# భారతదేశ చరిత్ర
# ప్రధాన సంఘటనలు





జి. వెంకటరామారావు

ప్రచురణ :
1990

*Important events in Indian History :*
*By G. V. Rama Rao*

వెల :
రూ. **50-00**



[ 'ఆంధ్రప్రభ', 'ఆంధ్రజ్యోతి' దిన పత్రికల నుంచి పునర్ముద్రితం.]

ప్రాప్తిస్థానం :
రచయిత,
ఇం. నెం. 18-7-739/2
అవుట్ సైడ్ గౌలీపూర,
హైదరాబాద్ - 500 253

ముద్రణ :
సౌభాగ్యలక్ష్మి ప్రెస్
తెనాలి.

# ఇందులో


| | |
|---|---|
| లోక్‌సభాపర్వం | 1 |
| మన రాష్ట్రపతులు | 13 |
| నెహ్రూ పరిశీలన | 30 |
| నెహ్రూ విదేశాంగ విధానం | 39 |
| నాలుగు దశాబ్దాల ప్రగతి | 45 |
| చైనా దురాక్రమణ | 51 |
| పాకిస్తాన్ రాజకీయాలు | 64 |
| భారత - పాకిస్తాన్ ఘర్షణలు | 71 |
| ప్రమాద స్థాయికి చేరుకున్న జనాభా | 82 |
| అధికార భాష | 88 |
| కాంగ్రెస్‌కు కాయకల్ప చికిత్స చేసిన ఇందిరాగాంధీ | 96 |
| రాజకీయ ఊబిలో గవర్నర్లు | 108 |
| కేంద్ర - రాష్ట్ర సంబంధాలు | 114 |
| చండీగఢ్ సమస్య | 123 |
| డార్జిలింగ్ పరిష్కారం | 130 |
| అడకత్తెరలో పోక చెక్క - శ్రీలంక | 134 |
| జనతా విజయపతాక | 141 |
| ప్రతిపక్ష నాయకత్వం | 150 |
| సతీసహగమన నిషేధం - పూర్వాపరాలు | 155 |
| అలీనోద్యమం | 159 |
| కాలానుగుణంగా మారిన కామన్‌వెల్త్ | 164 |

సహకారానికి సేతువు 'సార్క్' 168
భారత - బ్రిటన్ సంబంధాలు 174
భారత - అమెరికా సంబంధాలలో ఆటుపోటులు 177
భారత - సోవియట్ సంబంధాలు 186
నేపాల్‌లో ప్రజాస్వామ్య శంఖారావం 194
అలజడుల సుడిగుండాలలో బర్మా 200
శాంతికి దూరంగా బంగ్లాదేశ్ 206
భారత - జపాన్ సంబంధాలు 212
బెంగాల్‌లో సుస్థిర ప్రభుత్వం 215
కన్నడ ప్రభుత్వాల కథా కమామిషు 221
ద్రవిడ పార్టీల రాజకీయాలు 227
ఆంధ్ర రాజకీయార్ణవంలో ఆటు పోటులు 237
'తెలుగుదేశం' పార్టీ సాఫల్య వైఫల్యాలు 260
నూరేళ్ళ కాంగ్రెసు చరిత్ర 270
అధికారంలో రాజీవ్‌గాంధీ 287

# పరిచయం

- ఆచార్య కృష్ణావఝ్ఝుల సుబ్రమణ్యాం
చరిత్ర శాఖ అధ్యక్షులు,
ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం
హైదరాబాద్

స్వతంత్ర భారత దేశ చరిత్రకు సంబంధించిన అనేక విషయాల గురించి శ్రీ జి. వెంకటరామారావుగారు రాసిన ఈ వ్యాస సంపుటి విద్యార్థులకు, మేధావులకు జిజ్ఞాన కలిగిన సామాన్య పౌరులకు, మనకు స్వతంత్రం వచ్చినప్పటి నుండి ఇప్పటి వరకు జరిగిన, జరుగనున్న అనేక రాజకీయ, సాంఘిక ఆర్థిక పరిణామాల గురించి తెలుసుకోవాలన్న వారందరికీ ఎంతో ఉపయోగపడుతుందని నిస్సంకోచంగా చెప్పవచ్చు.

'ఆంధ్రప్రభ', 'ఆంధ్రజ్యోతి' లలో ఇది వరకే ప్రచురితమయి, బహుళ జనాదరణ పొందిన వ్యాసాలను ఒక గ్రంథ రూపంలో ముద్రించి రచయిత చాలా మందికి శ్రమ తగ్గించారు. అనేక అంశాలను గురించి ఆయన రాసిన ఆసక్తి దాయకమైన విషయాలను చదువుకోవడానికి, ఇప్పుడు పాఠకులు పాత దిన పత్రికల కోసం అనేక గ్రంథాలయాలు తిరగాల్సిన అవసరం కానీ, ఆ పాత పత్రికల్లో ఆ వ్యాసాలను వెతుక్కోవలసిన కష్టాలు కాని ఇక లేవు. లోక్‌సభకు 1952 నుండి 1989 వరకు జరిగిన తొమ్మిది సాధారణ ఎన్నికలు, ఇంతవరకు మన దేశ రాష్ట్రపతి పదవి నలకరించినవారు, దేశ జనాభా సమస్య, విదేశాంగ విధానం, ఇటీవల కాలంలో జరిగిన మన రాష్ట్రంలోని, ఇతర రాష్ట్రాలలోని రాజకీయ పరిణామాలు, కాంగ్రెస్ నూరేళ్ళ సంక్షిప్త చరిత్ర, ఇంకా ఎన్నో నెమరు వేసుకోవలసిన విషయాలు ఈ సంపుటిలోని వ్యాసాల వస్తువు.

అన్ని విషయాల గురించి అనేక గ్రంథాలు, పత్రికలల్లో వివరాలు దొరుకుతాయి. కానీ వాటన్నిటినీ క్రోడీకరించి, సంక్షిప్తంగా, సులభశైలిలో అందరికీ ఉపయోగపడే పద్ధతిలో వ్యాస రూపేణా అందించడం తేలికైన పని కాదు. అటువంటి కష్టమైన పని విజయవంతంగా సాధించినందుకు శ్రీ వెంకట రామారావు అభినందనీయులు. ఇంతకు ముందే వీరు రాసిన అనేక వ్యాసాలు గ్రంథ రూపం దాల్చాయి. ఇది వారి ప్రతిభకు ఇంకొక మచ్చు తునక.

ఇంతకు ముందు పత్రికల్లో ఈ వ్యాసాలు చదవని వారికి, వాటిని చదవడానికి ఇదొక మంచి అవకాశం. ఇటువంటి పుస్తకాలు తెలుగులో బహుకొద్ది. పాఠకులు రచయిత ప్రయత్నాన్ని ప్రోత్సహించి, ఇటువంటి పుస్తకాలు తెలుగులో ఇంకా అనేకం రావడానికి దోహదపడ్తారని ఆశిస్తున్నాను.

– కృష్ణావఝుల సుబ్రమణ్యం

# ఆకాంక్ష

సత్యాహింస లనెడి సూత్రాలను ప్రవచించి భారతదేశానికి స్వాతంత్ర్యం సంపాదించారు మహాత్మాగాంధీ. మత రహిత రాజ్యాంగాన్ని నిర్మించుకొన్న నవ భారతదేశం జవహర్‌లాల్ నెహ్రూ సృష్టి.

ప్రజాస్వామ్యం వయోజనుల ఓటింగ్ హక్కు మీద ఆధారపడి ఉంటుంది. దీని అర్థం ఓటర్లు తమకు ఇష్టం వచ్చిన రాజకీయ పక్షాల నుంచి అభ్యర్థులను ఎన్నుకోవడం మాత్రమే. దానివల్ల కలిగే ఫలితం - ఒక రాజకీయ పక్షాన్ని అధికారంలో కూర్చోపెట్టడం, ఇంకొక పక్షాన్ని అధికారం నుంచి లాగివేయడం. 1977, 1989 లోక్‌సభ ఎన్నికలలో మనదేశంలో ఇదే జరిగింది. చిరకాలంగా అధికారంలో ఉన్న రాజకీయ పక్షం, ప్రతిపక్షంగా వ్యవహరించే స్థితికి రావడం దేశ ప్రజల పరిణత రాజకీయ విజ్ఞతకు తార్కాణం. మన చుట్టు ఉన్న దేశాలలో ప్రజాస్వామ్య ప్రభుత్వాలు పేకమేడలా కుప్పకూలుతూ వుంటే భారతదేశంలో మాత్రమే ప్రజాస్వామ్యం చెక్కు చెదరకుండా ఉండటం గొప్ప విషయం. అది మనందరి కది గర్వకారణం.

ప్రజాస్వామ్యం పని చేయాలంటే రెండుగాను, అంతకంటె ఎక్కువగాను రాజకీయ పక్షాలు ఉండి తీరాలి. ఈ పక్షాల దృక్పథాలు భిన్నంగా ఉండాలి. ఈ విధంగా భిన్న రాజకీయ పక్షాలు ఉన్నప్పుడే ప్రభుత్వాధికారంలో మార్పులు సంభవమవుతాయి.

అయితే ఇక్కడ అంతగా కనిపించని విషయం ఒకటి ఉంది. జాతీయ ప్రాముఖ్యమైన విషయాలలో రాజకీయ పక్షాలు కేవలం సంపూర్ణంగా పరస్పర విరుద్ధమైన సిద్ధాంతాలు కలవిగా ఉండకూడదు. రాజకీయ పక్షాలకు కొంతవరకైనా ఏకాభిప్రాయం ఉండి తీరాలి. ఉదాహరణకు మనదేశం మొదటి నుంచి అనుస రిస్తున్న సోషలిజమ్, లౌకిక విధానం, అలీన విధానం, ప్రణాళికా బద్ధమైన ప్రగతి మొదలైన విధానాలను భూస్థాపితం చేయటానికి పూనుకుంటే ఏ ప్రజా ప్రభుత్వం

పని చేయలేదు. ఈ రెండు దృక్పథాలు గల పక్షాల మధ్య దేశం కకావికలమవుతుంది. అలా జరిగిన కొద్ది సంవత్సరాలలోనే దేశం దివాలా తీస్తుంది. ప్రత్యామ్నాయంగా వచ్చే ప్రభుత్వం విప్లవ పూరితమైనదైతే, అంతకు పూర్వం అధికారంలో ఉన్నవారు సులభంగా తొలగి అధికారాన్ని అప్పగించరు. ఎందుకంటే తమను బ్రతకనీయరనేది వారికి తెలుసు. అన్ని రద్దులు ప్రజాస్వామ్యంలో మంచి ఫలితాలను ఇవ్వవు.

ఈ దృక్పథంతోనే జాతీయ ప్రాముఖ్యమైన అంశాలనే యీ గ్రంథంలో చేర్చాను. ఇవన్నీ గతంలో పత్రికలలో ప్రచురితమైనవే కనుక వాటి ప్రాముఖ్యం గురించి ఇక్కడ మళ్ళీ చెప్పవలసిన అవసరం లేదు.

తెలుగులో రాజకీయ చరిత్రలు తెలిపే గ్రంథాలు తక్కువ. అందులో సమకాలీన చరిత్రపై వచ్చిన గ్రంథాలను వేళ్ళ మీద లెక్కపెట్టవచ్చు. గతంలో నేను విడుదల చేసిన ఆంధ్రప్రదేశ్ చరిత్రలను పాఠకలోకం ఆదరించింది. ఆ దృష్టితోనే యీ పుస్తకాన్ని విడుదల చేస్తున్నాను. పాఠకుల అభిమానాన్ని మరొకసారి కోరుతూ.

ఈ గ్రంథాన్ని సందర్భానుసారంగా ప్రచురించిన పత్రికాధిపతులకు, వివరణాత్మకమైన పీఠిక వెలయించిన మాన్యులు, ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయంలో చరిత్ర శాఖాధిపతులు ఆచార్య కృష్ణావఝుల సుబ్రమణ్యంగారికీ, సకాలంలో పుస్తకాన్ని ముద్రించిన మిత్రుడు 'సౌభాగ్యలక్ష్మి ప్రింటింగ్ ప్రెస్' అధినేత డి. మోహన్‌రావుగారికీ, కవరు పేజీపై అక్షరాలంకరణ చేసిన మిత్రుడు రచయిత ఏ. పండరీనాథ్‌గారికి, నా రచనలు ఆదరిస్తున్న పాఠక లోకానికి నా కృతజ్ఞతలు.

– రచయిత

# లోక్‌సభ పర్వం

భారతదేశంలో కొత్త రాజ్యాంగం ప్రకారం మొదటిసారి ఎన్నికలు 1951 అక్టోబరు - 1952 ఫిబ్రవరి మధ్య జరిగాయి. 21.6 కోట్ల మంది భారతీయులకు ఈ ఎన్నికలలో పాల్గొనే అవకాశం లభించింది. ఈ ఓటర్లలో నూటికి 45 మంది స్త్రీలు.

మొదటి సార్వత్రిక ఎన్నికలకు ముందే అంటే 1951 మధ్యలో కాంగ్రెసు పార్టీలో అఖిల భారత స్థాయి వైషమ్యాలు లేచాయి. కృపలానీ, ప్రకాశం, ఘోష్, కిద్వాయ్, సాదిక్ అలీ వంటి హేమాహేమీలు కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ స్థాపించారు. కేలప్పన్, ప్రకాశం మద్రాసు కోటను; ఘోష్, బెనర్జీలు బెంగాల్ గడ్డను; కృపలానీ దంపతులు, కిద్వాయ్ కలిసి ఉత్తరప్రదేశ్ ప్రభుత్వాన్ని హస్తగతం చేసుకోవటానికి ప్రయత్నించారు. కాని కిద్వాయ్ మధ్యలోనే కాంగ్రెస్‌లో తిరిగి చేరిపోయారు. మద్రాసు రాష్ట్రంలో ప్రకాశంగారికి, రంగాగారికి మధ్య విభేదాలు వచ్చాయి. కమ్యూనిస్టు నాయకుడు ఏ. కె. గోపాలన్ మలబార్‌లో ధ్వజమెత్తి కేలప్పన్ అంచనాలను బోల్తా కొట్టించాడు. ఈ ఎన్నికలలో ఈ పార్టీవారి అంచనాలన్నీ ఉల్టాసీదా అయిపోయాయి. లోక్‌సభలో ఈ పార్టీ తొమ్మిది సీట్లను మాత్రమే సంపాదించుకుంది.

కాంగ్రెసు అధ్యక్షుడు నెహ్రూ, జనసంఘ్ అధ్యక్షుడు డాక్టర్ శ్యాంప్రసాద్ ముఖర్జీ తప్ప ఈ ఎన్నికలలో ఇతర రాజకీయ పార్టీల అధ్యక్షులంతా ఓడి

పోయారు. ప్రతిపక్ష నాయకులలో ఓడిపోయిన వారిలో ప్రొఫెసర్ ఎన్. జి. రంగా, ఆచార్య కృపలానీ, ఎస్. ఎ. డాంగే, కమలాదేవి చటోపాధ్యాయ, అంబేద్కర్, ఎన్. బి. ఖరే, సాదిక్ అలీ మొదలైన వారున్నారు. కాంగ్రెస్ పక్షంనుంచి మొసలికంటి తిరుమలరావు, కె. సంతానం, రాజ్‌బహాదుర్ ఓడి పోయారు. ఇండిపెండెంట్లలో హృదయనాథ్‌కుంజ్రూ, హెచ్. వి. కామత్‌లకు ఓటమి ఎదురైంది. పండితనెహ్రూకు 2,33,571 ఓట్లురాగా నల్లగొండ నుంచి పోటీచేసిన కమ్యూనిస్టు నాయకుడు రావి నారాయణరెడ్డికి 3,09,162 ఓట్లు వచ్చాయి.

ఆ రోజులలో ఆంధ్రప్రాంతం మద్రాసు రాష్ట్రంలోని భాగంగా ఉండేది. ఆంధ్రకు కేటాయించిన 28 లోక్‌సభ స్థానాలలో కాంగ్రెస్ పార్టీ 6 స్థానాలను మాత్రమే గెలిచింది. అందులో కోస్తాలోని ఏడు జిల్లాలలో 2 స్థానాలే వచ్చాయి. ఎక్కువ స్థానాలు కమ్యూనిస్టుల వశమైనాయి.

హైదరాబాద్ రాష్ట్రంలోని భాగంగా ఉన్న తెలంగాణా ప్రాంతంలోని 13 స్థానాలలో కాంగ్రెసుకు 5, పి. డి. ఎఫ్. బ్యానర్ మీద పోటీచేసిన కమ్యూనిస్టు పార్టీ 7, సోషలిస్టు పార్టీ ఒక స్థానం సంపాదించుకున్నాయి.

ఈ ఎన్నికలలో కాంగ్రెసు పార్టీ 469 స్థానాలకు పోటీచేసి 366 స్థానాలు, కమ్యూనిస్టు పార్టీ 69 స్థానాలకు పోటీచేసి 26 స్థానాలను, ప్రజా సోషలిస్టు పార్టీ 400 స్థానాలకు పోటీచేసి 20 స్థానాలను, జనసంఘ్ 91 స్థానాలకు పోటీచేసి 3 స్థానాలను గెలుచుకున్నాయి. ఇతర పార్టీలవారు, ఇండిపెండెంట్లు 946 స్థానాలకు పోటీ చేసి 85 స్థానాలు గెలుచుకున్నారు.

## రెండవ లోక్‌సభ :

రెండవ లోక్‌సభకు 1957 లో ఎన్నికలు జరిగాయి. లోక్‌సభలో సభ్యుల సంఖ్య 505. ఎన్నికల తరువాత సభ మొదటి సమావేశంలో పార్టీల స్థితి యీ విధంగా ఉంది. ఎన్నికయిన 500 మంది లోక్‌సభ సభ్యులలో 365 మంది కాంగ్రెస్, 19 మంది ప్రజాసోషలిస్టు పార్టీ, 27 మంది కమ్యూనిస్టు పార్టీ 4 గురు జనసంఘ్‌కు చెందినవారు, 73 మంది ఇండిపెండెంట్లు ఇతరులు ఉన్నారు. ఇండి పెండెంటు ఇండియాలో ఇండిపెండెంట్లు గెలిచి ఏం చేస్తారనే విమర్శలు వచ్చినా ప్రతి ఎన్నికలలో వారు వ్యక్తిగత ప్రతిభతో, మంది మార్బలంతో గణనీయ మైన సంఖ్యలో ఎన్నికవుతూనే ఉన్నారు. ఈసారి లోక్‌సభకు ఎన్నికైన సభ్యు

లలో 27 మంది స్త్రీలు, 27 మంది ముస్లింలు, 78 మంది నిమ్నజాతులకు చెందిన వారు, 31 మంది నిమ్న తెగలకు చెందిన వారున్నారు.

ఆంధ్రుల చిరకాల వాంఛ అయిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఈ ఎన్నికలకు ముందే ఏర్పడటంతో అది రాష్ట్రంలో కాంగ్రెస్‌కు శుభోదయమైంది. 43 లోక్ సభ స్థానాలలో కాంగ్రెస్ 37, కమ్యూనిస్టు పార్టీ 4, సోషలిస్టు పార్టీ 2 స్థానాలను గెలిచాయి. ఈసారి రాష్ట్రంలోని మూడు నియోజక వర్గాలలో కాంగ్రెస్ అభ్యర్థులు పోటీ లేకుండా ఎన్నికయ్యారు. పోగా మిగిన 40 స్థానాలకు 113 మంది అభ్యర్థులు రంగంలో నిలిచారు. అన్ని స్థానాలకు కాంగ్రెసు పోటీ చేసింది. కమ్యూనిస్టు పార్టీ 19, ప్రజాసోషలిస్టు పార్టీ 7, సోషలిస్టు పార్టీ 6 స్థానాలకు తమ అభ్యర్థులను పోటీకి నిలబెట్టాయి.

## 1962 – మూడవ లోక్‌సభ ఎన్నికలు :

**1959 లో** జరిగిన నాగ్‌పూర్ కాంగ్రెస్ సమావేశంలో 'సోషలిస్టు తరహా సమాజ స్థాపన'కు కాంగ్రెసు పార్టీ సూత్రరీత్యా అంగీకరించిది. దీన్ని వ్యతిరేకించిన **రాజాజీ,** రంగా, మున్షీ, మసానీ మొదలైన వారితో స్వతంత్ర పార్టీ ఏర్పడింది. 1962 ఎన్నికలలో స్వతంత్ర పార్టి ఒక నూతన శక్తిగా అవతారమెత్తింది.

1962లో జరిగిన మూడవ సార్వత్రిక ఎన్నికల్లో కాంగ్రెసు పార్టీకి 364, సి. పి. ఐ. కి 31, స్వతంత్ర పార్టి 25, జనసంఘ్ 14, పి. ఎస్. పి. 13, సోషలిస్టు పార్టీ 6, ద్రవిడమున్నేత్రకజగం, ఇండిపెండెంట్లు ఇతరులు కలిసి 37 స్థానాలను గెలుచుకున్నారు. గత లోక్‌సభలో ప్రభుత్వాన్ని నిశితంగావిమర్శించిన ప్రతిపక్ష నాయకులంతా ఈ ఎన్నికల్లో ఓడిపోయారు. లోహియా, కృపలానీ, రంగా, అశోక్‌మెహతా, మసానీ, ఎ. సి. చటర్జి, వాజ్‌పేయి, డాంగే పరాజితులైన వారిలో ఉన్నారు. నెహ్రూను వ్యక్తిగతంగా విమర్శించని హిరేన్‌ముఖర్జీ, రేణుకాచక్రవర్తి మాత్రమే గెలిచిన ప్రతిపక్ష నాయకులు.

ఆంధ్రప్రదేశ్‌లోని 43 స్థానాలలో కాంగ్రెసు పార్టీ 33, కమ్యూనిస్టు పార్టీ 7, స్వతంత్ర పార్టీ 2, ఒక స్థానాన్ని ఇండిపెండెంటు అభ్యర్థి గెలుచుకున్నారు. తర్వాత ఆయన కమ్యూనిస్టు పార్టీలో చేరిపోయారు.

1964 మే 23 న పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ అస్తమించారు. ఆయన స్థానంలో లాల్‌బహాదూర్‌శాస్త్రి ప్రధానమంత్రి అయ్యారు. పాకిస్తాన్‌తో జరిగిన యుద్ధంలో విజయవీరుడైన శాస్త్రీజీ 1966 జనవరి 10వ తేదీన తాష్కెంట్‌లో హఠాన్మరణం చెందడంతో శ్రీమతి ఇందిరాగాంధీని ప్రధానిగా ఎన్నిక చేశారు. మూడవ లోక్‌సభ కాలపరిమితి ఇంకా 40 రోజులు ఉండగానే మార్చి 3, 1967 న దాన్ని రద్దు చేశారు.

## నాల్గవ లోక్‌సభ:

నాలుగవ లోక్‌సభ ఎన్నికలు 1967 ఫిబ్రవరిలో జరిగాయి. ఈ ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ 50 సీట్లను కోల్పోయింది. మొత్తం రాష్ట్రాలలో ఎనిమిది రాష్ట్రాలలో మటుకే కాంగ్రెస్‌కు మెజారిటీ లభించింది. దేశవ్యాప్తంగా క్షామ మేర్పడడం, అనేకచోట్ల అల్లరులు, అలజడులు జరగడం, ముఖ్యంగా ఢిల్లీలో గోహత్య నిషేధాన్ని గూర్చి జరిగిన అల్లరులు, విద్యార్థుల అల్లరులు, నెహ్రూ సారథ్యం లేకపోవడం, కాంగ్రెస్ పాలకవర్గంలోనే అంతఃకలహాలు, ధరలు పెరుగుదల వీటి ప్రభావం ప్రజానీకంపై బలంగా పనిచేసింది.

ఈ ఎన్నికల్లో కాంగ్రెస్‌కు తమిళనాడులోని 39 స్థానాలలో 3 స్థానాలు కేరళలోని 19 స్థానాలలో 1 స్థానం, ఒరిస్సాలోని 20 స్థానాలలో 9 స్థానాలు రాజస్థాన్‌లోని 23 స్థానాలలో 10 స్థానాలు, ఉత్తరప్రదేశ్‌లోని 85 స్థానాలలో 45, స్థానాలు, పశ్చిమ బెంగాల్‌లోని 40 స్థానాలలో 14 స్థానాలు లభించాయి. మద్రాసుకు చెందిన ఐదుగురుకి ఐదుగురు కేంద్రమంత్రులు డి. ఎం. కె. చేతుల్లో ఓడిపోయారు. కాంగ్రెస్ ప్రముఖులు కామరాజ్, అతుల్యఘోష్, ఎస్కే పాటిల్, కె. బి. మాలవ్యా, ఇండిపెండెంటు అభ్యర్థిగా పోటీచేసిన కృష్ణమీనన్ ఓడిపోయారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల వ్యవసాయ, ఆహారశాఖా మంత్రులందరూ ఈ ఎన్నికలలో ఓడిపోవటం విశేషం.

ఎన్నికల ఫలితాలు ఇలా ఉన్నాయి :- కాంగ్రెస్ 283, స్వతంత్రపార్టీ 45, సి. పి. ఐ. 24, సి. పి. ఎం. 19, జనసంఘ్ 31, ప్రజా సోషలిస్టు పార్టీ 14, సంయుక్త సోషలిస్టు పార్టీ 23, డి. ఎం. కె. 24, ఇండిపెండెంట్లు ఇతరులు 56.

ఆంధ్రప్రదేశ్‌లోని 41 లోక్‌సభ స్థానాలలో విజయవాడ సీటుకు కె. ఎల్ రావు పోటీ లేకుండా ఎన్నిక కావటంతో 40 సీట్లకు పోటీ జరిగింది. కాంగ్రెసుకు

35, కమ్యూనిస్టు పార్టీ 1, స్వతంత్ర 3, ఇండిపెండెంట్లు 2 స్థానాలు గెలుచుకున్నాయి. ఈ ఎన్నికలలో కేంద్ర పరిశ్రమల మంత్రి సంజీవయ్య, అఖిల భారత స్వతంత్రపార్టీ అధ్యక్షులు ఆచార్య ఎన్. జి. రంగా ఓడిపోయారు.

నాలుగవ లోక్‌సభను 1970 డిసెంబరున రద్దుచేశారు. గడువుకు ఒక సంవత్సరం 70 రోజులకు ముందుగానే నాల్గవ లోక్‌సభ రద్దయింది. అది మూడు సంవత్సరాల 9 నెలల 10 రోజులు మాత్రమే పనిచేసింది.

**అయిదవ లోక్‌సభ :**

భారత రాష్ట్రపతి పదవికి జరిగిన ఎన్నికల సందర్భంలో 1969 లో కాంగ్రెస్ నిలువునా చీలింది. ఇందిరాగాంధీ నాయకత్వంలో అధికార కాంగ్రెసు ఏర్పడింది.

అయిదవ లోక్‌సభకు ఎన్నికలు 1971 మార్చిలో జరిగాయి. రాజ్యాంగం ఏర్పడిన తరువాత మధ్యంతర ఎన్నికలు జరుగడం ఇదే మొదటిసారి. ఈ ఎన్నికలలో జనసంఘ్, స్వతంత్ర, పి. ఎస్. పి. పార్టీలు కలిసి 'గ్రాండ్ అలయెన్స్‌గా' గా ఏర్పడ్డాయి. ఈ ఎన్నికల ఫలితాలు ఇందిరాగాంధీ నాయకత్వాన్ని పటిష్ఠపరిచాయి.

కర్నాటకలో అప్పటికి సిండికేటు ప్రభుత్వమే అధికారంలో ఉంది. కానీ అక్కడ సిండికేటు కాంగ్రెస్‌కు కానీ, స్వతంత్ర, జనసంఘ్, ఎస్. ఎస్. పి. పార్టీలకుగాని ఒక్క స్థానం కూడా లభించలేదు. 27 స్థానాలను కాంగ్రెసే గెలిచింది. తమిళనాడులో సిండికేటు తరఫున ఒక్క కామరాజ్ నెగ్గారు. దక్షిణాది నాలుగు రాష్ట్రాలలో 'గ్రాండ్ అలయెన్స్'కు దక్కిన సీటంటు ఉండే అది ఒక్కటే.

సంయుక్త విధాయకదళ్ ప్రభుత్వం అధికారంలో ఉన్న ఉత్తరప్రదేశ్ లోని 85 స్థానాలలో కాంగ్రెస్ 73 స్థానాలను గెలిచింది. ఎస్. వి. డి. ప్రభుత్వం అధికారంలో ఉన్న మరో రాష్ట్రం బీహార్. అక్కడ 53 స్థానాలలో కాంగ్రెస్ 36 స్థానాలను సంపాదించింది.

ఢిల్లీలో కాంగ్రెస్ సాధించిన విజయానికి ప్రత్యేక ప్రాముఖ్యం ఉంది. అక్కడ పరిపాలన జనసంఘానికి లోగడ జనసంఘ్ గెలిచిన ఆరు లోక్‌సభ

స్థానాలను ఇప్పుడు కాంగ్రెస్ గెలిచింది. అల్ప సంఖ్యాక వర్గాలు, పేద ప్రజలు, షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు తరగతులు దాదాపు ఏకగ్రీవంగా కాంగ్రెస్‌కు ఓటు చేశారు. బొంబాయిలో శివసేనకు ఓటమి ఎదురవడం ఎంతో విశేషం.

అయిదవ లోకసభ ఎన్నికల ఫలితాలు : కాంగ్రెస్ 353, సి. పి. ఎం. 25, సి. పి. ఐ 23, డి. ఎం. కె. 23, జనసంఘ్ 22, స్వతంత్ర 8, సంయుక్త సోషలిస్టు పార్టీ 3, రివల్యూషనరీ సోషలిస్టు పార్టీ 3, ప్రజా సోషలిస్టు పార్టీ 2, ఇండిపెండెంట్లు 23, ఇతర పార్టీలు 17.

ఈ ఎన్నికలలో 'ఇందిరా గాలి' కి మహావృక్షమనుకున్న 'గ్రాండ్ అలయెన్స్' సునాయాసంగా నేలకొరిగింది. శ్రీయుతులు ఎస్కేపాటిల్, మసానీ, తారకేశ్వరీసిన్హా, రాంసుభాగ్‌సింగ్, సుచేతా కృపలానీ, సుశీలానయ్యర్, జార్జి ఫెర్నాండెజ్, మధులిమాయే వంటి యోధానయోధులు ఓడిపోయారు.

కాంగ్రెస్ చీలిక ప్రభావం ఆంధ్రప్రదేశ్ ఎన్నికల మీద కూడా పడింది. సంస్థా కాంగ్రెస్ అభ్యర్థు లెవరూ ఈ రాష్ట్రంనుంచీ ఎన్నిక కాలేకపోయారు. ఇందిరా కాంగ్రెసు 28 స్థానాలను గెలుచుకోగా 10 స్థానాలను గెలిచిన తెలంగాణా ప్రజాసమితి 1972 శాసనసభ ఎన్నికల ముందు కాంగ్రెస్‌లో కలిసిపోయింది, సి. పి. ఎం. ఒక స్థానం, సి. పి. ఐ. ఒక స్థానం గెలిచాయి. స్వతంత్రపార్టీ. జనసంఘ్ అభ్యర్థు లెవరు గెలవలేదు. ఒక ఇండిపెండెంటు అభ్యర్థి గెలిచారు.

అయిదవ లోక్‌సభలో మరొక ముఖ్యాంశం దాని కాలాన్ని 1978 మార్చి 18 వరకు అంటే తడవకు ఒక సంవత్సరం వంతున రెండేండ్లు పొడిగించడం అయినా 1977 జనవరి 18 వ తేదీన లోకసభను రద్దు చేశారు. అయిదవ లోక్ సభ అయిదు సంవత్సరాల పది నెలల ఆరు రోజులు పని చేసింది. అంతక్రితం లోక్‌సభలన్నీ తమ మామూలు వ్యవధి అయిదు సంవత్సరాలు నిండకముందే రద్దయ్యాయి.

## ఆరవ లోక్‌సభ :

ఆరవ లోక్‌సభకు ఎన్నికలు 1977 మార్చిలో జరిగాయి. ఎన్నికలకు ముందు పాత కాంగ్రెస్, భారతీయ లోక్‌దల్, జనసంఘ్, సోషలిస్టులు కలిసి

'జనతా పార్టీ ' గా ఏర్పడ్డాయి. జనతాపార్టీకి కొత్త ఎన్నికల గుర్తు కేటాయించ డానికి ఎన్నికల కమీషన్ నిరాకరించింది. అందుచేత భారతీయ లోక్‌దళ్ గుర్తు అయిన 'చక్రపరివేష్ఠితుడైన హలధరుడు' చిహ్నాన్నే జనతాపార్టీ స్వీకరించ వలసి వచ్చింది. కాంగ్రెస్‌కు రాజీనామా చేసి జగజీవన్‌రాం 'ప్రజాస్వామ్య కాంగ్రెస్' అనే కొత్త పార్టీని స్థాపించారు. ఈ ఎన్నికలలో ఇతర పార్టీలన్నీ కాంగ్రెస్‌తోనో, జనతాతోనే సీట్లు సర్దుబాటు చేసుకోవలసిన పరిస్థితు లేర్పడ్డాయి. జనతా పార్టీని ఓడించడమే సి. పి. ఐ. ప్రధాన లక్ష్యమైతే, కాంగ్రెస్‌ను ఓడించ డమే మార్క్సిస్టు పార్టీ తన లక్ష్యంగా పెట్టుకుంది.

ఈ ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీకి సంభవించిన పరాజయం మామూలు పరాజయం కాదు, ఘోరపరాజయం. కాంగ్రెస్‌కు ఉత్తరప్రదేశ్‌లోని 84 స్థానాల లోను, హర్యానాలోని 11 స్థానాలలోను, ఢిల్లీలోని 6 స్థానాలలోను, బీహార్‌లోని 54 స్థానాలలోను ఒక్క స్థానం కూడా దక్కలేదు. మధ్యప్రదేశ్‌లో ఒక స్థానం, రాజస్థాన్‌లో ఒక స్థానం, పశ్చిమ బెంగాల్‌లోని 3 స్థానాలు, ఒరిస్సాలో 4 స్థానాలు అస్సాం, గుజరాత్‌లలో 10 స్థానాలు కైవసం అయినాయి. కొత్తగా ఎన్నికైన పార్లమెంటులో జనతాపార్టి 271, కాంగ్రెస్ 153, ప్రజాస్వామ్య కాంగ్రెస్‌కు 28, మార్క్సిస్టులు 22, అకాలీలు 8, పేసెంట్స్ అండ్ వర్కర్స్ పార్టి 5, రిపబ్లికన్ పార్టి 2, ఇతరులు 12 స్థానాలు సంపాదించుకున్నారు. రాయబరెలీ నియోజక వర్గంలో పోటీచేసిన శ్రీమతి ఇందిరాగాంధీ 55,000 ఓట్లతో తన ప్రత్యర్థి రాజ్ నారాయణ్ చేతుల్లో ఓడిపోయారు. ఉత్తర భారతాన్ని జనతా ప్రభంజనం కుదిపి వేయగా దక్షిణ భారతదేశంలో పెక్కుచోట్ల కాంగ్రెస్ విజయం సాధించింది.

1977 లో జరిగిన ఎన్నికలలో ఆంధ్రప్రదేశ్‌కు అమిత ప్రాధాన్యం లభించింది. కాంగ్రెస్‌కు పెట్టని కోటగా ఆంధ్రప్రదేశ్ నిలిచింది. ఈ ఎన్నిక లలో నియోజక వర్గాల పునర్విభజనతో 41 నియోజక వర్గాల సంఖ్య 42 కు పెరి గింది. హనుమకొండ నియోజకవర్గం కొత్తగా ఏర్పడింది. ఒక్క నంద్యాల సీటు మినహా అన్ని నియోజకవర్గాలలో కాంగ్రెస్ విజయం సాధించింది. 29 స్థానలకు పోటీచేసిన జనతా పార్టి ఒక సీటును (సంజీవరెడ్డి స్థానం) గెలుచుకోగా, ప్రజా స్వామ్య కాంగ్రెస్ ఒక్క సీటు కూడా గెలుచుకోలేక పోయింది. కమ్యూనిస్టు పార్టి 10 స్థానాలకు పోటీచేసి అన్నిటా ఓడిపోయింది. మార్క్సిస్టు పార్టి 6 స్థానా

లకు పోటీచేసి ఓటమి పాలైంది. ఉభయ కమ్యూనిస్టు పార్టీలు విడివిడిగా పోటీ చేయడం వలన ఒక్క స్థానాన్ని కూడా అవి సంపాదించలేక పోయాయి.

ప్రధానమంత్రి పదవికి శ్రీ మురార్జి దేశాయ్ రాజీనామా చేయడంతో జనతా పార్టీలో చీలిక లేర్పడి ఓపరకు జనతా (ఎస్) కాంగ్రెసు (యు) శ్రీ చరణ్‌సింగ్ నాయకత్వాన సంకీర్ణ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశాయి. మామూలుగా అయితే ఆరవ లోక్‌సభ గడువు అయిదేండ్ల తర్వాత 1982 మార్చిలో ముగిసేది. అయితే అప్పటి ప్రధానమంత్రి చరణ్‌సింగ్ సలహా మీద 1979 ఆగష్టు 22వ తేదీన రాష్ట్రపతి ఆరవ లోక్‌సభను రద్దు చేశారు. ఆరవ లోక్‌సభ రెండు సంవత్సరాల నాలుగు నెలలు ఇరవై ఎనిమిది దినాలు పని చేసింది. ఆ విధంగా ఇంతవరకు ఏర్పడిన లోక్‌సభ లన్నింటిలో ఇది అతి తక్కువ కాలం పని చేసింది.

ఏడవ లోక్‌సభ :

1980 జనవరిలో ఏడవ లోక్‌సభకు జరిగిన ఎన్నికల్లో పార్టీల బలం ఈ విధంగా ఉంది. కాంగ్రెస్ (ఐ) 351, జనతా (ఎస్) 41, సి. పి. ఐ. 11, సి. పి. ఎం. 35, జనతా 31, డి. ఎం. కె. 16, కాంగ్రెస్ (యు) 13, ఇతర పార్టీలు - ఇండిపెండెంట్లు 26.

ఈ ఎన్నికలలో కాంగ్రెసు (ఐ) మూడింట రెండువంతులపైగా మెజారిటీ సంపాదించుకుంది. మెదక్‌లోను, రాయ్‌బరేలీలోను శ్రీమతి ఇందిరాగాంధీ పెద్ద మెజారిటీతో నెగ్గారు. రాయ్‌బరేలీలో ఆమెతో పోటీచేసిన సమీప ప్రత్యర్థి శ్రీమతి విజయరాజేసింధియాకు డిపాజిటు దక్కలేదు. ఈ లోక్‌సభ ఎన్నికలలో 13 రాష్ట్రాలలోను, 3 కేంద్రపాలిత ప్రాంతాలలోను జనతాపార్టీ పూర్తిగా తుడిచి పెట్టుకుపోయింది. ఆంధ్రప్రదేశ్, అస్సాం, హిమాచల్‌ప్రదేశ్, జమ్మూ-కాశ్మీర్, కేరళ, మేఘాలయ, నాగాలాండ్, ఒరిస్సా, సిక్కిం, తమిళనాడు, త్రిపుర, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాలలో జనతా సభ్యు లెవరు ఎన్నిక కాలేదు. కేంద్రపాలిత ప్రాంతాలలో, ఢిల్లీలో మాత్రమే అదీ కూడా అటల్‌బిహారీవాజ్‌పేయి అతి స్వల్ప మెజారిటీతో నెగ్గిన స్థానం ఒక్కటే జనతాపార్టీకి దక్కింది.

ఈసారి ఎన్నికలలో విశేషమేమంటే, లోక్‌దళ్‌లోని సోషలిస్టు లందరినీ ఓటర్లు తిరస్కరించారు. కర్నాటకలో కాంగ్రెసు (యు) పూర్తిగా తుడిచి పెట్టుకు

పోయింది. తమిళనాడులో డి. ఎం. కె. తో పొత్తు కుదుర్చుకొని కాంగ్రెసు (ఐ) 20 సీట్లు గెలిస్తే, అన్నా. డి. ఎం. కె. రెండు సీట్లతోనే తృప్తిపడవలసి వచ్చింది.

ఆంధ్రప్రదేశ్‌లోని 42 లోకసభ స్థానాలలో కాంగ్రెస్ (ఐ) 41 స్థానాలను గెలిచింది. రాష్ట్రంలో ఇందిరాగాంధీ ప్రచండమారుతాన్ని తట్టుకొని నిలబడ గలిగింది కేంద్ర గనులశాఖమంత్రి కిశోర్‌చంద్రదేవ్ మాత్రమే. సర్వశ్రీ జైపాల్‌రెడ్డి, కె. ఎల్. రావు, భాట్టం శ్రీరామమూర్తి, ప్రగడ కోటయ్య, పి. తిమ్మారెడ్డి, నీలం రాజశేఖరరెడ్డి, ఆసిఫ్‌పాషా, గౌతులచ్చన్న, ముత్యాలరావు ఓడిపోయిన ప్రముఖుల్లో ఉన్నారు. 1977 లోక్‌సభ ఎన్నికలలో సమైక్య కాంగ్రెస్ సాధించిన ఘన విజయాన్ని ఈసారి రాష్ట్రంలో కాంగ్రెస్ (ఐ) సాధించింది. జనతా 31 స్థానాలలో పోటీచేసి అన్నింటిలోను ఓడిపోయింది.

కాంగ్రెసు (ఐ) ప్రభజనం సర్వత్రా వీస్తూ 1977 జనతా గాలిలో తుడిచి పెట్టుకొనిపోయిన నాయకులలో దాదాపు అందరిని తిరిగి లోక్‌సభకు చేర్చింది. వీరిలో బన్సీలాల్, వి. సి. శుక్లా, పి. సి. సేథీ కూడా ఉన్నారు. శ్రీ సంజయ్ గాంధీ అమేథీ లోక్‌సభ స్థానాన్ని లక్ష 28 వేల ఓట్ల మెజారిటీతో గెలుచుకున్నారు.

ఈ ఎన్నికలలో ప్రజల దృష్టిలో రాజకీయ సుస్థిరత అగ్ర ప్రాధాన్యం వహించింది. అలయెన్స్‌లకు, మిశ్రమ ప్రభుత్వాలకు ప్రజలు పెద్ద నమస్కారం పెట్టారు. ఇది యావత్తు భారతావని ఓటర్లలలో కనిపించింది.

**ఎనిమిదవ లోక్‌సభ :**

1984 డిశంబర్ 24, 27 తేదీల్లో ఎనిమిదవ లోక్‌సభ ఎన్నికలు జరిగాయి. 1980 నాటి పరిస్థితికి 1984 పరిస్థితికి చాలా తేడా వుంది. శ్రీమతి ఇందిరాగాంధీని 1984 అక్టోబరు 31 న మతమౌఢ్యులు దారుణంగా హత్య చేశారు. దీనితో దేశమంతటా దినం దినం క్షీణిస్తూ వచ్చిన ఇందిరా కాంగ్రెస్ పలుకుబడి, శ్రీమతి ఇందిరాగాంధీ నిర్యాణం మూలంగా పునరుద్ధరణ పొందింది. ఆమె స్థానంలో ఆమె కుమారుడు శ్రీ రాజీవ్‌గాంధీ ప్రధాని అయ్యారు. 1980 నాటివలె ఈనాడు

కూడా ప్రతిపక్షాల అనైక్యంగానే ఉన్నాయి. దేశవ్యాప్తమైన ప్రతిపక్షమంటూ ఏదీలేదు. ఆంధ్రప్రదేశ్‌లో ప్రాంతీయ పార్టీ 'తెలుగుదేశం' అధికారంలో ఉంది. కర్నాటకలో ఇతర పక్షాల మద్దతుతో జనతాపార్టీ అధికారంలో ఉంది.

ప్రతిపక్షంవారు మాత్రం ఎవరికి వారే యమునాతీరే అన్న ధోరణిలో ఉండి పోయారు. ఇందుకు ప్రధాన కారణం చౌధరీ చరణ్‌సింగ్ ప్రధాని పదవీలాలసన అంటే అతిశయోక్తి కాదు. ఇందుకు ఇతర పార్టీలు అంగీకరించలేదు. కాబట్టి ఆయన లోక్‌దళ్ పార్టీ ముందుగా బి. జె. పి. తో ఒప్పందానికి వచ్చింది.

ఈ లోక్‌సభ ఎన్నికలలో ప్రతిపక్షాలు కనీవినీ ఎరుగనంత ఘోర పరాజయం పాలయ్యాయి. 27 స్థానాలకు పోటీచేసిన జనతాపార్టీ కేవలం తొమ్మిది స్థానాలలోనే విజయం సాధించింది. 223 స్థానాలకు పోటీచేసిన బి. జె. పి. కేవలం రెండు స్థానాల్లో గెలిచింది. హిందీ భాషా రాష్ట్రాల్లోనే ముఖ్యంగా పోటీచేసిన దళిత మజ్దూర్ కిసాన్ పార్టీ మొత్తం 168 మంది అభ్యర్థులను నిలబెట్టగా నలుగురు మాత్రమే గెలుపొందారు. ఆంధ్రప్రదేశ్‌లో 40 స్థానాలకు ఎన్నికలు జరుగగా 32 స్థానాలలో పోటీచేసి తెలుగుదేశం పార్టీ 28 స్థానాలను సాధించి లోక్‌సభలో అతి పెద్ద ప్రతిపక్షం అయింది. సి. పి. ఎం. తమకు ఎక్కువ ప్రాబల్యం ఉన్న కేరళ, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాలలో పెద్ద దెబ్బతింది. 13 స్థానాలనే దక్కించుకో గలిగింది.

జనతాపార్టీ అధ్యక్షుడు శ్రీ చంద్రశేఖర్, సి. పి. ఎం. పోలిట్ బ్యూరో సభ్యుడు శ్రీ బాలానందన్, డి. ఎం. కె. పి. నాయకులు కర్పూరీఠాకూర్, దేవీలాల్, జనతా నాయకుడు వీరేంద్రవర్మ, జార్జి ఫెర్నాండెజ్, ఎరాసెజియన్, శ్రీమతి ప్రమీలా దండావతే ప్రభృతులు ఓడిపోయారు. బి. జె. పి. అధ్యక్షుడు, అటల్ బిహారీ వాజ్‌పేయి గ్వాలియర్ స్థానం పోగొట్టుకున్నారు. రాజీవ్‌గాంధీ మంత్రి వర్గంలోని మొత్తం 51 మంది మంత్రుల్లో ఓడిపోయింది కేవలం 7 గురు మాత్రమే. అందులో ఒకరు కర్నాటకకు చెందిన ఎస్. ఎం. కృష్ణ, మిగిలిన ఆరుగురు ఆంధ్రులే. అలహాబాద్‌లో శ్రీ బహుగుణను సినీనటుడు అమితాబ్ బచ్చన్, వాయువ్య బొంబాయిలో శ్రీ రాంజెఠ్మాలానీని శ్రీ సునిల్‌దత్, మద్రాసులో జనతా నాయకుడు ఎరాసెజియన్‌ను వైజయంతిమాల ఓడించారు. కాంగ్రెసు పార్టీ విజయ రథం చక్రాల కిందపడి నలిగి పోయిన ప్రతిపక్షనాయకులలో రిపబ్లికన్ సోషలిస్టు

పార్టీ నాయకుడు త్రిడిబ్ చౌధరీ, ఫార్వర్డ్‌బ్లాక్ నాయకుడు చిత్తబసు ఉన్నారు. జమ్మూలో మాజీ కేంద్రమంత్రి కరణ్‌సింగ్ కూడా మొదటిసారి ఓటమి చవి చూసారు.

పశ్చిమ బెంగాల్‌లో అధికారంలో ఉన్న మార్కిస్టు పార్టీ కాంగ్రెసు (ఐ) విజయ వెల్లువను ప్రతిఘటించి నప్పటికీ ఆ రాష్ట్రంలో కాంగ్రెసు (ఐ) 16 సీట్లను దక్కించుకున్నది. 1980 ఎన్నికలలో ఈ పార్టీ కేవలం 4 చోట్ల గెలిచింది. అందు వల్ల బెంగాల్‌లో కూడా కాంగ్రెసు (ఐ) ప్రభంజనం బాగా వీచిందనే చెప్పవచ్చు. సమర్ ముఖర్జీ వంటి మార్కిస్టు నాయకులెందరో ఈ ప్రభంజనంలో కొట్టుకు పోవడంవల్ల కాంగ్రెసు (ఐ) పార్టీ ఈ రాష్ట్రంలో వామపక్ష ఫ్రంటునుంచి 12 సీట్లను కైవసం చేసుకోగలిగింది. వామపక్ష ఫ్రంటుకు 20 సీట్లు మాత్రమే లభించాయి.

కాంగ్రెసు (ఐ) పార్టీ ఈ ఎన్నికలలో 401 స్థానాలను సంపాదించుకోవట మన్నది దాని చరిత్రలో అపూర్వం. ఆ విధంగా ప్రజలు 1984 డిశంబర్ ఎన్ని కలలో ఇచ్చిన తీర్పు చారిత్రాత్మకమైనది. శ్రీమతి ఇందిరాగాంధీ హత్యకు ప్రజలు ఓట్లరూపంలో సానుభూతి వర్షం కురిపించారు. అంతేకాదు, మన సైన్యం అమృతసర్ స్వర్ణ దేవాలయంలో ప్రవేశించి దేశద్రోహులను ఏరిపారవేసే చర్యకు శ్రీమతి గాంధీ తీసుకున్న నిర్ణయం కూడా ఈ ఎన్నికలలో ప్రజలను ప్రభావితం చేసింది.

ఆంధ్రప్రదేశ్‌లో మాజీ ముఖ్యమంత్రులు వెంగళరావు, అంజయ్య మరి నలుగురు గెలిచినా ఎన్. టి. ఆర్. ప్రభంజనంలో ఆరుగురు కేంద్రమంత్రులలో సహా కాంగ్రెసు (ఐ) అభ్యర్థులందరు కొట్టుకుపోయారు. నాలుగు నెలలనాడు ఎన్. టి. ఆర్. ను ముఖ్యమంత్రి పదవినుంచి బర్తరఫ్ చేయకుండా కొనసాగ నిచ్చి ఉంటే ఎలా ఉండేదో తెలియదుకాని, ఆ దురదృష్టకర సంఘటన తర్వాత ఆయనపై ప్రజలలో సానుభూతి పెరిగింది. బహుశా సబ్సిడీ బియ్యం, జనతా చీరె, ధోవతి పథకాలవంటి జనాకర్షణ చర్యలు కూడా ఆయనకు తోడ్పడి ఉండ వచ్చు. ఏమైనా, జాతీయ ప్రతిపక్షాలన్నీ చతికిలపడగా, లోకసభలో ఒక ప్రాంతీయ పక్షం ప్రధాన ప్రతిపక్షం కావడం విచిత్ర పరిణామం.

తొమ్మిదవ లోక్ సభ :

తొమ్మిదవ లోక్‌సభకు డిశంబర్ 1989 లో ఎన్నికలు జరిగాయి. గత లోక్‌సభలో అభేద్యమైన మెజారిటీ ఉన్న కాంగ్రెసు (ఐ) పార్టీ ఈ ఎన్నికలలో ఘోర పరాజయం సంభవించింది. ఇంతకు ముందు ఒక్క 1977 ఎన్నికల్లోనే కాంగ్రెసు (ఐ) ఈ విధంగా చిత్తయింది. ఓటింగ్ వయోపరిమితి 18 సంవత్సరాలకు తగ్గించడంవల్ల ఈసారి ఓటర్ల సంఖ్య 27 శాతానికి పెరిగింది. ఈసారి ఎన్నికలలో ప్రజలిచ్చిన తీర్పు మహత్తరంగా ఉంది. రాజకీయ పార్టీలు చేసినా చేయకపోయినా ఓటర్లు మాత్రం ప్రజాతంత్ర వ్యవస్థను రెండు పార్టీల వ్యవస్థగా మార్చారు. రాజీవ్‌గాంధీ, వి. పి. సింగ్‌ల మీద ప్రజాభిప్రాయ సేకరణగా ఈ ఎన్నికలు పనిచేశాయి.

హిందీ భాష మాట్లాడే రాష్ట్రాలలో ఈ ఎన్నికలలో కాంగ్రెసుకు ఘోర పరాజయం ఎదురైంది. యు. పి. లోని 85 సీట్లలలో 14, బీహార్‌లోని 54 సీట్లలలో 4, హర్యానాలోని 10 సీట్లలో 4, హిమాచల్‌ప్రదేశ్‌లోని 4 సీట్లలలో 1, మధ్యప్రదేశ్‌లోని 34 సీట్లలలో 8, ఢిల్లీలోని 7 సీట్లలో 2 మాత్రమే కాంగ్రెసుకు లభించాయి. రాజస్థాన్‌లోని 25 స్థానాలలో కాంగ్రెసుకు ఒక్క స్థానమైనా లభించలేదు.

ఎన్నికల ఫలితాలు : కాంగ్రెసు (ఐ) 193, జనతాదళ్ 141, బి. జె. పి. 88, సి. పి. ఐ. (ఎం) 32, సి. పి. ఐ. 12, అన్నా డి. యం. కె. 12, అకాలీదళ్ 6, ఇతర పార్టీలు , ఇండిపెండెంట్లు 40. ఈసారి ఎన్నికలలో పోటీచేసిన 44 మంది కేంద్రమంత్రులలో 19 మంది ఓడిపోయారు.

గత ఎన్నికల్లో ఆంధ్రప్రదేశ్‌లో 27 స్థానాలను గెలుచుకున్న తెలుగుదేశం పార్టీ ఈ ఎన్నికలలో రెండు స్థానాలకే పరిమితం కావలసి వచ్చింది. రాష్ట్రం నుంచి తెలుగుదేశం మద్దతుతో పోటీచేసిన సి. పి. ఐ, సి. పి. ఎం, జనతాదళ్, బి. జె. పి. కాంగ్రెసు (ఎస్) లు ఒక్క స్థానం కూడా పొందలేకపోయాయి. మజ్లిస్ ఒక స్థానం గెలుచుకోగా కాంగ్రెసు (ఐ) 39 స్థానాలలో విజయపతాకం ఎగురవేసింది. పాలుల్ రెడ్డి, జైపాల్‌రెడ్డి, వెంకయ్యనాయుడు మొదలైన హేమా హేమీలు ఓడిపోయారు. సినీనటుడు కృష్ణ, నటి జమున గెలవడం ఈ ఎన్నికలలో విశేషం.

-)o(-

# మన రాష్ట్రపతులు

భారత రాజ్యాంగం 52 వ అధికరణంలో 'భారతదేశానికి ఒక రాష్ట్రపతి ఉంటారు' అని ఉన్నది. కేంద్రంలో కార్యనిర్వాహక అధికారమంతా యీ రాష్ట్రపతికి దత్తమై ఉంది. ఈ అధికారాన్ని ఆయన స్వయంగా గానీ, తన కింది ఉద్యోగుల ద్వారా గానీ వినియోగిస్తారు. 'రాజ్యాంగాన్ని భద్రపరిచి, కాపాడి, రక్షిస్తాన'ని రాష్ట్రపతి ప్రమాణం చేస్తారు. కనుక రాజ్యాంగాన్ని కాపాడవలసిన ప్రధాన బాధ్యత రాష్ట్రపతిదే.

## లాంఛన ప్రాయమైన అధికారాలు :

అధికారాలు ఉండటానికి రాష్ట్రపతి ఆధీనంలోనే ఉన్నా, వాటిని వినియోగించేది ప్రధానమంత్రి మాత్రమే. 'ప్రధానమంత్రి నాయకత్వంలో ఒక మంత్రిమండలి ఉండాలి. రాష్ట్రపతి తన విధి నిర్వాహణలో మంత్రిమండలి సలహా ప్రకారం నడుచుకోవాలి' అని రాజ్యాంగంలోని 14 వ అధికరణం నిర్దేశిస్తోంది. అయితే రాజ్యాంగాన్ని మొదట వ్రాసుకున్నప్పుడు ఈ విధంగా లేదు. 'రాష్ట్రపతికి సలహా ఇవ్వటానికి మంత్రిమండలి ఉండాలి' అని మాత్రమే ఉన్నది. 1977 లో 42 వ రాజ్యాంగ సవరణ ద్వారా 'అట్టి సలహా ప్రకారం నడుచుకోవాలి' అని చేర్చారు. అంటే రాష్ట్రపతి మంత్రివర్గం సలహాను పాటించి తీరాలని దీని అర్థం. అంతకు ముందు ఈ మాటలు లేకపోయినా మంత్రిమండలి సలహా ప్రకారమే రాష్ట్రపతి పనిచేసేవారు. అయితే ఎటువంటి వివాదాలకు ముందుగా అవకాశం ఉండకుండా లిఖిత పూర్వంగా దీన్ని రాజ్యాంగంలో పొందుపరిచారు. అంటే, మంత్రిమండలి సలహా తీసుకునే విషయంలో రాష్ట్రపతికి స్వేచ్ఛ లేకుండా చేశారన్నమాట. పోతే, 1979 లో 44 వ సవరణ ద్వారా మరొక మినహాయింపును ఈ అధికరణకు జతపరిచారు. 'అయితే, అట్టి సలహాగాని, మరొకటి ఏదైనాగానీ

పునర్విచారణ చేయవలసిందిగా రాష్ట్రపతి మంత్రిమండలిని కోరవచ్చు. అట్టి పునర్విచరణ జరిగిన తరువాత ఇచ్చిన సలహా ప్రకారం రాష్ట్రపతి నడుచుకోవాలి'. ఈ మార్పు వచ్చిన తరువాత రాష్ట్రపతి తప్పనిసరిగా మంత్రిమండలి సలహాను పాటించి తీరాలి. అయితే ఏమైనా సలహాగాని, పద్ధతిగాని రాష్ట్రపతికి ఇష్టంకాని ఎడల దానిని పునరాలోచన చేయమని ఆయన మంత్రిమండలిని కోరవచ్చు. అంతేగాని, మంత్రిమండలి పునరాలోచించిన తరువాత కూడా అదే సలహా వస్తే రాష్ట్రపతికి మరొక మార్గంలేదు. మంత్రిమండలి సలహాను పాటించని రాష్ట్రపతిని పార్లమెంటు తొలగించి వేయవచ్చు. ఈ విషయంలో మనం బ్రిటిష్ రాజ్యాంగాన్ని అనుసరించలేము. ఎందుకంటే, బ్రిటన్‌లో రాజునుగాని, రాణినిగాని తొలగించే సమస్యే తలఎత్తదు. ఆ పదవి వంశపారంపరమైనది.

### విశేషాధికారాలు :

రాష్ట్రపతికి కొన్ని విశేషాధికారాలను కూడా మన రాజ్యాంగం సంక్రమింప చేసింది. కొన్ని ప్రత్యేక సందర్భాలలో మంత్రివర్గ నిర్ణయాలను కూడా రాష్ట్రపతి ధిక్కరించవచ్చు. ఆ విధమైన అధికారాలు రాష్ట్రపతికి 8ం వ ఆర్టికల్‌లో రూపొందించారు. ఉభయ శాసనసభలలో పరిశీలనలో ఉన్న ఏ బిల్లు గురించి అయినా రాష్ట్రపతి వివరాలను కోరవచ్చు. ఆర్థిక బిల్లులు కాని వాటిని రాష్ట్రపతి పునఃపరిశీలనకు పంపవచ్చు. తనకు ఇష్టం వచ్చినప్పుడు పార్లమెంటుని సమావేశపరిచి ప్రసంగించవచ్చు. మంత్రిమండలి చర్చకురాని ఒక మంత్రి నిర్ణయాలను రాష్ట్రపతి కోరితే వాటిని ఆయన పరిశీలనకు మంత్రి పంపాలి. ఈ సూత్రం రాజ్యాంగం 78 వ ఆర్టికల్‌లో రూపొందించారు.

అయితే, ఈ విశేషాధికారాలను గత రెండు వందల సంవత్సరాలలో బ్రిటిష్ రాజు లెవరు ఉపయోగించలేదు. ఇలాంటి అధికారాలను అమెరికా అధ్యక్షుడికి మాత్రమే ఉన్నాయి. మంత్రిమండలి తన అధికారాన్ని దుర్వినియోగ పరిచినపుడు మాత్రమే రాష్ట్రపతి కలుగజేసుకొని తన విశేషాధికారాల అస్త్రాన్ని సంధించవచ్చు.

### రాష్ట్రపతి భవనం :

రాష్ట్రపతి అధికార నివాసాన్ని 'రాష్ట్రపతి భవన్' అంటారు. వందల కొలది ఎకరాల వైశాల్యం కలది ఈ భవనం ఆవరణ. తోటలు, మొగల్ మహా

రామాలు, విహారకేళీ జలాశ్రయాలు కాక, ఈ మహాప్రసాదంలో 300 గదులున్నాయి. అలాంటిలాంటి గదులు కావు. ఒక్కొక్క గది ఒక్కొక్క మహారాజ భవనం. ఈ శతాబ్దారంభంలో దీని నిర్మాణాన్ని అప్పటి బ్రిటిష్ సామ్రాజ్యవాద ప్రభుత్వం ప్రారంభించింది. 1911 లో దీని నిర్మాణం పూర్తి అయింది. అందులోకి అప్పటి వైస్రాయ్ లార్డ్ హార్డింజ్ మకాం మార్చాడు. అంతవరకు బ్రిటిష్ ఇండియా ప్రభుత్వానికి కలకత్తా నగరం రాజధానిగా ఉండేది. మహాసామ్రాజ్యాలు పతనావస్థకు చేరుకున్నాకనే గొప్ప కట్టడాల ప్రారంభం జరుగుతుందని, సామ్రాజ్యానికి అది చరమాంకమవుతుందని గడిచిన వెయ్యి సంవత్సరాల చరిత్రనుంచి ఎన్నో ఉదాహరణలిస్తూ నార్త్ కోట్ పార్కిన్సన్ ఒక సిద్ధాంతం ప్రతిపాదించాడు. బ్రిటిష్ సామ్రాజ్యంలోను అంతే జరిగింది. నేటి రాష్ట్రపతి భవనానికి ఆనాడు 'వైస్‌రీగల్ లాడ్జి' అని పేరు పెట్టారు. అటు తర్వాత 36 సంవత్సరాలకే భారతదేశానికి స్వాతంత్ర్యం లభించి బ్రిటిష్ సామ్రాజ్యం పతనమైంది. ఇది రాష్ట్రపతి భవన చరిత్ర.

దేశానికి స్వాతంత్ర్యం కనుచూపుమేరలో ఉన్న తరుణంలో - 1947 జులై 28 వ తేదీన మహాత్మాగాంధీ అప్పటి వైస్రాయ్ లార్డ్ మౌంట్ బ్యాటెన్‌కొక లేఖ వ్రాస్తూ ఆగస్టు 15 నాటికి తన నివాసాన్ని మరో చిన్న భవనానికి మార్చుకోవలసిందని సలహా ఇచ్చారు. ఇండియా కడు బీద దేశం కనుక దేశ ఆర్థిక స్తోమతను దృష్టిలో పెట్టుకొని దానికి అనుకూలంగా గవర్నర్ జనరల్ సైతం తన రాజభోగాన్ని విడనాడి, స్వతంత్ర భారత ప్రభుత్వానికి మార్గదర్శకుడు కావాలని అభిలషించారు. కాని పండిట్ నెహ్రూ మాత్రం దీనికి ఒప్పుకోలేదు. ఇండియావంటి సువిశాల దేశపు రాజ్యాధినేత దేశ ప్రతిష్ఠను ప్రతిబింబించే విధంగా మహాభవనంలోనే నివసించాలని వాదించారు. విదేశాల రాజ్యాధినేతలు మన రాష్ట్రపతికి అతిథులుగా వస్తూంటారు కనుక ఇంత పెద్ద భవనం అవసరమని ప్రభుత్వం వాదన.

### ఎన్నిక విధానం :

రాష్ట్రపతి ఎన్నికల ఓటింగ్ పద్ధతికి, సాధారణ ఎన్నికల ఓటింగ్ పద్ధతికి తేడా ఉంది. రాష్ట్రపతి ఎన్నికలలో లోక్‌సభ, రాజ్యసభ సభ్యులు, రాష్ట్రాలలోని శాసనసభ సభ్యులు పాల్గొంటారు. రాష్ట్రపతి పదవికి పోటీచేసే వ్యక్తి అభ్యర్థి

త్వాన్ని కనీసం పదిమంది సభ్యులు ప్రతిపాదించగా, మరో పదిమంది సభ్యులు సమర్థించవలసి ఉంటుంది. రాష్ట్రపతిని ఎన్నుకునే ఎలక్టొరల్ కాలేజీలో ప్రస్తుతం అంటే 1987 రాష్ట్రపతి ఎన్నికల సమయంలో 4665 మంది సభ్యులు ఉన్నారు. మొత్తం 25 రాష్ట్రాలకు సంబంధించిన 3919 శాసనసభ సభ్యులు ఉండగా, రాజ్య సభ సభ్యులు 233 మంది, లోక్‌సభ సభ్యులు 543 మంది ఉన్నారు.

రాష్ట్రపతికి పోటీచేసే వ్యక్తి తప్పని సరిగా భారతీయుడై ఉండాలి. 35 ఏళ్ల వయస్సు కలిగి, లోక్‌సభకు పోటీ చేయడానికి అవసరమైన అర్హతలన్నీ అతడు కలిగి ఉండాలి. ఈ అభ్యర్థి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలలో లాభం పొందే ఏ పదవిలో ఉండరాదు. అయితే రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి, గవర్నర్లు, మంత్రులు కొత్తగా గానీ, తిరిగిగానీ రాష్ట్రపతి పదవికి పోటీ చేయవచ్చు.

1987 జులైలో జరిగిన రాష్ట్రపతి ఎన్నికలలో విశేష మేమంటే ఇటీవల కొత్తగా ఏర్పడిన అరుణాచల్ ప్రదేశ్, మిజోరం, గోవా శాసనసభల సభ్యులు మొట్ట మొదటిసారిగా ఓటు చేశారు. రాష్ట్రపతి ఎన్నికల్లో ఓట్ల లెక్కింపు పద్ధతికి, సాధారణ ఎన్నికలలో ఓట్ల లెక్కింపు పద్ధతికి చాలా వ్యత్యాసం ఉంది. ఈ ఎన్నికల్లో ముగ్గురు వ్యక్తులు పోటీ చేశారు కనుక ప్రతి ఓటరుకు ముగ్గురుకి ఓటు చేయడానికి వీలు ఉంది. అలా ఓటు చేయడంలో తన మొదటి ఓటు ఎవరికి, రెండోది, మూడోది ఎవరెవరికి ఇచ్చేది ఆయా అభ్యర్థుల పేర్లకు ముందుగా 1, 2, 3 అని వేస్తూ ఉండాలి. ఇద్దరు అభ్యర్థులకు ఒకే అంకె ఓటు వేస్తే ఆ ఓటు చెల్లకుండా పోతుంది. ఓట్ల విలువ ఆయా రాష్ట్రాల శాసనసభల బలా బలాను బట్టి ఉంటుంది.

## 1987 ఎన్నికలు :

| వరుస సంఖ్య | రాష్ట్రం | శాసన సభ్యుల సంఖ్య | ఓటు విలువ | మొత్తం ఓట్ల విలువ |
|---|---|---|---|---|
| 1 | ఆంధ్రప్రదేశ్ | 294 | 148 | 43,512 |
| 2 | అస్సాం | 126 | 116 | 14,616 |
| 3 | అరుణాచల్ ప్రదేశ్ | 30 | 16 | 480 |
| 4 | జమ్మూకాశ్మీర్ | 76 | 83 | 6,308 |
| 5 | కేరళ | 140 | 152 | 21,280 |

| వరుస సంఖ్య | రాష్ట్రం | శాసన సభ్యుల సంఖ్య | ఓటు విలువ | మొత్తం ఓట్ల విలువ |
|---|---|---|---|---|
| 6 | కర్నాటక | 224 | 131 | 29,344 |
| 7 | గుజరాత్ | 182 | 147 | 20,754 |
| 8 | గోవా | 28 | 28 | 784 |
| 9 | హిమాచల్ ప్రదేశ్ | 68 | 51 | 3,486 |
| 10 | పంజాబు | 117 | 116 | 13,572 |
| 11 | హర్యానా | 90 | 112 | 10,080 |
| 12 | రాజస్థాన్ | 200 | 129 | 25,800 |
| 13 | మహారాష్ట్ర | 288 | 175 | 50,400 |
| 14 | తమిళనాడు | 234 | 176 | 41,184 |
| 15 | ఉత్తరప్రదేశ్ | 425 | 208 | 88,400 |
| 16 | మధ్యప్రదేశ్ | 320 | 130 | 41,600 |
| 17 | ఒరిస్సా | 147 | 149 | 21,903 |
| 18 | పశ్చిమ బెంగాల్ | 294 | 151 | 44,394 |
| 19 | బీహార్ | 324 | 174 | 56,376 |
| 20 | నాగాలాండ్ | 60 | 9 | 540 |
| 21 | మిజోరం | 40 | 8 | 320 |
| 22 | మణిపూర్ | 60 | 18 | 1,080 |
| 23 | త్రిపుర | 60 | 26 | 1,560 |
| 24 | మేఘాలయ | 60 | 17 | 1,020 |
| 25 | సిక్కిం | 32 | 7 | 224 |

పోతే, పార్లమెంటు సభ్యుని ఓటు విలువ 702 పాయింట్లుగా నిర్ణయించారు. ఈ విధంగా వివిధ రాష్ట్రాల శాసనసభ్యుల ఓట్ల విలువ 5,44,999 పాయింట్లు కాగా, పార్లమెంటు సభ్యుల ఓట్లు విలువ 5,44,752 పాయింట్లు. ఇలా మొత్తం ఓట్ల విలువ 10,89,751 పాయింట్లు ఖరారు చేశారు

ఓట్ల లెక్కింపు పెట్టేటపుడు ప్రతి అభ్యర్థికి రావలసిన ఓట్ల సంఖ్యను పోటీచేసే అభ్యర్థుల సంఖ్యను బట్టి నిర్ణయిస్తారు. ఆ కనీస సంఖ్యారాని వారిని

మొదటి లెక్కింపులోనే ఓడిపోయినట్లుగా ప్రకటిస్తారు. అటు తరువాత ఆ ఓడిపోయిన వారి ఓటు పత్రాలలో 2వ అంకె ఎవరికి వేశారో లెక్కకు తీసుకుంటారు. ఆ అభ్యర్థి కనుక ఓడిపోక మిగిలితే ఆ రెండవ ఓటును మొదటి ఓటుగా తర్వాత లెక్కింపులో మదింపు చేస్తారు. ఇలా ఒకరి తరువాత ఒకరు ఓడిపోయి మిగిలిన వారిలో ఎవరికి నూటికి యాభై పైబడి ఓట్లు వస్తాయో వారిని గెలిచినట్లుగా ప్రకటిస్తారు. ఒకవేళ మొదటి లెక్కింపులోనే పోటీచేసిన అభ్యర్థులలో ఒకరికి 50 శాతానికన్న ఎక్కువ మొదటి ఓట్లు వస్తే ఆ అభ్యర్థి నెగ్గినట్లు ప్రకటిస్తారు. మిగిలినవారిలో నూటికి యాభై పైచిలుకు రాకపోతే ఓటు విలువ మదింపు వ్యవహారం ప్రారంభమవుతుంది.

## డాక్టర్ రాజేంద్రప్రసాద్ :

భారత రాజ్యాంగం 1950 జనవరి 26 న అమల్లోకి వచ్చింది. అంతవరకూ దేశాధినేతగా ఉన్న గవర్నర్ - జనరల్ పదవి రద్దయింది. ఆ స్థానంలో రాష్ట్రపతి పదవి అధికారంలోకి వచ్చింది. ఉత్తరాదివారు ప్రధానిగా ఉంటే దక్షిణాది వారు రాష్ట్రపతిగా ఉండాలనీ, దక్షిణాదివారు ప్రధానిగా ఉంటే ఉత్తరాదివారు రాష్ట్రపతిగా ఉండాలన్న అభిప్రాయంతో మొదటి రాష్ట్రపతి పదవికి రాజాజీ పేరును, రెండో రాష్ట్రపతి పదవికి డా॥ రాధాకృష్ణన్ పేరును నెహ్రూ సూచించారు. కానీ యీ రెండుసార్లు కూడా కాంగ్రెసు హైకమాండ్ డా॥ రాజేంద్రప్రసాద్ పేరునే ఖాయపరిచింది. రాష్ట్రపతి ఎన్నికకు ముందు డా॥ రాజేంద్రప్రసాద్ రాజ్యాంగ సభ అధ్యక్షులుగా ఉండేవారు.

ఆ రోజులలో కాంగ్రెసు పార్టీలోనూ, దేశ ప్రజలలోను నెహ్రూ వ్యక్తిత్వం చాలా గొప్పది. గట్టిగా తలచుకుంటే ఆయన తాము సూచించిన అభ్యర్థులనే రాష్ట్రపతులుగా ఎంపిక చేయించుకొన గలిగేవారు. అయితే ప్రజాస్వామ్యంపై అత్యంత విశ్వాసం గల నెహ్రూ కాంగ్రెస్ అధిష్ఠానవర్గం చేసిన నిర్ణయాలలో జోక్యం కలగ చేసుకొనలేదు. డా॥ రాజేంద్రప్రసాద్ ఎన్నిక యీ విధంగా సాధ్యమయింది. ఆనాటి నుంచి రాష్ట్రపతి ఎన్నికలో ప్రధానమంత్రి కీలక వ్యక్తిగా ఉంటున్నారు. మెజారిటీ పార్టీ నాయకుడుగా ఉన్న ప్రధాని ప్రమేయం లేకుండా రాష్ట్రపతి గెలుపు దాదాపు అసంభవం.

రాష్ట్రపతి పదవికి ఎన్నో గౌరవాలు చేకూర్చి పెట్టారు నెహ్రూ. విదేశ అతిథుల కిచ్చే విందులో రాష్ట్రపతి పాల్గొనడానికి వస్తున్నప్పుడు నెహ్రూ కొంచెం ముందుగానే అక్కడికి చేరుకొని రాష్ట్రపతికి స్వాగతం పలికేవారు. వారు వెళ్లి పోతున్నప్పుడు రాష్ట్రపతి కన్నా తన అడుగు వెనుక వేసేవారు. తన విదేశ పర్యటన ముగించుకొని రాగానే నెహ్రూ రాష్ట్రపతిని కలుసుకొని అక్కడి విశేషాలను ఆయనకు తెలియపరిచేవారు. వారం వారం రాష్ట్రపతిని కలుసుకొని ఆయనతో దేశ, విదేశ వ్యవహారాలపై చర్చలు జరిపేవాడు.

పండెండు సంవత్సరాలు రాష్ట్రపతిగా పనిచేసిన గౌరవం ఒక్క డాక్టర్ రాజేంద్రప్రసాద్‌కే దక్కింది. ఈ సుదీర్ఘకాలంలో రాష్ట్రపతి ప్రసాద్, ప్రధాని నెహ్రూల మధ్య కొన్ని విభేదాలు కూడా తలెత్తాయి. ముఖ్యంగా మత విషయంలో ఈ ఇద్దరు నాయకుల మధ్య అభిప్రాయాలు తూర్పు, పడమరలుగా ఉండేవి. మతం పట్ల నెహ్రూ ఎంత అనాసక్తి కనబరిచేవారో రాజేంద్రప్రసాద్ అంత ఆసక్తి కనబరిచేవారు. 'నా మత విశ్వాసాల నుండి నేను దూరంగా ఉన్నట్లు నటించలేన'ని రాష్ట్రపతి ప్రసాద్ నిర్మొహమాటంగా చెప్పేవారు. ఆ విశ్వాసం తోనే ఆయన వారణాసిలో సాధు పుంగవులకు పాదాభివందనం చేశారు. పూరీ పుణ్యక్షేత్రంలో పరమశివుని విగ్రహావిష్కరణ మహోత్సవంలో సర్దార్ పటేల్‌తో పాటు పాల్గొన్నారు. అయితే ఆ సందర్భంగా రాష్ట్రపతి చేసిన ఉపన్యాసం రేడియోలో ప్రసారం కాకుండా నెహ్రూ చర్యలు తీసుకున్నారు.

ముఖ్యంగా డా॥ రాజేంద్రప్రసాద్ మూడంశాలపై ఎక్కువ శ్రద్ధ చూపే వారు. బిల్లులపై సంతకం పెట్టే ముందు రాష్ట్రపతికి వాటిని సమగ్రంగా పరిశీలించే హక్కు ఉండాలన్నది మొదటిది. ప్రజా విశ్వాసాలను కోల్పోయినట్లు చెప్పబడుతున్న ప్రభుత్వాల బర్తరఫ్ విషయంలో రాష్ట్రపతికి పునః పరిశీలించే అవకాశం ఉండాలన్నది రెండోది. దేశ రక్షణ విషయంలో సైన్యం తీసుకుంటున్న జాగ్రత్త చర్యల గురించి త్రివిధ దళాల అధిపతులతో చర్చలు జరపడం మూడోది. డాక్టర్ రాజేంద్రప్రసాద్ విదేశాలలో పర్యటిస్తున్నప్పుడు సెక్యులర్ భారతదేశం అధిపతిగా ఉదాత్తమైన పాత్ర నిర్వహించలేరనే అభిప్రాయం నెహ్రూకు ఉండేది. కానీ, రాష్ట్రపతి జపాన్, ఇండోనేషియా, శ్రీలంక పర్యటనలు నెహ్రూ అనుమానాలను చిత్తు చేశాయి.

1959 లో అమెరికా అధ్యక్షుడు ఐసెన్ హోవర్ భారత పర్యటన కొచ్చారు. నెహ్రూ కన్న రాజేంద్రప్రసాదే ఆయనను ఎక్కువ ఆకర్షించారు. 'దేవుని సుపుత్రులు మీరు' అని మన రాష్ట్రపతిని అభినందించి అమెరికా సందర్శించ వలసిందిగా ఆయనను ఆహ్వానించారు. 'మీరు మా దేశం కనుక సందర్శిస్తే మనిద్దరం మొత్తం అమెరికా చుట్టి వద్దాం' అని కూడా ఆయనతో అన్నారు. కాని రాష్ట్రపతి అమెరికా పర్యటన ఫైలు తన వద్దకి వచ్చిన ప్రతి సందర్భంలోను నెహ్రూ, 'మనలో ఎంతోమంది అమెరికా వెళ్లి వచ్చారు. రాష్ట్రపతి వెళ్ళక పోతే ఏం ?' అని నోటు వ్రాసి పంపేవారు. చివరకు డా॥ రాజేంద్రప్రసాద్ అమెరికా పర్యటన కలలు ఫలించనే లేదు.

డాక్టర్ రాజేంద్రప్రసాద్ సోవియట్ యాత్ర ఎంతో ఫలప్రదమైంది. ఆయన పర్యటనల వార్తలను ఇరు దేశాల పత్రికలు, పత్రిక శీర్షికలో ప్రచురించాయి. విభిన్న మతాలు, విభిన్న జాతులు విభిన్న భాషలు గల సోవియట్ దేశం ఏక ఖండంగా మనగలుగుతున్న విషయాలను రాష్ట్రపతి అధ్యయనం చేసి, భారతదేశం తిరిగి రాగానే వాటి వివరాలను మంత్రివర్గానికి పంపుతూ, భారత సమైక్యతకు అవి ఎంతవరకు ఉపకరిస్తాయో పరిశీలించవలసిందని కోరారు.

త్వరపడి దూరదృష్టి లేకుండా క్లిష్టమైన ఆర్థిక, సాంఘిక శాసనాలను చేసినపుడు ప్రజలు పెక్కు రకాలుగా కష్ట నష్టాలను అనుభవించగలరని డాక్టర్ రాజేంద్రప్రసాద్ నిరంతరం ప్రభుత్వాన్ని హెచ్చరిస్తూ ఉండేవారు. ప్రజాభిప్రాయానికి ప్రతిబింబ మనదగిన తన భావాలను ఎప్పుడి కప్పుడు ప్రధాని నెహ్రూకు, తదితర మంత్రులకు తెలియచేసేవారు. అభ్యుదయమనేది క్రమంగా సాధించాలనీ, అందుకోసం అన్ని వర్గాల ప్రజల స్వచ్ఛంద సహకారం పొందాలని ఆయన అభిలషించేవారు. ఇందుకు ఉదాహరణలుగా భూసంస్కరణ శాసనాలు, హిందూ ధర్మశాస్త్ర క్రోడీకరణ గురించి ఆయన చెప్పిన సలహాలను పేర్కొనవచ్చు. పండెండు సంవత్సరాలు బాధ్యత గల పదవిలో ఎంతో హుందాగా డా॥ రాజేంద్రప్రసాద్ ప్రవర్తించారు. భారత రాజ్యాంగ సూత్రాలను, ఆశయాలను కాదని ఆయన వ్యవహరించిన సందర్భం ఒక్కటైనా లేదు. అందుకు ఆయన సౌజన్యమే కారణం. రాష్ట్రపతి పదవి, దాని అధికారాల గురించి పరిశోధనలు జరగాలని ఆయన చేసిన ప్రకటనపై శ్రద్ధ తీసుకోనందుకే అనంతర రాష్ట్రపతులకు ఎన్నో జటిల సమస్య లెదురైనాయి.

డాక్టర్ రాధాకృష్ణన్ :

డాక్టర్ రాజేంద్రప్రసాద్ స్థానంలో ఉపరాష్ట్రపతి డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్ తన 74 వ ఏట 1962 లో భారతదేశపు రెండవ రాష్ట్రపతి అయ్యారు. నెహ్రూ ఔన్నత్యం వృద్ధాప్యంవల్ల కొంత, చైనా దాడివల్ల కొంత తగ్గుముఖం పడుతున్న సమయమది. యుద్ధ సమయంలో మన సైన్యాన్ని సర్వ సన్నద్ధంగా ఉంచనందుకు రాష్ట్రపతి ప్రభుత్వాన్ని తీవ్రంగా దుయ్యబట్టారు. దీన్ని సాకుగా తీసుకొని రాష్ట్రపతి కేంద్ర ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేయనున్నారనే వదంతులు వ్యాపించాయి. ఈ సందర్భంగా డా॥ రాధాకృష్ణన్ రాజాజీతో రహస్య మంతనాలు జరుపుతున్నట్లు కొన్ని వార్తలు వెలువడ్డాయి.

భారత-చైనాలమధ్య సంధి కుదర్చటానికి ఉద్దేశించిన ప్రతిపాదనలను ఐక్య అరబ్ రిపబ్లిక్ అధ్యక్షుడు నాసర్ దూత వింగ్ కమాండర్ ఆలీసాబ్రీ మోసుకొని ఢిల్లీ కొచ్చాడు. ఆయన గౌరవార్థం ఏర్పాటు చేసిన విందులో రాష్ట్రపతి, ప్రధానమంత్రి మొదలైన ప్రముఖులు పాల్గొన్నారు. ఈ ఆపత్సమయంలో మన దేశానికి నాసర్ అందించిన నైతిక సహాయం, సూయజ్ కాలువ సంక్షోభంలో నెహ్రూ ఆదేశానికిచ్చిన సహాయంలో ఎంతటిదని ఢిల్లీ పెద్దలు విమర్శించుకోవడం మొదలు పెట్టారు. వింగ్ కమాండర్ ఎంతో జాగ్రత్తగా చేసిన తన ప్రసంగంలో చైనా గురించి ఒక్క అప్రియమైన వాక్యంకూడా పలకక పోవటం నెహ్రూకు దిగ్భ్రాంతి కలిగించింది. ఇదంతా గమనిస్తున్న రాష్ట్రపతి నెహ్రూ భుజం తట్టి, అంతర్జాతీయ రాజకీయ రంగంలో కృతజ్ఞతా భావం చాలా తక్కువగా ఉంటుంద'ని నచ్చచెప్పారు.

డా॥ షేక్ అబ్దుల్లాకు అనవసరమైన ప్రాముఖ్య మిచ్చి కాశ్మీరు సమస్యను నెహ్రూ సాగదీస్తున్నారని డా॥ రాధాకృష్ణన్ అభిప్రాయ పడేవారు. షేక్ అబ్దుల్లాను కేంద్రంలోకి తీసుకొని డా॥ కరన్‌సింగ్‌ని ఆ రాష్ట్ర ముఖ్యమంత్రిగా చేస్తే అనేక సమస్యలు పరిష్కారమై పోయేవని ఆయన భావించేవారు. పాకిస్తాన్‌తో మన దేశం యుద్ధం చేస్తున్న సమయంలో జాతి నుద్దేశించుకుంటూ రాష్ట్రపతి చేసిన ప్రసంగాలు ఎంతో విజ్ఞతతో కూడినవి. అవి దేశ ప్రజలలో త్యాగనిరతిని, దేశభక్తిని కొంతమేరకు పెంపొందించ గలిగాయి. ఒకసారి డా॥ రాధాకృష్ణన్ తన విదేశ పర్యటన ముగించుకొని దేశం తిరిగి వస్తుండగా ఆయన

ప్రయాణం చేస్తున్న విమానం కొంతసేపు కైరో విమానాశ్రయంలో ఆగవలసి వచ్చింది. తమకు స్వాగత మివ్వటానికి వచ్చిన ఈజిప్టు అధ్యక్షుడు నాసర్‌తో రాష్ట్రపతి, 'మా సైన్యాలు లాహోర్ రంగంలో చొచ్చుకొని పోవడం మాకు గర్వకారణమైన విషయమే. కాని తిరిగి అవి పూర్వస్థానానికి వెళ్ళటంవల్ల మా ప్రతిష్ఠ అంతర్జాతీయ రంగంలో కొంత దెబ్బతిన్నద'ని చెప్పారు. 1967 జనవరి 26న లాల్ ఖిల్లాపై పతాకావిష్కరణ చేసిన తరువాత రాష్ట్రపతి ప్రసంగిస్తూ, 'ఎక్కడ చూచినా అవినీతి, బంధుప్రీతి, లంచగొండితనం వార్తలు విచ్చలవిడిగా వినిపిస్తున్నాయి. వాటిని అదుపులో ఉంచటానికి గట్టి చర్యలు చేబట్టక పోతే జాతి భవిష్యత్తు ఏమవుతుందో అనే భయసందేహాలు అందరిలో వ్యాపించి ఉన్నాయి, అని చేసిన ప్రసంగం ప్రభుత్వానికి ఆయన అంటించిన తుది చురక అయింది.

ముగ్గురు ప్రధానుల కాలంలో రాష్ట్రపతిగా పని చేసిన డా॥ రాధాకృష్ణన్‌తో ఇందిరాగాంధి సంబంధాలు కేవలం లాంఛనప్రాయమైనవి. తనను 'తన మిత్రుని కూతురు'గ చూస్తున్నందుకు శ్రీమతి ఇందిరా గాంధి బాధపడేవారు. కామరాజ్ మొదలైన పెద్దలు రాధాకృష్ణన్‌ను రెండోసారి రాష్ట్రపతి పదవికి పోటీ చేయమని కోరగా శ్రీమతి ఇందిరా గాంధి నుంచి తగినంత ప్రోత్సాహం లేనందుకు ఆయన రెండవసారి రాష్ట్రపతి పదవికి పోటీ చేయలేదు.

మన రాష్ట్రపతు లందరిలో డా॥ రాధాకృష్ణన్ శ్రేష్ఠులని విమర్శకుల అభిప్రాయం. ఎందుకంటె ఆయనలో స్వయం సిద్ధంగా ఉన్న తేజోవికాసం, ధారణాశక్తి, కుశాగ్రబుద్ధి ఆయన రాష్ట్రపతిగా ఉన్న కాలంలో దేశానికి ఎంతగానో ఉపయోగ పడ్డాయి.

### డా॥ జాకీర్ హుసేన్ :

ఈసారి కాంగ్రెస్ పార్లమెంటరీ బోర్డు ఉపరాష్ట్రపతి డా॥ జాకీర్‌హుసేన్ పేరును రాష్ట్రపతి పదవికి ప్రతిపాదించింది. స్వాతంత్ర్యానికి మునుపు డా॥ జాకీర్ హుసేన్ బేసిక్ విద్యావిధానానికి రూపకల్పన చేసి మహాత్మాగాంధీకి సన్నిహితులయ్యారు. ఆయన ఢిల్లీలోని జామెమిలియా ఇస్లామియాకు, ఆలీఘర్ విశ్వవిద్యాలయానికి పెక్కు సంవత్సరాలు వైస్ చాన్సలర్‌గా పని చేసిన విద్యావేత్త.

బీహార్ రాష్ట్ర గవర్నరుగా, ఉపరాష్ట్రపతిగా పనిచేసిన రోజులలో నిఖాల్సయిన పెద్దమనిషిగా ఆయన చలామణి అయినారు. డా॥ జాకీర్‌హుస్సేన్ అభ్యర్థిత్వానికి జయప్రకాశ్‌నారాయణ్ తన పూర్తి మద్దతు ప్రకటించి ఆయనను రాష్ట్రపతిగా ఏకగ్రీవంగా ఎన్నుకొనవలసిందని అన్ని పార్టీలకు విజ్ఞప్తి చేశారు.

ప్రతిపక్ష పార్టీల వారు తమ అభ్యర్థిగా సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ కోక సుబ్బారావును రంగంలో దించారు. ఇరు పక్షాలవారు నువ్వా ? నేనా ? అనే ధోరణిలో తమ అభ్యర్థుల విజయానికి తీవ్ర ప్రచారం చేసుకున్నారు. డాక్టర్ హుసేన్‌కు 4,71,244 పాయింట్ల ఓట్లురాగా, శ్రీ కోక సుబ్బారావుకు 3,63,971 పాయింట్ల ఓట్లు లభించాయి. డాక్టర్ జాకీర్ హుసేన్ భారతదేశపు మూడవ రాష్ట్రపతిగా 1967 మే 13 వ తేదీన తన 70 వ ఏట పదవీప్రమాణ స్వీకారం చేశారు. దీన్ని ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి వ్యక్తిగత విజయంగా భావించాలి.

తనను రాష్ట్రపతి చేసినందుకు డాక్టర్ జాకీర్‌హుసేన్ శ్రీమతి ఇందిరా గాంధీపట్ల ప్రసన్నభావంతో ఉండేవారు. కానీ తన వ్యక్తిత్వ నిరూపణకు సమయం వచ్చినప్పుడు అందుకు ఆయన ఎన్నడూ వెనుకాడలేదు. బీహార్‌లో సంయుక్త విధాయక్‌దళ్ ప్రభుత్వం ఆయన చొరవవల్ల ఏర్పడింది. జాతిపిత మహాత్మాగాంధీ విధానాలను విస్మరించి దేశం గొప్ప సంక్షోభంలో పడిపోయిందని ఆయన తన ఆవేదన వ్యక్తపరిచేవారు. డాక్టర్ జాకీర్ హుసేన్ 1969 మే 3వ తేదీన అంటే ఈ పదవిలో రెండేళ్లు మాత్రమే పనిచేసి గుండె జబ్బుతో మరణించారు. ఆయన స్థానంలో ఉపరాష్ట్రపతి శ్రీ వి. వి. గిరి తాత్కాలిక రాష్ట్రపతి అయ్యారు.

**వి. వి. గిరి :**

1969 జులై 12న కాంగ్రెసు పార్లమెంటరీ బోర్డు యీ అత్యున్నత పదవికి తన పార్టీ అభ్యర్థిని ఖరారు చేయడానికోసం బెంగుళూరులో సమావేశమైంది. సిండికేటు వర్గం శ్రీ నీలం సంజీవరెడ్డి పేరును ప్రతిపాదించగా శ్రీమతి ఇందిరాగాంధీ వర్గం నుంచి శ్రీ జగ్‌జీవన్‌రాం పేరును ప్రతిపాదించారు. పార్లమెంటరీ బోర్డు లోని మురార్జీదేశాయ్, ఎస్కే పాటిల్, కామరాజ్, చవాన్‌లు సంజీవరెడ్డిని బలపరచగా, ఇందిరాగాంధీ, ఫక్రుద్దీన్ అహ్మద్‌లు జగజీవన్‌రాంను బలపరిచారు. ఇందిరాగాంధీ అభ్యర్థికి ఆదిలో మద్దతు ఇస్తానన్న చవాన్ మధ్యలో

మాట తప్పడంతో ఇందిరా గాంధీ పెద్ద ఇరకాటంలో పడిపోయారు. ఆమెకు సంజీవరెడ్డి నామినేషన్ పత్రాలపై సంతకం పెట్టక తప్పలేదు. ఈ లోగా తాత్కాలిక రాష్ట్రపతి గిరి తమ పదవికి రాజీనామా చేసి ఇండిపెండెంటు అభ్యర్థిగా రంగంలో దిగినట్లు ప్రకటించారు.

శ్రీ గిరి ఉపరాష్ట్రపతి పదవికి రాజీనామా చేయగానే దేశంలో రాష్ట్రపతి లేని విచిత్ర పరిస్థితి ఏర్పడిపోయింది. ఉపరాష్ట్రపతిలేరు. రాష్ట్రపతి పదవి ఖాళీ, ఇక దేశాధినేత ఎవరు? అనే సమస్య ఎదురైంది. అప్పటి కప్పుడు పార్లమెంటును సమావేశ పరచి, ఇలాంటి సందర్భాలు ఎదురైనప్పుడు సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తిని తాత్కాలిక రాష్ట్రపతిగా నియమించు కోవచ్చుననే చట్టాన్ని చేసుకున్నారు. ఈ విధంగా సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ హిదయతుల్లా తాత్కాలిక రాష్ట్రపతి అయ్యారు.

పార్లమెంటరీ బోర్డు సమావేశంలో తన అభ్యర్థిని నెగ్గించుకొని శ్రీమతి ఇందిరాగాంధీ ఈ పరాజయానికి ప్రతీకార చర్యగా 'అంతరాత్మ ప్రబోధన' అనే సూత్రం లేవనెత్తి ఎవరి ఓటుహక్కు వారు స్వేచ్ఛగా ఉపయోగించు కొనవలసిందని తన వర్గాన్ని కోరారు. గ్రామ పంచాయతీ ఎన్నికల్లో సైతం సంతకం పెట్టినప్పుడు ఆ అభ్యర్థి వెన్నుపోటు పొడవడం సంభవించదు. ఇలా దిగజారి పోయాయి నాటి రాష్ట్రపతి ఎన్నికల రాజకీయాలు. రెండో కౌంటులో అత్యల్ప మెజారిటీతో శ్రీ గిరి రాష్ట్రపతిగా ఎన్నికయ్యారు. ఈ ఎన్నిక ఇటీవల చరిత్రలో కనీవినీ ఎరుగ నటువంటి సంచలనాన్ని కలిగించి నప్పటికీ, ప్రజాస్వామ్య పద్ధతిలో తు. చ. తప్పని రీతిని సలక్షణంగా జరగటం ముదావహం.

కార్మిక నాయకునిగా, గొప్ప జాతీయవాదిగా, అకలంక దేశభక్తునిగా భారత ప్రజల ఆదరాభిమానాలను చూరగొన్న వ్యక్తి శ్రీ వరాహగిరి వెంకటగిరి. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో రాజాజీ, ప్రకాశం మంత్రివర్గాలలో గిరి పనిచేశారు. కేంద్రమంత్రిగా, శ్రీలంకలో భారత హైకమీషనరుగా, పదేళ్ల గవర్నరుగా, ఉపరాష్ట్రపతిగా – ఏ పదవిలో పని చేసినా ఆ పదవికే ఆయన విలువలు సంతరించి పెట్టారు. అందువలన ఆయన రాష్ట్రపతిగా ఉంటున్న కాలంలో దేశానికి పెద్ద దిక్కుగా ఉంటూ ఎంతో హుందాగా ప్రవర్తించారు. 'పేరుకు గిరి, తీరుకు హిమగిరి, వెలుగు గిరి సరి, మెరుపుతీగ గిరి' అనే ప్రశంసలు పొందారు.

ఫ్రక్రుద్దీన్ అలీ అహ్మద్ :

ఇంతవరకూ ఉపరాష్ట్రపతులుగా ఉన్నవారే రాష్ట్రపతులుగా ఎన్నిక అవుతువచ్చారు. ఆ లెక్కన గిరి అనంతరం ఉపరాష్ట్రపతి గోపాల్ స్వరూప్ పాఠక్ రాష్ట్రపతిగా ఎన్నిక కావాలి. కానీ, ఈ పద్ధతి సాంప్రదాయంగా మారడం ఇందిరాగాంధీకి ఇష్టంగా లేదు.

శ్రీ పాఠక్ నెహ్రూ కుటుంబానికి సన్నిహితుడుగా ఉన్నవారే. ఇందిరా గాంధీ మొదటి మంత్రివర్గంలో ఆయన న్యాయశాఖను నిర్వహించారు కూడా. ఆటు తరువాత కర్నాటక గవర్నరుగా పనిచేశారు. కానీ, ఆయన స్వతంత్రాభి ప్రాయాలు కలిగిన వ్యక్తి. ఇందిరాగాంధీ దృష్టిలో రాష్ట్రపతి కావడానికి గల అర్హతలకు ఇది అవరోధకం. పాఠక్ ఉపరాష్ట్రపతిగా ఉన్నప్పుడు రాజ్యసభలో రాజభరణాల రద్దు అంశంపై చర్చ జరుగుతున్నది. రాజ్యసభ అధ్యక్షుని హోదాలో తనకు లభించిన ఓటు హక్కును శ్రీ పాఠక్ అధికార పక్షానికి అనుకూలంగా వేసి ఉంటే అది ఆలోచనసే నెగ్గవలసింది. కానీ, పాఠక్ ఆపని చేయక ఇందిరాగాంధీ అనుగ్రహం కోల్పోయారు. అందుకు ఇప్పుడాయన భారీ మూల్యాన్ని చెల్లించు కొనవలసి వచ్చింది. రాష్ట్రపతి పదవికి కొత్త అభ్యర్థి అన్వేషణ మొదలైంది.

డాక్టర్ జాకీర్ హుసేన్ పూర్తికాలం రాష్ట్రపతి పదవి నిర్వహించలేదు. కనుక ఒక ముస్లిం వ్యక్తిని రాష్ట్రపతిగా చేస్తే ఆ లోటును భర్తీ చేయవచ్చునని కాంగ్రెస్ పెద్దలకు అభిప్రాయం కలిగింది. ఆ దృష్టితో పరిశీలిస్తే శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహమద్ కంటె యోగ్యుడైన ముస్లిం నాయకుడు కాంగ్రెసు పార్టీలో అప్పుడు మరొకరు లేరు.

శ్రీ గిరి అనంతరం శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహమద్ తన 69వ ఏట 1974 లో రాష్ట్రపతి పదవికి అత్యంత మెజారిటీతో ఎన్నిక అయ్యారు. ఆయనతో పోటీచేసి ఓడిపోయిన త్రిదీబ్ కుమార్ చౌధరీ తాను వ్యక్తిగత హోదాతో కాక సిద్ధాంతాల ప్రాతిపదికపై పోటీ చేశానని, విజయలక్ష్మి శ్రీ అహమద్‌ను వరించి నందుకు ఆయనకు శుభాకాంక్ష లందజేస్తున్నానని చెప్పారు. శ్రీ అహమద్ ఎన్నిక ప్రజాస్వామ్య, సామ్యవాద, లౌకిక వ్యవస్థల విజయమని పలువురు

పేర్కొన్నారు. రేపు రాష్ట్రపతి ఎన్నిక జరుగుతుందనగా శ్రీ అహమద్ తన ఆస్తి విలువలను ప్రకటించాలని ప్రతిపక్ష సభ్యులు పట్టుబట్టారు. దానిపై ఫక్రుద్దీన్ అహమద్ తన ఆస్తి అరకోటి కాదని కొన్ని లక్షలేనని ప్రకటించారు.

శ్రీ ఫక్రుద్దీన్ అహమద్ దేశ స్వాతంత్ర్య సమరంలో కారాగారశిక్ష లనుభవించిన దేశభక్తుడు. ఎనిమిది సంవత్సరాలు ఆయన అస్సాం రాష్ట్ర మంత్రిగాను, చాలాకాలం కేంద్రమంత్రిగాను పని చేశారు. కేంద్ర మంత్రివర్గములో రాజకీయ వ్యవహారాల సంఘంలో శ్రీ అహమద్ సీనియరు మంత్రి. అందువల్ల ప్రభుత్వం తీసుకున్న అన్ని రాజకీయ నిర్ణయాలలో ఆయన భాగస్వామి. కాంగ్రెసు చీలిక సమయంలో శ్రీ అహమద్ ఇందిరాగాంధీకి గట్టి మద్దతుదారుగా ఉన్నారు. ఎమర్జెన్సీ వార్తలు వెలువడుతున్న సమయంలో శ్రీ అహమద్ కిమ్మనలేదు. దేశంలోకెల్ల అత్యున్నత పదవి తనకు ఇచ్చినందుకు ఆయన ఇందిరాగాంధీకి రుణపడి ఉన్నట్లు ప్రవర్తించారు. 1975 జూన్ 20వ తేదీ అర్ధరాత్రి 11-45 గంటలకు ఎమర్జెన్సీ ప్రకటనల కాగితాలపై రాష్ట్రపతి సంతకాలు జరిగాయి. ఈ విధంగా ఎంతోకాలంనుంచి ఎంతో కష్టపడి ప్రజలు సంపాదించుకున్న ప్రజాస్వామ్యాన్ని రాష్ట్రపతి ఫక్రుద్దీన్ అహమద్ ఒక్క కలంపోటుతో సరికివేశారు. ఈ చర్యతో ఆయనకున్న వ్యక్తిగత ప్రతిష్ఠతోపాటు రాష్ట్రపతి ప్రతిష్ఠకూడా దిగజారింది.

వస్తుతః శ్రీ ఫక్రుద్దీన్ అహమద్ సౌమ్యుడు. ఇందిరాగాంధీ మాటను కాదనలేక ఆయన ఎమర్జెన్సీ పత్రంపై సంతకం పెట్టారుకానీ, అందుకు ఆయన బాధపడకపోలేదు. ఢిల్లీలో జరిగిన ఒక ప్రార్థనా సమావేశంలో ప్రసంగిస్తు రాష్ట్రపతి, 'మీ హక్కులకోసం పోరాడే హక్కు మీకు ఉంది' అని ఉద్బోధించాడు. ఆయన డైరీ లభించి ఉంటే మరికొన్ని వివరాలు వెల్లడి అయ్యేవి. శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహమ్మద్ 1977 ఫిబ్రవరి 11వ తేదీన గుండెజబ్బుతో మరణించారు. అప్పుడు తాత్కాలిక రాష్ట్రపతిగా ఉపరాష్ట్రపతి శ్రీ జట్టి ప్రమాణ స్వీకారం చేశారు.

### నీలం సంజీవరెడ్డి :

కేంద్రంలో జనతా పార్టీ అధికారానికి రాగానే ఆనాటి ప్రధాని శ్రీ మురార్జీ దేశాయ్ శ్రీమతి రుక్మిణీదేవి అరుండల్ పేరును రాష్ట్రపతి పదవికి ప్రకటించి

దేశ ప్రజలను చకితుల్ని చేశారు. ప్రధాని యీ వింతధోరణి జనతాపార్టీని కూడా కొంత ఇబ్బంది పెట్టింది. అనేక చర్చల అనంతరం చివరకు సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ హెగ్డే, మాజీ కేంద్రమంత్రి శ్రీ ఎం. సి. చాగ్లా, శ్రీమతి రుక్మిణీదేవి అరుండల్ పేర్లను జనతా పార్లమెంటరీ బోర్డు పరిశీలనకు తీసుకుంది. ఛాగ్లాను, హెగ్డేను కాంగ్రెసుపార్టీ మొదటనే తిరస్కరించింది. పోతే అరుండల్ పేరు ప్రతిష్ఠలు రాష్ట్రపతి పదవికి సరిపోవు. 1969 రాష్ట్రపతి ఎన్నికలలో ఓడిపోయిన శ్రీ నీలం సంజీవరెడ్డికి ఇప్పుడు అవకాశం ఇవ్వాలని జనతాలోని ఒక వర్గం అభిప్రాయపడింది. దీనికి వత్తాసు పలికిన వారిలో శ్రీ జగ్‌జీవన్‌రామ్ కూడా ఉన్నారు. లోక్‌సభ స్పీకరుగా శ్రీ సంజీవరెడ్డి తన నిష్పక్షపాత రూలింగ్స్‌తో ప్రతిపక్షాల మన్ననలను కూడా పొందారు. ఇప్పుడు కాంగ్రెసు ప్రతిపక్షంలో ఉంది కనుక సంజీవరెడ్డి నిష్పక్షపాత వైఖరి తమ కెంతో అవసరమని భావించి సంజీవరెడ్డి పేరుకు శ్రీమతి ఇందిరాగాంధీ వెంటనే అంగీకరించారు.

ఇక్కడ మరొక విషయం ఉంది. ఆనాటి రాష్ట్రపతి ఎన్నికల్లో మొత్తం ఓటర్ల విలువ 10.8 లక్షల పాయింట్లు. అధికార పార్టీకి 5 లక్షలకు కొంచెం తక్కువ ఓట్లు ఉన్నాయి. కాంగ్రెస్ పార్టీకి నాలుగు లక్షలకు కొంచెం తక్కువ ఉన్నాయి. కనుక ఎవరి అభ్యర్థి గెలవాలన్నా మరొకరి సహకారం అవసరం. రాష్ట్రపతి ఎన్నిక ఏకగ్రీవంగా జరగాలని ఇరుపక్షాలు కృతనిశ్చయంతో ఉండటం వలన సంజీవరెడ్డి ఎన్నిక సులభమైనది.

అధికారంలో కొచ్చిన రెండేళ్ళకే జనతా కొంప కూలింది. లోక్‌సభలో మురార్జీదేశాయ్ ప్రభుత్వంపై అవిశ్వాస తీర్మానం ప్రవేశపెట్టినప్పుడు శ్రీ దేశాయ్ ఒక చేతిలో రాజీనామాను, మరొక చేతిలో తనను తిరిగి ప్రధానిగా నియమించాలని మరొక లేఖను పట్టుకొని రాష్ట్రపతికి చూపించారు. దీనివల్ల ఒక సంగతి స్పష్టమైంది. ఎంతో అనుభవజ్ఞుడైన రాజకీయవేత్త, నీతి నియమాలను భీష్మాచార్యులుగా పాటించే దేశాయ్ సైతం అధికారం నిలబెట్టుకొనే ప్రశ్న వచ్చినప్పుడు రుజుమార్గంలో ప్రవర్తించలేక పోయారు. ఎందుకంటే లోక్‌సభలో తనకు మెజారిటీ ఉంటే మురార్జీదేశాయ్ అవిశ్వాస తీర్మానాన్ని ఎదుర్కోవాలి. లేకపోతే రాజీనామా చేయాలి. ఈ రెండు పనులు వెంటనే మురార్జీ చేయనందుకు రాష్ట్రపతి ప్రతిపక్ష నాయకుడైన ఎస్. బి. చవాన్‌ను మంత్రివర్గం ఏర్పరచ వలసిందిగా ఆహ్వానించవలసి వచ్చింది. అందుకు చవాన్ తన అశక్తతను వెల్లడిం

చారు. ఇంతలో దేశాయ్ తనకు మెజారిటీ మద్దతు ఉన్నట్లు తెలుపుతూ తన మద్దతుదార్ల జాబితాను రాష్ట్రపతి కందించారు. ఆ జాబితాలో కొన్ని తప్పుడు పేర్లు బయట పడగానే మురార్జీ క్షమాపణలు చెప్పుకున్నారు. అప్పుడు లోక్‌దళ్ నాయకుడు చరన్‌సింగ్ ఇందిరాగాంధీ మద్దతుతో ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశారు.

కేవలం ఆవేశం, అధికారకాంక్ష వల్ల ప్రభుత్వం నిలవదు. రాజకీయ చాతుర్యంలో నిగ్గుదేలిన శ్రీమతి ఇందిరాగాంధీ చరణ్‌సింగ్‌కు తన మద్దతు ఉపసంహరించుకోగానే లోక్‌సభలో మెజారిటీ కోల్పోయిన ఆయన ప్రభుత్వం నెల తిరక్కుండానే రాజీనామా చేయవలసి వచ్చింది. అప్పుడు రాష్ట్రపతి సంజీవరెడ్డి 1979 ఆగస్టు 22న లోక్‌సభను రద్దుపరచి నవంబర్, డిశంబర్‌లలో పార్లమెంటుకు మధ్యంతర ఎన్నికలు జరిగే వరకు చరణ్‌సింగ్‌ను ఆపద్ధర్మ ప్రధానిగా కొనసాగనిచ్చారు. ఇక్కడ ఒక సంగతి గుర్తించాలి. రాష్ట్రంలో రాష్ట్రపతి పాలన విధించినట్లుగా కేంద్రంలో రాష్ట్రపతిపాలన విధించే అవకాశం లేదు.

పార్లమెంటులో మెజారిటీ కోల్పోయి, అధికార విసర్జన చేయవలసిన జనతా పార్టీ రాష్ట్రపతి యీ చర్యను తమ పార్టీ నాయకుడైన జగ్‌జీవన్‌రాంను ప్రధాని కాకుండా చేయటానికి పన్నిన కుట్రగా చిత్రించింది. జనతా అధ్యక్షుడు శ్రీ చంద్రశేఖర్ రాష్ట్రపతిని అభిశంసించడానికి సిద్ధమైనారు. 'తానాక్రమించిన మహోన్నత స్థానాన్ని సంజీవరెడ్డి దిగజార్చార'ని మురార్జీ చిందులు తొక్కారు. ఇక్కడ ఒక సంగతి పరిశీలించవలసి ఉంది. రాష్ట్రపతి ఎన్నికల్లో తనకన్న ఒక గాయనికి (రుక్మిణీదేవి ఆరుండల్) ప్రాధాన్యం ఇచ్చి తనను అవమాన పరచిన మురార్జీదేశాయ్‌ని, 1969 రాష్ట్రపతి ఎన్నికలలో తనతో పోటీ చేసిన జగ్‌జీవన్‌రాంని సంజీవరెడ్డి ఒక్క దెబ్బతో ఇప్పుడు నేలకూల్చి ప్రతీకారం తీసుకున్నారని కొందరు విమర్శకుల అభిప్రాయం. కానీ ఈ సమయంలో సంజీవరెడ్డి ప్రదర్శించిన దృఢవైఖరి, నిగ్రహమూ దేశానికెంతో మేలు చేశాయి. రాజకీయ పార్టీలకు తమ చిత్తం వచ్చినట్లు ప్రభుత్వాలు ఏర్పాటుచేసే అవకాశం సంజీవరెడ్డి ఆనాడు ఇచ్చిఉంటే కేంద్ర ప్రభుత్వం కూడా బీహార్‌లోని సంయుక్తదళ్ మంత్రివర్గాలలాగ నెలకొక్కటి చొప్పున మారుతూ ఉండేది. దానివల్ల ప్రపంచ దృష్టిలో మన ప్రజాస్వామ్యం నవ్వులపాలై ఉండేది. అది పార్లమెంటరీ వ్యవస్థకే ఎసరు పెట్ట కలిగి ఉండేది.

శ్రీ సంజీవరెడ్డికి రాష్ట్రపతి పదవి దక్కకుండా శ్రీమతి ఇందిరాగాంధీ ఒక నాడు అడ్డుకున్నారు. అయినప్పటికీ తరువాత నైనా అత్యున్నత పదవీ బాధ్యతను స్వీకరించడం ఆయనకు సాధ్యమైంది. పార్లమెంటు రద్దు ద్వారా శ్రీ సంజీవరెడ్డి ఇందిరాగాంధీ విజయానికి ఒక విధంగా తోడ్పడిన వారైనారు. ఇందిరాగాంధీకి రానున్న ఎన్నికల్లో గణనీయమైన మెజారిటీ లభిస్తోందని సంజీవరెడ్డి ముందుగానే ఊహించగలిగారు.

లోక్‌సభ ఎన్నికల్లో కాంగ్రెసు (ఐ) ఆధిక్యంలో ఉన్న రాష్ట్ర ప్రభుత్వాలను బర్తరఫ్ చేసే విషయంలో కూడా సంజీవరెడ్డి పూర్వ వైరాలను దృష్టిలో పెట్టుకొనలేదు. పరస్పర విభిన్న ప్రకృతులు గల సంజీవరెడ్డి రాష్ట్రపతిగాను, శ్రీమతి ఇందిరాగాంధీ ప్రధానిగాను ఉంటే కొంపలంటుకు పోతాయని భయపడ్డ వారి ఆలోచనలు పటాపంచలైనాయి. ఇద్దరూ రాజనీతి పారంగతులే కనుక భారత రాజకీయ రథానికి వారప్పుడు రెండు చక్రాలుగా ఉండిపోయారు. ప్రధానమంత్రుల ఇష్టా ఇష్టాలకు అనుకూలంగా నడచుకోవడానికి రాష్ట్రపతి కీలుబొమ్మకాదని తన హయాంలో నిరూపించారు సంజీవరెడ్డి.

## జ్ఞానీ జైల్‌సింగ్ :

ఇంతవరకు రాష్ట్రపతులైన వారిలో ఇద్దరు ముస్లింలు, మిగితావారు హిందువులు. సిక్కులకు, క్రిస్టియన్లకు ఆ యోగం లభించలేదు. ఒక సిక్కును రాష్ట్రపతిగా చేసి 'పంజాబులోని ఖలిస్తాన్' వాదాన్ని, ఉగ్రవాదాన్ని అరికట్ట గలుగుతామన్న ఉద్దేశంతో సంజీవరెడ్డి అనంతరం శ్రీ జ్ఞానీ జైల్‌సింగ్‌ని శ్రీమతి ఇందిరాగాంధీ రాష్ట్రపతిగా చేశారు. ఆయన పంజాబు ముఖ్యమంత్రిగా, కేంద్ర హోం శాఖ మంత్రిగా పనిచేసిన అనుభవజ్ఞుడు. నెహ్రూ కుటుంబానికి తానెంతో ఋణపడి ఉన్న సంగతిని జైల్‌సింగ్ ఎన్నడు మరచిపోలేదు.

స్వర్ణదేవాలయంపై సైనికచర్య (ఆపరేషన్ బ్లూస్టార్) జ్ఞానీ జైల్‌సింగ్‌కు ఇష్టం లేదు. కానీ ఆపరేషన్ బ్లూస్టార్ అనివార్య చర్య అని తన టెలివిజన్ సందేశంలో జైల్‌సింగ్ ప్రకటించి తన దేశభక్తిని వెల్లడి చేశారు. ఇది చాలా మంది సిక్కులకు ఆయన మీద ఆగ్రహం కలిగించింది. ఆనాడు ఆయన సిక్కు ప్రజల వొత్తిడికి లొంగిపోయి రాజీనామా ఇచ్చినా, ఇంకేమైనా తీవ్ర చర్య తీసుకున్నా ఆ చర్య దేశానికి అత్యంత క్లిష్ట పరిస్థితి కలిగించి ఉండేది.

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావును గవర్నరు రాంలాల్ బర్తరఫ్ చేసినప్పుడు ఎన్. టి. ఆర్. తన మద్దతుదారులను రాష్ట్రపతి భవనంలో జైల్‌సింగ్ ముందర హాజరుపరిచారు. 'మనది ఫెడరల్ రాజ్యాంగం. రాష్ట్రపతి విధులు, గవర్నర్ విధులు వేరువేరుగా రాసి ఉన్నాయి. శాసనసభ్యులను లెక్క పెట్టడం నా రాజ్యాంగ విధులలో లేదు. నేను కొత్త సాంప్రదాయం ప్రారంభించ తలచలేదు' అనిరాష్ట్రపతి స్పష్టంగా జవాబు చెప్పి రాజ్యాంగంపై తనకున్న గౌర వాన్ని వెల్లడించుకున్నారు.

ఇందిరాగాంధీ హత్య జరిగినపుడు, కొత్త ప్రభుత్వం ఏర్పడినపుడు శ్రీ జైల్‌సింగ్ ఎంతో మెలకువతో ప్రవర్తించి మన ప్రజాస్వామ్యాన్ని కాపాడారు. అలాగే హింసపై ప్రాంతీయతత్వంపై ఆయన జరిపిన పోరాటాలు జైల్‌సింగ్‌ని ప్రజలకు అత్యంత సన్నిహితం చేశాయి.

1984 ఎన్నికలలో అఖండ విజయం సాధించి తిరిగి రాజీవ్‌గాంధీ ప్రధానిగా ఎన్నిక కాగానే రాష్ట్రపతి 'దాక్షిణ్యం' ఇప్పుడు తనకు అవసరం లేనట్లుగా ప్రవర్తించడం మొదలు పెట్టారు. రాష్ట్రపతి పట్ల పూర్వపు ప్రధానులు పాటిం చిన గౌరవ మర్యాదలలో కొన్నింటిని రాజీవ్‌గాంధీ స్వస్తి చెప్పడంతో ఈ ఇరు వురి మధ్య పొరపొచ్చాల పర్వం ప్రారంభమైనది. కీలకమైన అంశాల మీద ప్రభుత్వ వైఖరిని ఎప్పటికప్పుడు రాష్ట్రపతికి వివరించడం గత ప్రధానులు అనుసరిస్తూ వచ్చిన ఒక సాంప్రదాయం. ముఖ్యంగా మంత్రివర్గ సమావేశాలలో తీసుకున్న నిర్ణయాల గురించి రాష్ట్రపతికి ప్రధాని తెలియచేసేవారు. కానీ, రాజీవ్‌గాంధీ ఈ విధానానికి స్వస్తి చెప్పారు. అలాగే, ప్రధాని విదేశ పర్యటన లకు వెళ్లేముందు, పర్యటనలు ముగించుకొని రాగానే రాష్ట్రపతిని కలుసుకునే వారు. రాజీవ్‌గాంధీ ఈ సాంప్రదాయానికి కూడా తిలోదకాలొదిరారు. ఒకసారి విలేఖరుల సమావేశంలో ఈ మార్పుల గురించి ప్రస్తావన తలెత్తగా, 'నేను వందలాది ఆచారాలకు తిలోదకాలిస్తున్నాను' అని రాజీవ్‌గాంధీ సమాధాన మిచ్చారు.

పోస్టల్ సవరణ బిల్లు వల్ల పౌరుల ప్రాథమిక హక్కులకు తీవ్ర విఘాతం కలుగుతుందని రాష్ట్రపతి జైల్‌సింగ్ భావించారు. ఉత్తరాలను చింపి చదవటానికి చిన్న చిన్న అధికారులకు సైతం ఈ బిల్లు ద్వారా అధికారం లభిస్తున్న దృష్ట్యా

రాష్ట్రపతి దీన్ని ఆమోదించలేదు. అవసరమైతే శ్రీ జ్ఞానీ జైల్‌సింగ్ స్వతంత్రంగా వ్యవహరించగలరని యీ చర్యతో వెల్లడైంది.

ఈలోగా అతి ముఖ్యమైన విషయాలను సైతం ప్రధానమంత్రి తనకు తెలియచేయడం లేదని జైల్‌సింగ్ ఒక సవివరమైన లేఖను రాజీవ్‌గాంధీకి రాసినట్లు పార్లమెంటులో చర్చకు వచ్చింది. అయితే ఈ చర్చకు స్పీకరు అనుమతించలేదు. తన తీర్పుకు కారణాలను తెలియచేస్తూ స్పీకరు రాష్ట్రపతి, ప్రధానమంత్రి దేశంలో అత్యున్నతమైన సంస్థలు. జాతీయ ప్రయోజనాల దృష్ట్యా వారిద్దరి మధ్య జరిగిన చర్చలను సభలో ప్రవేశపెట్టరాదని, అలా చేస్తే యీ వివాదం దేశవ్యాప్తంగా చెలరేగి, ఒక మంచి సాంప్రదాయం దెబ్బతింటుందని చెప్పారు. ఇదే విధంగా రాజ్యసభలోను సభాహక్కుల ఉల్లంఘన తీర్మానాన్ని ప్రవేశ పెట్టడానికి రాజ్యసభ అధ్యక్షుడు సమ్మతించలేదు. వీరిద్దరి మధ్య జరిగే ఉత్తర ప్రత్యుత్తరాలు మంత్రిమండలి బహిర్గత పరచకూడదని బ్రిటన్, కెనడా, ఆస్ట్రేలియా మొదలైన దేశాల రాజ్యాంగ పద్ధతులను సోదాహరణంగా పేర్కొని రాష్ట్రపతి, ప్రధానమంత్రి ఉత్తరాలపై చర్చకు అంగీకరించేది లేదని సభాధ్యక్షుడు శాసించారు.

ప్రధానమంత్రి శ్రీ రాజీవ్‌గాంధీ తనను అవమానించడం ప్రారంభించగానే జ్ఞానీజైల్‌సింగ్ ఎదురుతిరిగారు. నెహ్రూ కుటుంబానికి ఎంతటి విధేయుడైన వ్యక్తి అయినా, ఎంతటి మెత్తటి వాడైనా హద్దులు దాటితే అవమానాలు సహించేదిలేదని దీనితో వ్యక్తమైనది. ప్రభుత్వం నుంచి సమాచారం తీసుకోవలసిన క్లిష్ట సమయాలు జైల్‌సింగ్‌కు ఎదురైనట్లు ఇంతకు ముందరి రాష్ట్రపతులకు ఎదురుకాలేదు. వ్యక్తిగత కారణాంపై రాజీవ్‌గాంధీ-జైల్‌సింగ్ మధ్య ఘర్షణలు తీవ్రరూపం ధరించాయి. వారిని బలపరిచే వారు, వ్యతిరేకించే వారు దేశంలో రెండు వర్గాలుగా ఏర్పడి పోయారు.

పోస్టల్ సవరణ బిల్లుపై రాష్ట్రపతి ఆమోదం లభించక పోవడంతో రాష్ట్రపతి-ప్రధాని మధ్య సంబంధాలు పూర్తిగా బెడిసిపోయాయి. ఈ వివాదం ఎంతవరకు పోయిందంటే ప్రధానమంత్రినీ, ఆయన మంత్రి మండలిని రాష్ట్రపతి రద్దు చేయనున్నట్లు, అలాగే రాష్ట్రపతిని అభిశంసించడానికి పార్లమెంటు రంగం సిద్ధమైనట్లు ప్రచారాలు జరిగాయి. రాజ్యాంగంలోని 74 వ అధికరణ ప్రకారం మంత్రివర్గం సలహాకు అనుగుణంగా రాష్ట్రపతి నిర్ణయం తీసుకోవాలి.

మంత్రివర్గం అభిప్రాయానికి విరుద్ధంగా ఆయన యీ బిల్లుపై సుప్రీంకోర్టు సలహా కోరడానికి వీలులేదు. అయన కున్న ప్రత్యామ్నాయం ఒక్కటే - బిల్లుని ఆమోదించడం, లేదా పార్లమెంటుకు తిప్పి పంపడం. బిల్లుని పార్లమెంటుకు తిప్పి పంపితే రాష్ట్రపతిపై నిరసన ధ్వనులు గుప్పించడానికి మంత్రివర్గానికి అవకాశం లభిస్తుంది. ఈ సందర్భంగా జ్ఞానీ జైల్‌సింగ్ ఎంతో ఓరిమితో ప్రవర్తించి, ప్రధాన మంత్రి - తన మధ్య తలెత్తిన అపరిష్కృత సమస్యలను రాబోయే రాష్ట్రపతి ఇష్టానికి వదలిపెట్టి ఎంతో ఉదాత్తంగా ప్రవర్తించారు.

రాష్ట్రపతి శ్రీ జ్ఞానీ జైల్‌సింగ్ రాజ్యాంగ విరుద్ధంగా ఎన్నడూ ప్రవర్తించ లేదు. అన్ని రకాల సమాచారం కోరడం రాష్ట్రపతి హక్కు. రాష్ట్రపతి కోరిన సమాచారం అందజేయడం ప్రధాన మంత్రి బాధ్యత. ప్రధాన మంత్రి, రాష్ట్రపతి మధ్య రహస్యం ఉండటానికి 'ఇనుప తెర' లేవీ అడ్డం ఉండవు. ఫెయిర్-ఫాక్స్, భోఫార్స్, పశ్చిమ జర్మనీ జలాంతర్గాముల కుంభకోణాలకు సంబంధించిన పూర్తి సమాచారాన్ని రాష్ట్రపతి కోరిన విధంగా రాజీవ్ గాంధీ అందించడానికి నిరాకరించి దేశంలో ఒక సంచలనమైన వార్త సృష్టించారు.

తమ మధ్య ఎన్ని విభేధాలున్నా రాజీవ్ గాంధీకి నష్టం కలిగించే పనులేవీ జ్ఞానీజైల్‌సింగ్ చేయలేదు. అంతెందుకు? సుప్రీంకోర్టు న్యాయవాది రామ్ జెత్మలానీ, పత్రికా రచయిత రాజేంద్రపూరీ రాజీవ్‌గాంధీపై దావా వేయలను కున్నారు. భోఫార్స్ కుంబకోణానికి సంబంధించి రాజీవ్‌గాంధీ అబద్ధాలు చెప్పా రని దావా వేయదలిచారు. దానికి రాష్ట్రపతి అనుమతి కోరారు. (భారత శిక్షా స్మృతి 197 ఆర్టికల్ ప్రకారం ప్రభుత్వ నిర్వాహకులపై ఈ విధంగా దావా వేయ దలిస్తే ముందుగా అనుమతి తీసుకోవాలి. ముఖ్యమంత్రి విషయంలోనైతే గవర్నరు నుంచి, ప్రధాని విషయంలోనైతే రాష్ట్రపతి అనుమతి పొందాలి.) జైల్ సింగ్ అందుకు అనుమతించలేదు. రాజీవ్‌గాంధీని విచారించడానికి అనుమతించడం వంటి చిన్న విషయంలో ఆయన తన విచక్షణాధికారాన్ని ఉపయోగించలేదు. జనతాపార్టీ నాయకుడు జార్జ్ ఫెర్నాండెజ్ రాజీవ్‌గాంధీకి వ్యతిరేకంగా ఆరోపణలు చేస్తూ పిటిషన్ సమర్పించారు. జైల్‌సింగ్ దానికి ఎలాంటి వ్యాఖ్యానాలు చేయ కుండా హోం మంత్రిత్వశాఖకు పంపించి ఊరుకున్నారు. దానివల్ల ఒరిగేది ఏమీ ఉండదని ఆయనకు బాగా తెలుసు.

ఆర్. వెంకట్రామన్ :

జ్ఞానీజైల్‌సింగ్ పదవీ కాలం పూర్తికాగానే ఆయన స్థానంలో 1987 జూలై 13వ తేదీన ఉపరాష్ట్రపతి శ్రీ రామస్వామి వెంకట్రామన్ రాష్ట్రపతిగా ఎన్నికయ్యారు.

రాష్ట్రపతి పదవి బ్రిటిష్ రాణి/రాజు పదవివలె వంశ పారంపర్యమైనది కాదు. అందువల్ల దానికి రాజకీయ ప్రాధాన్యం ఎంతో ఉంది. అనేక సందర్భాలలో మన రాష్ట్రపతులు రాజ్యాంగ రక్షకులుగా ఉంటూ, దేశానికెంతో అమూల్యమైన సేవ చేశారు. సర్వతోముఖ ప్రజ్ఞా పాటవం కలవారు. సుదీర్ఘ రాజకీయ జీవితం గడిపినవారు రాష్ట్రపతులుగా ఎన్నిక కావడంతో యీ పదవికి గల ప్రాధాన్యం వ్యక్తమవుతుంది. సగంమంది రాష్ట్రపతులు ఆంధ్రప్రదేశ్ పౌరులు కావడం మన రాష్ట్రానికి గర్వకారణం.



# నెహ్రూ పరిశీలన

భారతదేశానికి మూడేళ్లలో స్వాతంత్ర్యం రానున్న దనగా అహమద్ నగర్ జైలు నిర్బంధంలో ఉన్న జవహర్‌లాల్ నెహ్రూ తన 'డిస్కవరీ ఆఫ్ ఇండియా గ్రంథం పూర్తి చేశారు. అందులో మాతరం వాళ్లు కష్టాల కోసం పుట్టారు. మేము ఎన్నో తప్పులు చేసిన మాట నిజం. కాని క్షుద్రత్వమూ, అల్పత్వము మమ్మ అంటలేదు. మేము పిరికి తన మెరుగము. సిగ్గుతో కుంచిం చుకు పోవలసిన పను లేవీ నేను చేయలేదు' అని రాశారు. స్వాతంత్ర్యానంతరం జరిగిన పరిణామాల గురించి కూడా ఆయనకు ఈ మాటలే వర్తిస్తాయి.

జవహర్‌లాల్ నెహ్రూను చూడాలన్న కుతూహలంతో దేశ విదేశాల నుండి చాలామంది ఢిల్లీకి వచ్చేవారు. 'నేనేమన్నా కుతుబ్ మినార్‌నా? లాల్‌ఖిల్లానా?' అని చిరుదరహాసం ప్రదర్శిస్తూ నెహ్రూ వారికి దర్శన మిచ్చేవారు. 'సమయం లేదు పోండి' అని ఆయన అనగా ఎవరు వినలేదు. ప్రజల నుంచి దూరం కావడం ఆయనకు ఇష్టం ఉండేది కాదు. అందువల్ల ప్రజలకు కూడా ఆయన మీద అపార ప్రేమ ఎన్నడూ తగ్గలేదు.

చైనా దురాక్రమణ సంఘటన నెహ్రూ ప్రజాభిమానంపై దెబ్బ తీయక పోవడం ఎంతో మందికి ఆశ్చర్యం కలిగించింది. 1962 ఎన్నికల్లో కాంగ్రెసు పార్టీ బలం కొంత తగ్గినా నెహ్రూ విమర్శకులంతా ఓడిపోయారు. సైనిక పరాజయం సంభవించినా ప్రజాభిమానం కోల్పోని నాయకుడు ప్రపంచ చరిత్రలో నెహ్రూ ఒక్కరే.

## నియంత కాలేదు :

నెహ్రూ అధికారానికి వచ్చినపుడు ఒక దేశంలో ప్రజాస్వామ్య వ్యవస్థ లను రద్దు చెయ్యడానికి ఎన్ని న్యాయమైన హేతువులు కావాలో, ఎట్టి వాతావరణం కావాలో అవన్నీ అప్పుడు భారతదేశంలో పుష్కలంగా ఉన్నాయి.ఈ కారణంతో

ఏ ఒక్కదానినైనా చూపించి ప్రజాస్వామ్యాన్ని రద్దు చేశానని ఆయన ప్రకటించినా నోరెత్తడానికి వీలులేదు. నిరక్షరాస్యులు, దారిద్ర్యం, అనేక వ్యాధులు, అజ్ఞానం ఒక్కటేమిటి అన్ని అనర్థాలు దేశాన్ని పొర మీద పొరగా కప్పి ఉన్నాయి. హిందూ - మహమ్మదీయ మత ఘర్షణలు, విభిన్న సంస్కృతీ సాంప్రదాయాలు యూనియన్‌ను భగ్నం చేసే అనేక ప్రతికూల శక్తులు - వాటిలో ఏ ఒక్క దాన్ని ఉపేక్షించడానికి వీలులేదు. ఇన్నింటిని దృష్టిలో పెట్టుకొని ఈ దేశంలో సుస్థిర ప్రజాస్వామ్య పాలనకు అవకాశం లేదు కనుక ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని రద్దు చేస్తున్నానని ఆయన ఒక్క మాటలో చెప్పవచ్చు. భారత దేశం ప్రజాస్వామ్యానికి సిద్ధంగా లేదని, అందువల్ల ఎన్నికలు జరిపించవద్దని కొందరు సూచించినా అందుకు ఆయన అంగీకరించలేదు. 1952, 1957, 1962 లలో ఎన్నికలు జరిపించారు. స్వచ్ఛందమైన ప్రజా సహకారం లేని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సంపూర్ణ ప్రయోజనకారులు కాలేవని ఆయన అభిమతం.

మత దురహంకారులనుండి దేశాన్ని కాపాడటంలో నెహ్రూ గొప్ప కృషి చేశారు. హైందవతి రోగమన వాదులనుండి దేశాన్ని రక్షిస్తూ రావడమేగాక, కుటుంబ నియంత్రణ, గోవధ మొదలైన విషయాలలో నెహ్రూ అసామాన్యమైన ధైర్యం ప్రదర్శించారు. నెహ్రూ తప్ప ఇంకెవ్వరూ ఇంత నిర్మొహమాటంగా ఈ సమస్యలను ఎదుర్కొనలేదు. హిందూ అతివదులను ఉద్దేశించి చేసిన ఒక ఎన్నికల ప్రసంగంలో 'ముస్లింలు, క్రిస్టియన్లు, సిక్కులు, బౌద్ధ సోదరులతో భుజం భుజం కలిపి తిరగండి. బలవత్తరమైన, సౌభాగ్య సంపన్నమైన స్వతంత్ర భారతావని కోసం అందరూ చేతులు కలిపి కృషి చేయండి' అన్నారాయన. ఉపన్యాసానంతరం శ్రోతలు జయ జయ ధ్వానాలు చేశారు.

రచయితగా నెహ్రూ జగత్ ప్రసిద్ధుడు. ప్రపంచ రాజకీయాలకు సంబంధించిన జర్నలిస్టుల పరిభాషకు ఆయన కొత్తగా చేర్చిన పద జాలాన్ని చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. 'వెకెటింగ్ ఎగ్రేషన్', 'ఎమోషనల్ ఇండిగ్రేషన్,' 'నేకేడ్ ఎగ్రెషన్', 'యాక్టివ్ న్యూట్రలిజమ్' మొదలైనవి ప్రపంచమంతటా పత్రికల ద్వారా వ్యాప్తి చెందాయి. మధ్యప్రాచ్యంగా వ్యవహరిత మయ్యే ప్రదేశాన్ని నెహ్రూ పశ్చిమ ఆసియాగా పిలవడంతో ఆ పేరే బాగా వాడుకలోకి వచ్చింది.

కవులు, గాయకులు, నర్తకీమణులు, శిల్పులు, చిత్రకారులు, క్రీడాకారులు ప్రపంచంలో ఎక్కడ ఉన్నా అందరూ నెహ్రూకు సన్నిహితులే. అవకాశం ఉన్నంతలో ఢిల్లీలో జరిగే ప్రతి చిత్రకళా ప్రదర్శనకు, క్రీడల ప్రారంభోత్స వానికి ఆయన హాజరయ్యేవారు. నచ్చిన చిత్రాలేమైనా ఉంటే కొని తీసుకొని వెళ్ళేవారు.

1950 లో త్రివేంద్రంలో కేంద్ర ప్రభుత్వ శాఖకు చెందిన నలుగురు అపెంకర్లను ఉద్యోగం నుంచి తొలగిస్తున్నట్లు నోటీసు ఇచ్చారు. పండిట్‌జీకి అప్పీలు చేసుకుంటే తమకు న్యాయం జరుగుతుందని వారి విశ్వాసం. నమ్మండి, నమ్మకపోండి. అప్పీలు చేసుకున్నారు. వారి కోరిక నెరవేరింది.

నెహ్రూ నిత్యయువకుడుగానే జీవించారు. సరిగ్గా ఉ. 9-30 గంటలకల్లా నల్ల ఎంబాసిడర్ కారులో నుండి నీటుగా డ్రస్సు చేసుకొని తమ అధికార నివాసా నికి వచ్చేవారు. అక్కడ వున్న వారందరి నమస్కారాలను మందహాసంతో స్వీకరించేవారు. మొదటి అంతస్తుకు వెళ్ళే 42 మెట్లు ఎక్కేవారు. 'లిఫ్టులో ఎందుకెక్కరు ?' అని అడిగితే ఒకే సమాధానం 'అది ముసలివాళ్ళకు' అని.

నెహ్రూ గొప్ప మానవతావాది. గాంధీ-ఇర్విన్ ఒప్పందం నాటి రోజులు. అప్పుడు కాంగ్రెసు అధ్యక్షుడుగా ఉన్న జవహర్‌లాల్ నెహ్రూని అరెస్టు చేసి నైనా జైల్లో పెట్టారు. కొన్నాళ్ళకు మోతీలాల్ నెహ్రూ, కాంగ్రెసు కార్యదర్శి సయ్యద్ మహమ్మద్‌ని అరెస్టు చేసి అదే జైలుకు తెచ్చారు. మోతీలాల్ వచ్చిన తరువాత ఆనందభవన్ నుండి రోజూ భోజనం వచ్చేది. కానీ, జవహర్‌లాల్‌కు ఇది ఇష్టంగా ఉండేదికాదు. ఆయన తన తండ్రిని ఏమీ అనలేకపోయారు. కోపంతో సయ్యద్ మహమ్మద్ వంక తిరిగి 'ఇదేమి హోటల్ కాదు, జైలు బయటనుంచి ఇంత ఆహారం తెప్పించుకోకూడదు' అని దెప్పిపొడిచేవారు.

ప్రజలమధ్య ఉన్నప్పుడు కూడా నెహ్రూ తన విధానాలను వదులుకోలేక పోయేవారు. స్వాతంత్ర్యానికి చాలా పూర్వం నెహ్రూ సింహళం వెళ్లిన సంద ర్భంలో ఒక చిన్న సంఘటన జరిగింది. ఆయన స్వర్గీయ ఎస్. డబ్ల్యు. ఆర్. డి. బండారునాయకతో 'కురువెగల' అనే చోట విందారగిస్తున్నారు. జవహర్‌లాల్‌ను చూడాలన్న కుతూహలంతో అక్కడ గుమికూడిన జనం భోజనం చేస్తున్న ఆయ

నను కిటికీలోంచి తొంగి తొంగి చూడడం మొదలు పెట్టారు. నెహ్రూ బండారు నాయక్ ప్రభృతుల వైపు తిరిగి ఇలా అన్నారు. 'నేను ప్రజల సమక్షంలో అనేక పనులు చేయగలను. కాని జనం చూస్తుండగా భోజనం మాత్రం చేయలేను.' ఆ మాటలు వినగానే జనం తొలగిపోయారు.

1958 లో ఒకనాడు సుప్రసిద్ధ చరిత్రకారుడు ఆర్నాల్డ్ టాయిన్బీకి ఢిల్లీ యూనివర్సిటీ వారు గౌరవ పట్టా ప్రధానం చేస్తున్నారు. అశోకా హోటల్ నుండి బయలుదేరిన టాయిన్‌బీ షాహజహనాబాద్ వీధిలోని జన సమూహంలో చిక్కుకు పోయి యూనివర్శిటీకి ముప్పావు గంట ఆలస్యంగా చేరుకున్నారు. ప్రధాని నెహ్రూ తనను ఆహ్వానించడానికి పరుగెత్తుకుంటు రావటం చూసి టాయిన్‌బీ నమ్మలేకపోయారు. తన కోసం ముప్పావు గంట వృధా చేయడానికి ఈ ప్రధాన మంత్రికి సమయం ఎలా దొరికిందో టాయిన్‌బీ అర్థం చేసుకోలేకపోయారు. ఇంకా ఆశ్చర్యం గొలిపే విషయం ఏమిటంటే ప్రధాని మొహంలో ఏమాత్రం చికాకు కనిపించలేదు. ఎప్పటి మందహాసంలో మార్పు లేదు. టాయిన్బీకి ఆ సమయంలో నెహ్రూలో మహాత్మాగాంధీ అగుపించారు. ఆ సంగతి సభలో కూడా చెప్పుకున్నారు.

ప్రపంచ శాంతి స్థాపనకు వలస రాజ్య నిర్మూలన ప్రధానాంశం కావాలని ఐక్యరాజ్య సమితి వేదిక మీద ఎలుగెత్తి పోరాడిన మహానాయకుడు నెహ్రూ. నిరాయుధీకరణ ఆవశ్యకత గురించి అగ్రరాజ్యాలను ఒప్పించిన మహారాజనీతిజ్ఞు డాయన. భారత దేశానికి అణ్వస్త్రాలు తయారుచేసే శక్తి ఉన్నా, దాన్ని శాంతి యుత ప్రయోజనాలకు మాత్రమే ఉపయోగించ దలచినట్లు ప్రకటించిన శాంత మూర్తి ఆయన. నెహ్రూ అనుసరించిన అలీన విధానం సైనిక ఆర్థిక శక్తి అతి తక్కువగా ఉన్న భారత దేశానికి అంతర్జాతీయంగా చాలా పేరు తెచ్చింది. ఆయన చేబట్టిన సామ్యవాద విధానం భారత దేశాన్ని కమ్యూనిష్టుల ప్రభంజనం నుంచి అతి తక్కువగా ఉంచింది. ఇంత బీద దేశంలో కమ్యూనిస్టుల ప్రభావాన్ని తక్కువగా ఉంచడం తేలిక పని కాదు.

నెహ్రూని తప్పులెరుగని ఉత్కృష్ట వ్యక్తిగా భావించరాదు. కాంగ్రెసు సంస్థను కాపాడటానికి నెహ్రూ తన మహోన్నత స్థానం నుంచి దిగజారిన సందర్భాలు కూడా ఉన్నాయి. 1959 లో కేరళలోని ప్రజాస్వామ్య వామపక్ష

ప్రభుత్వాన్ని రాష్ట్రపతి అభీష్టానికి విరుద్ధంగా (ప్రైవేటు చర్చలు) ఆయన రద్దు చేశారు. అపరాధులైన అనుచరులను, సహచరులను రక్షించడానికి నెహ్రూ ప్రదర్శించిన ఆశ్రిత పక్షపాతం జగద్విదితం. అవినీతికి, లంచగొండితనానికి అలవాటు పడ్డ వారిపై ఆయన తీవ్ర చర్యలు తీసుకోడానికి జంకేవారు. దానికంతకూ ఒకటే కారణం. మనుష్యులు ఇంత నీచంగా ప్రవర్తిస్తారనే ఊహ ఆయన కలలకు కూడా తట్టేది కాదు. అందుకే వ్యక్తిగతంగా ఆయనకు సహాలిన్యమూ అంటలేదు. తామరాకుపై నీటిబొట్టులా ఆయన జీవితం గడిచిపోయింది.

అలీన విధానాన్ని ప్రారంభ దశలో ఇటు భారత దేశంలోను, అటు విదేశాలలోను కూడా అపార్థం చేసుకున్నారు. కొందరు దీన్ని అవకాశ వాదం అని భావించారు. మరికొందరు 'మిద్యాచార' మని పిలిచారు. అయితే అప్పుడే విధానాన్ని నిశితంగా విమర్శించిన వారు కూడా ఇపుడు దాని విలువను గుర్తిస్తున్నారు. వాస్తవం చెప్పాలంటే కొత్తగా స్వాతంత్ర్యం పొందిన దేశాలలో ఎక్కువ దేశాలు తమ విదేశీ విధానానికి అలీన విధానాన్నే పునాదిగా పెట్టుకున్నాయి. ఈ విధాన ప్రయోజనానికి, దానిని రూపొందించిన మహానాయకునికి ఇంతకంటె గౌరవం ఇంకేమున్నది ?

'నేను తూర్పు పడమరలకు వింత కలయికను' అని నెహ్రూ ఎంత చెప్పుకున్నా భారత దేశమే ఆయనను ఎక్కువ ఆకర్షిస్తూ వచ్చింది. తన వీలునామాలో నెహ్రూ తన అంత్యక్రియలు ఎలా జరుగాలో చెప్పుకున్నారు. తన అస్తికలను, చితాభస్మాన్ని గంగలో, భారత భూమి మీద చల్లాలని కోరారు. నెహ్రూకు మించిన ప్రజాస్వామ్య వాది భారత దేశంలో మరొకరు పుట్టలేదు. ప్రజాస్వామ్యం ఉన్నత వరకు నెహ్రూ జ్యోతి ప్రకాశిస్తూనే ఉంటుంది. ఆయన తరంలో జీవించడమే మనకు గొప్ప విశేషం.



# నెహ్రూ - విదేశాంగ విధానం

బ్రిటిష్‌వారి హయాంలోనే భారత దేశానికి అంతర్జాతీయమైన కీర్తి కొంత ఉండేది. అది సామ్రాజ్యవాదానికి ఆలంబనమైన కీర్తి. దేశానికి స్వాతంత్ర్యం లభించగానే ఈ పరిస్థితులలో మార్పు అవసరమైనది. బ్రిటిష్ సామ్రాజ్యవాద సైనిక బలం స్థానంలో భారత జాతీయవాద నైతిక బలంతో భారత దేశం ఆసియా ఖండ నాయకత్వాన్ని స్వీకరించవలసి వచ్చింది. అందుకు అవసరమైన విధానాలను రూపొందించుకోవలసి వచ్చింది. వలసరాజ్య విధానాన్ని ఖండించడం, ఉపగ్రహాల సృష్టిని వ్యతిరేకించడం తరుణ భారత విదేశాంగ విధానానికి మూల సూత్రాలైనాయి.

1946 లో లార్డ్ వేవల్ ప్రభుత్వంలో రెండవ వ్యక్తిగా, వైస్రాయ్ కౌన్సిల్ ఉపాధ్యక్షుడుగా ఉన్నప్పుడే నెహ్రూ ఢిల్లీలో ఆసియా సంబంధాల సమావేశాన్ని ఏర్పాటు చేశారు. భారత దేశం అంతర్జాతీయ రాజకీయ రంగంలో ధ్వజప్రతిష్ఠ చేయనున్న సమయమిది. ఇండోనేషియా కదిలింది. స్వాతంత్ర్యం కోసం ఎదురు తెన్నెలు చూస్తుంది. ఆసియా ఖండానికి ఒక విశిష్ట వ్యక్తిత్వమున్నదని, చిరనిద్రాణమైన ఆసియా, సర్వతోముఖ వ్యక్తిత్వం వికసోన్ముఖమైనదని, ఆసియా ప్రజలకు ఆత్మగౌరవం, ఆత్మాభిమానం ఉన్నదని ప్రపంచానికి తెలియ చెప్పడం నెహ్రూ ఏకైక లక్ష్యం. జాతి, మత, వర్గ విచక్షణమీద ఇట్టి ఏర్పాటు చేయడం ఆయన పరిభాషలో చాలా అసభ్యం. భారత స్వాతంత్ర్య భానూదయా ఆసియాఖండ పర్వదినానికి ఉషస్విని వంటిదని అయన ఉద్ఘోష.

ఆ మహాసభ సందర్భంలో ఒక ఆసక్తికరమైన సంఘటన జరిగింది. ఇండోనీషియా స్వాతంత్ర ప్రధాన సమస్యపై చర్చ జరుగుతున్న ఆ సభలో ఇండోనీషియా స్వతంత్ర ప్రభుత్వ ప్రధాని డాక్టర్ సుల్తాన్ షరియార్ పాల్గొ

నాలి. అయితే ఆయన ఢిల్లీ రావడానికి వీలులేకుండా ఇండోనీషియా నిండా డచ్ సైన్యాలు కాపలాకాస్తున్నాయి. అప్పుడు ఇండోనీషియా రాజధాని అయిన జకార్తా విమానాశ్రయం డచ్ సైనికుల ఆక్రమణలో ఉంది.

అప్పుడు నెహ్రూ ఆ తరువాత ఒరిస్సా ముఖ్యమంత్రి అయిన జనతాదళ్ నాయకుడు పైలట్ బిజుపట్నాయక్‌ను పంపి, డచ్ సైనికులకు చిక్కకుండా షరియార్‌ను ఆయన ఇష్టంతోనే 'కిడ్నాప్' చేయించి, విమానంలో ఢిల్లీసభకు రప్పించ గలిగారు. ఇందుకు ఇండోనీషియా ప్రజలు, నాయకులు నెహ్రూను ఎంతో అభినందించారు.

అవి ప్రచ్ఛన్నయుద్ధం అలుముకొని వున్న రోజులు. ఒకవైపు అమెరికా విదేశాంగ మంత్రి డల్లస్, మరొకవైపు సోవియట్ ప్రధాన మంత్రి స్టాలిన్ తమ ప్రాబల్య విస్తరణ కోసం వర్ధమాన దేశాల వెంట పడ్డారు. వలసరాజ్య పరిపాలనతో సుదీర్ఘ పోరాటం జరిపి విముక్తమైన భారత దేశం ఈ రెండు అగ్ర రాజ్యాల ప్రభావం నుంచి దూరంగా ఉంటూ స్వతంత్రమైన అలీన విధానం రూపొందించుకుంది. 1960 వరకు కూడా భారతదేశ విదేశాంగ విధానం రష్యాకు అనుకూలంగా లేదన్నది గుర్తించుకొన వలసిన విషయం.

## పాకిస్తాన్ ప్రమేయం :

తరువాత భారత,పాకిస్తాన్ సంబంధాలు ఇరుదేశాల అంతర్జాతీయ విధానాల మీద ప్రస్ఫుటమైన ముద్ర వేశాయి. సైనిక సంధుల్లో పాకిస్తాన్ చేరిపోగా, భారత్ దీనికి విముఖత ప్రకటించింది. కాశ్మీర్ వివాద సందర్భంలో భద్రతా సంఘం పాకిస్తాన్‌కు అనుకూలంగా పశ్చిమ రాజ్యాల అభిప్రాయాల మేరకు తీర్మానాలు చేయకుండా సోవియట్ రష్యా 'వీటో' భారతదేశానికి అవసరమైనది. అమెరికా నుంచి పాకిస్తాన్ పొందే సైనిక సహాయానికి వ్యతిరేకంగా భారతదేశం సోవియట్ సహకారం పొందవలసి వచ్చింది. తన స్వప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని భారతదేశం సోవియట్ దేశంతో స్నేహాన్ని పెంపొందించుకోవడం అమెరికాతో పాటు ఇతర పాశ్చాత్య దేశాలకు మన మీద కన్నెర్ర అయింది. లూయీఫిషర్ 'దిస్ ఈజ్ అవర్ వరల్డ్' అనే గ్రంథంలో మన విదేశాంగ విధానాన్ని యీ విధంగా వివరించారు.

'ఈ కాలంలో భారత దేశంలో కమ్యూనిస్టులను అణచివేయడం, కాశ్మీర్ వివాదం ద్వారా పెరిగిపోతున్న హిందూ-ముస్లిం మత ద్వేషాలను తగ్గించడం నెహ్రూకు అవసరమైనది. అందుకు ఆయన సోవియట్ రష్యాను ఉపయోగించుకున్నారు. ఆయన అంతర్జాతీయంగా అవలంభించిన విధానాలు కూడా మాస్కోకు సంతృప్తి కలిగించాయి. పశ్చిమ జర్మనీ ఆయుధ సేకరణ ప్రయత్నాన్ని నెహ్రూ ఖండించారు. కానీ కమ్యూనిస్టుల ఆధ్వర్యాన తూర్పు జర్మనీ ఆయుధ సేకరణను ఆయన విమర్శించలేదు. ఆగ్నేయాసియాలో 'సీటో' కూటమి నిర్మాణాన్ని ఆయన ఖండించారు. కానీ సోవియట్-చైనా సైనిక సంధిని ఆయన కాదనలేదు.

'పశ్చిమ దేశాల సైనిక వ్యవస్థ గురించి నిశితంగా విమర్శించిన నెహ్రూ తూర్పు ఐరోపా సైనిక వ్యవస్థ తన కక్కురలేదంటారు. అణ్వాస్త్ర బలం రష్యాకు హెచ్చుగా ఉందని, అమెరికా ఇంకా ప్రయోగ, పరిశీలక దశలోనే ఉందని నెహ్రూకు తెలుసు. కానీ అమెరికాకు పరోక్షంగా నష్టం కలిగించే విధంగా అణ్వాస్త్రాలను విధ్వంసనను ఆయన ప్రబోధిస్తారు. అన్నిరకాల సామ్రాజ్యవాదాలను ఆయన ఖండిస్తారు. కానీ తూర్పు ఐరోపాలోని సోవియట్ సామ్రాజ్య విస్తరణ ఆయన కంటికి కనిపించదు. ఈ విధంగా కళ్ళ ఎదుట జరిగిన వాస్తవికమైన పరిణామాలను, యుద్ధానంతరం సంభవించిన ప్రముఖ అంతర్జాతీయ సంఘటనలను ఒక రాజకీయవేత్త కానకపోవడం అనేది శాంతి సాధనకు చిక్కులు కలిగించింది. లూయీఫిషర్ యీ వాదాన్ని పరిశీలనకు తీసుకుంటె కొన్ని వాస్తవాలు బయట పడతాయి. నెహ్రూ అప్పుడు అనుసరించిన అలీన విధానాన్ని పశ్చిమ రాజ్యాలు శంకించాయి. చివరకు హంగేరిలో ప్రజావిప్లవాన్ని సోవియట్ రష్యా అణచివేయడాన్ని నెహ్రూ ఖండించకపోవడంతో భారత దేశం అలీనవిధానం ముసుగులో కమ్యూనిస్టు కూటమిలో చేరిపోయిందనే విమర్శలకు నెహ్రూ తావు కలిగించారు. ఈ కాలంలో భారత రక్షణ మంత్రి కృష్ణమీనన్ భారత ప్రతినిధిగా తెరమీదికి వచ్చి బిరుసుతరంగా, దురుసుతనంగా ప్రసంగాలు చేసి 'భారతదేశం కమ్యూనిస్టుల ప్రచ్ఛన్న ప్రతినిధి' అనే ముద్రవేశారు. ఈ విధంగా 1962 వరకు భారత విదేశాంగ విధానంలో పాశ్చాత్య దేశాల వ్యతిరేక ధోరణి వ్యక్తమైంది.

భారత విదేశాంగ విధానం సోవియట్ అనుకూల వైఖరిలో ఉంటున్న కాలంలోనే భారత ఉత్తర సరిహద్దులలో ప్రధానమైన మార్పులు సంభవించాయి.

సోవియట్ యూనియన్‌కు పోటీగా ఆసియాలో ప్రధానమైన శక్తిగా కమ్యూనిస్టు చైనా అవతరించింది. టిబెట్‌ను చైనా కబళించినప్పుడు భారత్ నోరు విప్పలేదు అంటే, అలీన విధానం పేరుతో రష్యాతోపాటు చైనాను కూడా నెహ్రూ సంతృప్తి పరస్తు వచ్చారన్న మాట. రష్యా స్నేహంద్వారా కమ్యూనిస్టు చైనాను సంతృప్తి పరచటం, టిబెటును ఆ దేశానికి హస్తగతం చేయడం, కొరియా యుద్ధంలో చైనా తరఫున మధ్యవర్తిగా వ్యవహరించడం, ఇండో-చైనా కల్లోలాలలో చైనా వాదనకు ప్రాతినిధ్యం వహించడం, చివరకు ఐక్యరాజ్యసమితిలో చైనాకు సభ్యత్వ మివ్వాలని కోరడం - ఇవన్ని యీ ఉద్దేశంతోనే కొనసాగాయి. ఈ విధానాలన్నీ 'అలీన విధానం' ముసుగు కిందనే సాగింది. ఈ విధంగా ఒకవైపు రష్యాని బలపరచడంద్వారా పశ్చిమ రాజ్యాల వ్యతిరేకతను, మరొకవైపు చైనాను సమర్థించడంద్వారా ఆసియా దేశాల సానుభూతిని నెహ్రూ హయాంలో భారత దేశం కోల్పోయింది. అంతర్జాతీయంగా మన దేశం ఏకాకి అయింది. ఎవరు మిత్రులో, ఎవరు శత్రువులో నెహ్రూ గ్రహించలేని స్థితిలో ఉండిపోయారు.

ఒక కమ్యూనిస్టు దేశంతో పోరాడుతున్నప్పుడు మనకు మరొక కమ్యూనిస్టుదేశం ఆయుధ సహాయం చేయదని తెలుసుకున్న తరువాత దేశరక్షణకు మనం పాశ్చాత్య దేశాల ఆయుధ సహాయం కోరక తప్పలేదు. అయితే పశ్చిమ రాజ్యాల ఆయుధ సహాయం స్వీకరించడంవల్ల దేశ స్వాతంత్ర్యశక్తినీ, సర్వసత్తాకతను (సావిరానిటి) కోల్పోగలదన్న ప్రమాదంలో అర్థం లేదు. ఎందుకంటె రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో చర్చిల్ నాయకత్వంలో బ్రిటన్ పెక్కు ఐరోపా రాజ్యాలు, అమెరికా నుంచి ఆయుధ సహాయాన్ని స్వీకరించింది. దాని వల్ల ఆదేశాల స్వాతంత్ర్య రక్షణకు, సర్వసత్తాకతకు బలం చేకూరిందేగాని హాని కలుగలేదు. అలాగే హిట్లర్ దాడిని ఎదుర్కొనడానికి స్టాలిన్ నాయకత్వాన సోవియట్ రష్యాకూడా పశ్చిమదేశాల ఆయుధ సహాయాన్ని స్వీకరించింది. దీని వల్ల ఆ దేశానికి ఎలాంటి ప్రమాదం సంభవించలేదు.

అయితే ఆయుధ సహాయం పొందుతున్న సందర్భంలో మరొక వాదన కూడా ఉంది. ఆయుధ సహాయం చేస్తున్న దేశాలు పెట్టే షరతులను ఆయుధ సహాయం పొందుతున్న దేశం తలొగ్గవలసి వస్తుందని - నేటి ఈ వాదనలోని సారాంశంగా ఉంది. కానీ, ఆచరణలో దీని ప్రభావం ఎక్కువా వ్యక్తం కాలేదు.

అమెరికా ఆయుధ సహాయాన్ని పొందుతున్న బ్రిటన్, ఫ్రాన్స్‌లు అనేక రాజకీయ సమస్యలపై అమెరికా సలహాను పాటించడం లేదు. ముఖ్యంగా వలస విధానంపై అమెరికా సలహాను అవి అంగీకరించడం లేదు.

అటు పశ్చిమ రాజ్యాల నుంచి, ఇటు రష్యా నుంచి సహాయం పొందుతున్న యుగోస్లావియా స్వతంత్రంగా వ్యవహరిస్తూదే గానీ, యీ రాజ్యాల కనుసన్నలలో మెలగడం లేదు. చివరకు మన పొరుగు దేశమైన పాకిస్తాన్ కూడా అమెరికా, బ్రిటన్‌ల సలహాలను కాదని కమ్యూనిస్టు చైనాతో మిత్ర సంబంధాలను నెలకొన్నది. కనుక ఒక దేశం స్వతంత్ర విధానాలను అనుసరించడం, ఆయుధ సహాయాన్ని స్వీకరించడమనేది ఆయా దేశాల అంతర్గత బలం మీద ఆధారపడి ఉంటుందని దీనిని బట్టి చెప్పవచ్చు.

మనకు 'సర్వం' అలీన విధానమే నన్న వాదం పనికిరాదు. దేశ స్వాతంత్ర్యాన్ని, భౌగోళిక పరిస్థితులను రక్షించుకో లేనప్పుడు ఇతరుల దృష్టిలో మన అలీన విధానానికి అర్థం ఉండదు. మనకు అలీన విధానం కంటె మనమీద వచ్చిన శత్రువులను తిప్పకొట్టడంలో మనం చూపగల శక్తి ప్రపంచ మన్ననలను పొందగలుగుతుంది. నెహ్రూ అనుసరించిన అలీన విధానం భారతదేశాన్ని అంతర్జాతీయ వేదికమీద గౌరవప్రదమైన స్థానంలో కూర్చుండపెట్టిందే గాని, దానివల్ల మన ఇరుగు పొరుగు దేశాలమధ్య మన దేశ సంబంధాలు బాగుపడలేకపోయాయి. భారతదేశం శక్తివంతమైన రాజ్యంగా అవతరించడం అటు పాశ్చాత్య దేశాలకు, ఇటు ఆసియాలోని పెక్కు రాజ్యాలకు ఇష్టంలేదని దానివల్ల తెలిసిపోయింది. ఈ విధానం ప్రకారం మన విదేశాంగ విధానాన్ని రూపొందించుకొనవలసిన అవసరాన్ని నెహ్రూ ఆలస్యంగా గుర్తించారు.

స్వాతంత్ర్యం లభించిన తరువాత దేశ రక్షణ విషయంలో మనం తగిన శ్రద్ధ వహించలేదు. మన సైనిక బలాన్ని వృద్ధిపరచుకోలేదు. ఏ సైనిక కూటంలోను చేరలేదు. ఆ కారణం చేత మనం అప్పుడు బలహీనమై ఉన్నాం. చైనా దురాక్రమణ చేసినప్పుడు దాన్ని ప్రతిఘటించలేని స్థితిలో ఉన్నాం. అది మొదలు ప్రపంచంలో మన పేరుప్రతిష్ఠలు దెబ్బతిన్నాయి. మనం చేతకానివారం అనే అభిప్రాయం వ్యాపించింది. ఆసియా ఖండంలో చైనా ఒక్కటే బలమైన రాజ్యం అనే అభిప్రాయం ప్రబలింది. అందరూ మనలను హేళన చేసిన

వారుగా, సలహా ఇచ్చిన వారుగా తయారయ్యారు. మన సైనిక బలహీనతే దీనికి కారణం. కీలకం అందులోనే ఉంది. పాకిస్తాన్ తోక ఆడించడానికికూడా అదే కారణం. మనం అన్ని విధాలయిన బలాలను - ఆర్థిక, నైతిక, సైనిక బలాలను సంపాదించుకున్నప్పుడే అందరు మనలను గౌరవిస్తారు. కేవలం శాంతి తత్వాన్ని శాంతి సందేశాన్ని చూచి ఎవరు గౌరవించరు. ఈ విధానం ఆలంబనగా మన విదేశాంగ విధానాన్ని పునర్నిర్మించాలని నెహ్రూ తన చివరి రోజులలో మాత్రమే గుర్తించారు.

- (o) -

# నాలుగు దశాబ్దాల ప్రగతి

గత నలభై ఏళ్లలో భారత ఆర్థిక వ్యవస్థ సాధించిన అభివృద్ధిని, ప్రగతిని పరిశీలనకు తీసుకుంటే – మనం సాధించిన అతి ముఖ్యమైన విజయం. పరాశ్రయంనుంచి స్వావలంబనకు, పరాధీనత నుంచి స్వాతంత్ర్యానికి చేరుకోవడం అని చెప్పాలి.

## వ్యవసాయ రంగంలో :

వ్యవసాయ రంగాన్ని తీసుకుంటే 40 ఏళ్ల క్రితం మన దేశం బర్మా నుంచి బియ్యాన్ని, యూరప్ నుంచి గోధుమలను, ఈజిప్టు నుంచి పత్తిని దిగుమతి చేసుకునేది. ఈ నలభై ఏళ్ల కాలంలో మన ఆహార ధాన్యాల ఉత్పత్తి 50 మిలియన్ టన్నుల నుంచి 150 మిలియన్ టన్నులకు పెరిగింది. అంతేకాదు, 1947 కు పూర్వం మన ఆర్థిక రంగాన్ని భూతంలా ఆవహించిన కరువు ఈనాడు లేదు. అదే విధంగా ఒకనాడు పత్తి దిగుమతి చేసుకున్న మనం ఈనాడు పత్తి ఉత్పత్తిలో స్వావలంబన సాధించడమేగాక, ఎగుమతి కూడా చేస్తున్నాం. మన జనపనార భూములు తూర్పు పాకిస్తాన్‌లో చేరిపోయినా, నేడు పశ్చిమ బెంగాల్‌లో పండుతున్న జనుప పంట ఎక్కడ పెట్టుకోవాలో తెలియనంత ఎక్కువగా ఉంది. చక్కెరకు అవసరమైనంత చెరకు ఉత్పత్తి కూడా సమృద్ధిగా ఉంది. ఒక్కమాటలో చెప్పాలంటే వ్యవసాయ రంగంలో మనం స్వావలంబన సాధించడమే కాక, ఎగుమతులను కూడా చేస్తున్నాం.

అయినా మనం సాధించిన విజయాలు లోప భూయిష్ట రహితమైనవి కావు. మనకు చాలినన్ని ఆహార ధాన్యాలు ఉన్నాయి. కానీ పప్పులు, వంటనూనెలు సరిపోవు. వాటి దిగుమతులకు మనం ఏటా 800 కోట్ల రూపాయల మేరకు విదేశ మారకాన్ని ఖర్చు చేయవలసి వస్తున్నది. వ్యవసాయ పద్ధతిలో కొంత మార్పు

చేస్తే ఈ లోటును మనం భర్తీ చేసుకొనవచ్చు. లేదా బంజరు భూములను సాగు లోనికి తెచ్చి నూనెగింజల ఉత్పత్తి పెంచవచ్చు.

మన దేశంలో హెక్టారు పండే పంట రేటు చాలా తక్కువ. వరిపంట విషయంలో జపాన్ రాలుబడిలో మనదేశం సగమే. గోధుమల విషయంలో ఫ్రెంచి రైతు పండించే పంటలో మన రైతు మూడవ వంతు మాత్రమే పండిస్తు న్నాడు. పత్తి ఉత్పత్తిలో చైనాతో పోల్చితే మనది నాల్గోవంతు. 1960 తరువాత మనలను రక్షించిన నూతన వ్యవసాయిక సాంకేతిక నైపుణ్యానికి ఇప్పుడు కాల దోషం పట్టింది. ఇతర దేశాలతో సమానంగా ఆర్థికాభివృద్ధి సాధించాలంటే మనం బయో - టెక్నాలజీని ఆశ్రయించాలి.

## పారిశ్రామిక రంగం :

గత నలభై సంవత్సరాలలో దేశంలోని పరిశ్రమలు బాగా అభివృద్ధి చెందాయి. ఈనాడు పారిశ్రామిక రంగంలో భారతదేశం ప్రపంచంలోనే అతి పెద్ద వ్యవస్థను కలిగి ఉంది. వ్యక్తిగతంగా స్థాపించిన కొన్ని పరిశ్రమలు చాలా పెద్ద ఎత్తున ఉత్పత్తిని పెంచాయి. భారతదేశంలో పది శాతం ప్రజలు పరిశ్రమ లపై ఆధారపడి ఉంటే, ఆ పది శాతం బాగా పారిశ్రామికాభి వృద్ధి చెందిన పశ్చిమ దేశాల జనాభా కన్నా ఎక్కువ. భారత్ నేడు వస్త్రాల నుండి విమానాల దాకా దాదాపు అన్ని వస్తువులను ఉత్పత్తి చేస్తోంది. అలా చేస్తున్న దేశాలు ఎక్కు వగా లేవు. ఇది మనకు సంతోషం కలిగించే మాటేగాని దాని వలన కలిగే ఇబ్బం దులు కూడా కొన్ని ఉన్నాయి.

మొదటి అంశం - దిగుమతి సంక్షేమం అన్నది విచక్షణా రహితంగా పాటించడం జరిగింది. ఫలితంగా మనం అనేక వస్తువులను ఎక్కువ ధరలకు ఉత్పత్తి చేస్తున్నాం. పరిశ్రమలు బతికి బట్ట కట్టడం, నిజానికి బాగా లాభాలు తీయడం జరుగుతున్నదంటే దానికి కారణం ప్రభుత్వం దిగుమతుల నుండి కల్పి స్తున్న రక్షణే. దీనివల్ల నష్టపోయేది వినియోగదారుడే. ఇతర దేశాలలో వారు ఆయా వస్తువులకు చెల్లిస్తున్న ధరల కన్న మనదేశంలో వాటికి దాదాపు రెట్టింపు ధర చెల్లించవలసి వస్తున్నది. మనం ఎంత ఉత్పత్తి చేసినా ఇంత ఎక్కువ ధర లకు వీటిని ఇతర దేశాలకు ఎగుమతి చేయలేం కదా. 'దిగుమతి సంక్షేమం ద్వారా ఎగుమతుల పెంపు' అన్నది ఇలాంటి వస్తువుల విషయంలో సాధ్యం కాజాలదు.

ఖనిజోత్పత్తిలో మనం కనీ వినీ ఎరుగని ఎగుమతి ప్రగతి సాధించాం. 1947 కి పూర్వం చెదురు మదురుగా ఉన్న బొగ్గు, బంగారం గనుల స్థానంలో యీనాడు నాన్‌ఫెర్రస్ లోహాల ఉత్పత్తి అత్యంత ఉన్నతస్థాయికి చేరుకుంది. 1947కి పూర్వమైతే నిత్యావసర సరుకులైన సేఫ్టీపిన్‌లు, సబ్బులు, టూత్‌పేస్టులు ఇత్యాదులను కూడా మనం దిగుమతి చేసుకునేవారం. విద్యుచ్ఛక్తి ఉత్పాదన 34 రెట్లు పెరిగింది. 1950_51 లో దేశంలో కేవలం మూడువేల గ్రామాలకు మాత్రమే కరెంటు సౌకర్యం ఉండేది. 1985_86 నాటికి 3,82,000 గ్రామాలకు కరెంటు సౌకర్యం కల్పించారు.

అయినప్పటికీ కొన్ని ప్రశ్నలు మిగులుతున్నాయి. ఇంతకన్న ఎక్కువ అభివృద్ధి సాధించలేమా? నిరుద్యోగం ఎంతో పెరిగింది. ఏదో కొంతమందికి ఉపాధి లభించినా నిరుద్యోగుల సంఖ్య పెరుగుతూనే ఉంది. అమెరికా కార్మికునికి లభించే వేతనంలో మన కార్మికునికి లభించేది ఏబయ్యోవంతు. కెనడాలో విద్యుత్ వాడకం నూరు అనుకుంటే మన దేశంలో రెండు. సింగపూర్‌లో వినియోగించు కునే ఉక్కు పరిణామంలో మనం వినియోగించుకునేది మూడు శాతం మాత్రమే. మన దేశంలో ప్రతి 7000 మందికి సగటున ఒక కారు ఉంటే అమెరికాలో ప్రతి ఇద్దరికి ఒకటి.

## శాస్త్ర సాంకేతిక రంగాలు :

అంతా కలిపి ఓ పిడికెడు విశ్వవిద్యాలయాలు, పరిశోధనా సంస్థలు ఉన్న దేశం నుంచి భౌతిక, ప్రకృతి శాస్త్రాలు, ఇంజనీరింగ్, వైద్య, సామాజిక శాస్త్రాలతో సహా దాదాపు 150 కి పైగా ఉన్నత విద్యాసంస్థలను ఏర్పరచుకున్న స్థాయికి మన దేశం ఎదిగింది. నిజానికి ఒకనాడు విశ్వవిద్యాలయాలలో, పరిశోధనా సంస్థలలో బోధకులను ఇంగ్లాండ్ నుంచి రప్పించుకునే మనం, ఈనాడు అమెరికా, ఇంగ్లాండ్, ఐరోపా దేశాలకు ఏటా 10 వేల మంది శాస్త్రజ్ఞులను, ఇంజనీర్లను, డాక్టర్లను ఎగుమతి చేస్తున్నాం. వారు ఆయా దేశాల ఆర్థికవ్యవస్థలోనే గాక, మేధాపరమైన వ్యవస్థలలోను భాగస్వాములుగా ఉన్నారు. గత నాలుగు దశాబ్దాలలోనే భారతదేశంలో శాస్త్రజ్ఞులు, సాంకేతిక నిపుణుల సంఖ్య బాగా పెరిగింది. ప్రపంచం మొత్తంమీద అత్యధిక సంఖ్యలో శాస్త్రవేత్తలున్న దేశాలలో మన దేశానికి మూడవ స్థానం.

తారతమ్యాలు :

అభివృద్ధి చెందుతున్న దేశాలలో భారతదేశం గణనీయమైన స్థానంలో ఉన్నా తక్కువ ఆదాయం కలిగిన 38 దేశాలలో భారత్ ఒకటిగా ఉంది. తలసరి ఆదాయంలో మన దేశంకన్నా పాకిస్తాన్, శ్రీలంక పైన ఉండగా బంగ్లాదేశ్ అన్నిటికంటె కింది స్థానంలో ఉంది.

భారతదేశంలో శిశుమరణాల సంఖ్య 1965 లో వెయ్యికి 151 ఉండగా అది 1984 సంవత్సరానికి 90 కి తగ్గింది. ఇది స్పష్టమైన అభివృద్ధి. కానీ చైనాలో శిశుమరణాల సంఖ్య 1984 లో వెయ్యికి 58 కాగా శ్రీలంకలో 37. ఈ దేశాలతో పోల్చుకుంటే మనం సాధించింది ఏమంత పెద్ద అభివృద్ధికాదు. 1984 లో మన దేశంలో సగటు ఆయుర్దాయం పురుషులకు 56, స్త్రీలకు 55 సంవత్సరాలుగా ఉంది. అయితే, ఇదే సంవత్సరంలో చైనాలో సగటు ఆయుర్దాయం పురుషులకు 62, స్త్రీలకు 72 సంవత్సరాలు. ఈ విషయంలో బంగ్లాదేశ్, పాకిస్తాన్‌లు మనకంటె తక్కువగా ఉన్నాయి. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాలు, తూర్పు ఐరోపా సోషలిష్టు దేశాలలో సగటు ఆయుర్దాయం పురుషులకు 70, మహిళలకు 80 ఉంది. భారతదేశంలో అక్షరాస్యుల సంఖ్య 1960 లో 28 శాతంకాగా 1980 నాటికి అది 38 కి చేరుకుంది. అయితే శ్రీలంకలో అక్షరాస్యుల శాతం 85, చైనాలో 69 గా ఉంది.

మన దేశంలో తలసరి ఆదాయం సాలీనా 1.6 రేటులో పెరుగుతున్నా అది అన్ని వర్గాలలో సంక్రమంగా పంపిణీ జరగడంలేదనేది వాస్తవం. దురదృష్టవశాత్తు మన దేశంలో ఎవరెవరికి ఎంతెంత ఆదాయం పంపిణీ అవుతుందన్న ఖచ్చితంగా ఆధారపడే వివరాలు లభ్యం కావడంలేదు. 1975–76 లో లభిస్తున్న కొన్ని అంచనాల ప్రకారం మొత్తం జనాభాలో ఉన్న 20 శాతం గొప్పవారు 49.4 శాతం ఆదాయాన్ని పొందుతున్నారు అందులో పై స్థాయిలో ఉన్న 10 శాతం వారు 33.6 శాతం ఆదాయాన్ని సంపాదించుకోగలిగారు.

పోతే, దారిద్ర్యరేఖ దిగువన నివసిస్తున్న ప్రజల సంఖ్య 48 శాతంనుంచి 37 శాతానికి తగ్గింది. అంటే దాదాపు 27 కోట్లమంది ప్రజలు ఇంకా దారిద్ర్యరేఖ దిగువన నివసిస్తున్నారన్న మాట. ఇది గర్వించతగ్గ విషయం కాదు. సామాజిక న్యాయం విషయంలో మనం కళ్ళముందు చూసేది–అంతులేని సంపద ఒకవైపు, మరొకవైపు నికృష్ట దారిద్ర్యం, రెండు కలిసే ఉంటున్నాయి.

1930 లో కొరియా, భారత్‌ల తలసరి ఆదాయం దాదాపు సమానమే. 1987 నాటికి కొరియా మనకన్న పదిరెట్లు వృద్ధి పొందింది. ఆ రోజుల్లో మనం ప్రపంచంలోవి పారిశ్రామిక దేశాలలో పదో స్థానంలో ఉండగా నేడు 25వ స్థానానికి దిగజారిపోయాం. ప్రపంచ వాణిజ్యంలో మన వంతు 1.9 నుంచి 0.5 వరకు పడిపోయింది. దానికి కారణాలు లేకపోలేదు.

మన అభివృద్ధి పథకాలు సరి అయినవే. కానీ విధానానికి, అమలుకు మధ్య రాజకీయాలు చోటు చేసుకున్నాయి. ఫలితాలకన్న పద్ధతులు ముఖ్యమైనాయి. ఏ విధానమైనా సరి అయినదా కాదా తేల్చేది సోషలిజమ్ అయింది. ప్రభుత్వ కంట్రోలు పెంచితేనే అందులో సరిపడునంత సామ్యవాదం ఉన్నట్లు లెక్క. పబ్లిక్ సెక్టార్‌ను ఆ విధంగా విస్తరింపజేస్తేనే, పెద్దపెద్ద పరిశ్రమలు నెలకొల్పకుండా విరోధించినప్పుడే, కంపెనీలపైన, వ్యక్తులపైన దశసరిగా పన్నులు విధించినప్పుడే సోషలిస్టు విధానం అయినట్లు లెక్క. ఫలితంగా మనకు అతివ్యయ వ్యవసాయం, అతివ్యయ పరిశ్రమలు, అతివ్యయ వ్యవస్థ మిగిలాయి. ఆర్థిక వ్యవస్థ ఆదర్శాల వొత్తిడిలో నలిగిపోతు ఉంది.

ప్రభుత్వరంగ సంస్థల యాజమాన్యాన్ని మరింత సమర్థవంతం చేయటానికి వాటిని ప్రభుత్వపరం నుండి తప్పించకుండా మరొక మార్గంలేదా? ఆ సంస్థల షేర్లలో కొన్నిటికి ప్రజలకు అమ్మటం, యాజమాన్యాన్ని స్వతంత్రంగా వ్యవహరించ నీయటం ఒక మార్గం. చాలా దేశాలు ఈ మార్గం అనుసరించి ఘన విజయాలు సాధించాయి. మరోమార్గం కంట్రాక్టు పద్ధతిపైన వాటి యాజమాన్యాన్ని ప్రైవేటు రంగానికి అప్పగించడం. ఉదాహరణకు విద్యుత్ రంగంలో ఇది సాధ్యం.

మన వైఫల్యానికి అభివృద్ధి వ్యూహం కారణం కాదు. ఆర్థిక రంగాన్ని రాజకీయం చేయడం. దానివల్ల ప్రణాళికలకూ వాటి అమలుకు మధ్య వ్యత్యాసం ఏర్పడటం అందుకు కారణం. ప్రణాళికల వరకు దాదాపు అన్ని ప్రణాళికలలోను పెరుగుదల శాతం లక్ష్యాలు వాస్తవికంగానే ఉన్నాయి. కానీ సాధించింది లక్ష్యం కన్న తక్కువే. లక్ష్యాలను సాధించడం జరిగి ఉంటే అయిదవ ప్రణాళికాంతానికి

తలసరి ఆదాయం రు. 1537 కాక, 3398 రూపాయలయి ఉండవలసింది. దీనివల్ల మన దేశంలో దారిద్ర్యస్థాయిలో, ఉపాధికల్పనలో, ఎగుమతులలో ఎంతో తేడా కనిపించేది. ఆదాయాల పంపిణీలో మార్పు లేకపోయినా, దారిద్ర్యరేఖకు దిగువ ఉన్న జనాభా 10 శాతం తగ్గేది.

గత నాలుగు దశాబ్దాలలో మనం సాధించినవి ఎన్నో ఉన్నాయి. లోటుపాట్లు ఎలాఉన్నా మనం స్వయంసమృద్ధిని సాధించిన సంగతి మాత్రం వాస్తవం. వరుసగా రెండేళ్ళు కరువు సంభవించినా తట్టుకోకలిగినన్ని మిగులు ఆహార ధాన్యాలు ఇప్పుడు మన దగ్గర ఉన్నాయి. అలాగే, మనం చేసిన పొరపాట్లుకూడా కొన్ని ఉన్నాయి. అది అంగీకరించాలి. మనం ఆ పొరపాట్లను సరిదిద్దుకొనగలిగితే భారతదేశం కూడా జపాన్, దక్షిణ కొరియా, హాంగ్‌కాంగ్, తైవాన్, సింగపూర్‌లు సాధించిన అద్భుత ఆర్థిక అభ్యున్నతిని సాధిస్తుంది.

**
*

# చైనా దురాక్రమణ

భారతదేశం మీద కమ్యూనిస్టు చైనా దురాక్రమణ జరపడం ఇరవయ్యో శతాబ్దపు చరిత్రలో ప్రధాన ఘట్టం. చైనా సైన్యములు ఇంతవరకు ఏనాడు హిమాలయ సరిహద్దులు దాటి భారత భూభాగంలో అడుగు పెట్టిన సందర్భం లేదు. భారతదేశంలో ప్రజాస్వామ్య వ్యవస్థ శైశవదశలో ఉండగా, ఆర్థికాభివృద్ధికి నాందీ ప్రస్తావనలు జరుగుతున్న సమయంలో పొరుగున ఉన్న కమ్యూనిస్టు చైనాతో సరిహద్దుకు సంబంధించిన యుద్ధం తప్పని సరి అయింది. కమ్యూనిస్టు చైనాతో ఆదినుంచి భారతదేశం స్నేహంగా ఉంటూ వచ్చింది. బ్రిటిష్ ప్రభుత్వం ద్వారా చైనా సరిహద్దుల్లోని హిమాలయా రాజ్యం టిబెటులో తమకు సంక్రమించిన హక్కులను భారత్ వదులుకొన్నది.

**మొదటి దెబ్బ – టిబెటు :**

హిమాలయ పర్వతశ్రేణిలో వొదిగి ఉన్న స్వతంత్ర దేశం టిబెటు. టిబెటుకు అవతల సరిహద్దు చైనా. ఇవతల సరిహద్దు భారతదేశం. ఎన్నడో శతాబ్దాల క్రితం చైనాను మంచూ చక్రవర్తులు పాలిస్తున్నప్పుడు టిబెటు దేశం మీద చైనాకు నామమాత్రమైన సార్వభౌమాధికారం ఉండేదని వాడుక. కానీ ఆచరణలో ఎన్నడూ ఆ అధికారాన్ని చైనా వినియోగించుకోలేదు. ఎవరి జోక్యం లేకుండానే టిబెటు సర్వస్వతంత్రంగా జీవించింది. టిబెటు ప్రజలకు చైనాతోకన్నా భారతదేశంతోనే అనాదిగా సంబంధ బాంధవ్యాలు ఉన్నాయి.

దక్షిణాసియాలో తన విస్తరణ వాద పథకాల సాధనలో చైనా తొలి దెబ్బ టిబెటు మీద తీసింది. చిన్న రాజ్యాన్ని చైనా ఆక్రమించుకున్న విధానం ప్రపంచాన్ని దిగ్భ్రమ పరిచింది. టిబెటు ప్రజలను భయకంపితులను చేయడానికి చైనా అత్యాధునిక ఆయుధాలతో తన సైన్యాన్ని భారీఎత్తున పంపింది. చైనా సైన్యం టిబెటు ప్రజలపై అమానుషమైన దమనకాండ కొనసాగించింది. వారిని కొల్ల

గొట్టుతూ చంపుతూ వచ్చి దురాక్రమణ సైన్యంలాగ ప్రవర్తించింది. టిబెటు నుండి ఏలాంటి ప్రతిఘటన లేకపోయినా చైనా భారీఎత్తున తన బలప్రదర్శన జరిపింది. టిబెటును చైనా 1951 లో ఆక్రమించింది.

టిబెటును ఆక్రమించుకోగానే చైనావారు టిబెటు ప్రజలపై పూర్తిస్థాయిలో దమనకాండ ప్రారంభించారు. దానివల్లనే భారీ ఎత్తున టిబెటు కాందిశీకులు భారత దేశం పారిపోయి వచ్చారు. ఇలా వచ్చిన వారిలో వారి మత గురువు దలైలామా కూడా ఉన్నారు. భారతదేశం దలైలామాకు రాజకీయాశ్రమం ఇవ్వడం చైనీయులకు ఆగ్రహం కలిగించింది. టిబెటు నుండి భారతదేశానికి వచ్చిన శరణార్థుల సంఖ్య 18,814 మంది. ఈ శరణార్థులు చైనాతో ఒక ఒప్పందం కుదిరేవరకు మన దేశంలోనే ఉంటారు.

టిబెటుపై చైనా బలప్రయోగం ఏదో ఒక చెదురుమదురు సంఘటన కాదు. చైనా విస్తరణ కాంక్షల సుదీర్ఘ నేపథ్యంలోనే టిబెటుపై చైనా చర్యను పరిగణలోనికి తీసుకోవాలని బ్రిటిష్ చరిత్రకారుడు బి. ఎన్. పాటర్సన్ అభిప్రాయపడ్డాడు. 'ఇది కేవలం టిబెటును జయించడం కాదు. దక్షిణాసియా మొత్తములో చైనా ప్రభావాన్ని విస్తరింప చేయటానికి ఉద్దేశించిన పధకాలను అమలు పరచడంలోని తొలి చర్య మాత్రమే' అని ఆ చరిత్రకారుడు 'టిబెటులో తిరుగుబాటు' అనే తన గ్రంథంలో పేర్కొన్నాడు.

**పంచశీలకు పరాభవం !**

1949 లో చైనా ప్రజారిపబ్లిక్ అవతరించినపుడు నెహ్రూ దాన్ని ఎంతగానో అభినందించారు. ప్రపంచ ప్రజాభిప్రాయానికి వ్యతిరేకంగా ఐక్యరాజ్య సమితిలో కమ్యూనిస్టు చైనాకు ప్రాతినిధ్యం ఇవ్వాలని కోరుతూ వచ్చారు. చైనాతో వర్తక వాణిజ్యాభివృద్ధి వాడంబడికను 'పంచశీల' ఆధారంగా కుదుర్చుకున్నారు.

1954 లో చైనా ప్రధాని చౌఎన్‌లై భారతదేశ పర్యటన కొచ్చినప్పుడు నెహ్రూతో ఆయన జరిపిన సమాలోచనల ఫలితంగా వెలువడిన సంయుక్త ప్రకటనలో శాంతి సూత్రాలు అయిదింటిని 'పంచశీల' పేరుతో రూపొందించారు.

1) పరస్పర భౌగోళిక సమైక్యతను కాపాడుకోవాలి.

2) ఒండొరులు సార్వభౌమాధికారాలను గౌరవించుకోవాలి.

3) ఒకరి విషయంలో మరొకరు జోక్యం కలిగించుకొనరాదు.
4) పరస్పరం దురాక్రమణ జరుపుకొనరాదు.
5) సాంస్కృతిక రంగాలలో సుహృద్భావ వాతావరణాన్ని పెంపొందించు కోవాలి.

ఈ సూత్రాల మీదనే 1955 లో ఆఫ్రికా, ఆసియా దేశాల బాండుంగ్ సమావేశం జరిగింది. అంతర్జాతీయ రంగంలో నెహ్రూ కీర్తి ప్రతిష్ఠలు ఈ సమావేశంలో ఉచ్ఛస్థాయి నందుకున్నాయి.

చైనా తన 'ప్రాణ మిత్రమైన' భారతదేశం సరిహద్దులను అతిక్రమించి, భారత ప్రాంతాలపై దురాక్రమణ జరిపి చరిత్రనే కాదన్నది. చైనాతో చేసుకున్న ఒడంబడికల ప్రకారం బ్రిటిష్‌వారు వదిలి వెళ్లిన భూభాగం పుమ్మాటికి మనదే అయినా, సరిహద్దుల్లోని 32 వేల చదరపు మైళ్ల భూమి తనదేనని చైనా వాదించింది.

చైనా ప్రధాని చౌఎన్‌లై 1956 లో మన దేశాని కొచ్చినప్పుడు మన ప్రధానితో జరిపిన ముఖాముఖి చర్చలలో మక్‌మాహన్ రేఖను ఇండియా-చైనాల సరిహద్దుగా అంగీకరించాడు. తదనంతరం స్వదేశానికి తిరిగి వెళ్లగానే మాట తప్పాడు. మక్‌మాహన్ రేఖ ఈనాటిది కాదు. ఇది చైనా, బ్రిటిష్ ఇండియా ప్రభుత్వాల మధ్య జరిగిన ఒప్పందం.

**మక్‌మాహన్ రేఖ :**

1913-14 లో సిమ్లాలో జరిగిన చైనా, టిబెటు, బ్రిటిష్ ఇండియా ప్రభుత్వాల ప్రతినిధుల సమావేశంలో మక్‌మాహన్ రేఖ నిర్ణయం జరిగింది. బ్రిటిష్ ప్రభుత్వం పక్షాన అప్పటి భారత విదేశాంగ శాఖతో రాజకీయ వ్యవహారాల కార్యదర్శి సర్ ఆర్థర్ హెన్రీ మక్‌మాహన్, చైనా ప్రతినిధిగా ఇవాన్, టిబెటు తరపున దలైలామా ప్రధానమంత్రి ఈ సమావేశంలో పాల్గొన్నారు. టిబెటు ప్రతిపత్తికి సంబంధించి పదకొండు అధికరణాల ఒడంబడిక కుదుర్చుకున్నారు. తొమ్మిదవ అధికరణంలో ఈ సరిహద్దు రేఖ ప్రస్తావన ఉంది. భూటాన్ ఈశాన్యాగ్రం నుంచి ఎగువ బర్మా వరకు 850 మైళ్ల పొడవున వ్యాపించిన ఈ ఎల్లను మక్‌మాహన్ రేఖ' అన్న పేరుతో దేశ పటం మీద గీచారు. కానీ, ఈ రేఖ

వ్యాపించిన ప్రాంతం దుర్గమమైనది కనుక భారతదేశ ప్రాంతాలకు 100 మైళ్ల ఆవలగా ఈ సరిహద్దు ఉంటుందని నిర్ణయించుకున్నారే గానీ, సీమ చిహ్నాలేవీ పెట్టుకోలేదు. ఈ ప్రాంతాన్ని పరిశీలించిన సర్ చార్లెస్ బెల్ దేశం పటంమీద ఎర్ర సీరాతో బండగా ఒక గీత గీచి 'ఇది సరిహద్దు' అని నిర్ధారించాడు. దీనిని టిబెటు ప్రధాని స్వల్ప మార్పులతో అంగీకరించాడు. చైనా ప్రతినిధి యీ ఒప్పందం ముసాయిదాపై సంతకం పెట్టాడు.

1954 లో టిబెట్టుపై ఇండియా చైనాల మధ్య ఒడంబడిక జరిగినపుడు చైనా యీ మక్‌మాహన్ రేఖనుగానీ, కాశ్మీర్ ఎల్లల ఒప్పందానికిగానీ ఎలాంటి అభ్యంతరం పెట్టలేదు. దీనిని బట్టి కూడా మక్‌మాహన్ రేఖను చైనా గుర్తించినట్లు మరొకసారి ధృవపడింది. చైనా బర్మాతో 1956 లో సరిహద్దుల సంధి చేసుకున్నప్పుడు మక్‌మాహన్ రేఖను చైనా ప్రధాని ఒప్పుకున్నాడని అప్పటి బర్మా ప్రధాని థాకిన్‌నూ తెలిపాడు.

మరికొంత ఎగువకు వెళ్లితే కాశ్మీర్ - టిబెటుల ఎల్లలలోని కాశ్మీర్ ప్రాంతంపై కూడా చైనా కన్నువేసి ఉంచింది. కాశ్మీర్ టిబెటుల సరిహద్దు వద్ద కొండు వందల మైళ్ల పొడవుగా ఉంది. అక్కడ కొండ వాగులను బట్టి ఈ ఎల్లలు నిర్ణయించబడ్డాయి. ఈ ఎల్లలను దేశ దేశాల వారు మూడు శతాబ్దాలకు పైగా అంగీకరించారు. టిబెటులో మనదేశం జరుపుకున్న 1684, 1842 ఒడంబడికలు ఈ ఎల్లలను ధృవపరుస్తున్నాయి.

సరిహద్దు చరిత్ర సాక్ష్యం ఇంత గట్టిగా మనకు అనుకూలంగా ఉన్నా, చైనా వేటినీ సరకు చేయక మన ప్రాంతాలపై దురాక్రమణకు పూనుకుంది. ఈ దురాక్రమణ ఉభయదేశాల శాంతియుత సహజీవనానికి, పంచశీల ప్రవచించిన కొన్ని నెలలలోనే ప్రారంభం కావడం ఆశ్చర్యం కలిగించింది. 1954 లోనే ఈ ఎల్లల కలహం రాజుకుంది. 1957 నుంచి మన సరిహద్దులను చైనా మెల్లమెల్లగా ఆక్రమించడం మొదలుపెట్టింది. బ్రిటిష్ సామ్రాజ్యవాదులు టిబెటుపై పెత్తనం కోసం మక్‌మాహన్ రేఖను గీచుకున్నారనీ, దానిని పూర్తిగా మరచిపోయి చరిత్రను తిరిగి రాయాలని చైనా కోరింది. అంతటితో ఆగక ఉత్తరప్రదేశ్ ఎల్లలలో తన సైన్యాన్ని సమీకరించింది. కొత్త విమానాశ్రయాలను కట్టింది. మనమీద దుష్ప్రచారాలను చేసింది.

విభిన్న దృక్పథాలు :

విభిన్న సాంఘిక వ్యవస్థ గల రాజ్యాలు స్నేహ సుహృద్భావంతో మనగలవని ప్రపంచానికి చైనా–భారతమైత్రి ద్వారా చాటదలచిన నెహ్రూకు చైనా దురాక్రమణవల్ల తీరని ఆశాభంగం కలిగింది. చైనా–భారత్‌లు పరస్పరం శత్రు దృష్టితో చూచుకుంటున్న దుస్థితి ఏర్పడినందుకు నవీన్ నగర్ కాంగ్రెసు సమావేశంలో నెహ్రూ కంటతడి పెట్టుకున్నారు.

కాగా, చైనా ప్రధాని చౌఎన్‌లై మరో విధంగా మనల్ని నమ్మించాడు. భారత దేశ విషయంలో చైనాకు గల విస్తరణ కాంక్షను మరుగుపరచడానికి ప్రయత్నించాడు. టిబెటు సరిహద్దులలో చైనా సంచలనమంతా పశ్చిమ దేశాలు దురాక్రమణ జరుపకుండా చైనా సరిహద్దులు కాపాడుకొనడానికి ఉద్దేశించింది మాత్రమేనని, రానున్న పదీ పండెండు సంవత్సరాలలో చైనా నాయకత్వం తన స్వీయ ఆంతరంగిక సమస్యలతోనే సతమతమవుతుందే తప్ప, పొరుగు దేశాలకు వ్యతిరేకంగా ఏలాంటి కుట్రకు పూనుకోదని భారత ప్రభుత్వాన్ని నమ్మించడానికి ఆయన ఎంతగానో ప్రయత్నించాడు. చైనా ప్రమాదం గురించి భారత దేశానికి గల భయ సందేహాలను తగ్గించడానికి, తద్వారా భారత భూభాగంపై ఆకస్మిక దండయాత్రకు అత్యంత అనుకూలమైన పరిస్థితులు సృష్టించుకొనడానికి చైనా అధికారులు ఎంతో జాగ్రత్తగా మనలను మోసం చేశారు. చైనా–భారత్ యుద్ధం ప్రారంభం కావడానికి కొద్ది రోజులకు ముందు ఢిల్లీలోని చైనా రాయబారి భారత విదేశాంగ శాఖ కార్యదర్శికి పంపిన లేఖలో 'చైనా ప్రధాని దృష్టి, తన పోరాట విధానమంతా తూర్పు ప్రాంతానికీ, ప్రమాదభరితమైన అమెరికా సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా ఉద్దేశించిందే తప్ప ఆగ్నేసియాలోని దేశాలకు గానీ, దక్షిణాసియాలోని భారత దేశానికి గాని వ్యతిరేకంగా ఉద్దేశించింది కాదు. మా ప్రధాన శత్రువు అమెరికా సామ్రాజ్యవాదం. తూర్పున అమెరికాను శత్రువుగా చేసుకొని, తిరిగి పశ్చిమాన భారతదేశాన్ని శత్రువుగా చేసుకునేంత తెలివి తక్కువది కాదు చైనా.' అని ఆ చైనా రాయబారి భారత నాయకులను వంచించాడు.

భారత–చైనాలమధ్య సరిహద్దు సుమారు 2500 మైళ్ళ పొడవు వుంటుంది. ఇది కాశ్మీర్ ఉత్తరభాగంనుండి ఇండియా ఈశాన్య సరిహద్దు (బర్మాదగ్గర) వరకు వ్యాపించింది. సరిహద్దు వివాదం ముఖ్యముగా రెండు భాగాలకు చెంది ఉంది.

కాశ్మీర్‌కు తూర్పున ఉన్న లడఖ్ విషయంలోనూ భారత ఈశాన్య ప్రాంత విషయంలోనూ సరిహద్దు సమస్యలు తలెత్తాయి. అయితే ఈ రెండు ప్రాంతాల విషయంలో కమ్యూనిస్టు చైనా అవతరించిన తరువాత సుమారు పదేండ్ల వరకు ఈ సమస్యలు అంతగా జటిలం కాలేదు. రెండు దేశాల చిత్రపటాలలో, చారిత్రక పత్రాలలో విభేదాలు కనపడినప్పటికీ సమస్యను అతి సులువుగా సంప్రదింపుల ద్వారా పరిష్కారం చేసుకోవచ్చుననే మిత్రభావంతో రెండు దేశాలు హామీలు ఇచ్చుకున్నాయి.

## క్రమబద్ధంగా జరిగిన దాడి :

చైనా దురాక్రమణ క్రమబద్ధంగా 1959 నుంచి మొదలయింది. 1959 జనవరిలో చైనా ఒక దౌత్యపత్రంలో మొట్టమొదటిసారిగా లడఖ్ ప్రాంత రేఖ సరిహద్దుని, ఈశాన్యప్రాంత సరిహద్దుని (మెక్‌మాహన్) ఒప్పుకునేది లేదని, ఈ విషయలలో భారతదేశమే మొండిపట్టుతో వ్యవహరిస్తున్నదని తెలియచేసింది. పోతే ఈ సందర్భంగా ఒక ముఖ్య విషయం చెప్పవలసి ఉంది చైనా ఇప్పుడు కూడా ఒక రాజీప్రతిపాదన చేసింది. లడఖ్ సరిహద్దు విషయంలో భారతదేశం చైనా వాదాన్ని, ప్రతిపాదనను ఒప్పుకుంటే, మెక్‌మాహన్‌రేఖ విషయంలో చైనా ఉదార భావంతో భారత సరిహద్దును అంగీకరిస్తానని చెప్పింది. కానీ, అప్పటికే చైనా వ్యక్తపరస్తున్న దురహంకార వైఖరి లడఖ్ విషయంలో అప్పటికే జరిపిన దురాక్రమణ మూలంగా విస్మయం చెందిన ఇండియా ఈ రాజీ ప్రస్తావనను పట్టించుకోలేదు.

రాజీ ప్రతిపాదనలు కొనసాగుతుండగానే 1959 జులై 28న చైనా సాయుధ దళాలు లడఖ్‌లోని పశ్చిమ పాంగాంక్ సరస్సు ప్రాంతంలో ప్రవేశించి అక్కడ గస్తీ ఉన్న ఆరుగురు భారతీయ పోలీసులను అరెస్టు చేశాయి. స్పాంగుర్ అనే చోట సైనిక శిబిరాన్ని అవి నెలకొల్పాయి. ఆగష్టు 7 న చైనా సైనికులు మెక్‌మాహన్ రేఖ వద్ద నున్న ఖంజిమాన్‌ను దాటి భారత గస్తీ దళాన్ని వెనక్కునెట్టేశారు. సుభాన్‌సారీ డివిజన్‌లో మరొక చైనా దళం ప్రవేశించి, అక్కడ వున్న భారత గస్తీ దళం మీద కాల్పులు జరిపి లాంగ్జును ఆక్రమించారు. అక్టోబర్ 20 నాటికి చైనా సైనికులు లడఖ్‌లోని చాంగ్‌చెన్‌మో లోయలోని భారత భూభాగంలో 40 మైళ్లు ముందుకు చొచ్చుకు వచ్చి, అక్కడ వున్న భారత గస్తీ

దళంపై కాల్పులు జరిపి తొమ్మిదిమందిని చంపివేశారు. దీనికి భారత ప్రభుత్వం తన నిరసనను తెలియచేయగా చైనా ప్రభుత్వం కాంగ్‌కా కనుమ ప్రాంతం తనదేనని వాదించింది. పోరు విరమణకు భారత ప్రభుత్వం చేసిన తాత్కాలిక ప్రతిపాదనలను చైనా నిరాకరిస్తూ లడఖ్‌లోని అక్సాయ్‌చిన్‌కు ఇంకా పశ్చిమంగాను, దక్షిణంగాను తన సైన్యాలను ముందుకు నడిపింది. టిబెటు నుండి సింక్‌యాంగ్ వరకు ప్రయాణాలకు వీలుగా అక్సాయ్‌చిన్ రోడ్డును నిర్మించింది. ప్రధాని నెహ్రూ ఆహ్వానంపై 1960 ఏప్రిల్ 19 న ఢిల్లీలో చౌఎన్‌లై, నెహ్రూల సమావేశం జరిగింది. సుదీర్ఘ చర్చల అనంతరం తమ మధ్య సమాధానం కుదరలేదని ఉభయ దేశాల అధికారుల సమావేశాలు జరుగాలని ఒడంబడిక చేసుకున్నారు. దరిమిలా చైనా, భారత్ అధికారుల సమావేశాలు ఢిల్లీలోను, పీకింగ్‌లోను జరిగాయి. తనకు రావాలని కోరుతున్న 50,000 చదరపు మైళ్ల భూభాగంలో అప్పటికే చైనా 12,000 చదరపు మైళ్ల భూభాగాన్ని ఆక్రమించుకుందని ఈ సమావేశాలలో వెల్లడైంది.

1960 లో చైనా ప్రధాని ఢిల్లీ వచ్చి వెళ్లిన తరువాత కూడా ఈ దురాక్రమణ కొనసాగుతూ వచ్చింది. 1960 జూన్ 3 న నీఫాలోని కామెంగ్ డివిజన్‌లో తసాంగ్‌గోసా అనే చోట ఐదు మైళ్ల వరకు చైనా సైనికులు చొచ్చుకుపోయారు. సెప్టెంబర్ 22 న సిక్కిం సమీపంలో జీలా కనుమను దాటి చైనా సైన్యాలు వచ్చాయి. లడఖ్‌లో హాట్‌స్ప్రింగ్ అనే చోటుకి వారు వచ్చి చేరారు. 1960 మార్చి నుంచి ఆగష్టు 22 నాటికి చైనా విమానాలు 52 దఫాలు భారత గగన సరిహద్దులను అతిక్రమించాయి. 1961 మేలో లడఖ్‌లోని ఘనుల్ దగ్గర చైనా సైన్యాలు పురోగమించాయి. జులై 2 వ తేదీ నాటికి నీఫాలో మరొక మైలు ముందుకు వచ్చాయి. ఆగష్టు నాటికి లడఖ్‌లో కొత్తగా మూడు గస్తీ కేంద్రాలను చైనా ఏర్పరచి, అక్కడికి రాక పోకలకు వీలుగా రోడ్డులను నిర్మించింది. కారాకోరమ్ కనుమ నుంచి కాంగ్‌గా కనుమవరకు ఉన్న భూభాగంలో తన గస్తీ స్థావరాలను ఏర్పాటు చేసుకుంటున్నట్లు 1962 ఏప్రిల్‌లో చైనా ప్రకటించింది. ఈ ప్రాంతాలలో ఉన్న భారత గస్తీ దళాలను వెంటనే ఖాళీ చేయాలని హెచ్చరించింది. చిప్‌చాప్ లోయలో కూడా కాపలా ఏర్పాట్లు చేసింది. 1962 సెప్టెంబర్ 8 న మక్‌మాహన్ రేఖను దాటి తాంగ్లా కనుమలను చైనా సైనికులు పట్టుకున్నారు.

ఈ విధంగా 1962 సెప్టెంబర్ 8 వ తేది అనేది చైనా సాయుధ దురాక్రమణకు కీలకమైనదిగా భారత్ పరిగణించింది. ఈ తేదీకి ముందు నీఫారంగంలో చైనా సైనికులు మక్‌మాహన్ రేఖను అతిక్రమించలేదు. లడఖ్‌తో మాత్రం తనకు కావాలనికోరే 15,000 చదరపుమైళ్ళలోను 12,000 చదరపు మైళ్ళను ఆక్రమించారు. ఈ దురాక్రమణ దాదాపు పదిసంవత్సరాలుగా, చాటుమాటుగా, స్నేహభావంనటిస్తూ శాంతి సమాలోచనలు సాగిస్తూ కమ్యూనిస్టు చైనా కొనసాగించింది. 1962 అక్టోబర్ 20 నుండి అటు నీఫాలోను, ఇటు లడఖ్‌లోను కమ్యూనిస్టు సైన్యాలు భారీ ఎత్తున దాడిచేసి సాయుధ దురాక్రమణను ప్రారంభించాయి. చైనా-భారత్ దేశాల మధ్య ఈ అప్రకటిత యుద్ధం 1962 నవంబరు 20 వరకు కొనసాగింది. ఈ యుద్ధంలో దౌలత్ బేగ్ ఓల్డీ నుంచి చుసుల్ సమీపంవరకు ఉన్న భారత భూభాగాలను చైనా ఆక్రమించింది. అంటే, లడఖ్‌లో తనకు రావలనుకున్న 15,000 చదరపు మైళ్ళను స్వాధీనం చేసుకుంది. నీఫాలో బొమ్‌డిలా కనుమను, తవాంగ్‌ను కూడా పట్టుకుంది. అంటే, నీఫా రంగంలో తనకు రావాలనుకున్న 13,000 చదరపు మైళ్ళను బల ప్రయోగం ద్వారా వశపరచుకుంది. ఆ విధంగా 1962 నవంబర్ 20 నాటికి తనకు రావాలనుకున్న భారత భూభాగాలలోని ప్రాంతాలను కమ్యూనిస్టు చైనా కబళించి, తనకు తాను యుద్ధ విరమణ షరతులను ప్రకటించింది.

## యుద్ధ విరమణ :

యుద్ధ విరమణ చేసిన వెంటనే కమ్యూనిస్టు సైన్యాల ఉపసంహరణకూడా ప్రారంభమైంది. 1962 డిసంబర్ 9 న కమ్యూనిస్టు చైనా మూడు ప్రశ్నలను భారత దేశానికి అందజేసింది.

1. చైనా తనకు తానుగా యుద్ధాన్ని విరమించడం.
2. ఉభయ దేశాలు పోరు విరమించి 1959 నవంబర్ 7 నాటికి ఆధీన శ్రేణి నుంచి చెరి పన్నెండున్నర మైళ్ళు వెనక్కు తగ్గడం.
3. సాయుధ బలాల ఉపసంహరణ సమస్యపై ఉభయదేశాల అధికారుల చర్చలు, నిస్సైనిక మండలం నిర్మాణం, ఇతర అంశాల గురించి సమాలోచనలు జరగటం.

ఈ మూడు ప్రశ్నలకు భారతదేశం పంపిన సమాధానాలు-

1. యుద్ధ విరమణ, సైన్యాల ఉపసంహరణ చైనా ప్రభుత్వం తనం తట తానుగా చేసింది. యుద్ధవిరమణకు సంబంధించినంతవరకు చైనా చర్యకు ప్రతిబంధకం కలిగించే చర్య ఏదీ భారత ప్రభుత్వం తీసుకోదు.

2. ఉభయులకు అంగీకారయోగ్యమైన ఏర్పాటు ప్రాతిపదికగా ఉభయ దేశాలు పోరు విరమించడం భారత ప్రభుత్వానికే సమ్మతమే. అయితే ఆ ఏర్పాటు 1962 సెప్టెంబర్ 8వ తేదీనుంచి భారత్‌పై చైనా జరిపిన దురాక్రమణను తొలగించేదిగా ఉండాలి. ఏదయినా తన ప్రాంతం భారత్‌లో ఉండిపోయిందని చైనా భావిస్తే, న్యాయమూర్తులద్వారా లేదా ఇలాంటి ఇతరులద్వారా ఆ విషయాన్ని తేల్చుకోవాలి. 1959 నవంబర్ 7వ తేదీ ఆధీనరేఖకు చైనా చేస్తున్న వాదనను భారత ప్రభుత్వం అంగీకరించదు.

3. ఉభయ దేశాల అధికారుల సమావేశం జరుగాలంటే యుద్ధ విరమణ రేఖను గురించి, సైన్యాల ఉపసంహరణ గురించి ఇదమిద్ధమైన ఆదేశాలు ఇవ్వ డం అవసరం. భారత ప్రభుత్వం సూచిస్తున్న 7వ తేదీ ఆధీనశ్రేణి మధ్య సుమారు 2,500 చదరపు మైళ్ల వ్యత్యాసం ఉంది. దురాక్రమణద్వారా పొందిన ఈ ప్రాంతాన్ని చైనాకు వదలడం భారత ప్రభుత్వానికి ఇష్టంగా లేదు. కనుక ఆధీనశ్రేణి గురించి ఉభయ ప్రభుత్వాల మధ్య ఒప్పందం కుదిరితేతప్ప అధికా రులకు తగిన ఆదేశాలిచ్చే అవకాశం ఉండదు.

దీనిని బట్టి ఒక విషయం స్పష్టమైంది. 1962 సెప్టెంబర్ 8 నాటికి కమ్యూ నిస్టు చైనా సుమారు 12,000 చదరపు మైళ్ళ భూభాగాన్ని ఆక్రమించింది. తరు వాత యుద్ధంద్వారా మరో 25,000 చదరపు మైళ్ళ మీద దురాక్రమణ జరిపింది. ఇలా చైనా మన దేశంలోని 14,500 చదరపు మైళ్ళ భూభాగాన్ని స్వాహాచేసింది. (భారతదేశానికి చెందిన 14,500 చదరపు మైళ్ళ భూమి చైనా ఆధీనంలో ఉన్న దని భారత విదేశ వ్యవహారాల సహాయమంత్రి శ్రీ ఖుర్షీద్ ఆలంఖాన్ 1985 మే 17న రాజ్యసభలో ప్రకటించారు. పాకిస్తాన్ ఆక్రమిత కాశ్మీర్‌లోని 2000 చద రపు మైళ్ల భూభాగాన్ని పాకిస్తాన్ చైనాకు ధారాదత్తం చేసింది)

నీఫా రంగంలో మక్‌మాహన్ రేఖ ఆవలివైపున పందెండున్నర మైళ్ల వరకు తన సేనను ఉపసంహరించడానికి చైనా అంగీకరించింది. కానీ ధోలా, లాంగ్జూ, కిటుబు స్థావరాలను భారత ప్రభుత్వం తిరిగి స్వాధీనపరచుకోరాదని

షరతు పెట్టింది. ఆ విధంగా సరిహద్దు పొడవునా సింహద్వారాలు తనవద్ద ఉంచు కొని, వాని దిగువ భూభాగాలను నిస్సైనిక మండలంగా చేసి, అవసరమైనప్పుడు దెబ్బతీయడానికి అనువైన అవకాశాలను చైనా తనవద్ద ఉంచుకోవాలన్నది ఆ దేశ యోచనలకు అతి కీలకంగా ఉంది. ఇది శాంతి సుహృద్భావాలతో ఇరుగు పొరుగు మిత్రులుగా సహజీవనం చేయాలని కోరే వారి లక్షణం కాదని భారత ప్రభుత్వం చైనా ప్రతిపాదనలను తిరస్కరించింది.

ఈ యుద్ధంలో సైనిక పరంగా భారత్‌కు అపజయం కలగడానికి రెండు ప్రధాన కారణాలున్నాయి. చైనా జవాన్లు అనేక సంవత్సరాలనుంచి పొందుతున్న ప్రత్యేక సైనిక శిక్షణ వంటిది మన జవాన్లకు లేకపోవడం మొదటిది. 14,000 అడుగుల ఉన్నత ప్రదేశాలపై యుద్ధం చేయడం మనవారికి కొత్తకావడం రెండోది.

## నయా సామ్రాజ్యవాదం :

ఇంతవరకు సామ్రాజ్యవాద దేశాలంటే పశ్చిమ దేశాలేనని మనం భావిస్తు వచ్చాం. నిన్నమొన్నటి వరకు వలస దేశాలుగా ఉన్న ఆసియా రాజ్యాలకు సామ్రాజ్యవాదమంటే గిట్టదని, పశ్చిమ సామ్రాజ్యవాదంతో హోరాహోరిగా పోరాడిన ఆసియా దేశాలు స్వాతంత్ర్యం పొందాక సఖ్యంగా ఉంటు వలస వాదాన్ని ఎదుర్కొంటాయని నమ్ముతూ వచ్చాం. కానీ, అవకాశం లభిస్తే ఆసియా దేశాలు కూడా సామ్రాజ్యవాదాన్ని అవలంభిస్తాయని నడుస్తున్న చరిత్ర రుజువు చేస్తున్నది. 'బాండుంగ్' 'సుహృద్భావం', 'ఆసియా ఐక్యమత్యం' నినాదాలకు అర్థం లేదని తేలిపోయింది. నిన్నమొన్నటి వరకు అంతర్యుద్ధాలతో, జపాన్ దురాక్రమణలతో పీడితమైన చైనా, తన అనుభవాలను సైతం మరచిపోయి ఒక సామ్రాజ్యవాద దేశంగా తయారయింది. సామ్యవాదం పేరుతో నిర్దాక్షిణ్యంగా టిబెటును ఆక్రమించింది. భారతదేశం మీద దురాక్రమణ జరిపింది. బలవంతంగా సుఖపెట్టే ప్రయత్నానికి మార్క్స్, ఏంగిల్స్ విముఖులు. అయితే ఈ శతాబ్ది అర్ధ భాగం నుంచి దాన్ని గట్టిగా హృదయస్థం చేసుకోవలసిన వారు కమ్యూనిస్టులు. వారు కనుక తమ మతానికి పితృదేవతలైన వారిలో ఒకరు చెప్పినట్లుగా 'బల వంతంగా సుఖపెట్టాలనే' నినాదాన్ని, ప్రయత్నాన్ని విరమించుకుంటే, ఈ ప్రపం చం ఇంతకంటె సుఖంగా, సౌభాగ్యంగా జీవిస్తోంది. భారత ప్రజలు చైనా నుంచి కోరుతున్నదికూడా ఇదే.

భారత ప్రజలపై చైనా దురాక్రమణ ప్రభావం ఎంతగా ఉందో జాన్ స్ట్రాచీ చక్కని అంచనా వేయగలిగారు. 'కమ్యూనిస్టేతర దేశాలలో అందరికన్నా కూడా భారతదేశానికే చైనాతో ఎక్కువ స్నేహభావం ఉండేది. ఐక్యరాజ్య సమితిలో చైనాను సమర్థించి సభ్యత్వమివ్వాలని భారతదేశమే ఒకప్పుడు ప్రతిపాదించింది. పంచశీల సూత్రాల ప్రకారం ఒప్పందం చేసుకుంది. అలాంటి భారత దేశాన్ని మిత్ర వైఖరి నుండి శత్రు వైఖరి వహించేటట్లు చెయ్యడం పశ్చిమ రాజ్యాలు చేసినంత గొప్ప తప్పిదం. ఇది చేయదగిన దేనా ? భారతదేశం వెళ్ళిన వారికి ఈ విషయం తెలియక మానదు. చైనా ప్రభుత్వం తెలివితక్కువతనానికి ఈ చర్య పెద్ద నిదర్శనం. నేను ఈ విషయాన్నే నెహ్రూతో చర్చించాను. ఎల్లప్పుడూ తనకు ఉండే సహనభావం, దూరదృష్టి, మితవాదితనం ఈ సందర్భములో కూడా చూపెట్టారు. చైనా ఆక్రమణను ఆయన ఒప్పుకుంటారని అనుకోవడం శుద్ధ అవివేకం. అలా ఆయన చేయరని నాకు గట్టిగా తెలుసు. ఒకవేళ ఆయన అలా చేయదలచినా భారత ప్రజాభిప్రాయం ఎదురై చేయనీయదు. చైనా ముందుకు త్రోసుకురావటం వీరికి చాలా ఆందోళన కలిగిస్తున్నది. ఏది ఏమైనా సరే వారిని అరికట్టాలనే కృత నిశ్చయానికి వచ్చింది. సామ్రాజ్యవాద దేశాలు అనేకసార్లు వ్యవహరించినట్లుగానే చైనా వ్యవహరించింది. జాన్‌స్ట్రాచీ ఈ విధముగా చెప్పినందుకు ఆయనను చైనా విరోధిగా భావించరాదు. 1962 నవంబర్ 14 న పార్లమెంటులో 'దురాక్రమణదారుని ఎంతకాలము పట్టినసరే, ఎంత గట్టిగా పోరాడవలసి వచ్చినాసరే పవిత్ర భారత భూభాగం నుండి తరిమికొట్టాలని భారత ప్రజలు దృఢసంకల్పంతో ఉన్నార'ని నెహ్రూ ప్రతిపాదించిన తీర్మానాన్ని సభ ముక్త కంఠంతో అంగీకరించింది. సరిహద్దు సమస్యను చరిత్ర వదిలిపెట్టిన సమస్యగా భావిస్తే భారత ప్రజల మనోభావాన్ని తక్కువ అంచనా వేసుకున్నారనే అనాలి.

### ఏకాకిగా మిగిలిన భారత్ :

భారతదేశంపై చైనా జరిపిన దాడితో మనం ఇంతకాలంగా అనుసరిస్తూ వచ్చిన అలీన విధానపు పునాదులే కదిలిపోయాయి. మన ప్రాదేశిక సమగ్రతా రక్షణకు మనం ఇతరులపై ఆధారపడవలసి వచ్చింది. ఈ ఆపత్సమయములో మనకు బ్రిటన్, అమెరికాలు అండగా నిలిచాయి. ఆయుధాల సప్లయి, రవాణా విమానాలు వచ్చాయి. పశ్చిమ జర్మనీ ఉన్ని వస్తువుల సప్లయి చేసింది. ఆసి

యాలో కమ్యూనిస్టు చైనా దురాక్రమణను బహుముఖంగా నిరోధించవలసిన అవసరం ఉన్నదని అమెరికా, బ్రిటనులు గుర్తించాయి. అందుకు పాకిస్తాన్‌తో మన దేశానికి స్నేహం అనివార్యం అని ఆ దేశాలు షరతులు విధించాయి. సోవియట్ ప్రధాని కృశ్చేవ్ ఇరుదేశాల స్నేహం కోరినవాడే. ఐసన్‌హోవర్ అంతటి వ్యక్తిని అగ్రనాయక సమావేశానికి ఒప్పించాడు. అలాంటి వ్యక్తి దూరం ఆలోచించి చైనా శ్రేయస్సును కోరి తన పలుకుబడితో యుద్ధాన్ని నివారించలేక పోయాడు. ఈ యుద్ధం భారత ప్రతిష్ఠను బాగా దెబ్బతీసింది. ప్రపంచం ఎదుట భారత్ ఒక అపజయం పొందిన దేశంగా నిలబడవలసి వచ్చింది. భారత్‌కు మిత్ర దేశాలుగా ఇంతవరకు నటిస్తూవచ్చిన అరబ్ దేశాలు ఈ విషమ సమయములో ఒక్క సానుభూతి వ్యక్తమైనా మనకు అందించలేక పోయాయి. కొలంబో రాజ్యాలు చేసిన సంధి ప్రయత్నాలు ఫలించలేదు. యుద్ధ సమయంలో తటస్థంగా వున్న పాకిస్తాన్ అటు తరువాత పీకింగ్‌కు చేరువయ్యింది. కంబోడియా చైనాతో చేతులు కలిపింది. ఇండియా సహాయం అనేక రకాలుగా పొందిన ఇండోనీషియా చైనా పట్ల మొగ్గుచూపింది. ఉత్తర కొరియా, ఉత్తర వియత్నాంలు కమ్యూనిస్టుల స్నేహ కూటమిలో చేరాయి. ఆఫ్రికా, ఆసియా దేశాల మధ్య భారత్ ఏకాకిగా నిలిచింది.

## మార్పుల పర్వం :

1976 లో రాయబారస్థాయి సంబంధాలు తిరిగి ఏర్పడినప్పటినుంచి భారత్-చైనాల మధ్య కొంతవరకు శత్రుభావంలో సడలింపు కనిపించింది. జనతాపార్టీ హయాంలో ఇరుగు-పొరుగు దేశాల విషయంలో ఎక్కువగా శ్రద్ధ చూపడం, వివాదాలను, అపోహలను తగ్గించడానికి ప్రయత్నించడం జరిగింది. చైనా విషయంలోను ఇదే ధోరణిని గమనించవచ్చు. 1978 లో అప్పటి విదేశాంగమంత్రి అటల్‌బిహారీ వాజ్‌పేయి చైనా సందర్శించారు. కాని దీని ఫలితాలు నిరర్థకమైనాయి. భారతదేశ విదేశాంగమంత్రి చైనాలో పర్యటిస్తున్నప్పుడే, వియత్నాంపై చైనా సైనిక చర్య తీసుకోవడం మన దేశానికి ముఖంమీద కొట్టినట్లయింది. ఎందుకంటె మనకు వియత్నాంతో సన్నిహిత సంబంధాలున్నాయి. దీనివల్ల ఉభయదేశాల సంబంధాలలో ప్రగతి విషయం అటుంచి ఇది మన ప్రతిష్ఠకు సవాలుగా పరిణమించింది. దౌత్య పరంగా ఈ పర్యటన ఒక వైఫల్యం.

ఇందిరాగాంధీ తిరిగి 1980లో ప్రధాని అయిన తరువాత చైనా విషయంలో మామూలు సంబంధాలు నెలకొల్పుకునే యత్నాలు కొనసాగాయి. ఇతర రంగాలలో ఈ రెండు దేశాలమధ్య సంబంధాలు కొంతవరకు పెరిగాయి. వాణిజ్య వ్యవహారాలలో, పౌర పర్యాటక రంగంలో, సాంస్కృతిక విషయాలలో రాకపోకలు జరిగాయి. ఇక్కడ మరొక ముఖ్య విషయము గమనించాలి. అంతర్జాతీయ వ్యాపార రంగంలో జపాన్‌ను అదుపులో ఉంచటానికి అమెరికాకు చైనా స్నేహం అవసరమైతే, చైనాకు భారత్ స్నేహం అవసరమైంది. ఈ నేపథ్యంలో చైనా భారత్‌తో తిరిగి స్నేహ సంబంధాల అభివృద్ధికి ప్రయత్నం చేస్తోంది.

చైనా అధినేత డెంగ్ జియావో పింగ్, అప్పటి భారత ప్రధాని రాజీవ్ గాంధి మధ్య శిఖరాగ్ర సమావేశం బీజింగ్‌లో 1988 డిసెంబరులో జరిగింది. సరిహద్దు వివాదాన్ని చర్చలద్వారా ఉభయులకు ఆమోదయోగ్యమైన పద్ధతిలో పరిష్కరించుకోవాలని అంగీకారం కుదిరింది. భారత్-చైనా సరిహద్దు వివాదం ఉభయ పక్షాలకు ఆమోదయోగ్యంగా పరిష్కారం కావలసిన అవసరం నేడు ఎంతైనా ఉన్నది.

ముక్తాయింపు :

1954 లో మొదటిసారి నెహ్రూ చైనా సందర్శించారు. 'ఆసియా రాజ్యాల శాంతికూటం' ఒకటి ఏర్పరచి అందులో ఇండియాను భాగస్వామ్యం చేయాలని చైనా నాయకులు అభిలషించారు. ఈ అభిప్రాయానికి సమాధానంగా నెహ్రూ 'యుద్ధకూటాలకు ప్రత్యామ్నాయంగా శాంతి కూటాలు ఏర్పరచినంత మాత్రాన శాంతి రక్షింపబడుతుందని నేను అనుకోను. 'పంచసూత్రాలు' 'సీటో'కు జవాబుగా ఏర్పడాలనే చౌఎన్‌లై వాదనను నెహ్రూ ఈ పర్యటనలో 'జాగరిక ఆసియా' అన్నారు. చైనావలె తన ప్రాబల్య విస్తరణ కోసం ఇండియా ప్రయత్నించడం లేదు. ఆగ్నేసియాలో తృతీయ కూటాన్ని ఏర్పరచి తాను నాయకత్వం వహించాలనే ఆకాంక్ష ఇండియా కెన్నడూ లేదని నెహ్రూ ఆనాడే చైనాకు స్పష్టపరిచారు.

- )o( -

# పాకిస్తాన్ రాజకీయాలు

భారత ఉపఖండం నుంచి 1947 ఆగస్టు 14 న విడిపోయింది పాకిస్తాన్. ఆనాటి నుంచి ఆ దేశ రాజకీయ వ్యవస్థ అనిశ్చిత పరిస్థితిలో కొనసాగుతున్నది. పాకిస్తాన్ ఆవిర్భవించగానే భారత ముస్లింలీగ్ రద్దయిపోయి, భారతదేశం నుంచి వచ్చిన శరణార్థులతో పాకిస్తాన్ ముస్లింలీగ్ ఏర్పడింది. పాకిస్తాన్ నిర్మాత మహమ్మద్ అలీ జిన్నా వృద్ధాప్యంవల్ల గవర్నర్ జనరల్ పదవితోనే తృప్తిపడి ముస్లింలీగ్ రాజకీయాలను పటిష్ట పరచలేకపోయాడు. 1948 సెప్టెంబరులో జిన్నా మరణించాడు. తరువాత పాకిస్తాన్ ప్రధాని నవాబ్ జాదాలియాకత్ అలీ ఖాన్ ఇటు ప్రభుత్వాన్నీ, అటు పార్టీ యంత్రాంగాన్ని తన పూర్తి అదుపులో ఉంచుకున్నాడు. కానీ లియాఖత్ అలీఖాన్ బలపడటం పంజాబీలకు ఇష్టంగా లేదు. పాకిస్తాన్ రాజకీయాలలో మొదటి నుంచి పంజాబీల ప్రభావం ఎక్కువ.

జిన్నా మరణానంతరం తూర్పుపాకిస్తాన్ (ప్రస్తుత బంగ్లాదేశ్) నాయకుడు ఖాజా నిజాముద్దీన్ పాకిస్తాన్ గవర్నర్ - జనరల్ అయ్యాడు. శరణార్థిగా వచ్చిన వ్యక్తి (లియాఖత్ అలీఖాన్ దేశ విభజనకు పూర్వ ఉత్తరప్రదేశ్ నివాసి) ప్రధాని కావడం, తూర్పు పాకిస్తాన్ వ్యక్తి గవర్నర్-జనరల్ కావడం సహించలేని అసంతృప్తి వర్గానికి పంజాబ్ లీగ్ నాయకుడు మియా ముంతాజ్ దవుల్తానా నాయకత్వం వహించాడు. 1951 అక్టోబర్ 16 వ తేదీన లియాఖల్ అలీ ఖాన్‌ని హత్య చేశారు. లియాఖల్ మరణంతో పాకిస్తాన్‌లో ప్రజాబలంలేని నాయకులు అధికారాన్ని హస్తగతం చేసుకొని పాకిస్తాన్ రాజకీయాలకు సుస్థిరత లేకుండా చేశారు.

లియాఖత్ అలీఖాన్ మరణించగానే గవర్నర్ జనరల్ పదవికి రాజీనామా చేసి ఖాజా నిజాముద్దీన్ ప్రధాని అయ్యాడు. సర్ గులాం మహమ్మద్ అతని

స్థానంలో గవర్నర్ జనరల్ అయ్యాడు. నిజాముద్దీన్ కాలంలో కేంద్ర ప్రభుత్వంలో సహజంగానే బెంగాలీల ప్రభావం ఎక్కువయింది. ప్రాంతీయ తత్వం వెరితలలు వేసింది. పంజాబీలు, బెంగాలీలు, బలూచీలు, సింధీలు, పటాన్లు ఎవరికి వారే ఆధిక్యం కోసం పరస్పర పోరాటాలు మొదలు పెట్టారు. ప్రాంతీయ తత్త్వాలను అణచలేని నిజాముద్దీన్‌ను ప్రధాని పదవి నుంచి తొలగించి అతని స్థానంలో మహమ్మద్ అలీ బోగ్రాను ప్రధానిగా నియమించాడు గవర్నర్-జనరల్.

బ్యూరోక్రసీలో కొందరు అధికారులు హఠాత్తుగా పైకి వచ్చేస్తారు. సర్ ఇస్కిందర్ మిర్జా అలా పైకి వచ్చినవాడే. రక్షణశాఖ కార్యదర్శిగా ఉన్న సర్ మిర్జా అధికార పెనుగులాటలో దేశీయాంగశాఖ మంత్రి పదవిని హస్తగతం చేసుకొని 1955 ఆగష్టు 5 న గులాం మహమ్మద్ చేత గవర్నర్-జనరల్ పదవికి సెలవు పెట్టించి తానే గవర్నర్-జనరల్ అయి కూర్చుండిపోయాడు. ప్రధాన మంత్రి పదవి నుంచి మహమ్మద్ అలీబోగ్రాని తొలగించి అతని స్థానంలో చౌదరి మహమ్మద్‌అలీని ప్రధానిగా చేశాడు సర్ మిర్జా. చౌదరీతో పడక అనతి కాలంలోనే తూర్పు పాకిస్తాన్ నాయకుడైన హుసేన్ షహీద్ సుహ్రావర్దీ చేత అవామీ, రిపబ్లికన్ పార్టీల మిశ్రమ ప్రభుత్వం ఏర్పాటు చేయించాడు.

ఇస్కిందర్ మిర్జా తన అధికారాన్ని సుస్థిర పరచుకునే ఎత్తుగా పాకిస్తాన్‌కు పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పనికిరాదనీ, అధ్యక్ష పరిపాలన ప్రవేశపెట్టాలని ప్రచారాలు చేయడం మొదలు పెట్టాడు. అతని యీ చర్యతో గవర్నర్-జనరల్, ప్రధాని అధికారాల మధ్య ఘర్షణ మొదలైంది. ఇది చివరకు ప్రధాని సుహ్రావర్దీ రాజీనామాకు దారి తీసింది. సుహ్రావర్దీ స్థానంలో చుంద్రీగర్ రెండు నెలలు మాత్రమే ప్రధానిగా పనిచేశాడు. అటు తర్వాత ఫిరోజ్‌ఖాన్‌నూన్ పాకిస్తాన్‌లో ఆరు పార్టీల మిశ్రమ ప్రభుత్వం ఏర్పాటు చేశాడు.

### సందేహం తీరింది :

అవిభక్త భారతదేశపు ముస్లింలీగ్ నాయకులతో ఆనాడు లియాఖత్ అలీ ఖాన్ తరువాత ఈ నూన్‌గారిదే ప్రధాన స్థానం. ఆ రోజుల్లో ఈ నూన్ ఉపన్యసించడానికి వచ్చినపుడు తన భార్యను కూడా వెంట పెట్టుకొని వచ్చేవాడు. 1940 లో ఈ నూన్ మహాశయుడు మూడో పెళ్ళి చేసుకొని పాత్రికేయులకు

కొంత ఇబ్బంది కలిగించాడు. ఎందుకంటే అతడు ఏ సభకు ఏ భార్యను తెచ్చే వాడో తెలిసేది కాదు. తమకు కలిగిన యీ ఇబ్బందిని పరిష్కరించుకొనడానికి పాత్రికేయులు ఒకసారి రైట్ ఆనరబుల్ సర్ తేజ్ బహాదుర్ సప్రూ సహాయం కోరారు. ఈ విచిత్ర సంగతి విన్న సప్రూ వెంటనే అందుకొని, 'అందులో ఏముంది. నూన్‌గారు మొదటి భార్యను వెంబడించుకొని వస్తే, 'లేడీ ఫోర్-నూన్' అనండి, రెండో భార్య వెంట ఉంటే 'లేడీ నూన్' అనండి, మూడో భార్య వెంట ఉంటే 'లేడీ ఆఫ్టర్ నూన్‌అనండి' అని వారి సందేహాన్ని తీర్చేశాడు.

### సర్ మీర్జా పతనం :

ఈనూన్ ప్రభుత్వం మంత్రుల మధ్య తలెత్తిన ఫోర్టు పోలియోల విభజనను పరిష్కరించలేక 195: అక్టోబరు 7న రాజీనామా చేసింది. దానిపై గవర్నర్ జనరల్ ఇస్కిందర్ మీర్జా పాకిస్తాన్‌లో రాజ్యాంగాన్ని రద్దుచేసి, జనరల్ అయూబ్‌ఖాన్‌ను తనకు అండగా సైనిక పాలనాధికారిగా నియమించాడు. ద్వంద్వ పరిపాలన ఎప్పుడూ ఎక్కడా మంచి ఫలితం ఇవ్వలేదు. పాకిస్తాన్‌లో యీ ద్వంద్వ పరిపాలన 20 రోజులే కొనసాగింది. 1957 అక్టోబరు 20 వ తేదీన జనరల్ అయూబ్‌ఖాన్ తనకు తానే పాకిస్తాన్ అధ్యక్షుడయినట్లు ప్రకటించుకొని, దేశంలో అధ్యక్షతరహా పాలన ప్రవేశపెట్టాడు.

### అధికారంలో అయూబ్ :

ప్రెసిడెంటు అయూబ్‌ఖాన్ 1962 మార్చి 1 వ తేదీన పాకిస్తాన్‌లో 'బేసిక్ డెమోక్రసీ' అనే కొత్త రాజ్యాంగాన్ని అమలుకు తెచ్చాడు. ఈ వ్యవస్థలో దేశాధ్యక్షుడ్ని ప్రజలు నేరుగా ఎన్నుకోరు. మామూలు పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పాకిస్తాన్‌కు పనికిరాదనే ఉద్దేశంతో పరోక్ష ఎన్నికలద్వారా ప్రెసిడెంటును సర్వాధికారాలతో ఎన్నిక చేయించడం కోసం జనరల్ మహమ్మద్ అయూబ్‌ఖాన్ దేశంలో యీ విధమయిన పరిపాలనను ప్రవేశపెట్టాడు. పాకిస్తాన్‌ను వరుసగా పదేండ్లు పరిపాలించిన మొదటి వ్యక్తిగా ఆ దేశ చరిత్రలో అయూబ్‌ఖాన్ నిలిచి పోయాడు. 1965 లో భారతదేశంతో జరిగిన యుద్ధంలో పాకిస్తాన్ ఓడిపోయింది. తాష్కెండ్ ఒప్పందంపై శాస్త్రి-అయూబ్ సంతకాలు జరిగాయి.

ఇక్కడ జుల్ఫికర్ అలీ భుట్టో గురించి కొంత చెప్పాలి. ప్రాంతీయతత్త్వ ప్రేరిత పాకిస్తాన్ రాజకీయాలలో ఆజ్యం పోసిన వ్యక్తిగా భుట్టో పైకి వచ్చాడు.

ఇతని జన్మస్థానం సింధురాష్ట్రమే అయినా పంజాబ్‌లోనే ఇతని ప్రభావమెక్కువ. 1958 లో తన ముప్పయి ఏళ్ళ వయస్సులోనే అతనికి అయూబ్‌ఖాన్ మంత్రి వర్గంలో స్థానం లభించింది. 1963 లో పాకిస్తాన్ విదేశాంగ మంత్రి కావడంతో నెహ్రూతో సమానుడనే భావానికి అతడు వచ్చేశాడు. చిన్నతనంలోనే అధికార రుచి మరిగిన భుట్టో పాకిస్తాన్ రాజకీయాలను ఎంతో విషతుల్యం చేశాడు.

భారతదేశాన్ని తన పరమ శత్రువుగా భావించుకొని, ప్రపంచ వేదికపై మన దేశాన్ని పరమ అసభ్యకరమైన పదజాలంతో తూలనాడిన ఈ భుట్టో పాకిస్తాన్ భారతదేశంతో వెయ్యి సంవత్సరాల వరకు పోరాడ గలదని ప్రగల్భాలు పలి కాడు. తాష్కెంట్ ఒప్పందాన్ని విమర్శిస్తూ ప్రజలను తనపై రెచ్చగొట్టిస్తున్న భుట్టోను మంత్రివర్గం నుంచి తొలగించాడు అయూబ్. దీనితో భుట్టోకు మహర్దశ ప్రారంభమైంది. 1967 లో భుట్టో పాకిస్తాన్ పీపుల్సు పార్టీ (పి.పి.పి.) స్థాపించాడు ఎంతో కాలం తరువాత ప్రజాస్వామ్య పద్ధతిలో ఒక రాజకీయ పార్టీ అవతరి స్తుంటే ప్రజలు దీనికి స్వాగతించారు. కానీ భుట్టో పార్టీలో ఎన్నడూ ఎన్నికలు జరిపించలేదు.

సైనిక పరాజయంతో సైనిక పరిపాలన ఎక్కువ రోజులు కొనసాగదు. 1969 మార్చి 29 వ తేదీన జనరల్ అయూబ్‌ఖాన్ తన అధికారాన్ని జనరల్ యహ్యాఖాన్‌కు దత్తం చేసి గద్దె దిగిపోయాడు. 1971 లో యహ్యాఖాన్ పాకి స్తాన్‌లో ఎన్నికలు జరిపించాడు. ఈ ఎన్నికల్లో తూర్పు బెంగాల్ నాయకుడైన షేక్ ముజిబుర్ రహమాన్ అవామీలీగ్‌కు మెజారిటీ స్థానాలు లభించాయి. జనరల్ యహ్యాఖాన్ అతన్ని ప్రధానిగా చేయాలనుకుంటె భుట్టో అడ్డు తగిలాడు. భుట్టో చేసిన ఈ పొరపాటు నిర్ణయమే పాకిస్తాన్ విభజనకు దారితీసింది. బంగ్లాదేశ్ యుద్ధంలో పాకిస్తాన్ ఓడిపోవడంతో జనరల్ యహ్యాఖాన్ గద్దె దిగిపోయాడు. అప్పుడు 1971 డిశంబరు 21న విభజిత పాకిస్తాన్‌కు మొదటి ప్రధాని అయ్యాడు జులికర్ అలీ భుట్టో.

**భుట్టో ఉరితీత :**

1977 మార్చి 7వ తేదీన భుట్టో పాకిస్తాన్‌లో ఎన్నికలు జరిపించి తన పాకి స్తాన్ పీపుల్సు పార్టీ అధికారంలోకి వచ్చేటట్లు చేసుకున్నాడు. ఉత్తుంగ తరంగం వలె ఎగురుతున్న గుర్రాన్ని ఎక్కినప్పుడల్లా భుట్టో కిందికి పడిపోయే వాడు.

అతని యీ విధానమే పెక్కుమంది శత్రువులను దేశంలో సృష్టించింది. హీన మైన పద్ధతిలో బేరాలు, ప్రలోభాలు, బెదిరింపులు జరిగాయి. ప్రత్యర్థులు ఆరోప ణల అస్త్రాలు సంధించారు. 1977 జూలై 5వ తేదీన రక్తపాత రహితమయిన సైనిక తిరుగుబాటు జరిగి భుట్టో పదవీచ్యుతుడయినాడు. జనరల్ జియాఉల్‌హక్ పాకిస్తాన్‌లో అధికారంలోకి రావడంతో ఆ దేశంలో మూడవసారి సైనిక పరిపా లన అమలుకు వచ్చినట్లయినది. అధికారంలో ఉన్నప్పుడు ఒక హత్యాకేసులో ఇరుకున్న భుట్టోను ప్రపంచాభిప్రాయానికి వ్యతిరేకంగా జనరల్ జియా 1979 ఏప్రిల్ 4వ తేదీన ఉరి తీయించాడు.

జియా పాలన :

జనరల్ జియా పాలన పదకొండేళ్లు సాగింది. క్రమక్రమంగా రాజకీయా లలో రాటుతేలిన వ్యక్తి అయ్యాడు. భారత ఉపఖండంలో అమెరికన్ వ్యూహాలకు పట్టుగొమ్మగా నిలిచి తన అధికారాన్ని కాపాడుకుంటూ వచ్చాడు. ఆఫ్ఘన్ సంక్షోభంలో రష్యా బూచిని చూపించి ప్రత్యర్థులను దూరంగా ఉంచగలిగాడు.

అధికారంలోకి రాగానే ఎన్నికలు జరిపిస్తానన్న జియా 1984 వరకు నిరం కుశత్వాన్ని కొనసాగించాడు. 1984 డిశంబరులో ప్రజాభిప్రాయ సేకరణ తంతు జరిగింది. 1985 మార్చి నుంచి ఐదేళ్ళపాటు తనకు తాను దేశాధ్యక్షుడుగా ప్రక టించుకున్నాడు. 1985 లో అప్పటికి తొమ్మిదేళ్లుగా ఉన్న మార్షల్ లాను ఎత్తి వేసి కొత్త రాజ్యాంగాన్ని ప్రవేశపెట్టాడు. అనంతరం మహమ్మద్‌ఖాన్ జునేజును ప్రధానిగా నియమించాడు. కానీ 1988 మే 29న పాకిస్తాన్ అధ్యక్షుడు జనరల్ జియా జాతీయ అసెంబ్లీని రద్దుచేసి దేశ ప్రధాని జునేజును బర్తరఫ్ చేశాడు. 1985 మార్చిలో ఆవిర్భవించిన జాతీయ అసెంబ్లీ, దాని ఆశయాలను సాధించడ ములో విఫలమైందని ఆయన పేర్కొన్నాడు. జాతీయ అసెంబ్లీ రద్దయిన దృష్ట్యా జునేజుకు ప్రధాని పదవి సహజంగానే పోయినట్లు ప్రకటించాడు. ఇక్కడ ఒక విషయం స్పష్టమయింది. జునేజు పాక్ రాజకీయాల్లో సైనికుల పాత్ర తగ్గించడం కోసం, ఒకమేరకు జియా 'స్వేచ్ఛ'ను హరించడం కోసం ప్రయత్నించాడు. తానే ఎన్నిక చేయించిన ప్రధాని, ప్రభుత్వము తనకే ఎసరుపెట్టే ప్రమాదం ఉందని గుర్తించడం వల్లనే జియా యీ ఆకస్మిక చర్యకు పాల్పడ్డాడనడంలో సందేహం లేదు.

జియాఉల్‌హక్ చివరిరోజులలో ఆయనకు ఎన్నో ఎదురుదెబ్బలు తగిలాయి. మొదటిది దేశాన్ని, ప్రభుత్వాన్ని ఇస్లామీకరించడం కోసం ఆయన జారీచేసిన ఆర్డినెన్స్. ఈ ఆర్డినెన్స్ చాలా అస్పష్టంగా ఉంది. ఇస్లాం అంటే ఇష్టపడే వారిని ఆకర్షించడం మినహా దీనికి మరొక ఉద్దేశం ఉన్నట్లు లేదు. అమెరికా కూడా వద్దంటున్నా వినిపించుకోకుండా 'ఇస్లామిక్ బాంబు' అనే ఆటంబాంబుకు దీక్షగా కృషి చేశాడనే విమర్శ ఆయన మీద ఉంది.

జనరల్ జియా వివాదాస్పదమైన వ్యక్తి. పొరుగున ఉన్న ఆఫ్ఘనిస్తాన్‌లో రష్యా మద్దతుతో ఏర్పడిన ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు గెరిల్లాలకు జియా బాహాటమైన మద్దతు ఇస్తూ అంతర్జాతీయంగా వివాదాస్పదుడయ్యాడు. ఆఫ్ఘనిస్తాన్‌లో శాంతిస్థాపనకు, పోరాట విరమణకు అగ్రరాజ్యాల మధ్య అవగాహన కుదిరి, రష్యా తన సేనలు ఉపసంహరణ ప్రారంభించిన తరువాతకూడా అక్కడి పరిస్థితులకు సహకరించలేదనే విమర్శకు జియా గురయ్యాడు. బేనజీర్ భుట్టో నాయకత్వంలో సాగిన ప్రజా ఉద్యమం కూడా జియాను ఇరకాటంలో పెట్టింది. ఇన్ని విమర్శలు, వివాదాల మధ్య తొణకకుండా, కాఠిన్యం, కర్కశత్వం తరగకుండా పాకిస్తాన్‌కు ఎదురులేని నియంతగా పదకొండు సంవత్సరాలు పరిపాలించిన జనరల్ జియాఉల్‌హక్ 1988 ఆగష్టు 17 న స్వదేశంలో జరిగిన విమాన ప్రమాదంలో మరణించాడు.

ఇండియాను చీకాకు పెట్టడంలో జియా కృతకృత్యుడైన మాట నిజం. కానీ అంతకన్న మించి పాక్ ప్రజల బతుకు దుర్భరం చేశారు. జునేజు హయాంలోని పరిమిత ప్రజాస్వామ్యాన్ని కూడా సహించలేకపోయాడు. పంజాబీల పెత్తనానికి పట్టం కట్టడం కోసం పాకిస్తాన్‌లోని ఇతర జాతీయుల్ని కఠినంగా అణగదొక్కాడు. మహిళల్ని పశువులకన్న హీనంగా చూశాడు. ఇస్లామీకరణ పేరుతో మధ్య యుగాల నాటి చాదస్తాన్ని షిరియత్ చట్టాల పేరుతో ప్రజలపై రుద్దాడు. ఆయన హయాంలో దేశం ఆర్థికంగా పతనావస్థకు చేరుకుంది. దేశంలో రూపాయి కరువైంది. విదేశమారక ద్రవ్యం అపురూపమైంది. దేశం సగటు ఉత్పత్తి గత శతాబ్దంలో కేవలం 1.9 శాతం మాత్రమే పెరిగింది. కానీ రక్షణశాఖ ఖర్చు మాత్రం 26 శాతానికి ఆయన పెంచాడు. విదేశ రుణాలు 13.6 బిలియన్ డాలర్లకు చేరాయి.

తిరిగి ప్రజా ప్రభుత్వం :

1988 నవంబరులో పాకిస్తాన్ జాతీయ అసెంబ్లీకి, రాష్ట్రశాసన సభలకు ఎన్నికలు జరిగాయి. పాకిస్తాన్ పీపుల్సు పార్టీ అధినేత శ్రీమతి బేనజీర్ భుట్టో అధికారంలోకి వచ్చారు. పాకిస్తాన్‌లో ఎవరు అధికారంలోకి వచ్చినా భారత్‌తో కఠిన వైఖరి వహించడంలో ఒకరికన్నా ఒకరు మిన్నగా వ్యవహరిస్తున్నారు. కనుక బేనజీర్ భుట్టో హయాంలో కూడా భారత్-పాక్ సంబంధాలలో పెద్దమార్పు వస్తోందని ఆశించలేం.

* *

* *

# భారత పాకిస్తాన్ ఘర్షణలు

భారతదేశ విభజన పథకాన్ని 1947 జూన్ 3 వ తేదీన ఆమోదించారు. కానీ ముస్లింలీగ్ దీన్ని మనస్ఫూర్తిగా అంగీకరించలేదు, సమ్మతించింది అంతే. 1947 లో పాకిస్తాన్‌గా అవతరించిన ప్రాంతాన్ని, 1944 లోనే జిన్నాకు ఇవ్వ జూపారు. ఆనాడు ఆయన దాన్ని 'పురుగులు తినేసినట్లుగా ఉంద'ని నిరాకరించాడు. ఆ ప్రాంతాలతో పాకిస్తాన్ ఏర్పడితే అది గ్రామీణ మురికి పేటగా ఉంటుందని పేర్కొన్నాడు. 1947 వరకు ముస్లింలీగ్ ఎంత బేరమాడినా తనకు కావలసింది సాధించుకునే శక్తి లేకపోయింది. అప్పటి నుంచే తమ కెంతో అన్యాయం జరిగి పోయిందనే అభిప్రాయం పాకిస్తాన్ నాయకులకు ఏర్పడింది. కాలక్రమేణా ఆ అభిప్రాయం బలపడుతూ వచ్చింది. భారత భౌగోళిక విస్తీర్ణం పెరగకుండా చూడాలని, పాకిస్తాన్‌తో సరిసమానంగా ఉండేటట్లు చూడాలని, అందుకుగాను భారతీయ సంస్థానాలను భారతదేశం నుంచి వేరు చేయటానికి లీగ్ నాయకులు ప్రయత్నించారు. దేశ విభజన నాటి నిరాశా నిస్పృహలే యీ ప్రయత్నాలకు కారణం.

## కాశ్మీర్ ఒక్కటే సమస్య కాదు :

భౌగోళికంగా ఉనికి ఎలా ఉన్నప్పటికీ, మతపరమైన జనాభా వివరాలు ఎలా ఉన్నప్పటికీ భారత సంస్థానాలు పాకిస్తాన్‌లో చేరవచ్చు, లేదా స్వతంత్రంగా ఉండవచ్చు ననే సిద్ధాంతం లేవదీసి ఇందులో ఏది జరిగినా పాకిస్తాన్ వాటిని బల పరుస్తుందని జిన్నా సంస్థానాధీశులకు హామీ ఇచ్చాడు. కొత్త దేశం తరపున వ్యవహరిస్తూ 1947 జూన్ నెలాఖరున, నాటి తిరువాన్కూర్ దివాను సర్ సి. పి. రామస్వామి అయ్యర్‌తో ఆ రాష్ట్ర భవితవ్యాన్ని గురించి జిన్నా సంప్రదింపులు జరిపాడు. పాకిస్తాన్, తిరువాన్కూరులు పరస్పరం రాయబారులను పంపుకుంటా

యని ప్రకటించాయి. భారతదేశంలో చేరవద్దని జోధపూర్ సంస్థానాధీశునికి పాకిస్తాన్ తొలి గవర్నర్-జనరల్ ఎన్నో ఆశలు చూపాడు. హైదరాబాద్ సంస్థానం స్వతంత్రంగా ఉండేందుకు,పాకిస్తాన్‌తో సహకారాన్ని పెంపొందించుకునేందుకు ఆ సంస్థానికి ఆయన బాహాటంగా ఇచ్చిన ప్రోత్సాహం లోక విదితమే. ముస్లింలీగ్ ప్రముఖ నాయకుడు చౌధరీ ఖలీఖుజ్జమాను 1947 మే నెలలో భోపాల్ సందర్శించి భారత్‌కు వ్యతిరేకంగా అక్కడి ముస్లింలీగ్‌ను రెచ్చగొట్టి వచ్చాడు. ఇదంతా ఇపుడు ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే పాకిస్తాన్ ప్రచారాలు చేస్తున్నట్లుగా భారత - పాకిస్తాన్ మధ్య విభేదాలకు కాశ్మీర్ ఒక్కటే కారణం కాదు.

దేశ విభజన సమస్యల, విభేదాల మధ్య కాశ్మీర్ వంటి సమస్యలు ఉత్పన్నమై యీ ఇరు దేశాల మధ్య ఆ తరువాత కాలంలో సంఘర్షణలు, శత్రుత్వం, అసూయ హెచ్చాయి. ముస్లింలీగ్, కాంగ్రెస్ పార్టీలకు ప్రతిపత్తి సంబంధించి అనాదిగా ఉంటూ వచ్చిన ఘర్షణకు భారత వ్యతిరేకత మరింత దోహదం చేసింది. పాకిస్తాన్‌కు రెండు ముక్కలుగా ఉండవలసిరావడం, అవి వెయ్యిమైళ్ల దూరంలో భారత భూభాగం చేత వేరు చేయబడి ఉండడంతో ఆ రెండు భాగాలు మధ్య సమైక్యతను సాధించేందుకు భారత వ్యతిరేక భావాలను ప్రచారం చేయడం తప్ప పాకిస్తాన్ నాయకులకు గత్యంతరం లేకపోయింది. 1947 లో భారత, పాకిస్తాన్ దేశాలు ఏర్పడినపుడు రాజకీయాలలో మతం వహించదగు పాత్రవంటి కొన్ని విషయాలలో భేదాభిప్రాయాలు ఉన్నప్పటికీ, రాజకీయ ప్రజాస్వామ్యం, విదేశాంగ విధానం వంటి విషయాలలో ఏకాభిప్రాయం ఉంటూనే వచ్చింది. కాలక్రమేణ యీ ఏకాభిప్రాయం కూడా హరించుకుపోయింది. ఇప్పుడు ఉభయ దేశాలు పరస్పర విరుద్ధమైన దేశీయాంగ, విదేశాంగ విధానాలను అనుసరిస్తున్నాయి. అంతేకాదు, భారతదేశంపై కక్ష సాధించాలనే ఉద్దేశంతో పాకిస్తాన్ భారత వ్యతిరేకతను ప్రదర్శించే ఏ దేశంతోనైనా స్నేహ హస్తం చాచటానికి సిద్ధపడి ఉంది. ఈ విధంగా భారత వ్యతిరేకత పాకిస్తాన్‌కు కేంద్రమయింది. 12 కోట్ల జనాభా కలిగిన పాకిస్తాన్ తాను చిన్న దేశమనే భావనను పోగొట్టుకోలేక పోయింది. అంతర్జాతీయ రంగంలో తనకు సహజంగా రావలసిన స్థానాన్ని పొందడానికి ప్రయత్నించకుండా భారతదేశానికి వ్యతిరేకంగా సైనిక, రాజకీయ పొత్తులను కుదుర్చుకొనడానికి తహతహ లాడింది.

కాశ్మీర్ సమస్య :

కాశ్మీర్ సంస్థానంలో అత్యధిక శాతం ప్రజలు ముస్లింలే అయినప్పటికీ, మత రాజకీయాలకు వారు మొదటినుంచి దూరంగానే ఉంటు వచ్చారు. 1938 లో షేక్ అబ్దుల్లా నాయకత్వంలో ఏర్పడిన నేషనల్ కాన్ఫరెన్స్ దాని ఆవిర్భావం నాటి నుంచి మత, కుల, ప్రాంతీయ వివక్ష లేకుండా జమ్మూ-కాశ్మీర్ ప్రజల తరపున ఒకే వేదికమీద ప్రజాస్వామ్య హక్కులకోసం పోరాటం సాగించింది. రాచరిక వ్యవస్థకు వ్యతిరేకంగా కూడా జరిగిన యీ పోరాటంలో మహాత్మా గాంధీ, జవహర్‌లాల్ నెహ్రూ మొదలగు మహానాయకులు పాల్గొన్నారు. 1946 లో మహారాజా ప్రభుత్వం నెహ్రూని అరెస్టు చేసిందికూడా. ఈ ప్రజాపోరాటాలలో జిన్నా గాని మరే ఇతర ముస్లింలీగ్ నాయకులుగాని ప్రమేయం పెట్టుకోలేదు.

కాశ్మీర్‌లోని ముస్లింప్రజలను రాజకీయంగా వశపరచుకోవడంలో విఫలురైన పాకిస్తాన్ నాయకులు కాశ్మీర్‌ను బలప్రయోగంగా సంపాదించడానికి ప్రయత్నించారు. 1947లో పాకిస్తాన్ వేలకొలది పాకిస్తానీ సాయుధ దుండగులను అమాయకులైన, శాంతిప్రియులైన కాశ్మీర్ ప్రజల మీదికి ఉసిగొల్పింది. ఈ దుండగులు హత్యలు చేశారు. లూటీలు చేశారు. హిందూవులను, ముస్లింలను అందరినీ ఒకే విధంగా హింసించారు. ఈ దుండగుల బారినుండి తన రాష్ట్ర ప్రజలను కాపాడుకోడానికి కాశ్మీర్ మహారాజే తన రాష్ట్రాన్ని భారతదేశంలో విలీన పరిచాడు. ఈ చర్యకు షేక్ అబ్దుల్లా కూడా అంగీకరించాడు. చట్టరీత్యా యీ విలీనం తిరుగులేనిది, ఖరారైనది. భద్రతా సమితిలో షేక్ అబ్దుల్లా ప్రసంగిస్తూ, 'తుపాకి బెదురుచూపి, మా భూమిని పాకిస్తాన్‌కు దాస్య రాజ్యంగా మార్చాలనే నిర్దిష్ట లక్ష్యాలతో వేలాది పఠాన్ కొండజాతుల వారు యుద్ధంలో ప్రయోగించే ఆయుధాలతో సాయుధ దుండగుల వలెనేగాక, ఒక కేంద్ర ఆదేశాన్ని నిర్వర్తించే మహాశక్తిలాగ ఒక్కుమ్మడిగా మాపై విరుచుకపడ్డారు' అన్నారు. భారతదేశంలో కాశ్మీర్ విలీనం సంపూర్ణమైనదని 1952 ఏప్రిల్ 13వ తేదీన జమ్మూ-కాశ్మీర్ రాజ్యాంగ సభ (తరువాత శాసనసభ) లో షేక్ అబ్దుల్లా ప్రకటించారు. కాశ్మీర్ రాష్ట్రంలోని 30,200 చదరపు మైళ్ల భూమి అంటే జమ్మూ-కాశ్మీర్‌లోని మూడోవంతు భాగం పాకిస్తాన్ ఆక్రమణలో ఉండిపోయింది. అయితే ఈ భాగంలోని రెండువేల చద

రపు మైళ్ల భూమిని 1963లో పాకిస్తాన్ చైనాకు దత్తం చేసింది. కాశ్మీర్ రాజ్యాంగము రూపొందినప్పుడు పాకిస్తాన్ ఆక్రమిత కాశ్మీర్‌లో ఏనాటికైనా ప్రజ లెన్ను కొనే ప్రతినిధుల కోసం ప్రత్యేకంగా 25 స్థానాలు కేటాయించివుండే ఏర్పాటు ఒకటి జరిగింది.

ఈ విధంగా కాశ్మీర్ సంస్థానం రెండుగా విభజింపబడింది. 1947లో పాకిస్తాన్ దురాక్రమణ చేసిన ప్రాంతం 'అజాద్ కాశ్మీర్' పేరుతో పాకిస్తాన్‌లో అంతర్భాగమైపోయింది. భారత్‌లో విలీనమైన భాగం రాష్ట్రపతిప త్తితో భారత్‌లో అంతర్భాగమైపోయింది. ఈ రెండు భాగాలలో గత 40 సంవత్సరాలలో పెక్కు పరిణామాలు సంభవించాయి. అందులో ప్రధానమైనది భారత్ అంతర్భాగమైన కాశ్మీర్‌లో పలుమార్లు ఎన్నికలు జరిగాయి. ఫలితంగా శాసనసభ ఏర్పడింది. అది స్వతంత్ర రాజ్యాంగాన్ని రూపొందించుకొని భారత పార్లమెంటుకుకూడా తన ప్రతినిధులను పంపుతున్నది. ఈ విధంగా కాశ్మీర్ ప్రజల నిర్ణయాధికారం చట్టబద్ధంగా నిర్ణయమై, పాకిస్తాన్ కోరుతున్న విధంగా ప్లెబిసైట్ అవసరమైంది. కానీ పాక్ ఆక్రమిత కాశ్మీర్‌లో ఇంతవరకు ఏలాంటి ఎన్నికలు జరుగలేదు. దీనివల్ల అక్కడి ప్రజలకు స్వయం నిర్ణయాధికారం హక్కు అనేది కల్గలేదు. పాక్ నియంతృత్వం క్రింద ఆ ప్రాంతం అణగిపోయింది. అయినా వివాదం మాత్రం భారత్ ఆధీనంలో ఉన్న భూభాగం పూర్తిగా తనకు చెందాలవి పాకిస్తాన్ కోరుతుంది. అంతర్జాతీయ నిర్ణయ సరిహద్దును మాటిమాటికి ఉల్లంఘిస్తూనే ఉంది.

## రాణ్ ఆఫ్ కచ్ వివాదం :

దేశ విభజన సమయంలో పాకిస్తాన్ తన దేశపు పశ్చిమ సరిహద్దుల్లోని అంటే భారత భూభాగమైన గుజరాత్‌లోని రాణ్ ఆఫ్ కచ్ విభాగంలో 3500 చదరపు మైళ్ల భూభాగం తనదని వాదిస్తూ వచ్చింది. ప్రభుత్వ రాయబారాల ద్వారా సంభాషణలు విఫలం కాగానే 1965 లో ఈవివాదం తీవ్రమై ఏప్రిల్ నెలలో యీ రెండు దేశాలమధ్య అది ఘర్షణకు దారితీసింది. బ్రిటిష్ ప్రధాని హెరాల్డ్ విల్సన్ మధ్యవర్తిత్వం వహించారు. జూన్‌లో ఇరుదేశాలు ఒక అంగీకారానికి వచ్చాయి. తక్షణమే ఇరు పక్షాలు యుద్ధ విరమణ చేయాలని, ఈ విషయమై తిరిగి చర్చలు ప్రారంభించుకోవాలనీ, చర్చలు విఫలమైతే మధ్యవర్తులద్వారా (ఆర్బిట్రేషన్) యీ వివాదం పరిష్కరించుకోవచ్చునని ఒడంబడిక కుదిరింది.

పాకిస్తాన్‌కు గట్టి చెంపదెబ్బ :

కచ్ ఒప్పందంపై సంతకాలు జరిగిన సిరా తడి ఆరకముందే పాకిస్తాన్ కాశ్మీర్‌పై పెద్ద ఎత్తున దాడికి దిగింది. పూర్వంలాగానే ఈసారి కూడా పాకిస్తాన్ చొరబాటుదారులను పంపింది. ఈ చొరబాటుదారులు రహస్య మార్గాలలో, దొంకదారుల వెంట కనుమల గుండా ప్రవేశించి బందిపోటులు చేయడం, పోలీసు స్టేషనులపై దాడి చేయడం, గ్రామాలపై వచ్చిపడడం ప్రారంభించారు. కానీ కాశ్మీర్ ప్రజలు యీ చొరబాటుదారులకు ఆశ్రయ మివ్వలేదు. కాశ్మీర్ ఇండియాలో అంతర్భాగమనీ, పాకిస్తాన్‌తో మాకు పొత్తు అక్కరలేదని స్పష్టంగా చెప్పారు. దీనితో కాశ్మీర్ ప్రజలు తనతో చేతులు కలిపి విప్లవానికి సిద్ధమవుతారని పాక్ ఆశ నిరాశ అయింది.

విప్లవం విఫలం కాగానే పాకిస్తాన్ జమ్మూరంగంలో అసలు యుద్ధమే ప్రారంభించింది. 100 భారీ ట్యాంకులతోను, నవీన ఆయుధాలతోను, యుద్ధ పరికరాలతోను యుద్ధ రంగంలో దిగింది. అమెరికా ఇచ్చిన పాటన్‌ట్యాంకులు కచ్ రంగంలో ముందు ప్రయోగాయి. ఇది భారత సేనకు అనుకూల క్షేత్రం కాదు. రవాణామార్గాలు దానికి అందుబాటులో లేవు. అందువల్ల భారత సేనలు ఇక్కడ వెనక్కు తగ్గవలసి వచ్చాయి. భారత ప్రభుత్వం యుద్ధ రంగంలోకి విమానాలను దింపింది. ఇవి 45 నిమిషాలలో 28 సార్లు పాకిస్తాన్ ట్యాంకులపై దాడిచేశాయి. 13 ట్యాంకులను పనికిరాకుండా చేశాయి. పాకిస్తాన్‌కు అమెరికా ఇచ్చిన శాబర్ జెట్‌లను మన నాటువిమానాలు కూల్చివేశాయి.

నానాటికి యుద్ధం తీవ్రమయింది. అఖ్నూర్‌ని పట్టుకుంటేనే గాని పాకిస్తాన్‌కు గత్యంతరం లేదు. అది భారత్‌కు ప్రాణం వంటిది. రవాణామార్గాలకు అది కూడలి. దాన్ని కనుక పట్టుకుంటే పాకిస్తాన్ సియాల్‌కోట నుంచి సూటిగా జమ్మూమీద పడవచ్చు. పాకిస్తాన్ సైన్యం చాంబ్‌లోని యుద్ధ విరమణ రేఖను దాటి, దాని శాబర్‌జెట్ విమానాలు అమృత్‌సర్‌మీద దాడిచేసి అక్కడవున్న మన సైనిక నిర్మాణాల మీద దెబ్బ తీశాయి. దానితో ప్రెసిడెంటు అయూబ్‌ఖాన్ ఇండియాపై విజయం సాధించి అవలీలగా ఢిల్లీని గెలవగలనని కలలు గన్నాడు. పాకిస్తాన్ అధ్యక్షుడు అవలీలగా ఢిల్లీని పట్టుకోదలచితే మనం కూడా లాహోర్ వరకు వెళ్లదలచామంటు ప్రధాని శాస్త్రి సమాధానమిచ్చారు.

పాకిస్తాన్ భారతదేశంపై బలవంతాన తెచ్చిపెట్టిన ఈ అప్రకటిత యుద్ధం కొన్ని అద్భుత ఫలితాల నిచ్చింది. చరిత్రలో మరే యుద్ధంలోను భారీ శకటాలు ఇంత త్వరగా విధ్వంసం కాలేదు. రణరంగంలో విజయలక్ష్మి కేవలం సైనికుల శక్తి సామర్ధ్యాల మీదనే పూర్తిగా ఆధారపడుతుందని విస్పష్టంగా రుజువు గావటం జరుగలేదు. పశ్చిమ పాకిస్తాన్ రంగంలో 22 రోజులు జరిగిన యీ పోరాటంలో భారత సైనికులు వీరోచితంగా పోరాడారు. సామాన్యమైన ఆయుధాలతోనే పాకిస్తాన్ సైనిక దళాలను సలగ కొట్టేశారు. అమెరికా ఇచ్చిన ఆధునిక యుద్ధ పరికరాలు పాకిస్తాన్‌కు ఈ యుద్ధంలో ఎందుకు పనికిరాకుండా పోయాయి.

మన సైన్యం కాశ్మీర్ రంగంలో యుద్ధ విరమణ శ్రేణిలో ఉన్న అతి కీలకమైన హాజీపీర్ కనుమలను పట్టుకుంది. పాకిస్తాన్ ఎదురు దాడికి వ్యూహం పన్నుతున్న సమయంలో యుద్ధ విరమణ జరిగి తీరవలసిందేనని ఇరు దేశాలకు ఐక్యరాజ్య సమితి విజ్ఞప్తి చేసింది. శాంతిసాధనకై యునైటెడ్ నేషన్స్ ప్రధాన కార్యదర్శి ఉథాండ్ ఢిల్లీ, రావల్పిండిలను సందర్శించారు.

యుద్ధ విరమణకు ఒప్పుకుంటూనే అయూబ్‌ఖాను మళ్లీ పాతపాటే మొదలు పెట్టాడు. యుద్ధం విరమించగానే కాశ్మీర్ నుంచి భారత సేనలు వైదొలగాలి. అక్కడ విదేశ సేనలు వచ్చి శాంతి కాపాడాలి. 1949 జనవరి 5 వ తేదీ నాటి సమితి తీర్మానం తిరిగితోడి, అందుకు అనుగుణంగా మూడు నెలలలోగా కాశ్మీర్‌లో జనవాక్య సేకరణ జరగాలి. ఈసారి కూడా పాకిస్తాన్ చేసిన ప్రతిపాదనలు భారత సార్వభౌమాధికారానికి, ప్రాదేశిక సమగ్రతకు భంగం కలిగించేవిగానే ఉన్నాయి. మన వాదం ప్రపంచానికి తెలిసిందే. జమ్మూ-కాశ్మీర్ భారతదేశంలో అంతర్భాగం బలప్రయోగం ద్వారా ఈ పరిస్థితిని తారుమారు చెయ్యడానికి భారత దేశం సహించదు. పాకిస్తాన్ ఈ నిజాన్ని గుర్తించడం ఒక్కటే ఈ సమస్యకు సరైన పరిష్కార మార్గం.

భారత ఉపఖండంలో శాంతి పరిరక్షణ అత్యంత ఆవశ్యకమని సోవియెట్ ప్రధాని కొసిగిన్ గుర్తించి తాష్కెంట్‌లో ప్రెసిడెంటు అయూబ్, ప్రధాని శాస్త్రిల సమావేశం జరిపారు. తమ సాయుధ దళాలను 1965 ఆగష్టు 5 వ నాటి స్థానాలకు ఉపసంహరించాలని ఆదేశిస్తూ భద్రతా సమితి చేసిన తీర్మానాన్ని ఇరు దేశాల నాయకులు అంగీకరించారు. కాశ్మీర్ సమస్య పరిష్కారానికి అయూబ్ మొండికేసి

కూర్చున్న ఎత్తు ఫలించలేదు. కాశ్మీర్ సమస్యను తిరిగితోడే అవకాశమే లేదని, అలాంటి హామీ పొందిన తరువాతనే హాజీపీర్ కనుమల నుండి భారతసేన ఉప సంహరణకు ప్రధాని శాస్త్రి ఒప్పుకున్నారు. పాకిస్తాన్ దురాక్రమణను ఉక్కు హస్తంతో ఎదుర్కొని, భారత విజయ పతాకను గగనతలానికి గర్వంగా ఎగుర వేసిన భారత ప్రధాని లాల్‌బహదూర్‌శాస్త్రి తాష్కెంట్ ఒప్పందంపై సంతకం చేసి, అర్ధరాత్రి వేళ హఠాన్మరణం చెందారు. ఆ 'వామనమూర్తి' మరణం భారత ప్రజానీకానికి తీవ్ర దుఃఖం కలిగించింది.

యుద్ధ ఫలితాలు :

22 రోజులు సాగిన ఈ భీషణ సమరంలో భారతసేనలు పాకిస్తాన్‌లోని మూడు రంగాలలో బాగా చొచ్చుకొని పోయాయి. మన సాయుధ దళాలు కాశ్మీర్ లోని యుద్ధ విరమణ శ్రేణిని దాటడమేకాదు, పాక్ ఆక్రమిత కాశ్మీర్‌లోని కీలక మైన, అత్యంత ప్రధానమైన పాక్ స్థావరాలను ఎన్నింటినో కైవసం చేసుకున్నది.

సియాల్ కోట రంగంలో 15, 19 మైళ్ళు, లాహోర్ రంగంలో సుమారు 8 మైళ్ళు మన సైన్యం పాక్ భూభాగంలోనికి చొచ్చుకుపోయింది. రాజస్తాన్ రంగంలో మన సేనలు పశ్చిమ పాకిస్తాన్‌లోని సింధ్‌లో ప్రవేశించి అక్కడ దాదాపు 30 మైళ్ళు పురోగమించాయి. అయితే ఛాంబ్ జవురియన్ రంగంలో మాత్రమే పాకిస్తాన్ సాయుధ దళాలు భారత భూభాగంలోనికి చొచ్చుకుపోయి అంతర్జాతీయ సరిహద్దు దాటి పదిమైళ్ళు ఆక్రమించాయి.

ఈ ఇండో-పాక్ యుద్ధంలో మరణించిన, భారత సేనలకు పట్టుబడిన పాకిస్తానీ సైనికుల సంఖ్య 4089 మంది. అందులో మరణించిన వారి సంఖ్య 3340 మంది. వీరిలో 22 మంది ఆఫీసర్లు. పట్టుబడిన సంఖ్య 449 మంది. వీరిలో 12 మంది ఆఫీసర్లు. భారత సైనికులలో మరణించిన వారి సంఖ్య 1157 మంది. వీరిలో 75 మంది ఆఫీసర్లు.

దగ్ధ చేసిన, పట్టుకున్న పాకిస్తానీ, టాంకుల సంఖ్య 464. అందులో 245 పటాన్ టాంకులు, 48 షెర్మన్ టాంకులు, 166 చెఫీస్ టాంకులు సియాల్ కోట రంగంలో మరో అదనంగా 7 టాంకులను పట్టుకున్నారు. 70 పాకిస్తానీ విమానా లను కూల్చివేయగా భారత్ 35 విమానాలను కోల్పోయింది. ఏ విధంగా చూసినా యీ యుద్ధంలో భారత్ కన్నా పాకిస్తాన్ నష్టమే అపారం.

పాకిస్తాన్ మన సైన్యంతో పోరాడలేక మన జనపదాలపై బాంబులు కురిపించి విశేషంగా పౌరనష్టం, ఆస్తి నష్టం కలిగించింది. సెప్టెంబర్ 22 మధ్యాహ్నం పాకిస్తాన్ అధ్యక్షుడు కాల్పుల విరమణ అంగీకరించాక పాకిస్తాన్ విమానాలు వేసిన వెయ్యి పౌనులు బాంబులకు అమృత్‌సర్‌లో అధిక జన సామర్థ్యం గల ప్రాంతంలో 62 మంది చనిపోయారు. దాదాపు అంతకు రెట్టింపు సంఖ్యలో గాయపడ్డారు. సెప్టెంబర్ 20 వ తేదీన గుజరాత్ రాష్ట్ర ముఖ్యమంత్రి బల్వంతరాయ్ మెహతా, ఆయన సతీమణి ప్రయాణం చేస్తున్న విమానాన్ని పాకిస్తాన్ విమానాలు కూల్చివేశాయి. ముఖ్యమంత్రి, ఆయన సతీమణితో పాటు మరో ఐదుగురు మరణించారు.

భారత సేనలను ఇంత క్రమశిక్షణతో, నేర్పుతో, అన్నిటినీ మించిన ధైర్య సాహసాలతో నడిపిన త్రిమూర్తులు-

సర్వసేనాని - జనరల్ జయంత్‌నాథ్ చౌదరీ.

వైమానిక దళాధిపతి - ఎయిర్ మార్షల్ అర్జున్‌సింగ్.

నౌకా దళాధిపతి - అడ్మిరల్ భాస్కర్ సదాశివ్ సోమన్.

అందరిలో తలమానిక మైన మహామనీషి భారత ప్రధాని లాల్ బహదుర్ శాస్త్రి.

## బంగ్లాదేశ్ పరిణామాలు :

తూర్పు పాకిస్తాన్ ప్రజల ప్రజాస్వామ్య హక్కులను కాలరాచి, పాకిస్తాన్ మిలిటరీ ప్రభుత్వం స్వతంత్ర బంగ్లాదేశ్ పోరాటానికి కారణమైంది. ఈ ఉద్యమంలో 30 లక్షల మందిని పాకిస్తాన్ సైన్యం చంపివేసింది. శక్తివంతమైన మారణాయుధాలు కలిగిన పాక్ సైన్యం బంగ్లాలో సామాన్య పౌరులను చిత్రహింసలకు గురిచేసింది. వారి ఆస్తులను విధ్వంసం చేసింది. మేధావులను వెతికి వెతికి పరిమార్చింది. స్త్రీలను మానభంగం చేసింది. భారతదేశంతో సహా ప్రపంచ దేశాలు చేసిన విజ్ఞప్తులను, హెచ్చరికలను పాక్ పాలకులు ఖాతరు చేయలేదు.

ఆస్తులను, ఆప్తులను సమస్తాన్ని పోగొట్టుకున్న బంగ్లా ప్రజలు ప్రాణాలు కాపాడుకునేందుకు మూడు వైపులగల సరిహద్దులను దాటి భారత భూభాగంలోకి వచ్చిపడ్డారు. అలా వచ్చిన శరణార్థుల సంఖ్య రెండు కోట్లకు చేరింది. మానవతా దృక్పథంతో భారత్ వారికి ఆశ్రయమిచ్చింది. ప్రపంచ చరిత్రలో మునుపెన్నడూ

జరిగి వుండని ఈ శరణార్థుల ఉదంతంలో భారత దేశం అలవిమీరిన ఆర్థిక భారాన్ని మోస్తూ, సమస్య పరిష్కారానికి ప్రపంచ దేశాలకు చేసిన పలు విన్నపాలు నిష్ఫలం అయినాయి. శరణార్థులను శాశ్వతంగా భారత దేశంలో వుండిపోయే పరిస్థితుల నెదుర్కొకలిగిన స్తోమత భారత్‌కు లేదు. శరణార్థుల పోషణ, ఆశ్రయం, రక్షణ కొరకు కేంద్రప్రభుత్వం వినియోగించిన ప్రత్యేక సిబ్బందితోపాటు, పశ్చిమ బెంగాల్, అస్సామ్, మేఘాలయ, త్రిపుర రాష్ట్రాలలోని ప్రభుత్వ సివిల్ సర్వీస్ ఉద్యోగులందరూ నియుక్తులు కావడంతో ఆయా రాష్ట్రాలలో అభివృద్ధి కార్యక్రమాలు స్తంభించి పోయాయి. జీవన సౌకర్యాలు లేని ప్రాంతాలలో ఆశ్రయం పొందిన శరణార్థుల శిబిరాలలో భయంకరమైన అంటువ్యాధులు ప్రబలి వేలాదిమంది శరణార్థులు మరణించారు. రోజువారీ తాత్కాలిక ఖర్చుకాక, భారత ప్రభుత్వం తన వార్షిక బడ్జెటులో 60 కోట్ల రూపాయలను కేటాయించింది.

బంగ్లాదేశ్‌లో ప్రజాపోరాట ప్రభంజనాన్ని అణచలేని పాకిస్తాన్ హఠాత్తుగా 1971 డిశంబర్ 3వ తేదీన భారత గగనతలాన్ని అతిక్రమించి భారత పట్టణాలు, జనవాసాలపై విమానదాడుల్ని ప్రారంభించింది. మరుసటిరోజు భారత దేశంపై అధికారికంగా యుద్ధాన్ని ప్రకటించింది.

1971 డిశంబర్ 6 వ తేదీన భారత ప్రభుత్వం బంగ్లాదేశ్ రిపబ్లిక్‌ను గుర్తించింది. ఆ దేశం పిలుపు మేరకు బంగ్లా విముక్తికి తన సైనికదళాలను భారత ప్రభుత్వం రంగంలోకి దించింది. పది రోజుల గడువులో జెస్సోర్, దౌలత్‌పూర్, చాంద్‌పూర్, తంగెయిల్, ఖుల్నా పట్టణాలను విముక్తం చేసి రాజధాని ఢక్కా నగరాన్ని చక్రబంధంలో భారత సైన్యాలు దిగ్బంధించాయి. చివరకు పాక్ సైన్యం భారత సైన్యానికి లొంగిపోక తప్పలేదు. దీనితో బంగ్లాదేశ్ విముక్తి పూర్తయింది. అనంతరం సిమ్లాలో జరిగిన భారత-పాకిస్తాన్ ప్రధాన మంత్రుల శిఖరాగ్ర సమావేశంలో ఇరుదేశాలమధ్య విభేదాలను సామరస్య పూర్వకంగా పరస్పర చర్చలతో పరిష్కరించుకోవాలని అంగీకారం కుదిరింది.

బంగ్లాదేశ్ విముక్తి సమరంలో భారతదేశం నిర్వహించిన పాత్రపట్ల పాకిస్తాన్‌కు ఇప్పటికి ఆగ్రహం ఉంది. ప్రతీకార చర్యగా ఖలిస్తాన్ ఉద్యమం పట్ల పాకిస్తాన్ సానుభూతి ప్రదర్శిస్తున్నది. ఖలిస్తాన్ ఉద్యమ నాయకులతో జనరల్ జియా సంబంధాలుకూడా పెట్టుకున్నాడు. భ్రింద్రేన్‌వాలా అనుచరులకోసం

కొంత డబ్బు, కొన్ని ఆయుధాలు పాకిస్తాన్‌నుంచి పంజాబుకు చేరాయి. ఆయుధాలను ఉపయోగించడంలో సిక్కులకు శిక్షణ ఇవ్వడానికి లాయల్పూర్, ముల్తాన్, సియాల్‌కోట్ పట్టణాలలో శిబిరాలు ఉన్నాయి.

**సియాచిన్ సమస్య :**

సియాచిన్ హిమఖండం ఇండియా. పాకిస్తాన్ సరిహద్దుల్లో ఉన్న ఉత్తర కాశ్మీర్ ప్రాంతంలో ఉంది. కారాకోరమ్ శ్రేణిలో ఇరవై వేల అడుగుల ఎత్తున గల ఈ హిమసందం సుమారు డెబ్బయి అయిదు కిలోమీటర్లు. అక్కడ పిచ్చి మొక్క కూడా మొలవదు. ఇక్కడ ఉష్ణోగ్రత శీతాకాలంలో మైనస్ 50 డిగ్రీల సెల్సియస్‌కు పడిపోతుంది. అప్పుడు చాలామంది మరణిస్తుంటారు.

సియాచిన్ ప్రాంతం తనదే నంటుంది పాకిస్తాన్. జమ్మూ-కాశ్మీర్ భారతదేశంలో విలీనమైంది కనుక సియాచిన్ భారతదేశ అంతర్భాగం. సియాచిన్ విషయంలో పాకిస్తాన్‌కు ఖచ్చితమైన అభిప్రాయం లేదు. ఇది పాకిస్తాన్ అంతర్భాగమన్నారు కొందరు పాకిస్తాన్ నాయకులు. సియాచిన్ ఏ దేశ భూభాగం కాదని నిర్వాసిత మండలమని పేర్కొన్నారు కొందరు. ఇది సిమ్లా ఒప్పందం పరిధిలోకి రాదని మరికొందరి అభిప్రాయం. సియాచిన్ గ్లేషియర్ భారత్ ఆధీనంలో ఉన్నట్లయితే కారంకోరం హైవేకు రక్షణ ఉండదని పాకిస్తాన్ వాదన. అతి ఎత్తయిన ఈగ్లేషియర్ పాకిస్తాన్ ఆధీనంలో ఉండే లడఖ్ ప్రాంతానికి, తద్వారా మొత్తం జమ్మూ-కాశ్మీర్‌కు రక్షణ ఉండదని భారతదేశం భావిస్తున్నది.

సియాచిన్‌కు 1972 వరకు ఎటువంటి ప్రాధాన్యత లేదు. అందువల్లనే సిమ్లా ఒప్పందంలో రెండు దేశాల వాయువ్య సరిహద్దులను స్పష్టంగా పేర్కొన్నప్పటికీ సియాచిన్ గురించి ప్రస్తావన రాలేదు. ఈ ఒప్పందంలో ఎన్. జె. 9842 బిందువు వరకు ఒక రేఖను నిర్దేశించారు. ఈ రేఖకు వందలాది కిలోమీటర్ల దూరంలో సియాచిన్ ఉంది. మంచు నిండి ఉండే ప్రాంతమిది. వాస్తవాధీన రేఖకు ఉత్తరాన ఉన్న సియాచిన్ కోసం 1947-48 లో గాని, అటు తర్వాత గాని ఘర్షణలు జరుగలేదు. కనుక అక్కడ సరిహద్దులు గీయవలసిన అవసరం ఏర్పడలేదు. మనుషులు ఆవాసంలేని మరుభూమి సియాచిన్. పాకిస్తాన్ ఆక్సాయ్‌చిన్ ప్రాంతాన్ని చైనాకు దత్తం చేయగానే హఠాత్తుగా ఇది కీలక ప్రాంతంగా సంతరించుకుంది.

1965 యుద్ధానికి ముందు సియాచిన్ భారత భూభాగంగానే ఉంది. అయినా సియాచిన్ తనదని పాకిస్తాన్ వాదన. 1978 లో సియాచిన్ సమీంపలో పాకిస్తాన్ అయిదు సరిహద్దు తనఖీ స్థావరాలను ఏర్పాటు చేసింది. 1971 యుద్ధం తరువాత రెండు దేశాలు అంగీకరించిన వాస్తవాధ్యారేఖను పాకిస్తాన్ ఏకపక్షంగా 1983 ఆగష్టు 21 న విస్తరించిందని ఆరు సంవత్సరాల అనంతరం భారతదేశం గుర్తించింది. అప్పుడు పాక్ సైనికులు సియాచిన్‌లో అడుగు పెట్టకుండా నిరోధించడానికి భారత్ సైనికులు చర్య తీసుకున్నారు. కారకోరమ్ కనుమవరకు వాస్తవాధీన రేఖను విస్తరించి పాకిస్తాన్ వాయవ్య భాగంలోని 4 వేల చదరపు మీటర్ల ప్రాంతం మీద కన్ను వేసింది. దీన్ని భారత్ ప్రతిఘటించక తప్పలేదు. తత్ఫలితంగా ఎన్నో ఘర్షణలు జరిగాయి. ఇరుదేశాల సైనికులు అనేక మంది మరణించారు. సముద్ర మట్టానికి కొన్ని వేల అడుగుల ఎత్తున ఆడపాదడపా ప్రమాదకరంగా జరుగుతున్న ఈ యుద్ధం ప్రపంచంలోనే అత్యంత ఖరీదైన యుద్ధమని చెబుతున్నారు. ఈ ప్రాంత పరిరక్షణలో భారత్ ఏటా 30 కోట్లు నష్టపోతున్నది. పాకిస్తాన్ నష్టం ఇంతకు ఎక్కువగానే ఉంది. పాకిస్తాన్‌లో ప్రజాస్వామ్య ప్రభుత్వం ఏర్పడిన తరువాత ఈ సమస్య పరిష్కారం సులువైనది. 1972 సిమ్లా ఒప్పందం ప్రాతిపదికగా సియాచిన్ వివాదాన్ని శాంతియుతంగా పరిష్కరించుకోవడానికి 1989 జూన్‌లో నిరంతర చర్చల తరువాత ఇరుదేశాలు అంగీకరించాయి. ఇది ఉభయదేశాల ప్రజలకు, సైనికులకు దౌత్య వర్గాలకు ఎంతో సంతోషం కలిగించింది. భారత్-పాకిస్తాన్ స్నేహ పర్వానికి దీనితో నూతన అధ్యాయం మొదలవుతుందని అందరు ఆశించారు.

సిమ్లా ఒప్పందమే మార్గదర్శకం :

1978 జూన్‌లో శ్రీమతి ఇందిరాగాంధీ, శ్రీ భుట్టో మధ్య సిమ్లాలో జరిగిన శిఖరాగ్ర సమావేశంలో ద్వైపాక్షిక సంప్రదింపుల ద్వారా శాంతిని నెలకొల్పుకోవాలన్న ఒప్పందం కుదిరింది. సిమ్లా ఒప్పందం ప్రకారం ఉభయులు అంగీకరించి చేసుకున్న ఏర్పాట్లకు దాదాపు ఇరవై సంవత్సరాల పాటు యుద్ధోన్మాదులు తిలోదకాలిచ్చారు. సిమ్లా ఒప్పందం ప్రాతిపదికగా శాంతి సామరస్యాలను పెంపొందించడానికి బదులు దీనికి ఎవరు భంగం కలిగించినా అది మూర్ఖత్వానికి అవిత్జ్ఞతకు పరాకాష్ట అని చెప్పక తప్పదు. ఒకటి మాత్రం స్పష్టం. నిర్మాణాత్మక వాతావరణంలో ఎప్పుడు చర్చలు జరిపినా నూతన మార్గంలో అడుగుపెట్టాలి. కాశ్మీర్‌పై ప్లెబిసైట్ ఆలోచనకు శాశ్వతంగా స్వస్తి చెప్పాలి.

# ప్రమాదస్థాయికి చేరుకున్న జనాభా

భారతదేశానికి స్వాతంత్ర్యం లభించినప్పుడు దాని జనాభా 36 కోట్లు మాత్రమే. జనగణాంకాల ప్రకారం మనం రెండు భారతదేశాలను అధిగమించి, మూడో భారతదేశాన్ని అతిత్వరలో సృష్టించబోతున్నాం. ప్రపంచ భూభాగంలో మన దేశం 2.4 శాతం మాత్రమే. కానీ మన దేశ జనాభా ప్రపంచ జనాభాలో 15 శాతం. 1989 మార్చి 1వ తేదీనాటికి మన దేశ జనాభా 79 కోట్ల 20 లక్షలు. జనాభా పెరుగుదల రేటు 1.7 శాతం ఉండగలదని వేసిన అంచనాలు తల్లక్రిందులై 2.13 శాతానికి అది పెరిగిపోయింది. మన దేశంలో నిమిషానికి 50 మంది పుట్టుతున్నారు. ఇండియా ప్రతి ఏట ఒక ఆస్ట్రేలియా ఖండ జనాభాని జన్మిస్తోంది. మన దేశంలోనేకాదు, మొత్తం భూమండలలోనే జనాభా వొత్తిడివల్ల విపరీతమైన పరిణామాలు ఏర్పడుతున్నాయి. విలాస జీవిత పర్యవసానమా అన్నట్లు భూమికి రక్షణ కవచంగా పనిచేసే ఓజోన్ పొర సన్నబడటం, కాలుష్యాల ప్రభావం మూలంగా వాతావరణం వేడెక్కడం, వ్యర్థపదార్థాలు పెచ్చరిల్లి జల వనరులు విషతుల్యం కావడం, సహజ వనరులు, ఇంధన నిల్వలు, భూసారం, అటవీ సంపద తరిగిపోవడం, పలు జీవరాసులు నశించి పోవడం జరుగుతున్నది. ఇవి నిజంగానే ఆక్షేపించడానికి వీలులేని ప్రమాద సంకేతాలు.

## పెరుగుదలకు కారణాలు :

ప్రస్తుత పెరుగుదల రేటు ఇలాగే కొనసాగితే భారతదేశం జనాభా 2001 నాటికి 102 కోట్ల 20 లక్షలకు చేరుతుంది. 2050 నాటికి ఇది చైనా జనాభాను దాటిపోతుందని అంచనా. ఇదేమి గర్వించదగ్గ అంశంకాదు. ఆత్మ విమర్శ చేసుకోవలసిన అంశం. ఆరవ పంచవర్ష ప్రణాళిక కాలంలో మన దేశ ఆర్థికాభివృద్ధి 5.2 శాతం పెరుగుతుందనుకున్నారు. కానీ ఈ కాలంలో జనాభా 8 కోట్లకు పెరిగి

నందున ఈ అభివృద్ధి 3.2 శాతం దగ్గర నిలబడవలసి వచ్చింది. మన దేశం జనాభా ఇంత ఉండాలి అని తేల్చి చెప్పేముందు మన వనరుల విలువ చెప్పగలిగి ఉండాలి. మన ప్రభుత్వం దేశజనాభా 90-100 కోట్లలోపు ఉండాలని ఉద్దేశిస్తుంది.

జనాభారేటుని అన్నిటికంటె ఎక్కువ స్త్రీల అక్షరాస్యత, వివాహ వయస్సు ప్రభావితం చేస్తాయి. అక్షరాస్యులైన స్త్రీల సంఖ్య తక్కువగానే ఉన్న కారణం గానే బీహార్, మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్, రాజస్థాన్ రాష్ట్రాలలో మన కుటుంబ నియంత్రణ కార్యక్రమాలు ఆశించిన ఫలితాలు ఇవ్వలేకపోతున్నాయి. 1981 గణాంక వివరాల ప్రకారం గ్రామీణ స్త్రీలలో 18 శాతమే అక్షరాస్యులు. అయితే రాజస్థాన్‌లో అక్షరాస్యులైన స్త్రీల సంఖ్య 5.5 శాతం. మధ్యప్రదేశ్‌లో 9 శాతం, ఉత్తరప్రదేశ్, బీహార్‌లలో 10 శాతం మాత్రమే గ్రామీణ స్త్రీలు అక్షరాస్యులు. పోతే కుటుంబ నియంత్రణ కార్యక్రమాలు కొంతవరకైనా విజయవంతమైన కేరళలో 64.4 శాతం, పంజాబ్‌లో 2[illegible].6 శాతం, తమిళనాడులో 25.8 శాతం గ్రామీణ స్త్రీలు అక్షరాస్యులు.

కుటుంబ నియంత్రణ :

ప్రభుత్వపరంగా మొట్టమొదటి కుటుంబ నియంత్రణ కేంద్రం 1930 లో బెంగుళూరులో స్థాపించారు. ఇది మన దేశంలోనే కాక, ప్రపంచంలోనే జనాభాని అదుపులోకి తేవడానికి ప్రభుత్వపరంగా చేసిన తొలి యత్నం. మన దేశంలో గృహవసతి, ఉపాధి, ఇతర జీవనావసరాల లేమిని దృష్టిలో పెట్టుకొని ప్రభుత్వం ఈ చర్య తీసుకుంది. ఆరవ ప్రణాళికాంతానికి (1980-85) ప్రతి వెయ్యిమందికి జననాలరేటు 25 కు తగ్గించాలని అంచనావేస్తే అది 34 వద్ద వచ్చి ఆగిపోయింది. కుటుంబ నియంత్రణ కార్యక్రమాలలో మనం అనుకున్నంత ప్రగతిని సాధించలేక పోతున్నామనేది నిర్వివాదాంశం.

మన దేశంలోని దంపతులలో కేవలం 24 శాతం మందే కుటుంబ నియంత్రణను పాటిస్తున్నారు. 1971 లో ఈ కార్యక్రమం క్రింద 10 శాతం మంది దంపతులకు లబ్ధి చేకూరగా 1986-87 లో 37 శాతం లాభపడినట్లు లెక్కలు చెప్పుతున్నాయి. మరీ ఆపరేషన్లు అంత బ్రహ్మాండంగా, ఇతర సాధనాలు ఇంత విరివిగా అందరికీ అందించడం జరిగినా, జననాల రేటు అలాగే స్థిరంగా ఉండిపోవడం వల్ల మన ప్రణాళిక వైఫల్యం వీటివల్ల స్పష్టమవుతుంది.

జనతా ప్రభుత్వ హయాంలో కుటుంబ నియంత్రణ పాలసీలో కొంత మార్పు వచ్చిన మాట కాదనలేము. కానీ యీ మార్పును సవరించడానికి, సరిదిద్దడానికి పదేళ్ళ కాలం పట్టవలసిన అవసరం లేదు. ఒక సుదీర్ఘ పథకంపై రెండేళ్ళలో వచ్చిన సడలింపు పెద్ద మార్పునుకూడా వ్యక్తం చేయదు. పథకాలు ఇంత ఘోరంగా దెబ్బ తింటున్నాయంటే ప్రభుత్వం అనుసరిస్తున్న పద్ధతుల్లో అంతర్ వైరుధ్యాలవైపు దృష్టి సారించక పోవడమే కారణం. కుటుంబ నియంత్రణ కార్యక్రమాలలో సత్ఫలితాలను సాధించిన రాష్ట్రాలకు ఒకవంక ప్రోత్సాహక సహాయం అందజేస్తూనే, మరొక వంక కేంద్ర రాష్ట్రాలమధ్య ద్రవ్య పంపిణీకి జనాభాను ప్రాతిపదికగా తీసుకుంటున్నారు. 18 ఏళ్లు నిండనిదే ఆడపిల్లలకు పెళ్లి చేయరాదనే శాసనమైతే చేశారు. దాన్ని ఉల్లంఘిస్తున్న వారిపై కఠిన చర్యలు తీసుకోవడంలేదు. అవిద్య, దారిద్ర్యం అధిక సంతానానికి మూలమని చెప్పుతున్నామే కాని ఈ రెంటివల్ల పీడితులైన వర్గాలను కుటుంబ నియంత్రణవైపు ఆకర్షితులను చేయడానికి ప్రత్యేక శ్రద్ధ వహించడం లేదు. ఇప్పటికే గ్రామీణ ప్రాంతాలలో పేద కుటుంబాలలో పుట్టే ప్రతి బిడ్డను అదనపు చేతులుగానే భావిస్తున్నారు తప్ప అదనపు భారంగా చూడటంలేదు. సంపన్న కుటుంబాల వారే సంతానం ఎక్కువైతే వారికి చదువు సంధ్యలు ఇతర సౌకర్యాలు కల్పించడంలో ఇబ్బంది లెదురవుతాయని ఆలోచిస్తున్నారు, కానీ పేదవారు అలా ఆలోచించడం లేదు. దీనికితోడు ఎందరు బతికి బట్ట కడతారో తెలియని దుస్థితి కూడా ఉంది. ఇదికూడా అధిక సంతానోత్పత్తికి కారణమవుతున్నది. పుట్టినవారు పొత్తిళ్లలోనే గిట్టరనే నమ్మకం కలిగితే పరిస్థితిలో కొంత మార్పు రావచ్చు. సమగ్ర శిశు అభివృద్ధి పథకం అమలులోకి వచ్చిన తరువాత శిశు మరణాలరేటు తగ్గినమాట వాస్తవం. 1970 లో శిశు మరణాలు వెయ్యికి 136 ఉండగా 1980 లో 90 కి తగ్గాయి. మరో 10 ఏళ్లకు 30 శాతం తగ్గుతాయని అధికార గణాంకాలు తెలుపుతున్నాయి.

## భారత-చైనా దేశాలు :

ఈ సందర్భంగా భారత్-చైనా దేశాల జనాభాను పరిశీలిద్దాం. చైనా, భారత దేశాలు ఇంచుమించుగా ఒకే సమయంలో బయలు దేరాయి. ఈ రెండు దేశాల మధ్య పోటీ – అది పందెం అనుకుంటె, 1940 దశాబ్దం చివరి సంవత్సరంలో ప్రారంభమయింది. అప్పుడు యీ రెండు దేశాలు స్వతంత్రమైనాయి. చైనాతో పోలిస్తే భారతదేశం చాలా నెమ్మదిగా బయలుదేరింది.

ప్రపంచంలో జనాభా దృష్ట్యా చైనా, భారత దేశాలు ప్రథమ, ద్వితీయ స్థానాలు ఆక్రమిస్తున్నాయి. 1988 మధ్యభాగంలో ఆసియా జనాభా మూడు వందల కోట్ల స్థాయికి వచ్చిందని నిపుణుల అంచనా. ప్రస్తుతం మన దేశంలోని జనాభా పెరుగుదల రేటు 1.7 శాతానికి తగ్గిఉంటుందని మన ప్రభుత్వం ఆశిస్తోంది. కానీ, ఈ రేటు 2 శాతం స్థాయిలో ఉంటుందని అంతర్జాతీయ నిపుణుల అంచనా. ప్రస్తుతము భారత దేశములోని జననాలరేటు వెయ్యి ఒక్కింటికి 33. మరణాల రేటు 13. ఇటీవలి సమాచారం ప్రకారము చైనాలో జనాభా పెరుగుదల రేటు 1.4 శాతం. జననాలరేటు వెయ్యి ఒక్కింటికి 21, మరణాలరేటు వెయ్యి ఒక్కింటికి 7. చైనాలో సంతానోత్పత్తి దశలో ఉన్న దంపతులలో 74 శాతం మంది వివిధ కుటుంబ నియంత్రణ పద్ధతులద్వారా సంతాన నిరోధకశక్తి పొందగలిగారు. 1987 మార్చి చివరినాటికి మన దేశంలో సంతానోత్పత్తిదశలో ఉన్న దంపతుల సంఖ్య 13 కోట్ల 20 లక్షల 72 వేలు. 1987 మార్చి చివరినాటికి వీరిలో వివిధ కుటుంబ నియంత్రణ పద్ధతులద్వారా కేవలము 37.4 శాతం మంది మాత్రమే సంతాన నిరోధక శక్తి పొందగలిగారు. చైనాతో పోల్చినప్పుడు మన దేశ పరిస్థితి జనాభా విషయంలో అసంతృప్తిగా కనిపిస్తుంది. ఇప్పటి అంచనాల ప్రకారం చైనా జనాభా పందకోట్లు దాటింది. భారత దేశపు జనాభా 1988 మార్చి నాటికి 81 కోట్లకన్న అధికంగా ఉంది. క్రీ. శ. రెండు వేల సంవత్సరం నాటికి 100 కోట్ల స్థాయికి, 2050 సం. నాటికి 150 కోట్ల స్థాయికి వస్తుందని నిపుణులు అంచనా వేస్తున్నారు. అప్పటికి భారత దేశం జనాభా రీత్యా ప్రథమస్థానంలో ఉంటుందని క్రీ. శ. 2050 నాటికి చైనా జనాభా 155 కోట్ల జనాభా ఉంటుందని అంచనా.

కుటుంబ నియంత్రణ విషయంలో ఆసియాలో యీ రెండు బృహద్దేశాలు కుందేలు, తాబేలు కథని జ్ఞాపకం తెప్పిస్తున్నాయి. ఎవరు కుందేలు, ఎవరు తాబేలు యీ వివరణ వల్ల వెల్లడవుతుంది. ఈ కథలో కుందేలుకు, తాబేలుకు జరిగిన పందెంలో కుందేలు బాణంలాగా ముందుకు పోయి కాసేపట్లో కంటికి కనబడకుండా పోతుంది. తాబేలు నెమ్మది నెమ్మదిగా కాళ్లు ఈడ్చుకుంటూ వెళుతూ ఉంటుంది. ముందు వెళ్లిన కుందేలు మధ్యలో పడుకొని పందెం సంగతే మరచిపోతుంది. తాబేలు మాత్రం నెమ్మదిగా దొర్లుకుంటూ కుందేలు పడుకున్న చోటుకి చేరుతుంది. కుందేలు మళ్లీ పరుగెత్తి మధ్యలోపొదలో ఇరుక్కోవడమో, లేకపోతే

నదిలో పడటమో, జరిగి అనేక అవాంతరాలను ఎదుర్కొనటం జరుగుతుంది. చివరకు అతి మందకొడిదనుకున్న తాబేలు పందాన్ని గెలుస్తుంది.

కుటుంబ నియంత్రణ విషయంలో చైనా గణనీయమైన అభివృద్ధిని సాధించిన మాట వాస్తవమే. కానీ చైనా దృష్టాంతాన్ని అనుసరించడానికి మన దేశానికి రాజకీయ కారణాలు అడ్డు వస్తున్నాయి. చైనా ప్రభుత్వం తన ప్రజల చేత నిర్బంధగా కొన్ని పనులు చేయించగలదు. మనది ప్రజాస్వామ్యం కనుక ఇక్కడ నిర్బంధ పథకాలు సాధ్యం కావు. సరికదా, అలా చేస్తే ప్రభుత్వాలు కూలిపోయే ప్రమాదం ఉంది. ఉదాహరణకు 1977 లో ఇందిరాగాంధీ ప్రభుత్వ పతనానికి నిర్బంధ కుటుంబ నియంత్రణ కొంతవరకు కారణమని విమర్శకుల అభిప్రాయం.

జనాభా ప్రమాదాన్ని భారతదేశం తీవ్రంగా ఎదుర్కొనే స్థితికి వచ్చిందనే విషయంలో ఎవరికి అనుమానాలు ఉండవలసిన అవసరం లేదు. ఎందుకంటే నేడు మన దేశ జనాభాలో కేవలం నాలుగు శాతం మంది మాత్రమే 64 సంవత్సరాల వయస్సు దాటినవారు 35 శాతం మంది 15 సంవత్సరాల లోపువారు. వీరు త్వరలోనే వైవహిక జీవితం ప్రవేశిస్తారు. కనుక జనాభా ప్రమాదం ముందు ముందుకు మరింత తీవ్రమవుతుంది. కుటుంబ నియంత్రణ కార్యక్రమాలలో గణనీయమైన విజయం సాధించని ఎడల ఈ శతాబ్ది చివరికి భారతదేశం జనాభా పెరుగుదల సుడిగుండంలో తీవ్ర ప్రమాదాలు ఎదుర్కొనవలసి వస్తుంది. ఇప్పటికే జనాభా పెరుగుదల కారణంగా భారతదేశంలోని అభివృద్ధి పథకాలు హరించుకుపోతున్నాయి. ఉపాధి తదితర అవసరాల నిమిత్తం పల్లె ప్రాంతాల ప్రజలు వలసరావడంతో పట్టణ ప్రాంతాలు విస్తరిస్తున్నాయి. జనాభా వొత్తిడి వల్ల పట్టణాల లోపల సామాజిక, ఆర్థిక అనర్థాలు, సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి. 1981 లెక్కల ప్రకారం మనదేశంలో 76.69 శాతం మంది గ్రామీణ ప్రాంతాలలో నివసిస్తున్నారు. అయితే నేం ? ఇతర పేద దేశాలవలె భారతదేశంలో కూడా పట్టణ ప్రాంతాలు విస్తరిస్తున్నాయి. నగరాల మీద జనాభా వొత్తిడి తీవ్రమవుతున్నది. ఐక్యరాజ్య సమితి జనాభా నిధి సంస్థ నివేదిక ప్రకారం ఈ శతాబ్ది చివరి నాటికి ప్రపంచ జనాభాలో సగభాగం పట్టణాలకు వస్తుందని, పట్టణ జనాభాలో అయిదోవంతు మంది మహానగరాలలో నివసిస్తారని తెలిసింది. పట్టణాల విస్తరణతో వ్యవసాయ

భూములు, ఇంధన వనరులు, జనవనరులు, అడవులు దెబ్బతినక తప్పదు. పట్టణ వాసులు సంఖ్య యీ విధంగా పెరిగిపోతుంటే ఈ శతాబ్ది చివరి నాటికి నగరాలలో జీవితం దుర్భరమవుతుంది.

అపరిమితంగా పెరిగిపోతున్న జనాభా వల్ల మనదేశానికి అనేక తీవ్ర పరిణామాలు ఎదురవుతున్నాయి. ఈ 'జనాభా ప్రేలుడు' ప్రమాదం మారణాయుధాల ప్రేలుడు ప్రమాదం కన్న ఎక్కువ నష్టం కలిగిస్తుంది. ఈ దశాబ్ది చివరి నాటికి జననాల రేటును వెయ్యికి 21 వరకు, మరణాల రేటును 9 వరకు, శిశు మరణాల రేటును 60 వరకు (వెయ్యి ఒక్కంటికి) తగ్గించినప్పుడే భారతదేశం ఈ గండం నుంచి బైటపడి గట్టెక్కుతుంది. జనాభా పెరుగుదల ప్రపంచ సమస్య. ఐక్య రాజ్య సమితి నివేదికలో వెల్లడి అయినట్లు ప్రభుత్వాలతో పాటు వ్యక్తులు కూడా జనాభా నియంత్రణ పట్ల తీవ్ర కృషి జరుపవలసి ఉంది.

-(0)-

# అధికార భాష

మన దేశంలో అస్సామీ, బెంగాలీ, గుజరాతీ, హిందీ, కన్నడం, కాశ్మీర్, మలయాళీ, మరాఠీ, ఒరియా, పంజాబీ, సంస్కృతం, తమిళం, తెలుగు, ఉర్దూ, సింధి రాజ్యాంగలో గుర్తింపు పొందిన ప్రాంతీయ భాషలు. బీహార్, ఉత్తర ప్రదేశ్, మధ్యప్రదేశ్, రాజస్తాన్, ఢిల్లీ, హర్యానాలలో హిందీ ప్రాంతీయ భాషగా ఉంది. పంజాబీ, గుజరాతీ, మరాఠీలకు హిందీ లిపి ఉంది. ఆంధ్ర ప్రదేశ్, తమిళనాడు, కేరళ, కర్నాటక, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాలకు వాటి ప్రత్యేక ప్రాంతీయ భాషలున్నాయి. మన దేశంలో హిందీ మాట్లాడేవారి కంటె హిందీయేతర భాషలు మాట్లాడే వారి సంఖ్య ఎక్కువ. 1981 జనాభా లెక్కల ప్రకారం మన దేశంలో వివిధ భాషలు మాట్లాడే వారి సంఖ్య ఇలా ఉంది. అస్సామీ 1.4 శాతం, బెంగాలీ 7.4 శాతం, గుజరాతీ 4.8 శాతం, హిందీ, ఉర్దూ పంజాబీలు కలుపుకొని 42.5 శాతం, కన్నడ 3.5 శాతం, మలయాళం 3.4 శాతం, మరాఠి 7.3 శాతం, ఒరియా 3.5 శాతం, తమిళం 7 శాతం, తెలుగు 7.4 శాతం, ఇతర భాషలు 11.8 శాతం, మొత్తం 100.

**ఒక్క ఓటుతో అధికార భాష :**

దేవనాగరి లిపి కలిగిన హిందీ భారత దేశపు అధికార భాషగా ఉంటుందని మన రాజ్యాంగంలో పేర్కొన్నారు. రాజ్యాంగం ముసాయిదాను చర్చించడానికి కాంగ్రెసు పార్టీ సభ్యులు సమావేశమైనప్పుడు అధికార భాషకు సంబంధించిన 15వ ఆర్టికల్ చర్చకు రాగానే సభలో తీవ్ర ఉద్రిక్త వాతావరణం ఏర్పడింది. రాజ్యాంగ నిర్మాతలలో ఒకరయిన డా. అంబేద్కర్ నాటి సంఘటనల గురించి వివరిస్తూ, 'రాజ్యాంగంలో ఏ ఇతర ఆర్టికల్‌పై ఇంత ఘాటుగా చర్చ జరగలేదు. ఇన్ని వాదోపవాదాలు చెలరేగ లేదు. హిందీని అధికార భాష చేయాలన్న అంశాన్ని ఓటింగ్‌కు పెట్టగానే అనుకూలంగా 7, ప్రతికూలంగా 7 ఓట్లు వచ్చాయి.

సభాధ్యక్షుని కాస్టింగ్ ఓటుతో హిందీ అధికార భాష అయింది' అన్నారు. హిందీ తీవ్రవాదుల్లో ప్రముఖుడైన సేఠ్ గోవింద్‌దాస్ కూడా తన ఆత్మకథలో హిందీ ఒక్క ఓటు మెజారిటీతో అధికార భాష అయినట్లు చెప్పుకున్నారు.

వాదోపవాదాలు :

హిందీని అధికార భాష చేయడానికి హిందీ రాష్ట్రాల సభ్యులు పార్లమెంటులో ఎప్పటికప్పుడు వొత్తిడి తెస్తూనే ఉన్నారు. హిందీయేతర సభ్యులు దీన్ని ప్రతిఘటిస్తూనే ఉన్నారు. 1948 లో మద్రాసుకు చెందిన శ్రీ టి. టి. కృష్ణమాచారి (తరువాత కేంద్రమంత్రి) రాజ్యాంగ సభలో ఇలా హెచ్చరించారు. 'ఇప్పటికే దక్షిణాది ప్రజలలో వేర్పాటుధోరణులు ఎక్కువయ్యాయి. గౌరవనీయులైన సభ్యులు హిందీ విషయంలో పట్టుపట్టి పుండుమీద కారం చల్లవద్దు.' బెంగాల్‌కు చెందిన మైత్రా అనే సభ్యుడు 'సభలో హిందీలో మాట్లాడక పోతే మనకు స్వాతంత్ర్యం లభించనట్లేనా ? మన స్వాతంత్ర్యం అర్థంలేనిదా ?' అని హిందీవాదులను ఎద్దేవా చేశారు.

రాజ్యాంగ సభ సమావేశాలలో సభ్యులు ప్రసంగించటానికి భాషా పరమైన చిక్కులు ఏర్పడినప్పుడు వారు ఇంగ్లీషులో గాని, హిందీలోగాని సభాధ్యక్షుని అనుమతితో తమ ప్రాంతీయ భాషల్లోగాని ప్రసంగించ వచ్చునని సభా నిబంధనల కమిటీ పేర్కొన్నది. ఈ రూలింగ్‌ని అప్పుడే సేఠ్ గోవింద్‌దాస్ తీవ్రంగా వ్యతిరేకించారు. కానీ సభ ఆయన వాదనను తిరస్కరించగానే హిందీ తీవ్రవాదులు తీవ్ర నిరాశకు లోనయ్యారు. 1953 లో లోక్‌సభలో ప్రసంగిస్తూ ఆనాటి కేంద్ర హోం మంత్రి శ్రీ కె. ఎన్. కట్జూ 'ప్రజ లెన్నుకున్న పార్లమెంటు సభ్యులు విభిన్న భాషలలో మాట్లాడం మెందుకో నాకు అర్థం కాదు. మీకు జాతీయ భాష రాదంటారేమో, ఆ గౌరవం ఇంగ్లీషు కెక్కడిది ? ప్రతిఒక్కరు తమ స్వంత భాషను ఈ సభలో వినిపిస్తూ ఉంటే పార్లమెంటు జాతీయతను కోల్పోయి సర్వభాషా కవిసమ్మేళన వేదికగా మారిపోతుంది' అని హేళన చేశారు. బాధ్యతాయుత పదవుల్లో ఉన్న పెద్దల ముందుచూపులేని ప్రకటనలు హిందీకి మేలుకంటె కీడునే ఎక్కువ కలగజేశాయి.

1955 లో కేంద్ర అధికార భాషా సంఘం ఏర్పడింది. మొత్తం 20 మంది కమీషన్ సభ్యులలో ఇద్దరు తప్ప 18 మంది సభ్యులు హిందీని అధికార భాషగా

చేయడం వలన దక్షిణాది ప్రజలకు ఎక్కువ నష్టం వాటిల్లుతుందని అభిప్రాయ పడ్డారు. అఖిల భారత సర్వీసు కమీషన్ పరీక్షలలో దక్షిణాదివారు నష్టపోతారని పేర్కొన్నారు. అధికార భాష విషయంలో తుది నిర్ణయం తీసుకునేవరకు సుప్రీం కోర్టు హైకోర్టులలో ఇంగ్లీషు భాషను కొనసాగించ వచ్చునని కమీషన్ సలహా ఇచ్చింది.

హిందీయేతర రాష్ట్రాలపై హిందీని బలవంతంగా రుద్దడం వలన దేశ సమైక్యతకు భంగం కలుగుతుందని గుర్తించిన నెహ్రూ రాజ్యాంగం అమలుకు వచ్చిన 15 సంవత్సరాలకుగానీ హిందీని అధికార భాషగా పెట్టడం జరుగదన్నారు. 1958 లో గౌహతిలో జరిగిన కాంగ్రెసు సమావేశంలో కూడా హిందీయేతర రాష్ట్రాల సమ్మతిలేనిదే హిందీని రుద్దడం జరుగబోదని తీర్మానించారు.

అధికార భాషా సవరణ చట్టం :

1967 లో అధికార భాషా సవరణ చట్టం వచ్చింది. దాని ప్రకారం హిందీ యేతర భాషల ప్రాంతాల ప్రజలు తమ మాతృభాషలతో పాటు హిందీ, ఇంగ్లీషు నేర్చుకోవలసి ఉంటుంది. అలాగే హిందీ ప్రాంతాల వారు తమ మాతృ భాష హిందీతోపాటు ఇంగ్లీషు మరొక ప్రాంతీయ భాష నేర్చుకోవలసి ఉంటుంది. దీన్ని త్రిభాషా సూత్రం అన్నారు. దేశ సమైక్యతను, సమగ్రతను ఒక్క త్రిభాషా సూత్రమే పటిష్టపరుస్తోందని భావించారు. హిందీయేతర ప్రజలకు నెహ్రూ ఇచ్చిన వాగ్దానాన్ని అమలు పెట్టడమే ఈ బిల్లు లక్ష్యమన్నారు. దుర దృష్టకరమైన విషయం ఏం జరిగిందంటే ఈ సూత్రం ఇటు హిందీ వాదులకు గానీ, హిందీ వ్యతిరేకులకుగాని సంతృప్తి ఇవ్వలేకపోయింది. కేంద్ర విద్యా మంత్రి శ్రీ త్రిగుణసేన్ ప్రవేశపెట్టిన ఈ భాషా సూత్రం తనకు ఆమోదయో గ్యం లేనందున విదేశ వ్యవహారాల మంత్రి శ్రీ ఎం. సి. ఛాగ్లా కేంద్ర మంత్రి పదవి నుంచి తప్పుకున్నారు.

అధికారభాషా బిల్లుపై చర్చ జరిగినన్ని రోజులు భాషోన్మాదులు విశృంఖ లంగా ప్రవర్తించి దేశానికెంతో అపకీర్తి తెచ్చే పనులు చేశారు. అధికార భాషా బిల్లుకు వ్యతిరేకంగా పార్లమెంటు భవనం ముందు ప్రదర్శనలు జరపడానికి ఉత్తరప్రదేశ్‌లోని ఇద్దరు మంత్రులు లక్నో నుంచి పనికట్టుకొని వచ్చి ఢిల్లీలో నానా రభస చేసి పోయారు. ఇంగ్లీషు వ్యతిరేక ఆందోళన సందర్భంగా భాగ

ల్వార్‌లోని మార్వాడీ కళాశాల వద్ద ఒక విద్యార్థినిని బాకుతో పొడిచి చంపారు. ఆ పాఠశాల ఆవరణలోనే కత్తిపోట్లకు గురయిన ఇద్దరు విద్యార్థులు అతి ప్రమాద స్థితిలో గాయపడ్డారు. తాజ్‌మహల్, ఫతేపూర్ సిక్రి తదితర చారిత్రాత్మక కట్ట డాల వద్ద వాటి విశేషాలను తెలిపే ఇంగ్లీషు ప్రకటనలను, ఇంగ్లీషు వ్యతిరేక ప్రదర్శకుల విజ్ఞప్తిని పురస్కరించుకొని పురాతత్వ శాఖ తొలగించింది. తాజ్ మహల్ యాత్రీకులకు అత్యంత ఆకర్షణీయంగా ఉంటూ వచ్చిన ఇంగ్లీషు ప్రక టన లన్నింటినీ తొలగించివేశారు. లోక్‌సభలో అధికారభాషా విషయంపై చర్చలు జరుగుతున్నప్పుడు ప్రేక్షకుల గ్యాలరీ నుంచి 'బక్వాస్ బంద్ కరో' (అనవసర ప్రసంగాలు చాలించండి) అని గట్టిగా అరచి ఒక విద్యార్థి లోక్‌సభ చరిత్రలోనే అసాధారణ సంఘటన సృష్టించాడు. ఈ బిల్లుని ఆమోదించిన సమయంలోనే హిందీ అంకెలు గల లారీ నడిపినందుకు ఆ లారీ డ్రైవర్‌కు కలకత్తాలోని ప్రెసి డెన్సీ మెజిస్ట్రేటు 20 రూపాయలు జరిమానా విధించారు. బెంగాల్‌లో అమలులో ఉన్న వాహనాల చట్టం ప్రకారం పేట్ల అంకెలు ఇంగ్లీషులోనే ఉండాలి. తమిళ నాడులో అన్ని రాజకీయ పక్షాలు ఒక్కటై హిందీ వ్యతిరేకోద్యమాన్ని నడిపాయి.

1955 లో ద్రవిడ మున్నేట్రకజగమ్ పార్టీనుంచి ఎన్నికైన మద్రాసు మేయర్ తిరు (శ్రీ) ఎ. సి. అరసు పదవిలోకి రాగానే ఏటా రేడియోలో జరిగే మేయర్ పరిచయ కార్యక్రమంలో పాల్గొనవలసిందని ఆయనను కోరారు. అందుకు ఆయన తిరస్కరించారు. రేడియోవారు ఉపయోగించే 'ఆకాశవాణి' అనే పదం తనకు అభ్యంతరంగా ఉందనీ, ఆ పేరు తీసి శుద్ధ తమిళ పదమైన 'వాణొలి' అనే పేరు పెట్టే దాకా రేడియోలో తమ పార్టీ మేయర్లు ప్రసంగించేది లేదని త్రోసి పుచ్చారు. ఏటేటా ఎన్నికయ్యే మేయర్ ఇలాంటి వింత చేష్టలు దేశంలో అధికార భాషకు వ్యతిరేకంగా ఎన్నో జరుగుతూనే ఉన్నాయి.

### పాకిస్తాన్ దృష్టాంతం :

మన పొరుగు దేశమైన పాకిస్తాన్ కూడా భాషాపరమైన పెక్కు చిక్కు లకు గురైంది. 1961 లెక్కల ప్రకారం అంటే - అవిభక్త పాకిస్తాన్‌లో నూటికి యాభై నలుగురు బెంగాలీ భాష మాట్లాడేవారు. తూర్పు పాకిస్తాన్ (బంగ్లాదేశ్) ఒక్కటే తీసుకుంటే ఈ సంఖ్య 96 కు చేరుకుంది. ఈ సంగతిని పాకిస్తాన్ పాల కులు పూర్తిగా విస్మరించి బంగ్లాదేశ్‌లో నూటికి నలుగురు మాత్రమే మాట్లాడే

ఉర్దును అక్కడ కూడా అధికార భాషగా చేశారు. దీని వెనుక కొంత చరిత్ర ఉంది. 1937 లో లక్నోలో జరిగిన ముస్లింలీగ్ సమావేశంలో ముస్లిం ప్రజలు ఆధిక్యం గల రాష్ట్రాలలో ఉర్దు ఒక్కటే ఉపయోగానికి పెట్టాలని తీర్మానించారు.

పాకిస్తాన్ ఏర్పడగానే తూర్పు బెంగాల్ రాష్ట్ర ప్రజలు తమ ప్రాంత భాషను తమ రాష్ట్రానికి అధికార భాషగా చేయాలని ఆందోళనలు లేవదీశారు. కానీ, జిన్నా, లియాఖత్‌అలీఖాన్‌లు యీ వాదనను అంగీకరించలేదు. 1953 ఫిబ్రవరి 21 వ తేదీన తూర్పు బెంగాల్ అంతటా ఉర్దు వ్యతిరేకంగా పెద్ద ఎత్తున అల్లరులు జరిగాయి. చివరకు ఆ రాష్ట్రంలో ఉర్దుతోపాటు బెంగాలీకి కూడా అధికార భాషా స్థానం లభించింది. కాని అది కంటి తుడుపు మాత్రమే. పాకిస్తాన్‌లో ముద్రితమయ్యే నాణేలు, కరెన్సీ నోట్లు, ప్రభుత్వ డ్యాకుమెంట్లు, పోస్టల్ స్టాంపుల పైన ఉర్దు, ఇంగ్లీష్ భాషలు మాత్రమే ఉండేవి. తమ భాషను అవమాన పరచడానికే ప్రభుత్వం ఈ చర్య తీసుకున్నట్లు తూర్పు బెంగాల్ ప్రజలు భావించారు. బంగ్లాదేశ్ ఏర్పడేవరకు ఈ రాష్ట్ర ప్రజలు ఫిబ్రవరి 21 వ తేదీన తమ భాషా సంస్మరణ దినంగా జరుపుకునేవారు. ఈ భాషా వివాదాలే చివరకు పాకిస్తాన్ చీలికకు కారణమైనాయి. అవిభక్త పాకిస్తాన్‌లో నూటికి 55.48 మంది బెంగాలీలు, 29.2 మంది పంజాబీలు, 3.7 మంది సిక్కులు, 5.5 మంది సింధీలు, 3.65 మంది ఉర్దూ మాట్లాడేవారు, 0.22 మంది ఇంగ్లీషు మాట్లాడేవారు, 0.69 మంది బెలుచీలు ఉండేవారు. ప్రస్తుత పాకిస్తాన్‌లో 20 శాతం మంది ప్రజలే ఉర్దు మాట్లాడతారు. కాని ఉర్దు పాకిస్తాన్‌లో అధికార భాష అయి కూర్చున్నదంటే దానికి మత పరమైన రంగు పులమటమే కారణం.

ప్రాంతీయ భాషల ప్రాముఖ్యం :

పార్లమెంటులో సభ్యులు ఇక మీదట హిందీ, ఉర్దు, ఇంగ్లీషు భాషలలోనే గాక మరో పది భాషలలో ఉపన్యసించవచ్చునని 1983 ఫిబ్రవరి 18 వ తేదీన అధికార ప్రకటన వెలువడింది. ఇంతవరకు ఇంగ్లీషు, హిందీ ప్రసంగాలకు మాత్రమే అనువాద సౌకర్యాలు ఉండేవి. ఇప్పుడు తెలుగు, తమిళం, అస్సామీ, బెంగాలీ, గుజరాతీ, మరాఠీ, మళయాళం, ఒరియా, పంజాబీ, కన్నడం ఉపన్యాసాలకు కూడా అనువాద సౌకర్యాలు కలగజేశారు. అయితే ఉపన్యసించడానికి గంట ముందు తాము ఏ భాషలో ఉపన్యసించ దలచుకున్నది సభ్యులు తెలియపరచాలి.

హిందియేతర రాష్ట్రాలలో హిందీని బలవంతంగా రుద్దుతున్నారని అందుకు నిరసనగా డి. ఎం. కె. సభ్యుడు ఎస్. వి. ఎస్. సోము 1985 నవంబర్ 28 న లోక్‌సభ నుంచి వాకౌట్ చేశారు. 'ఎవరైన హిందీని బలవంతంగా రుద్దే ప్రసక్తే లేద'ని స్పీకరు బలరాం జక్కర్ హామీ ఇవ్వవలసి వచ్చినది. అయితే సోముకు స్పీకరు సమాధానం సంతృప్తి ఇవ్వలేదు.

కేంద్ర ప్రభుత్వం నుంచి 50 శాతం, అంతకు మించి ఖర్చుల సబ్సిడీ పొందుతున్న స్వయం పాలనా సంస్థలు కేంద్ర ప్రభుత్వం నిర్వహించిన అధికార భాష విధానాన్ని అనుసరించాలని, దైనందిన కార్య కలాపాలలో హిందీ భాషను వాడాలని కోరుతూ కేంద్ర ప్రభుత్వం జారీ చేసిన సర్క్యులర్‌ను దానికి వ్యతిరేకంగా జరిగిన వొత్తిడి మూలంగా ఉపసంహరించుకోవలసి వచ్చింది.

ఏతా-వాతా ఇది ప్రాంతీయ భాషల యుగం. అధికార భాష విషయంలో తీవ్రమైన మార్పులు దేశ సమైక్యతను హాని కలిగిస్తాయి కనుక నెహ్రూ ఇచ్చిన హామీని పాటించడమే యీ విషయంలో సరి అయిన మార్గం. హిందీ మాట్లాడే రాష్ట్రాల ప్రభుత్వాలు పరస్పరం ఉత్తరాలు రాసుకునేటప్పుడు హిందీని ఉపయోగించుకుంటున్నాయి. మిగతా రాష్ట్రాలకు వ్రాసేటప్పుడు ఇంగ్లీషు అనువాదాన్ని జతపరచడం సాంప్రదాయంగా ఉన్నది. ఈ విధానంలో మార్పు ఉండదని కేంద్రం గట్టిగా హామీ ఇవ్వాలి.

**అనుసంధాన భాష :**

తమిళనాడు ముఖ్యమంత్రులందరు హిందీ వ్యతిరేకంగా ధ్వజమెత్తిన వారే. ఆంధ్రప్రదేశ్‌లో తెలుగుదేశం ప్రభుత్వం అధికారంలో ఉన్న కాలంలో కూడా హిందీకి వ్యతిరేకం కనిపించలేదు. అంటే - త్రిభాషా సూత్రాన్ని తమిళనాడు విడనాడితే, ఆంధ్రప్రదేశ్ బలపరిచింది.

ఏ దేశ చరిత్రలో కూడా ఒక విదేశ భాష శాశ్వత అధికార భాషాస్థానాన్ని ఆక్రమించడం జరుగలేదు. అధికార భాషగాని, అనుసంధాన భాషగాని భారతీయ భాష అయి ఉండాలనే నిర్ణయంలో సందేహాలుండటం అనవసరం. అయితే, మన పొరుగు దేశమైన పాకిస్తాన్ దృష్టాంతాన్ని అనుభవంగా తీసుకొని జాతీయ భాష విషయంలో మనం జాగ్రత్తగా అడుగు ముందుకు వేయవలసి వచ్చింది. ఇప్పటికి

మన దేశంలో నూటికి 97 మందికి ఇంగ్లీషు రాదనే సంగతిని మనం మరచి పోరాదు. అయితే దీనికి రాజాజీ ఇచ్చిన సమాధానంకూడా ఆలోచించతగినదే. 'నూటికి ఒకరే ఇంగ్లీషు మాట్లాడగలిగిన వారు దేశంలో ఉన్నమాట నిజమేఐనా ఆ కొద్దిమంది దేశమంతా వ్యాపించి ఉన్నారు'.

మొదటినుంచి భారత దేశంలో ఆర్య భాషా కుటుంబం అత్యంత ప్రాముఖ్యం వహిస్తున్నది. సంస్కృతం భారత దేశానికి ముఖ్యమైన ప్రాచీన భాష. ప్రాచీన కాలంలోను, మధ్యయుగంలోను దేశమంతటా విద్యాధికుల మధ్య భావ వినిమయం సంస్కృతం ద్వారా జరిగింది. మన మత గ్రంథాలన్నీ సంస్కృతంలోనే రచించారు. కుంతల శాతకర్ణి ఆస్థాన పండితుడైన శర్వవర్మ కాతంత్ర వ్యాకరణం రచించి ఆరు నెలలలో సంస్కృత భాషను తమ రాజుకు నేర్పగలిగాడని గుణాఢ్యుని కథ ద్వారా మనకు తెలుస్తున్నది. ముస్లిం పరిపాలనలో వారి భాషలైన అరబిక్, పర్షియన్ మొదలైనవి సంస్కృతానికి పదవీచ్యుతి కలిగించాయి.

బ్రిటిష్ వారు భారత దేశానికి వచ్చినప్పుడు వారికి మన దేశ భాష లేవీ తెలియవు. భారతీయు లెవరికి వారి భాష తెలియదు. ఈస్టిండియా కంపెనీ వారు ఏ భారతీయ భాషను మన దేశ అధికార భాషగా చేయలేదు. వారు తమ భాషనే ప్రభుత్వ భాషగా చేశారు. దీని ఫలితంగా లక్షలాది మంది ప్రజలకు ఇంగ్లీషు నేర్చుకొనవలసిన అవసరం కలిగింది. మన దేశంలో ఒక రాష్ట్ర ప్రజల భాషను మరొక రాష్ట్ర ప్రజలు అర్థం చేసుకోలేరు కనుక ఇంగ్లిషు అన్ని ప్రాంతాలలో చొచ్చుకుపోయింది. దేశంలోని ఏ రాష్ట్రానికి వెళ్ళినా ఇంగ్లిషు అర్థమవుతుంది. ఇంగ్లిషు మన జాతీయ భాష కాకపోయినా అవసరానికి అక్కరకొచ్చే భాషగా త్వరలో చెలామణిలోకి వచ్చింది.

అనుసంధాన భాష రెండు అవసరాలను తీరుస్తుంది. విద్యాభివృద్ధికి, విజ్ఞానాభివృద్ధికి కావలసిన ఒక అవసరం. వర్తక వాణిజ్యాలు, రాజకీయాలు నడపడానికి కావలసినది రెండవ అవసరం. విద్యార్థులకు, ఉన్నత విద్య బోధించే అధ్యాపకులకు ఏదో ఒక ప్రధానమైన అంతర్జాతీయ భాష వచ్చి ఉండాలి. ఇంగ్లిష్, ఫ్రెంచ్, జర్మనీ, రష్యన్ లాంటి భాషలు ఈ అవసరాలను తీరుస్తాయి. అయితే వీటిలో ఇంగ్లిషుదే అగ్రతాంబూలం. అంతేకాదు 150 సంవత్సరాల నుంచి మన విద్యావేత్తలు, విద్యాధికు లందరు ఇంగ్లిషు భాషకు అలవాటు పడిపోయారు. మన

గ్రంథాలయాలన్నీ ఇంగ్లీషు భాషతోనే నిండిపోయాయి. ఇలాంటి పరిస్థితులలో ఇంగ్లీషు భాషను నేర్చుకోవడమే ఉన్నత విద్య అభ్యసించే వారికి సులభ సాధ్యం. ఈ లాభాన్ని వదులుకోవడం మనకు ప్రాజ్ఞత కాదు.

ఇక్కడ మరో విషయం ఆలోచించాలి. ఇంగ్లీషువంటి ఒక అనుసంధాన భాషలో విద్యాధికులకు పరిచయం ఉంటేనే తప్ప ఒక విశ్వవిద్యాలయానికి చెందిన ఆచార్యులు మరొక విశ్వవిద్యాలయానికి వెళ్ళి, చర్చలలో పాల్గొనడం, దేశ విజ్ఞాన ఐక్యతను పరిరక్షించడం సాధ్యంకాదు. విదేశ హస్తం ప్రవేశించక మునుపు సంస్కృతం ఇలాంటి అనుసంధాన భాషగా పనిచేసేది. దీనితో దేశ మంతటా ఒకే విధమైన సంస్కృతి, విజ్ఞానం వ్యాపించ గలిగాయి. ఈ భావైక్యత యీనాటి పరిస్థితులలో మన విద్యాధికులమధ్య ఉండటం చాలా అవసరం. ఈ అవ సరాన్ని అనుసంధాన భాష తీర్చగలుగుతుంది. ఈ పని ఇంతవరకు ఇంగ్లీషు భాష వల్ల జరుగుతున్నది. ఇప్పటి పరిస్థితులలో సంస్కృతం యీ భారాన్ని మోయ లేదు. ఇప్పటి మన అనుసంధాన భాష ప్రపంచ భాష అయి ఉండాలి. దీనివల్ల విశ్వవిద్యాలయాల మధ్య సన్నిహిత సంబంధ మేర్పడుతుంది. ప్రపంచంలోని ఉన్నత విజ్ఞానమూ, పరిశోధనలతో మన విద్యావేత్తలకు పూర్తి సంబంధం ఏర్ప రచు కోవడానికి వీలు కలుగుతుంది. ఇలాంటి సంబంధాలు ఉంటేనే తప్ప మన విద్యావేత్తలకు ప్రపంచంలో పరిగణన లభించదు. ఈ అనుబంధం లేకపోతే మన విజ్ఞానం ఎంతో పరిమితమై పోతుంది.

విద్యాధికుల మధ్య భావసమైక్యతకు ఇంగ్లీషు భాష అనుసంధాన భాషగా ఉండాలని అంటే దాని అర్థం వర్తక వ్యాపారాలకు, ఇతర లౌకిక వ్యవహారాలకు కూడా ఇంగ్లీషు అనుసంధాన భాషగా ఉండాలని చెప్పడం కాదు. దానికి హిందీ భాషను ఉపయోగించుకోవచ్చు. ఉత్తర ప్రత్యుత్తరాలు, రాజకీయ ఉపన్యాసాలు, శాసనసభలలోని చర్చలు హిందీ భాషతో జరుపవచ్చు. ఈ విషయంలో ఇతర ప్రాంతీయ భాషలకన్న హిందీయే ఎక్కువ ఉపయోగపడుతుంది. ఇది నిర్వివాద మైన అంశం. కనుక విశాల ప్రజల ప్రయోజనాల దృష్ట్యా త్రిభాషా సూత్రమే జాతీయ సమైక్యతను వర్ధిల్ల చేస్తుంది. అంటే హిందీతో పాటు ఇంగ్లీషు, ఏదైనా ఒక ప్రాంతీయ భాష వచ్చితీరాలి. రోడ్డు అలజడులు భాషా సమస్యను పరిష్క రించలేవు.

-[ం ం]-

# కాంగ్రెస్‌కు కాయకల్ప చికిత్స చేసిన ఇందిరాగాంధీ

శ్రీ లాల్ బహాదుర్ శాస్త్రి మరణించిన తరువాత 1966 జనవరి 16 తేదీన ప్రధానమంత్రి పదవికి జరిగిన ఎన్నికలలో శ్రీమతి ఇందిరాగాంధికి 355 ఓట్లురాగా మురార్జీదేశాయ్‌కి 189 ఓట్లు వచ్చాయి. ఆమె ఏర్పాటు చేసిన మొదటి మంత్రి వర్గంలో మురార్జీ లేరు. శ్రీమతి గాంధీని ప్రధానిగా చేయడంలో సిండికేటు పాత్ర కొంత ఉంది. ప్రధాని పదవి అలంకరించిన ప్రపంచ స్త్రీలలో ఇందిరా గాంధీ రెండవవారు. ప్రథమ తాంబూలం శ్రీలంకలో సిరిమావో బండారునాయకే పుచ్చుకున్నది. శ్రీలంక చిన్న ప్రజా ప్రభుత్వం. భారతదేశం ప్రపంచంలో కెల్లా పెద్ద ప్రజాస్వామ్యం.

ఇరవై ఏళ్లగా నిరాటంకంగా పాలనాధికారం వహించిన కాంగ్రెస్ 1967 మార్చిలో జరిగిన నాల్గవ సార్వత్రిక ఎన్నికలలో తీవ్ర పరాజయం ఎదుర్కొంది. కామ్‌రాజ్, అత్యుల్లఘోష్, ఎస్కేపాటిల్ ఓడిపోవడం వల్ల సిండికేటుకు శృంగ భంగమయింది. ఏకపక్ష ప్రభుత్వం ఎంతటి సమర్థమైనది అయినా దేశానికి మంచిదికాదు. ప్రత్యామ్నాయంగా ప్రభుత్వం నిర్వహించగల బలమైన ప్రతి పక్షాలు ఉండటం ప్రజాస్వామ్యంలో అత్యంతవశ్యకం. అదే ఈ ఎన్నికలలో జరిగింది.

ఎన్నికలలో కాంగ్రెస్‌కు జరిగిన పరాభవం కాంగ్రెస్ వాదులలోని ఐక్యతను తట్టి లేపింది. ఇందిరాగాంధీతో మళ్లీ పోటీ పడుతున్న మురార్జీని ఉపప్రధాని పదవిలో కూర్చుండ పెట్టారు. మరో పోటీ దారుడైన సంజీవరెడ్డికి మంత్రి పదవి బదులు లోక్‌సభ సభాపతి ఉద్యోగం లభించింది. కాంగ్రెస్ ఐక్యత కోసం వివిధ వర్గాల మధ్య పదవుల పంపకంలో సిండికేటు ఈసారి ఉదాత్తగానే తన పాత్రను నిర్వహించింది.

ఎన్నికలలో తమ పార్టీకి ఇంత ఘోరం జరిగిపోతుందని కాంగ్రెసు నాయకులు ముందుగా ఊహించలేకపోయారు. 1967 జూన్‌లో ఢిల్లీలో పార్టీ సమావేశాలు జరిపి తమ ఓటమికి గల కారణాలను నెమరు వేసుకోవడం మొదలుపెట్టారు. పబ్లిక్ రంగంలోని పరిశ్రమలు ఆశించిన ఫలితాలు ఇవ్వకపోవడం తమ పార్టీ పరాజయానికి కారణమని శ్రీ ఎస్. ఎన్ మిశ్రా వాదించారు. ప్రజాస్వామ్య సోషలిజమ్ త్వరత్వరగా ఫలితాలివ్వాలంటే వామపక్ష ప్రజాశక్తులతో సహకరించుకుంటూ ముందడుగు వేయడం ఒక్కటే మార్గమని కె. డి. మాలవ్యా హితవు చెప్పారు. అనేక తర్జన భర్జనలు జరిగిన తరువాత ఎ. ఐ. సి. సి. పది అంశాల కార్యక్రమాన్ని సూచించింది. అందులో బ్యాంకులు జాతీయకరణ, భూసంస్కరణలు, రాజ భరణాల రద్దు ముఖ్యమైనవి.

## దశ తిరిగిన కామ్‌రాజ్ :

కాంగ్రెస్ తీర్మానాలు చట్టాలుగా రూపొందాలంటే కొంత సమయం పడుతుంది. కాంగ్రెస్‌లోని 'యంగ్ టర్క్స్' దీన్ని అర్థం చేసుకోలేక పోయారు. ఇందిరాగాంధీ అభ్యుదయ విధానాలను మంత్రివర్గంలో ఉంటూ మురార్జీ అడ్డుకుంటున్నారనే అపోహ వారికి కలిగింది. పార్టీలోను, పార్లమెంటులోను తీవ్రమైన పదజాలంతో వారు మురార్జీని నొప్పించేవారు. దీన్ని ఖండించడంలో ప్రధాని ఎటువంటి ఆసక్తి చూపలేదు. ఫలితంగా ఇందిరాగాంధి – మురార్జీల మధ్య విభేదాలు మరింత తీవ్రమవుతూ వచ్చాయి.

1967 ఎన్నికలలో ఓడిపోగానే కామ్‌రాజ్ దశ తిరిగిపోయింది. రెండేళ్ళ క్రితం నుంచి కామ్‌రాజ్ నాడార్ జాతకం మహోచ్ఛలో ఉంది. లాల్‌బహాదూర్ శాస్త్రీని, ఇందిరాగాంధీని ప్రధానులుగా చేసి 'కింగ్ మేకర్' అనే బిరుదును దేశ రాజధాని నగరంలో సైతం ఆయన సార్థకం చేసుకున్నారు. నిర్మాణ కౌశలంలోను, ఎన్నికలలో విజయం చేకూర్చడంలోను, రాజకీయ దురంధరత్వంలోను ఆయనకు సాటి ఆయనేనని లోకం హోరెత్తిపోయేటట్లుగా పొగడింది. 'పార్క్కలాం' అనే ఆయన ఊతపదం రాజకీయ చతురతకు మారుపేరుగా చెలామణి అయింది. ఆయన ధాటికి ఆగలేక ఎందరో మేధావులైన తమిళ రాజకీయ ప్రముఖులు అజ్ఞాత వాసంలోకి వెళ్ళిపోయారు. 1967 నాటి ఎన్నికల ముందు ఆయన భక్తులు ఆయనను

గురించి ప్రస్తావిస్తూ 'తలైవరు' కావాలనుకుంటే ప్రధానిగానో, రాష్ట్రపతిగానో అయ్యేవారని చెప్పుకునేవారు. రాజకీయం ప్రమాదకరమైన ఆట. ఒకసారి ఉన్నత శిఖరాలను అధిరోహించడం, మరొకసారి అథఃపాతాళానికి దిగజారి పోవడం రాజకీయాలలో మామూలే. విజ్ఞత మూర్తీభవించిన కామ్‌రాజ్ ఈ సమయంలో చాలా తెలివిగా ప్రవర్తించారు. ప్రధానికి సలహా లివ్వడం మానేసి సమాలోచనల వరకే తమ అధికారాన్ని పరిమితం చేసుకున్నారు. కాంగ్రెస్ అధ్యక్ష పదవికి మళ్లీ పోటీ చేసేదిలేదని ఆయన ప్రకటించారు.

నిజలింగప్ప :

కామ్‌రాజ్ తమ నిర్ణయం ప్రకటించగానే గుల్జారీలాల్‌నందాను రంగంలోకి ఒక వర్గం దింపింది. ఆయన వామపక్షవాదిగా ప్రతీతి. ఆయన సిద్ధాంతాలు మురార్జీ వర్గీయులకు నచ్చలేదు. నందా పేరు తెరమరుగున పడిపోగానే రాజస్థాన్ ముఖ్యమంత్రి మోహన్‌లాల్ సుఖాడియా పేరును సిండికేటు వర్గం వారు చూపించారు. సుఖాడియా ప్రధాని వర్గానికి సుముఖుడే. కానీ ఆయనను ముఖ్యమంత్రి పదవి నుంచి తప్పించడం ఇప్పట్లో సాధ్యం కాదని ప్రధాని ప్రకటించగానే కాంగ్రెస్ అధ్యక్షుని కోసం దేవులాటలు తీవ్రమైనాయి. చివరకు అందరకు అంగీకార అభ్యర్థిగా కర్నాటక ముఖ్యమంత్రి నిజలింగప్పను కాంగ్రెస్ అధ్యక్షుడుగా నిర్ణయించుకున్నారు.

1969 ఫిబ్రవరిలో ఉత్తరప్రదేశ్, పంజాబ్, బీహార్, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాల అసెంబ్లీలకు ఎన్నికలు జరిగాయి. మూడు రాష్ట్రాలలో కాంగ్రెస్ ఓడిపోయింది. దీనివల్ల దేశ రాజకీయాలలో మూడు కొత్త పరిణామాలు సంభవించాయి. 1. పార్లమెంటులో ప్రభుత్వం మరింత గడ్డు పరిస్థితులు ఎదుర్కొనవలసి వచ్చింది. 2. ప్రభుత్వ యంత్రాంగంలో తీవ్రమైన మార్పులు అవసరమైనాయి. 3. ప్రధానికి పదవీచ్యుతి కలిగించే తతంగాన్ని కాంగ్రెస్‌లోని ఒక వర్గం తీవ్రతరం చేసింది.

కాంగ్రెస్ చీలిక :

1969 మేలో రాష్ట్రపతి డా॥ జాకీర్‌హుసేన్ మరణించారు. ఉపరాష్ట్రపతిగా ఉన్న శ్రీ వి. వి. గిరి తాత్కాలిక రాష్ట్రపతి పదవిని స్వీకరించారు. సిండికేటు సమావేశమై రాష్ట్రపతి పదవికి సంజీవరెడ్డి పేరును ప్రతిపాదించింది. కాంగ్రెస్

పార్లమెంటరీ బోర్డు మెజారిటీ ఓటుతో దీన్ని ఆమోదించింది. ఈలోగా తాత్కాలిక రాష్ట్రపతి పదవికి, ఉపరాష్ట్రపతి పదవికి రాజీనామా చేసి వి. వి. గిరి ఎన్నికల రంగంలోకి దూకారు. సిండికేటు అభ్యర్థిగా పోటీ చేస్తున్న సంజీవరెడ్డి నామినేషన్ పత్రాలపై సంతకం పెట్టిన ఇందిరాగాంధీ 'అంతరాత్మ ప్రబోధం' అనే సూత్రం లేవనెత్తి ఎవరి ఓటు హక్కు వారు స్వేచ్ఛగా ఉపయోగించుకొనవలసిందని కాంగ్రెస్ పార్టీ క్రమశిక్షణకు విరుద్ధంగా ప్రచారాలు చేశారు. రాష్ట్రపతి పదవికి ఇంత ఆర్భాటంగా ఎన్నికలు జరగడం మనదేశంలో ఇదే మొదటిసారి. ఎన్నికలలో గిరికి విజయం లభించింది.

1969 జులైలో శ్రీమతి ఇందిరాగాంధి మురార్జీ నుంచి ఆర్థికశాఖను తీసుకున్నారు. ఉపప్రధాని పదవి నుంచి తొలగించలేదు. ఈ 'అవమానం' భరించలేని మురార్జీ దేశాయ్ తమ పదవికి రాజీనామా చేశారు. శాఖలను ఇవ్వటంలోను, తొలగించడంలోను ప్రధానికి గల స్వేచ్ఛను మురార్జీ పాటించి ఉన్నట్లయితే అది కాంగ్రెస్ ఐక్యతకు దోహద పడేది. నాయకుల పట్టుదలలు కాంగ్రెస్‌కు మరింత ప్రమాదం తెచ్చిపెట్టాయి.

రాష్ట్రపతి ఎన్నికలలో పార్టీ క్రమశిక్షణకు విరుద్ధంగా ప్రవర్తించిన ఇందిరాగాంధీపై కాంగ్రెస్ అధ్యక్షుడు నిజలింగప్ప చర్యలు తీసుకొని కాంగ్రెస్ పార్టీ సభ్యత్వం నుంచి ఆమెను సస్పెండ్ చేశారు. క్రొత్త నాయకుడిని ఎన్నుకొనవలసిందిగా కాంగ్రెస్ పార్లమెంటరీ బోర్డుకు ఆదేశాలు జారీ చేశారు. పార్లమెంటు ఉభయ సభలలో సిండికేటును సమర్థించే సభ్యుల సంఖ్య 60 మాత్రమే. వారు సమావేశమై మురార్జీ దేశాయ్‌ని పార్లమెంటరీ పార్టీ నాయకునిగాను, రాంసుభాగ్ సింగ్‌ను లోక్‌సభలో తమ నాయకునిగాను ఎన్నుకున్నారు.

ఈలోగా ఇందిరాగాంధీని సమర్థించే ఎ. ఐ. సి. సి. సభ్యుల సమావేశం ఢిల్లీలో జరిగింది. కాంగ్రెస్ పార్టీ అధ్యక్ష పదవి నుంచి నిజలింగప్పను తొలగించే తీర్మానాన్ని గోవింద్‌దాస్ ప్రవేశపెట్టగా అది ఏకగ్రీవంగా ఆమోదం పొందింది. సి. సుబ్రహ్మణ్యంను కాంగ్రెస్‌కు తాత్కాలిక అధ్యక్షుడుగా ఎన్నుకున్నారు. 73 వ కాంగ్రెస్ సమావేశాలు 29 డిశంబర్ 1969 లో బొంబాయిలో జగ్‌జీవన్‌రాం అధ్యక్షతన జరిగాయి. నిజలింగప్ప అధ్యక్షతలోని కాంగ్రెస్ సంస్థా కాంగ్రెస్‌గాను, ఇందిరాగాంధీ నాయకత్వంలోని కాంగ్రెస్ అధికార

కాంగ్రెస్‌గాను చెలామణిలోనికి వచ్చాయి. మునుపటి చీలికలలాగా కాక, ఈ చీలిక కాంగ్రెస్‌ను శాశత్వంగా చీల్చింది.

కాంగ్రెస్ వాదులలో చంద్రశేఖర్, అర్జున్ అరోరా, చింతామణి పాణిగ్రాహి కృష్ణకాంత్ మొదలైన మాజీ సోషలిస్టుల గ్రూపు ఒకటుంది. ఈ గ్రూప్ర పేరు 'యంగ్ టర్క్స్'. ఈ యంగ్‌టర్క్స్ పార్లమెంటు సభ్యులు బ్యాంకులను జాతీయం చేయమని ప్రధానిపై వొత్తిడి తెచ్చారు. మాజీ సంస్థానాధీశుల ప్రత్యేక హక్కులను, వారి రాజభరణాల రద్దు గురించిన ప్రధాని ప్రతిపాదించిన బిల్లును 'ఓల్డ్ గార్డ్స్' పార్లమెంటులో ఆమోదం పడకుండా చేయగలిగారు. మాజీ సంస్థానాధీశులు చేసుకున్న అప్పీలును దేశంలో సర్వోన్నత న్యాయస్థానమైన సుప్రీంకోర్టు విచారించి రాజభరణాల రద్దును రాజ్యాంగ విరుద్ధమని కొట్టివేసింది. ఈ విధంగా సామాజిక ఆర్థిక విధానాలు వొడిదుడుకల్లో పడడంతో లోక్‌సభను రద్దుచేసి ప్రజాభీష్టాన్ని తెలుసుకోవాలని శ్రీమతి ఇందిరాగాంధీ నిర్ణయించారు.

1971 లో జరిగిన మధ్యంతర ఎన్నికల్లో లోక్‌సభ మొత్తం 521 స్థానాల్లోనూ కాంగ్రెస్‌కు 350 లభించాయి. దీనితో ఇందిరాగాంధీకి మూడింట రెండు వంతుల మెజారిటీ లభించినట్లయినది. ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రజాస్వామ్యం పట్ల అచెంచల విశ్వాసంతో తీసుకునే చర్యకు సాధారణంగా అనుకూల ఫలితాలు లభిస్తాయని యీ ఎన్నికలు రుజువు చేశాయి.

1971 బంగ్లాదేశ్ యుద్ధ మప్పుడు శ్రీమతి ఇందిరాగాంధి మన దేశానికి మహా విజయాన్ని సాధించిపెట్టారు. అటు తర్వాత వచ్చిన ఆర్థిక సంక్షోభం నుంచి కూడా ఆమె నాయకత్వం దేశాన్ని గట్టెక్కించింది. ఆమెను విపరీతంగా విమర్శించే జనసంఘ్ కూడా ఆ రోజుల్లో ఆమె కేవలం కాంగ్రెసు పార్టీ నాయకురాలు కాదని, పార్టీలకు మార్గాలకు అతీతంతో మొత్తం దేశానికి ఆమె నాయకురాలని అభివర్ణించింది.

ఎమర్జెన్సీ భూతం :

1971 లో లోక్‌సభకు ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ ఎన్నికను సవాల్ చేస్తూ రాజ్‌నారాయణ్ దాఖల్ చేసిన పిటిషన్‌పై అలహాబాద్ హైకోర్టు న్యాయమూర్తి జగ్‌మోహన్ లాల్‌సిన్హా 1975 జూన్ 12 వ తేదీన 'శ్రీమతి ఇందిరాగాంధీ ఎన్నిక రద్దు' అని తీర్పు ఇచ్చారు.

ఎన్నికలలో ఆమె రెండు అక్రమాలు చేసినట్టు జస్టిస్ సిన్హా తీర్పు చెప్పారు. మొదటిది ప్రధానమంత్రి సచివాలయంలో స్పెషల్ డ్యూటీ ఆఫీసరుగా ఉన్న యశ్‌పాల్‌కపూర్‌ను 'తన గెలుపుకోసం ఉపయోగించుకోవడం'. ప్రభుత్వ ఉద్యోగిగా ఆయనను అలా ఉపయోగించి ఉండేది కాదు. రెండవ అక్రమం-తాను మాట్లాడబోయే ఎన్నికల ప్రచారం సభలకు శ్రీమతి ఇందిరాగాంధీ ఉత్తరప్రదేశ్ అధికారుల చేత వేదికలను నిర్మింప చేసింది. అధికారులే లౌడ్ సీకర్లు ఏర్పాటు చేసి, విద్యుచ్ఛక్తి కూడా సరఫరా చేశారు.

శ్రీమతి ఇందిరాగాంధీతో పోటీ చేసిన రాజ్‌నారాయణ్ లక్ష ఓట్ల తేడాతో ఓడిపోయారు. ఈ 'అనౌచిత్యాలు' జరుగపోయినా ఎన్నికల ఫలితంలో మార్పు ఉండేదికాదు. ప్రధానమంత్రి గద్దె దిగి పోవలసినంత పెద్ద విషయాలు కా ఇవి. ఒక చిన్న ట్రాఫిక్ నేరానికి ప్రధానమంత్రిని పదవి నుంచి తప్పించడం ఇది. కానీ చట్టం చట్టమే. దీనితో సి. పి. ఐ. మినహా ఇతర ప్రతిపక్షాలన్నీ శ్రీమతి ఇందిరాగాంధీని ప్రధానిగా గుర్తించబోమని ప్రకటించాయి. తప్పు చేసినట్లు హైకోర్టు తీర్పు ఇచ్చిన తరువాత పదవిని అంటి పెట్టుకున్నందుకు ఆమెను విమర్శించాయి.

ఇందిరాగాంధి సుప్రీంకోర్టుకు అప్పీలు చేసుకుంది. 'దారుణమైన ఎన్నికల అపరాధ మేమీ చేయలేదని, ఆమె ప్రధానమంత్రిగా కొనసాగవచ్చుననీ, అలహాబాద్ హైకోర్టు తీర్పు మీద సుప్రీంకోర్టులో అప్పీలు పరిష్కారమయ్యే దాకా లోక్ సభలో ఆమెకు ఓటు హక్కు మాత్రం ఉండదని' సుప్రీంకోర్టు న్యాయమూర్తి కృష్ణయ్యర్ తన నిర్ణయం ప్రకటించారు.

ప్రతి పక్షాలు జయప్రకాశ్‌నారాయణ్‌ని ఆశ్రయించాయి. జూన్ 26 న ఢిల్లీలో ఆయన అధ్యక్షతన బ్రహ్మాండమైన బహిరంగ సభ జరిగింది. ఈ సభలో శ్రీమతి ఇందిరాగాంధీని పదవిలో కొనసాగ నివ్వబోమని ప్రతిపక్ష నాయకులందరు గట్టిగా శపథం చేశారు.

1975 జూన్ 25వ తేదీ రాత్రి 11-45 గంటలో ఎమర్జెన్సీ ప్రకటనల కాగితాలపై రాష్ట్రపతి సంతకాలు జరిగాయి. ఆ తరువాత స్వాతంత్ర్యం అన్నది పౌరునికి క్రమేపీ అర్థహీన మయింది. పౌరుల ఓటుద్వారా అధికారంలోకి వచ్చిన నాయకులు స్వాతంత్రాన్ని పునర్ నిర్వహించారు. సెన్సార్‌షిపుని విధించి

పత్రికలను నోరెత్తకుండా చేశారు. వ్యక్తిగత స్వేచ్ఛలను తొలగించారు. న్యాయ శాఖకు అధికారం తగ్గింది. హెబియస్-కార్పస్ పని చేయలేదు. ఈ సంఘటనల గగన వేగంతో పౌరుడు దిగ్భ్రాంతి చెందాడు. అమాయకుల ముఖకవళికల్లో భయం కనిపించింది. అవకాశవాదులకు ఎమర్జెన్సీ ప్రయోజనమైంది. దిగ్భ్రాంతి చెందిన మేధావుల నాయకత్వం వహించలేకపోయారు. ఎందుకంటే నాయకత్వం వహించ గలవారు జైళ్లల్లో ఉన్నారు.

'తన స్వేచ్ఛలోనే స్వాతంత్ర్యం కోల్పోతే బానిసత్వం తగ్గిపోతుందా? ప్లెబిసైడ్ద్వారా నిరంకుశ పాలనను ఎన్నుకుంటే చేతులారా చేసుకున్నందుకు స్వతంత్రులుగా కొనసాగినట్లేనా?' హెర్బర్ట్ స్పెన్సర్ పలికిన యీ మాటలు మనలో చాలామందికి పరిచితం కాకపోవచ్చు. గాంధీజీనాయకత్వాన స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న వారిలో కొందరు మనలో ఉన్నారు. అయినా ఒక పద్ధతి ప్రకారం పౌరస్వేచ్ఛలను కుంచించి, ప్రాథమిక హక్కులను తొలగించినప్పుడే దేశంలోని మేధావులు దానిని పట్టించుకోలేదు. రాబోయే ముప్పును గుర్తించిన వారు కూడా చాలా కొద్దిమందే.

అరెస్టయిన వారిలో కమ్యూనిస్టులు (మాస్కో అనుకూలురైన మితవాదులు) తప్ప అన్ని పార్టీల వారు ఉన్నారు. జె. పి. (జైప్రకాశ్ నారాయణ్) ని అరెస్టు చేసినప్పుడు ఆయన 'వినాశకాలే విపరీత బుద్ధి' అనే సూక్తిని పలికారు.

## రాజ్యాంగ సవరణలు :

ఎన్నికల అవినీతి నేరానికి సంబంధించిన సవరణ బిల్లును లోక్‌సభ 1975 ఆగష్టు 5న ఆమోదించింది. ఈ సవరణ ప్రకారం అవినీతి నేరం కారణంగా తిరిగి ఎన్నికలలో పోటీచేసే హక్కును కోల్పోయిన వ్యక్తి కేసును రాష్ట్రపతికి నివేదించాలి. రాష్ట్రపతి ఎన్నికల కమిషన్‌తో సంప్రదించి, ఆ శిక్ష అమల్ జరగాలో, లేదో, ఎంతకాలం అమలు జరుగాలో నిర్ణయిస్తాడు. అంటే, ఎన్నికల కమీషనర్ అధికారాన్ని రాష్ట్రపతి వినియోగిస్తాడు. ఈ సవరణ తీసుకురావడంలో ఒక కీలకం ఉంది. మంత్రి మండలి సలహాను రాష్ట్రపతి విధిగా పాటించి తీరాలని, తరువాత ఒక రాజ్యాంగ వివరణను ప్రభుత్వం ప్రవేశపెట్టింది. దీనితో రాష్ట్రపతి విచక్షణాధికారం అంతరించింది.

ప్రధాన మంత్రి ఎన్నికపై వచ్చే వివాదాన్ని ఎన్నికల కమీషనర్ పరిధి నుండి తొలగించే 40వ రాజ్యాంగ సవరణ బిల్లును ఆగష్టులో ఆమోదించారు.

అలాగే, రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి, ప్రధాన మంత్రి పదవులు నిర్వహిస్తున్న వ్యక్తులపై ఏ న్యాయస్థానాలలోను క్రిమినల్ చర్యలు గైకొనడానికి వీలులేని 41వ రాజ్యాంగ సవరణను కూడా ఆమోదించారు.

ఈలోగా జూన్ 12వ తేదీన అలహాబాద్ హైకోర్టు ప్రకటించిన తీర్పును నవంబర్ 7వ తేదీన సుప్రీంకోర్టు ఏకగ్రీవంగా కొట్టివేసింది. శ్రీమతి ఇందిరా గాంధీ ఆరేండ్లవరకు ఎన్నికలలో పాల్గొనరాదని హైకోర్టు ఇచ్చిన రూలింగ్‌ను కూడా సుప్రీంకోర్టు రద్దుచేసింది. చండీగఢ్‌లో జరిగిన కాంగ్రెస్ సమావేశంలో అత్యయిక పరిస్థితిని పొడగించి 1976 మార్చిలో జరగవలసి ఉన్న ఎన్నికలు ఒక ఏడాదిపాటు నిర్వహించరాదని చేసిన నిర్ణయాన్ని కేంద్ర మంత్రివర్గం ఆమోదించింది.

రాష్ట్ర శాసన సభలలోని సగం శాసనసభలు ధృవీకరించిన పిమ్మట 42వ రాజ్యాంగ సవరణ బిల్లును 1976 డిశంబర్ 18న రాష్ట్రపతి ఆమోదముద్ర వేశారు. ఈ రాజ్యాంగ సవరణ ఈ క్రింది అంశాలకు వర్తిస్తుంది.

1. రాజ్యాంగ సవరణలో 'సర్వసత్తాక ప్రజాస్వామ్య రిపబ్లిక్' అనే పదాలను తొలగించి, వాటిస్థానే 'సర్వసత్తాక సోషలిస్టు రిపబ్లిక్' అనే పదమాలిక చేర్చారు. అదే విధంగా 'జాతీయ సమైక్యత' అనే పదాల స్థానే 'జాతీయ సమైక్యత, సమగ్రత' అనే పదాలను చేర్చారు.

2. ఈ చట్టం ప్రకారం ప్రాథమిక హక్కులకంటె రాజ్యాంగములో పేర్కొనబడిన ఆదేశిక సూత్రాలకే ఎక్కువ ప్రాముఖ్యం లభించింది.

3. నిర్బంధ జాతీయ సేవతో సహా పౌరులకు పది ప్రాథమిక విధులను ఈ చట్టంలో చేర్చారు.

4. లోక్‌సభ, రాష్ట్ర శాసనసభల గడువును ఐదు సంవత్సరాల నుంచి ఆరు సంవత్సరాలకు పెంచారు.

5. శాంతి భద్రతలు విషమించిన సందర్భాలలో ఏ రాష్ట్రంలోనైనాసరే కేంద్ర సాయుధ బలాలను వినియోగించే అధికారం ప్రభుత్వానికి సంక్రమింప జేశారు.

6. 'జాతీయ వ్యతిరేక కార్యక్రమాలను' నిషేధించారు.

7. సవరణ అమలులో ఎటువంటి అవరోధాలు తలఎత్తినా వాటిని తొలగించడానికి ఉత్తరువులు జారీచేసే అధికారం రాష్ట్రపతికి రెండు సంవత్సరాలపాటు ఉంటుంది.

8. ఏ రాజ్యాంగ సవరణను న్యాయస్థానాలలో సవాలు చేయరాదనీ, కనీసం ఏడుగురు న్యాయమూర్తులలో మూడింట రెండు వంతుల మంది ఏకీభవించనిదే కేంద్ర శాసనాన్ని కాని, రాష్ట్ర శాసనాన్ని కాని రాజ్యాంగ విరుద్ధం అని ప్రకటించే వీలులేకుండా చేశారు.

సర్వాధికారాలు శ్రీమతి ఇందిరాగాంధీ చేతుల్లో కేంద్రీకృతం కావటానికి దోహదం చేసిన అత్యయిక స్థితికి శాశ్వతంగా రాజ్యాంగ ప్రతిపత్తి కల్పించటమే ఈ సవరణల లక్ష్యమని శ్రీ అశోక్ మెహతా వ్యాఖ్యానించారు.

కాంగ్రెసు (ఐ) ఆవిర్భావం :

1977 లో జరిగిన లోక్‌సభ ఎన్నికలలో శ్రీమతి ఇందిరాగాంధీ రాయ్ బరేలి నియోజక వర్గం నుంచి 55 వేల తక్కువ ఓట్లతో ఓడిపోయారు. 1977 మార్చి 23వ తేదీన ఆమె ప్రధాన మంత్రి పదవికి రాజీనామా చేశారు

ఇరవైఏడు సంవత్సరాల కాలంలో కాంగ్రెసు పార్టీ అత్యున్నత పదవికి 1977 మే 7వ తేదీన పోటీ జరిగింది. (1950 లో నాసిక్ కాంగ్రెసు మహాసభలో నెహ్రూ అభిమతానికి విరుద్ధంగా టాండన్ కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నిక అయ్యారు) కాసు బ్రహ్మానందరెడ్డికి 317 ఓట్లు, ఆయనతో పోటీ చేసిన సిద్ధార్థ శంకర్ రాయ్‌కు 160 ఓట్లు వచ్చాయి. శ్రీమతి ఇందిరాగాంధి రబ్బరు స్టాంపుగా ఉండటానికి కాసు అంగీకరించలేదు. రాజకీయ అరణ్యవాసం భరించలేని శ్రీమతి ఇందిరాగాంధీ కాంగ్రెస్‌ను రెండవసారి చీల్చడానికి పూనుకున్నారు. కడచిన ఎనిమిదేళ్ళలో ఎనిమిది మంది కాంగ్రెసు అధ్యక్షులు మారారు. శ్రీమతి ఇందిరా గాంధీ తనకు నచ్చని వారిని, చెప్పుచేతలలో ఉండని వారిని అధికారంలో ఉండనీయరని తాము కాంగ్రెసు అధ్యక్షులైన మూడు నెలలలోనే ఉద్వాసన చెప్పించడానికి ఆమె ఉద్యమం ప్రారంభించారని బ్రహ్మానందరెడ్డి అన్నారు.

1978 జనవరి 2వ తేదీన శ్రీమతి ఇందిరాగాంధీ అఖిల భారత జాతీయ కాంగ్రెసు నుండి విడిపోయి తన అధ్యక్షతన ఇందిరా కాంగ్రెసును స్థాపించారు.

21 మంది కాంగ్రెసు వర్కింగు కమిటీ సభ్యులలో సర్వశ్రీ కమలాపతి త్రిపాఠీ, సయ్యద్ మీర్ ఖాసిం, పి. వి. నరసింహారావు, వీరేంద్రవర్మ, బూటాసింగ్, ఎ. పి. శర్మ, శ్రీమతి మరగతం చంద్రశేఖర్ ఇందిరాగాంధీ వర్గములో చేరి పోయారు. అఖిల భారత కాంగ్రెసు కమిటీ జనవరి 3వ తేదీన శ్రీమతి ఇందిరా గాంధీని కాంగ్రెసు నుండి బర్తరఫ్ చేసింది.

1978 ఫిబ్రవరిలో అస్సాం, మేఘాలయ, కర్నాటక, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలకు, కేంద్రపాలిత ప్రాంతమైన అరుణాచల్ ప్రదేశ్‌కు ఎన్నికలు జరి గాయి. ఆంధ్రప్రదేశ్, కర్నాటక రాష్ట్రాలలో కాంగ్రెసు (ఐ) ఘనవిజయము సాధించింది. కర్నాటకలోనైతే అధికార కాంగ్రెసుకు రెండే రెండు స్థానా లొచ్చాయి. కర్నాటకలో తమ పార్టీకి జరిగిన ఘోరపరాజయాన్ని తనదిగా తీసు కొని కాంగ్రెసు అధ్యక్షుడు బ్రహ్మానందరెడ్డి తన పదవికి రాజీనామా చేశారు. చిక్‌మగ్‌ళూరు నియోజకవర్గం నుంచి శ్రీమతి గాంధీ లోక్‌సభకు ఎన్నికయ్యారు. బ్రహ్మానందరెడ్డి స్థానంలో స్వరణ్‌సింగ్ కాంగ్రెసు అధ్యక్షులయ్యారు.



1979 జూన్‌లో కర్నాటక ముఖ్యమంత్రి శ్రీ దేవరాజ్ అర్స్ కాంగ్రెసు (ఐ) తో తెగతెంపులు చేసుకున్నారు. కాంగ్రెస్ (ఐ) అధికారంలో ఉన్న రెండు రాష్ట్రాలలో ఒకటి ఆమె చేయిజారిపోయింది. దీనికి ఆమె భయపడలేదు. సమిష్టి నాయకత్వానికి లోబడి పెద్ద పార్టీలో ఉండటంకంటె తిరుగులేని నాయకురాలుగా చిన్న పార్టీలో పెత్తనం చెలాయించడమే సులభం. తనవెంట ఎంతమంది ఉన్నా రన్నది ఆమెకు ముఖ్యం కాదు. ఎలాంటి వ్యక్తులు ఉన్నారనేది ముఖ్యం. ఆమె తన విధేయుల నుంచి పూర్తి విధేయత కోరేది.



జనతా ప్రభుత్వంలో హోంమంత్రిగా ఉన్నప్పుడు శ్రీమతి ఇందిరాగాంధీని జైల్లో పెట్టేవరకు నిద్రపోని చరణ్‌సింగ్ ఇందిరాగాంధీ సహాయంతో ప్రధాని అయ్యారు. ప్రధాన మంత్రిగా ఉన్నప్పుడు ముఖ్యమంత్రులను ఎక్కించడం, దింపించడం ఎంత సులభంగా శ్రీమతి ఇందిరాగాంధీ చేస్తూ వచ్చారో ప్రతిపక్షంలో వుంటూ ప్రధాన మంత్రులనుకూడా ఆమె ఎక్కించి దింపించారు. చరణ్‌సింగ్ ప్రభుత్వంపై విశ్వాసప్రకటన తీర్మానాన్ని వ్యతిరేకించాలని కాంగ్రెసు (ఐ) నిర్ణ

యం తీసుకున్న దృష్ట్యా 1979 ఆగష్టు 20వ తేదీన ఆయన ప్రభుత్వం రాజీనామా చేసింది. 1977 లోనే ఇందిరాగాంధీ - ఈ జనతా ప్రభుత్వం రెండేళ్లకంటె బ్రతకదని చెప్పింది. అదే జరిగింది.

ఇందిరాగాంధీకి తిరిగి పట్టాభిషేకం :

1980 లో జరిగిన లోక్‌సభ ఎన్నికలలో కాంగ్రెసు (ఐ) మూడింట రెండు వంతులపైగా మెజారిటీ సంపాదించుకుంది. ఈ ఎన్నికలలో కర్నాటకలో కాంగ్రెస్ (యు) పూర్తిగా తుడిచి పెట్టుకుపోయింది. కాంగ్రెస్ (యు) అధ్యక్షుడు దేవరాజ్ అర్స్ తమ పదవికి రాజీనామా చేశారు. శ్రీమతి ఇందిరాగాంధీ మరల ప్రధాన మంత్రి అయినారు.

వేర్పాటువాదంతో సిక్కుల విజృంభణ నానాటికి తీవ్రమైనది. అమృతసర్ లోని స్వర్ణదేవాలయం టెర్రరిస్టులకు నిలయమైనది. సైనిక చర్య ద్వారా ఇందిరా గాంధీ స్వర్ణదేవాలయాన్ని టెర్రరిస్టుల నుంచి విముక్తి కలిగించి సిక్కు మతాధిపతులకు అప్పగించారు.

దేశాన్ని పదహారేళ్ళకు పైగా పాలించిన ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధిని 1984 అక్టోబరు 31 తేదీన ఆమె అంగరక్షకులుగా నియుక్తులైన శిక్కు గార్డులే ఆమె మీద కాల్పులు జరిపారు. ఆమె మరణం జాతి సమగ్రతకు చెల్లించిన అతి భారీ మూల్యం. ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ హత్యపట్ల ప్రజలలో పెల్లుబికిన ఆగ్రహావేశాలకు దేశంలోని పలుప్రాంతాలలో ఒక మతవర్గానికి చెందిన అమాయకులు గురైనారు. త్రిపుర, బీహార్, ఒరిస్సా, పశ్చిమ బెంగాల్, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్‌లలో విపరీతమైన హింసాకాండ జరిగింది. కొన్ని గుండ్లకే ప్రాణాలు కోల్పోయిన వ్యక్తిపై మెషన్ గన్‌తో గుండ్లవర్షం కురిపించటమన్నది దేశంలోని ఒక వర్గం వారిలో ద్వేషం, కక్ష ఎంతగా పెరిగిపోయాయో సూచించింది.

శ్రీమతి ఇందిరాగాంధీ భారతదేశ రాజకీయ, ఆర్థిక స్వాతంత్ర్యాల కోసం కృషిచేసి సఫలం చెందారు. ఆమె నాయకత్వంలో భారతదేశం సాంఘిక, ఆర్థిక అభివృద్ధిని పొందడం, ఆస్థాయిలో ఇండియాకు అంతర్జాతీయ ఖ్యాతి ఇనుమడించడం ఇండియా శత్రువులలో అసంతృప్తి కలిగించింది. సెక్యులర్ భారత వ్యవస చిన్నాభిన్నం కాకుండా చూడటానికీ, దేశాన్ని పటిష్టపరచడానికి ఆమె చేసిన

కృషి తక్కువేమి కాదు. కువిమర్శల వంటి సిద్ధాంత వైరుధ్యాల వరకు తన ప్రత్యర్థులపై ఆమె నిరుపమాన ధైర్యం ప్రదర్శించి పోరాడింది. రాజకీయ వ్యవహారాలలో ఆమె చొరవ అనితర సాధ్యం. అలీనోద్యమానికీ, ఆకలి బాధకు, దారిద్ర్యానికి, పెత్తందారీతనానికి, దోపిడీకి, దురాక్రమణకు, వివక్షతకు వ్యతిరేకంగా కృతనిశ్చయంతో వీరోచితంగా పోరాడిన మహోన్నత రాజనీతిజ్ఞురాలు. ఆమె ఆలోచనా విధానం, కార్యాచరణ భారత ప్రజలే కాక, మొత్తం ప్రపంచ ప్రజానీకాన్ని చూరగొన్నాయి. ఐక్యరాజ్యసమితికి కూడా ఉత్తేజం కలిగించాయి.

* *

* *

# రాజకీయ ఊబిలో గవర్నర్లు

గవర్నర్ల వ్యవస్థపై ఇటీవలి కాలంలో దేశవ్యాప్తంగా చర్చ తిరిగి మొదలయింది. నిజానికి రాజ్యాంగ రచనా సమయంలోనే రాజ్యాంగ పరిషత్తులు ఈ అంశంపై సుదీర్ఘ చర్చ జరిగింది. అయితే, ఆనాటి నుంచి ఈనాటి వరకు గవర్నర్ల అధికార పరిధి విషయంలో చర్చ కొనసాగుతూనే ఉండటం ప్రత్యేకాంశం. గవర్నరు వ్యవస్థకు రూపకల్పన చేసే సమయంలో నెహ్రూ, పటేల్, రాధాకృష్ణన్, అంబేద్కర్, అల్లాడి కృష్ణస్వామి అయ్యర్, కృపలానీ వంటి హేమాహేమీలు చర్చలలో పాల్గొని తమ అమూల్యాభిప్రాయాలను అందించారు. 1946 డిశంబర్ 6 న తొలిసారి రాజ్యాంగ సభ సమావేశమైనప్పుడు రాష్ట్రాల అధికారాల విషయంలో కేంద్ర జాబితా తయారీకి జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షతన ఒక కమిటీ, రాష్ట్ర జాబితా తయారీకి సర్దార్ పటేల్ అధ్యక్షతన ఒక కమిటీ ఏర్పడ్డాయి. ఈ రెండు కమిటీల ప్రథమ సమావేశం 1947 మే 5 న జరిగింది.

ఈ రెండు కమిటీలు జూన్ 6 నుంచి 9 వరకు గవర్నరు వ్యవస్థ గురించి చర్చలు జరిపాయి. గవర్నర్ల పాత్ర, అధికారాల గురించి సాగిన ఈ చర్చలో ఆ పదవి అమెరికా మాదిరి ఉండాలా ? శాసనసభకు బాధ్యత వహించేలా ఉండాలా ? అనే అంశం ప్రస్తావనకు వచ్చింది. గవర్నరు రాష్ట్రానికి, కేంద్రానికి మధ్య సంధానకర్తగా ఉండాలని కొందరు సూచించారు. ఈ సుదీర్ఘ చర్చ అనంతరం ఈ రెండు కమిటీలు సంయుక్తంగా సమావేశమైనప్పుడు గవర్నర్లను ప్రజల నుంచి నేరుగా ఎన్నికయ్యేటట్లు చేయాలన్న అభిప్రాయం వ్యక్తమైనది. ఈ విషయాన్నే సర్దార్ పటేల్ 1947 జూన్ 27 న రాజ్యాంగ సభకు నివేదించారు. రాజ్యాంగం చిత్తు ప్రతి ఖరారు చేసే సమయంలో శ్రీ బి. ఎన్. రావు రెండు సూచనలు చేశారు. అందులో మొదటిది గవర్నరు నియమకానికి రాష్ట్ర శాసన

సభ నలుగురు పేర్ల ప్యానల్‌ని పంపాలి. అందులో రాష్ట్రపతి ఒకరిని నియమిస్తారు. పోతే, ప్రజల నుంచి నేరుగా గవర్నరుని ఎన్నుకునే విధానం రెండోది.

అయితే, గవర్నరును ప్రజలు నేరుగా ఎన్నుకుంటే ఎన్నికైన ముఖ్యమంత్రి మధ్యన, ఎన్నికైన గవర్నరు మధ్యన అధికారాల వివాదం తలెత్తుతుందనే సందేహాన్ని చాలామంది సభ్యుల వ్యక్తం చేశారు. అప్పుడు ఈ అంశంపై తుది అభిప్రాయం ఇవ్వడానికి 1948 ఏప్రిల్ 10 వ తేదీన రాజ్యాంగ సభ ఒక ఉపసంఘాన్ని నియమించింది. ఈ ఉపసంఘం గవర్నర్లను రాష్ట్రపతి నియమించాలని సూచన చేసింది. ఈ ఉపసంఘ నిర్ణయం రాజ్యాంగసభలో చర్చకు వచ్చినప్పుడు రాష్ట్రాల ముఖ్యమంత్రులను సంప్రదించి గవర్నర్లను రాష్ట్రపతి నియమించాలని అల్లాడి కృష్ణస్వామి అయ్యర్ అభిప్రాయపడ్డారు. గవర్నర్లు సర్వదా రాజకీయాలకు అతీతంగా వ్యవహరించాలని నెహ్రూ చెప్పారు. రాజ్యాంగ నిర్ణయ సభ ఇంత సుదీర్ఘ చర్చల అనంతరం గవర్నరు పదవికి రూపకల్పన చేసింది.

## సర్కారియా కమీషన్ సిఫారసులు :

గవర్నర్ల ఎంపిక, వారు నిర్వహించవలసిన పాత్ర గురించి సర్కారియా కమీషన్ (1988) కొన్ని సిఫారసులను చేసింది.

1. కేంద్రంలో అధికారంలో ఉన్న పార్టీకి చెందిన వ్యక్తిని ప్రతిపక్షాలు అధికారంలో ఉన్న రాష్ట్రాలలో గవర్నరుగా నియమించరాదు.

2. గవర్నరుగా నియమితుడయ్యే వ్యక్తి ఏదో ఒక రంగంలో ప్రముఖుడై ఉండాలి.

3. గవర్నర్లను స్వంత రాష్ట్రాలలో నియమించరాదు. సంబంధిత రాష్ట్రాలలోని రాజకీయాలలో వారికి ఏలాంటి సంబంధం ఉండరాదు. రాజకీయాలలో మునిగి తేలిన వ్యక్తిని, ముఖ్యంగా సమీపకాలంలో రాజకీయాలలో సంబంధం ఉన్న వ్యక్తిని గవర్నరుగా నియమించరాదు.

అసెంబ్లీలో అత్యధిక మెజారిటీ ఉన్న పార్టీని లేదా పార్టీల కూటమినే ప్రభుత్వం ఏర్పాటుకు గవర్నర్ ఆహ్వానించాలి. అసెంబ్లీలో ఏ ఒక్క పార్టీకి మెజారిటీ లేని సమయంలో అత్యధిక సంఖ్యాకుల గల పార్టీని ప్రభుత్వం ఏర్పాటుకు ఆహ్వానించి, 30 రోజులలోగా ఆపార్టీ పూర్తి మెజారిటీ నిరూపించుకునే విధ

ముగా షరతులు విధించాలి. అసెంబ్లీ బయట మెజారిటీని లెక్కించే పద్ధతికి స్వస్తి చెప్పాలి.

గవర్నరును నియమించే ముందు సంబంధిత ముఖ్యమంత్రిని సంప్రదించే సాంప్రదాయానికి సర్కారియా కమీషన్ కూడా సుముఖత వ్యక్తం చేసింది. అయితే, అసెంబ్లీ లేదా ముఖ్యమంత్రి సూచించిన 'ప్యానెల్'లోని సభ్యులనే గవర్నర్లుగా నియమించాలనే వాదనను కమీషన్ తిరస్కరించింది.

### వివాదం ఎందుకు?

భారత దేశంలో గవర్నరు పదవి పూర్తిగా కేంద్రప్రభుత్వం సృష్టి. అందుకే అతడు లాంఛనప్రాయమైన రాజ్యాంగాధినేత మాత్రమే. 356 ఆర్టికల్ క్రింద రాష్ట్రపతి గవర్నరు సిఫారసుపై రాష్ట్రప్రభుత్వాన్ని బర్తరఫ్ చేయవచ్చు. రాష్ట్రంలో శాంతిభద్రతలకు తీవ్రమైన ముప్పు వాటిల్లి ప్రజాప్రభుత్వం విఫలమైనప్పుడు, యూనియన్‌ను భగ్నం చేసే ప్రయత్నాలు జరుగుతున్నప్పుడు, రాష్ట్రపతి ఈ చర్యకు పూనుకోవాలి. కానీ, ఇటీవల పరిణామాలు మాత్రం దీనికి పూర్తిగా భిన్నమైనవి. పార్టీ ఫిరాయింపులవల్ల రాష్ట్రాలలో రాజకీయ సంక్షోభం తలెత్తినప్పుడు గవర్నర్లు సహనంతో ప్రవర్తించి ముఖ్యమంత్రులకు తమ కొంపలను దిద్దుకునే అవకాశం ఇవ్వకుండా తమ విశేషాధికార అస్త్రాన్ని సంధించి వెంటనే ఆ రాష్ట్రాలలో రాష్ట్రపతి పాలన విధింపు చర్యలకు పూనుకుంటున్నారు. ఈ చర్య మన ప్రజాస్వామ్యాన్ని నవ్వులపాలు చేస్తున్నది. అందువల్ల గవర్నరు పదవిని రద్దుచేయాలన్న నినాదం కాంగ్రెసేతర ప్రభుత్వాలు గల రాష్ట్రాలలో ఎక్కువ వినిపిస్తున్నది.

### విద్యారంగానికి సైతం :

కాంగ్రెసేతర ప్రభుత్వాలు అధికారంలో ఉన్న రాష్ట్రాలలో గవర్నరు రాష్ట్రప్రభుత్వాల మధ్య జరుగుతున్న ప్రచ్ఛన్నయుద్ధం విశ్వవిద్యాలయాలకు సైతం విస్తరించింది. జాదవ్‌పూర్ విశ్వవిద్యాలయ వైస్ ఛాన్సలర్ నియామకంలో పశ్చిమ బెంగాల్ గవర్నర్ టి. ఎన్. సింగ్ ప్రదర్శించిన వైఖరి, డా. సంతోష్ భట్టాచార్యను వైస్ ఛాన్సులర్‌గా గవర్నరు ఎ. పి. శర్మ నియమించిన విధానం ఎంతో వివాదాస్పదంగా తయారైంది. మధురై-కామరాజ్ యూనివర్సిటీ వైస్ ఛాన్సులర్‌గా డా. కృష్ణస్వామిని రాష్ట్రప్రభుత్వం అభిప్రాయానికి విరుద్ధంగా

గవర్నరు ఖురానా నియమించి అనవసరమైన పేచీకి దిగారు. పరిణత మేధా సంస్కారం, నూతన విషయావిష్కరణ కుశలత, పరిపాలనానుభవం, శీఘ్రంగా నిర్ణయాలు గైకొనే సామర్థ్యం గల వారిని మాత్రమే వైస్ ఛాన్సులర్‌గా నియమించాలి. డా. అశుతోష్ ముఖర్జీ, డా. సి. ఆర్. రెడ్డి, డా. రాధాకృష్ణన్, రఘుపతి వెంకటరత్నంనాయుడు, ఆచార్య నరేంద్రదేవ్, లక్ష్మణస్వామి మొదలియార్ మొదలైన ప్రసిద్ధ విద్యావేత్తలను వైస్ ఛాన్సులర్లుగా నియమించినప్పుడు ఎవరైనా తప్పుపట్టారా ?

## ఆంధ్రప్రదేశ్ దృష్టాంతరం :

శాసనసభలో మెజారిటీ ఉన్న ఎన్. టి. రామారావు ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేసి గవర్నరు రాంలాల్ ఆ పదవిని భ్రష్టు పట్టించారు. అనంతరం గవర్నరుగా పని చేసిన కుముద్‌బెన్ జోషి నాలుగాకులు ఎక్కువే చదివినట్లు చెప్పవచ్చు. 1986 లో ఆమె హైదరాబాద్‌లోని రాజ్‌భవన్‌లో అడుగు పెట్టినప్పటి నుండి ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావుతో నువ్వా-నేనా ? అనే రీతిలో పోటీ పడిన సన్నివేశాలను ఎన్నో సృష్టించారు. గవర్నరు పదవిలో ఉన్నంత కాలం ఎవరైనాసరే, తమ రాజకీయ విభేదాలను, పార్టీ అభిమానాలను పక్కన పెట్టాలి. కానీ కుముద్‌బెన్ జోషి మాత్రం తమ పార్టీ విధేయతను చాటుకోడానికి ఎల్లప్పుడు ప్రయత్నిస్తూనే వచ్చారు. బిల్లులను ఆమోదం తెలపడంలో మితిమీరిన జాప్యం చేస్తూ 'తెలుగు దేశం' ప్రభుత్వాన్ని పెక్కుసార్లు ఇరకాటంలో పెట్టారు. చివరకు వైస్ ఛాన్సులర్ల నియామకంలో కూడా ఆమె రాజకీయ 'చాతుర్యం' ప్రదర్శించారు. తనకు తానుగా జిల్లాలలో పర్యటిస్తూ, ప్రజాస్వామ్యబద్ధంగా ఎన్నికైన రాష్ట్ర ప్రభుత్వం సామర్థ్యంమీద వ్యతిరేక వ్యాఖ్యలు చేస్తూ, ముఖ్యమంత్రి సహాయనిధికి కాకుండా తాను అధ్యక్షురాలిగా ఉన్న ఒక సంస్థకు విరాళాలు ఇవ్వవలసినదిగా ప్రజలను కోరుతూ ఒక విధంగా ఆమె పోటీ ప్రభుత్వాన్ని నడపదలచుకున్నట్లు ప్రవర్తించారు. అలాగే 'రిపబ్లిక్ దినోత్సవం' మొదలైన సందర్భాలలో తన 'ప్రభుత్వం' చేసిన మంచి పనులేవీ ప్రస్తావించకుండా ఎంతసేపు కేంద్ర ప్రభుత్వం ఘనతను కొనియాడడమే పనిగా పెట్టుకున్నారు. తాజాగా ఆమె చేసిన నిర్వాకం లోకాయుక్త నియామకంలో అడ్డు తగలడం, హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిని సంప్రదించికూడా రాష్ట్రప్రభుత్వం లోకాయుక్తను నియమిస్తే రకరకాల ప్రశ్నలు వేస్తూ గవర్నరు ఆ నియామకాన్ని ఆమోదించడంలో

రాత్సారం చేసి, చివరకు ఆ నియామకం జరగకుండా చేశారు. గవర్నరుకు రాజ్యాంగం అలాంటి అధికారాన్ని అనుమతించలేదు.

కడకు శ్రీ మురార్జీదేశాయ్ కూడా గవర్నర్ల నియామకంలో పక్షపాత వైఖరిని విడనాడలేదు. ఆయన ప్రధానిగా ఉన్న హయాంలో గవర్నర్లుగా నియమితులైన వారందరూ పాత కాంగ్రెసులో ఆయన సహచరులే.

బర్తరఫ్ చేసిన సందర్భం :

కేంద్రంలో కాంగ్రెస్ (ఐ) తిరిగి అధికారంలోకి రాగానే జనతా పాలనలో నియమించిన పదిమంది గవర్నర్లను తొలగించాలన్న అంశం పరిశీలనకు వచ్చింది. భగవత్ దయాళ్ శర్మ (మధ్యప్రదేశ్), జి. బి. తపసే (హర్యానా), కె. సి. అబ్రహాం (ఆంధ్రప్రదేశ్), రఘుకుల తిలక్ (రాజస్థాన్), ప్రభుదాస్ పట్వారీ (తమిళనాడు), శ్రీమతి జ్యోతి వెంకటాచలం (కేరళ), శ్రీమతి శారదాముఖర్జీ (గుజరాత్), గోవింద్‌నారాయణ్ (కర్నాటక), టి. ఎన్. సింగ్ (పశ్చిమ బెంగాల్) సాదిక్ అలీ (మహారాష్ట్ర) ఈ జాబితాలోని వారు. లోగడ ఒక సందర్భంలో పశ్చిమ బెంగాల్ గవర్నర్ శ్రీ ధామస్‌ను తొలగించాలనుకున్నపుడు కేంద్రానికి ఇటువంటి సంకట పరిస్థితే ఏర్పడింది. రాష్ట్రపతి ఇష్టపడినంత కాలమే గవర్నర్లు పదవిలో ఉంటారని కేంద్ర ప్రభుత్వం అభిప్రాయం. 'ఇష్టం' అన్న మాటకు ఒక రోజు ఆమోదంతోను, మరొక రోజు అసంతృప్తితో ఉండటం కాదని, తన తొలగింపుకు సరి అయిన కారణం ఉండాలని ఆయన వాదించారు. గవర్నరు పదవీ కాలం అయిదు సంవత్సరాలు. వారిని ఒక రాష్ట్రం నుంచి మరొక రాష్ట్రానికి బదిలీ చేశారే కానీ తొలగించలేదు. ఒక ధామస్ కేసు మినహా. నేషనల్ ఫ్రంటు అధికారంలోకి రాగానే కాంగ్రెసు ప్రభుత్వం నియమించిన గవర్నర్లను రాజీనామా చేయించింది. ఇదికూడా మంచి సాంప్రదాయం కాదు.

హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిని తాత్కాలిక గవర్నరుగా నియమించే సాంప్రదాయానికి స్వస్తి చెప్పి రాజీవ్ గాంధీ ప్రధానిగా ఉన్నప్పుడు పశ్చిమ బెంగాల్ గవర్నర్ ప్రొఫెసర్ నూరూల్ హుసేన్‌ను ఒరిస్సా తాత్కాలిక గవర్నరుగా కొంత కాలం నియమించారు. ఒక రాష్ట్రానికి ఫుల్‌టైం గవర్నరుగా ఉన్న వ్యక్తిని పొరుగు రాష్ట్రానికి పార్టు టైం గవర్నరుగా నియమించడంలోని ఔచిత్యం తీవ్ర విమర్శకు కారణమైంది.

మన గవర్నర్ల వేతనాలు ఎక్కువని జాతిపిత మహాత్మా గాంధీ అభిప్రాయ పడ్డారు. 1947 నవంబర్ 'హరిజన్' పత్రికలో ఆయన వ్రాసిన ఒక వ్యాసంలో ఈ అభిప్రాయం వ్యక్తమైనది. అతిసంపన్న దేశమైన అమెరికాలోని న్యూయార్క్ రాష్ట్ర గవర్నరు వేతనం 10 వేల డాలర్లు అంటే 3000 రూపాయలన్నమాట. ఇంకా చిన్న రాష్ట్రమైతే ఆ రాష్ట్రగవర్నరు వేతనం 1500 రూపాయలకే పరిమితం. భారత గవర్నర్లతో సమానమైన దక్షిణాఫ్రికా అడ్మినిస్ట్రేటర్ల వేతనం 3000 రూపాయలు. స్టాలిన్‌కు నెలకు 350 రూపాయలు మాత్రమే వేతనంగా చెల్లించే వారన్న సంగతి జగత్ ప్రసిద్ధి.

గవర్నర్ల నియామకంలో కొన్ని ముఖ్యాంశాలను పాటించవలసి ఉంది. అనుభవజ్ఞులనే గవర్నర్లుగా నియమించాలన్నది అందులో అతి ముఖ్యం. అప్పుడు ఆయన నైతికంగా రాష్ట్ర ప్రభుత్వాన్ని ప్రభావితం చేయగలుగుతాడు. స్థానిక పార్టీ రాజకీయాలకు, పదవుల కీచులాటలకు, ముఠాతత్త్వాలకు దూరంగా ఉంటూ గవర్నరు నిష్కర్షగా వ్యవహరించాలి. కేంద్ర రాష్ట్ర సంబంధాలను పటిష్టవంతముగా నిలబెట్టడం అనే సూత్రానికి గవర్నరు అంకితమై ఉండాలి. గవర్నర్ల నియామకం ఆయా రాష్ట్రాల ముఖ్యమంత్రులతో సంప్రదించిన మీదట జరగాలి.



# కేంద్ర-రాష్ట్ర సంబంధాలు

రాజ్యాంగ చట్టంలోని పదకొండవ అధ్యాయమంతా కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాల మధ్య ఉండవలసిన సంబంధ బాంధవ్యాల గురించి ప్రస్తావిస్తుంది. 1967 మే 22 వ తేదీన ద్రావిడ మున్నేట్రకజగమ్ నాయకుడు అన్నాదొరై మద్రాసు (తమిళనాడు) లో తమ పార్టీ అధికారంలోకి రాగానే తమ ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వంతో తగాదా రాకుండా చూస్తోందనీ, కేంద్ర ప్రభుత్వ సహకారం పొందటానికి కృషి చేస్తుందని ప్రకటించారు. కేంద్రంలోను, రాష్ట్రాలలోను విభిన్న రాజకీయ పార్టీలు అధికారంలో ఉన్నా అవి సామరస్యంగా మనుగడ సాధించ గలవన్న అభిప్రాయానికి ఆయన బలం చేకూర్చి పెట్టారు.

మొత్తం దేశానికి కాని, దేశంలోని ఒక భాగానికి కాని వర్తించే చట్టాలను అమలు పరిచే నిమిత్తం పార్లమెంటుకు ప్రత్యేకాధికారాలను రాజ్యాంగ సూత్రాలు ఇస్తున్నాయి. రక్షణ, విదేశీ వ్యవహారాలు, కరెన్సీ, కమ్యూనికేషన్స్, పౌరసత్వం, కేంద్ర రెవిన్యూ ఆడిట్ కి చెందిన ఇత్యాది మూరు అంశాల గురించి పార్లమెంటుకు చట్టాలు అమలుపరిచే అధికారాలు ఉన్నాయి.

రాష్ట్ర శాసన సభలకు శాసనాలు సృష్టించే ప్రత్యేకాధికారాల జాబితాలో శాంతి భద్రతలు, విద్య, వ్యవసాయం, భూమికౌలు, ప్రజారోగ్యం, పరిశ్రమలు ఇత్యాది అంశాలను పేర్కొనడం జరిగింది. ఇవిగాక ఇంకా యాభై అంశాల జాబితా ఒకటి ఉంది. పార్లమెంటు, రాష్ట్ర శాసనసభలు తమ శాసనాధికారాలను వాటిపై ఉపయోగించవచ్చు.

ఏ జాబితాలో పేర్కొనని అంశాల గురించి శాసనాలను సృష్టించే ప్రత్యేకాధికారులు పార్లమెంటు కున్నాయి. జాతీయ శ్రేయస్సు దృష్ట్యా రాష్ట్రాధికారాల జాబితాలో ఉన్న కొన్ని అంశాల గురించి శాసనాలు అమలు జరపాలని రాజ్యసభ

నిర్ణయించినట్లయితే అందుకు అధికారం పార్లమెంటుకు ఉంది. అయితే హాజరైన వారిలో మూడింట రెండు వంతుల సభ్యుల బలం, ఓట్లు ఆ నిర్ణయానికి అందాలి.

దేశంలో అత్యవసర పాలనను రాష్ట్రపతి ప్రవేశపెట్టినప్పుడు రాజ్యసభ ప్రకటనతో నిమిత్తం లేకుండా రాష్ట్ర శాసనసభలకున్న అధికారాలను రాష్ట్రపతి పార్లమెంటుకు హస్తగతం చేయవచ్చు.

స్వాతంత్ర్యం లభించిన మొదటి రోజులలో కేంద్రంలోను, దాదాపు అన్ని రాష్ట్రాలలోను ఒకే రాజకీయ పార్టీ (కాంగ్రెస్) అధికారంలో ఉండేది. కనుక అప్పట్లో ఈ సమస్య తలెత్తలేదు. అంతేకాదు, మన తొలితరం నాయకులలో జాతీయదృక్పథం, విశాలదృష్టి, సేవానురక్తి ప్రధానంగా ఉండేవి. వారంతా దేశ స్వాతంత్ర్య సమరంలో రాటుదేలిన జాతీయ యోధులు. కనుక వారి దృష్టి దేశమంత విశాలంగా ఉండేది. ఆనాటి ప్రధానమంత్రి వసుదైక దృక్పథం కలవారు. ముఖ్యమంత్రులు జాతీయ దృక్పథం కలిగిన నాయకులు.

## మారిన దృక్పథం :

కేంద్ర-రాష్ట్ర అధికారాల గురించి తొలి ఘర్షణ మూడు దశాబ్దాల క్రితం రెండవ తరం నాయకత్వం (శ్రీమతి ఇందిరాగాంధి) పైకి వస్తున్న రోజులలో కేరళలో ప్రారంభమైంది. ఆనాటి నుంచి రాజ్యాంగంలోని 356 అధికరణాన్ని కేంద్ర పాలక పక్షం ఇతర పక్షాలు అధికారంలో ఉన్న రాష్ట్రాలలో ఆ ప్రభుత్వాలను రద్దు చేయడానికి పలుమార్లు దుర్వినియోగం చేసింది.

ఆర్థిక రంగంలో కూడా రాజ్యాంగ నిర్మాతలు ఆశించినంతగా అభివృద్ధి జరుగడంలేదు. అధికారంలో ఉన్నవారు తమ రాష్ట్రానికో, తమ స్వంత నియోజకవర్గానికో మితిమీరిన అభిమానం చూపడం, రాజకీయంగా తమకు అనుకూలంగా లేనప్పుడు నిజంగా వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధిని విస్మరించడం జరుగుతున్నది. కేంద్రపాలకులు తమకు అనుకూలంగా లేని రాష్ట్రప్రభుత్వాలకు ఇవ్వవలసిన నిధులను అవసరమైన సమయంలో ఇవ్వకపోవడం జరుగుతున్నది. కేంద్రపాలకులు తమ అధికార పరిధిలో చూపుతున్న విధానాన్నే రాష్ట్రపాలకులు చూపుతున్నారు. ఉభయులూ తమ వైమనస్యాలను రాజకీయ ప్రయోజనాల కోసం ఉపయోగించుకుంటున్నారు.

ప్రణాళికా సంఘం :

దేశమంతటా అభివృద్ధి కృషిని సమతూకంలో జరిపించడానికి తగిన ఆర్థికాభివృద్ధి ప్రణాళికలను అమలు పరచవలసిన బాధ్యత రాష్ట్ర ప్రభుత్వాలది. ఆలోచనలో ప్రణాళికా సంఘం ఒక సలహా సంఘం మాత్రమే. కానీ, ఆచరణలో అలా జరగడం లేదు. అభివృద్ధి ప్రణాళికలకు నిధుల కేటాయింపు కూడా కేంద్ర ప్రభుత్వం ప్రణాళికా సంఘం చేతుల్లో పెట్టినందుకు రాష్ట్రప్రభుత్వాలు అభివృద్ధి నిధుల కోసం ప్లానింగ్ కమీషన్ దయాదాక్షిణ్యాల మీద ఆధార పడవలసి వస్తున్నది. ఈ విధంగా కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాలను లొంగదీసు కోవడానికి ప్రణాళికా సంఘాన్ని తన చేతి మంత్రదండంగా ఉపయోగిస్తున్నది. పార్లమెంటుకు ఎటువంటి బాధ్యత వహించని ప్లానింగ్ కమీషన్‌కు ఇన్ని అధికారాలెందుకో అర్థంకాదు. పరిపాలనా రథానికి ప్లానింగ్ కమీషన్ అనవసరమైన ఐదవ చక్రం. ఇదీ ప్రభుత్వంలో మరో ప్రభుత్వం అయిపోయింది. ప్రణాళికా సంఘానికి ఇప్పటి పరిస్థితిలో ఉన్న బాధ్యత లేదు. లేని అధికారమూ లేదు. ఈ విషయం పైననే నెహ్రూతో విభేదించి నాటి కేంద్ర ఆర్థిక మంత్రి జాన్ మత్తాయ్ రాజీనామా చేశారు.

ప్లానింగ్ కమీషన్ గురించి ప్రస్తావిస్తూ ప్రముఖ న్యాయశాస్త్ర నిపుణుడు నానీఫాల్కీవాలా కూడా ఇది రాజ్యాంగబద్ధమైన సంస్థ కాదని తమ అభిప్రాయాన్ని పేర్కొన్నారు. అయినా, ఇది ఇన్నాళ్లూ అసాధారణ రీతిలో తన అధికారాలను పెంచుకుంటూ వచ్చింది. ప్లానింగ్ కమిషన్ అర్థరాజకీయ స్వభావంతో కూడుకొని ఉంది. కేంద్రం రాష్ట్రాలకు పంపే ఆర్థిక వనరులలో 70 శాతం రాజ్యాంగబాధ్యత లేని యీ సంస్థ నియంత్రిస్తుంది. ఈ విధానంలో మార్పు రావాలంటే కేంద్రం పై దాన్ని తిరుగుబాటుగా భావించ వలసిన అవసరం లేదు.

శాంతి భద్రతల పరిరక్షణ పూర్తిగా రాష్ట్రప్రభుత్వాల వ్యవహారం. కేంద్ర బలాలను ఒక రాష్ట్రానికి పంపించవలసిన అవసరం కలిగితే ఆ రాష్ట్ర ప్రభుత్వముతో సంప్రదించి యీ పని చేయాలి. ఒక రాష్ట్రంలోని ఏ భాగాన్నయినా కల్లోలిత ప్రాంతమని ప్రకటించడానికి ముందు కేంద్రప్రభుత్వం ఆ రాష్ట్రప్రభుత్వం సలహా తీసుకోవాలి. ఇవి జరుగక పోవడంవలనే కేంద్ర-రాష్ట్రప్రభుత్వాల మధ్య ఇటీవలి కాలంలో ఘర్షణలు తలెత్తుతున్నాయి.

ఆర్థిక రంగంలో :

కేంద్రంతో రాష్ట్రప్రభుత్వాలకున్న ఇబ్బంది అంతా ఆర్థిక పరమైనదే. పరిశ్రమలలో 93 శాతం వరకు కేంద్రం తన ఆధిపత్యంలోకి తీసుకున్నది. వీటిలో అలంకార సామాగ్రి, కాగితం, గృహపరికరాలు, వంట సామాగ్రిలాంటి పరిశ్రమలుకూడా ఉన్నాయి. పైగా వీటికి ప్రధాన పరిశ్రమలని పేరు తగిలించడం హాస్యాస్పదం. వ్యవసాయం రాష్ట్రానికి సంబంధించినదే అయినా, వ్యవసాయ పరికరాలు మాత్రం కేంద్రం హక్కుగా ఉంది. దీనివల్ల పరస్పర పెనుగులాటకు అవకాశాలు లభిస్తున్నాయి.

ప్రజారంగంలో ఉన్న వనరులలో 70 శాతం కేంద్రప్రభుత్వ ఆధీనంలో ఉంటే, 25 రాష్ట్రాలకు లభించేది 30 శాతమే. ఏ ఫెడరల్ వ్యవస్థలో ఇంత దారుణం లేదనే విమర్శకు ఇది తావిచ్చింది. అంతేకాదు, విస్తరించటానికి అవకాశమున్న అన్ని రంగాలలో కేంద్రమే పన్నులు తీసుకుంటుంది. కార్పొరేషన్ టాక్సులలో రాష్ట్రాలకు వాటా లేనేలేదు. ఇది ఇవ్వాళ ఆదాయం పన్నుకంటె ఎక్కువగా ఉంది. ఆదాయంపన్ను మీద సర్‌చార్జీలలో రాష్ట్రాలకు వాటా లేదు.

ఇక ప్రజలనుంచి ప్రభుత్వం స్వీకరించే రుణాల సంగతి : 1950 లో ఈ రుణాలలో మూడింట రెండు వంతులు రాష్ట్రాలకు కేటాయించేవారు. ఇప్పుడు కేంద్రం వాటా సుమారుగా 90 శాతానికి చేరుకుంది. రిజర్వు బ్యాంకు నుండి రాష్ట్రాలు తీసుకునే ఓవర్ డ్రాఫ్టుల మీద కఠిన నిబంధనలు ఉన్నాయి. కేంద్రానికి మాత్రం ఏలాంటి పరిమితులు లేవు. రాష్ట్రాలు చెల్లించే వడ్డీరేటు కూడా ఎంతో ఖరమైనది. వ్యాపార బ్యాంకులు ఇచ్చే దాదాపు 40,000 కోట్ల రూపాయల అడ్వాన్సుమీద రాష్ట్రాలకు ఏమాత్రం అదుపులేదు.

కేంద్ర-రాష్ట్ర ఆర్థిక సంబంధాల విషయంపై 1983 లో శ్రీనగర్‌లో జరిగిన ప్రతిపక్ష పార్టీల నాయకుల సమావేశంలో చేసిన సూచనల వివరాలు ఇలా ఉన్నాయి.

1. కార్పొరేషన్ పన్నులద్వారాను, ఆదాయంపన్ను మీద సర్‌చార్జీ రూపకంగాను వచ్చే మొత్తాలలో రాష్ట్రాలకు తగిన వాటా ఇవ్వాలి.

2. ఆర్టికల్ 268, 269 లలో పేర్కొన్న అంశాలను అమలు పరచాలి. అంటే-ఈ ఆర్టికల్స్ ప్రకారం స్టాంపుడ్యూటీలు, మందులు, టాయిలెట్ సామాను

లపై ఎక్సయిజు సుంకాలను కేంద్రమే వసూలు చేస్తుంది. కానీ, వాటిని ఎక్కడ వసూలు చేస్తారో ఆ రాష్ట్రప్రభుత్వానికే ఇచ్చివేయడం జరుగుతుంది. కానీ, వ్యవసాయేతర ఆస్తుల వారసత్వ బదిలీలపై విధించే ఎస్టేటు డ్యూటీ, రైలు-సముద్రం-విమాన రవాణా సర్వీసులలో చేర్చబడే వస్తువులపై టర్మినెల్ టాక్సులు, రైల్వే చార్జీలపై పన్నులు, స్టాక్-ఎక్చేంజ్ వ్యవహారాలపై పన్నులు, వార్తాపత్రికల అమ్మకంపై విధించే పన్ను, పత్రికల వ్యాపార ప్రకటనలపై పన్నులు- ఇలాంటివి. అవి నిర్దేశించినరీతిలో రాష్ట్రపద్దులకు జమ కావడం లేదు.

3. ఎక్సయిజుపై అదనపు డ్యూటీలు విధించే పథకాన్ని నిలుపు చేయాలి.

4. వస్తువుల ధరలను పెంచడంద్వారా, వచ్చే అదనపు ఆదాయంలో 40 శాతం రాష్ట్రాలకు ఇవ్వాలి.

5. జాతీయ ప్రాధాన్యం గల వస్తువులుగా ప్రకటించటానికి ముందు వాటిని పునఃపరిశీలించాలి.

6. ఖనిజాలపై రాయల్టీలు రాష్ట్రాలతో సంప్రదించి వాటి వాటా చెల్లించాలి.

7. ఓవర్‌డ్రాఫ్టుల విషయమై రాష్ట్రాల అభిప్రాయాలు గౌరవించాలి.

8. రిజర్వుబ్యాంకు నిర్వాహక వర్గంలో రాష్ట్రాల ప్రతినిధులకు స్థానమివ్వాలి.

9. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలమధ్య ఆర్థిక, ద్రవ్య వ్యవహారాలను చర్చించడానికి ఒక వ్యవస్థను రూపొందించాలి. ఇవి ఎంతవరకు సాధ్యమో పరిశీలించడానికి కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాల సమావేశాలు వెంటనే జరగాలి.

సమాన స్థానం :

కేంద్ర రాష్ట్ర సంబంధాలమధ్య సామరస్య విధానం ఏర్పడినప్పుడే దేశం బలపడుతుంది. రాష్ట్రాల పట్ల కేంద్రం ధోరణి వలస దేశాల పట్ల నాటి బ్రిటిష్ ప్రభుత్వ ధోరణికన్న అన్యాయంగా ఉందని కాంగ్రెసేతర ప్రభుత్వాల వాదన. 'కేంద్రం' అనే పదం రాజ్యాంగంలో లేదని, రాష్ట్రాల యూనియన్ అనే భావాన్ని అది వ్యక్తపరుస్తుందని పాల్కీవాలా లాంటి రాజ్యాంగ నిపుణుల అభిప్రాయం. రాష్ట్రాలకన్నా కేంద్రానికి రాజ్యాంగం ప్రాధాన్యం కల్పించలేదని

ఆయన వాదన. దీన్ని పరిశీలనకు తీసుకుంటే మన రాజ్యాంగం ఏకాధికారవ్యవస్థ (యునెటరీ)గా రూపొందిందా? ఫెడరల్ విధానంగా రూపొందిందా తెలిసిపోతుంది.

భారత రాష్ట్రాల ఏర్పాటుగాని, విచ్ఛిత్తిగాని కేంద్ర శాసనాల ప్రకారం జరుగుతుంది. 'విచ్ఛిత్తి చేయరాని రాష్ట్రాలతో కూడిన, విచ్ఛిత్తి కతీతమైన రాష్ట్ర సమాఖ్య' అని పిలువబడే అమెరికన్ ఫెడరేషన్ వంటిదికాదు భారత సమాఖ్య. భారతదేశంలో రాజ్యాంగం ప్రకారం ఎన్నో కొత్త రాష్ట్రాలను సృష్టించారు. పాత రాష్ట్రాలు అదృశ్యమైనాయి. ఈ ఒక్క అంశమే చాలు కేంద్రప్రభుత్వమూ, రాష్ట్ర ప్రభుత్వాల ప్రతిపత్తిని వ్యక్తపరచటానికి. అంతే కాదు, దాదాపు అన్ని పరిపాలనా రంగాలలోను కేంద్ర పాలనా, రాష్ట్ర పాలనా ఒకదానితో ఒకటి ముడివేసుకుపోయి, 'మూడు కాళ్ళ పందెం'లా ఒకటి లేకుండా మరొకటి కదలలేని విధంగా మారిపోయాయి. భారత రాజ్యాంగానికున్న విశిష్టత, లోపం కూడా ఇదే. పరస్పర అవగాహనకు దోహదం చేస్తుంది కనుక ఇది మన రాజ్యాంగంలోని విశిష్ట అంశం. పార్టీ రాజకీయాలను పరిపాలనా విషయాలలో మిళితం చేసే అవకాశం ఉంది కనుక దీన్ని లోపంగానే భావించాలి. ఎందుకంటె పరస్పర విరుద్ధమైన పార్టీల అభిప్రాయాలవల్లనే ఇబ్బందు లేర్పడుతున్నాయి. కొన్ని అంశాలలో రాష్ట్రాలకు పూర్తి స్వాతంత్ర్యం ఉంది కనుక ఇది ఫెడరల్ రాష్ట్రం దేశం నుండి విడిపోరాదు కనుక ఇది యూనిటరీ. ఈ రెండంశాలు భారత రాజ్యాంగంలో స్పష్టంగా పేర్కొనబడ్డాయి.

కేంద్రాధిపత్యం :

రాష్ట్రాలపై కేంద్రం ఆధిపత్యం వహించే పెక్కు అంశాలు మన రాజ్యాంగంలో ఉన్నాయి.

1. రాజ్యాంగంలోని 249 ఆర్టికల్ 7వ షెడ్యూలులోని రెండో జాబితాను పరిశీలిస్తే రాష్ట్రాలకు కేటాయించిన అంశాలపై కూడా కేంద్రం చట్టాలను చేయవచ్చు.

2. భారత రాజ్యాంగం 257, 353, 365 ఆర్టికల్స్ ప్రకారం ఏ రాష్ట్ర ప్రభుత్వానయినా ఆదేశించే అధికారం కేంద్ర ప్రభుత్వానికి ఉంది. ఈ ఆదేశాలను పాటించని రాష్ట్రప్రభుత్వాలను అదుపు చేసే అధికారం కూడా కేంద్ర ప్రభుత్వానికి ఉంది.

3. 352 నుండి 356, 360 ఆర్టికల్స్ ప్రకారం రాష్ట్రప్రభుత్వాల అధికారాలను కేంద్రం హస్తగతం చేసుకొనవచ్చు.

4. 31 (ఎ), 31 (3), 200, 254 (2), 288 (2) ఆర్టికల్స్ ప్రకారం రాష్ట్రప్రభుత్వం ఆమోదించిన నిర్ణీత బిల్లులు చట్టరూపం ధరించాలంటే రాష్ట్రపతి వాటికి ఆమోదముద్ర వేయాలి.

తమిళనాడులో కరుణానిధి ప్రభుత్వం ఆశ్రిత పక్షపాతం, అవినీతి, ఆర్థిక అవకతవకలతో కూరుకుపోయిందని ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ నేరారోపణ చేస్తూ కరుణానిధిని సంజాయిషీ కోరారు. దానిపై కరుణానిధి రాష్ట్ర ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వానికి జవాబుదారీ వహించాలనే అంశం రాజ్యాంగంలో ఎక్కడా పొందుపరచబడలేదని, కనుక కేంద్రప్రభుత్వానికి సంజాయిషీ చెప్పుకోవలసిందిగా రాష్ట్రప్రభుత్వాన్ని ఆదేశించడం రాజ్యాంగ విరుద్ధమని వాదించారు. కానీ, రాజ్యాంగంలోని ఏడవ షెడ్యూలులో దర్యాప్తు సంఘాల విషయం ప్రస్తావనలో ఉంది. అంటే, కేంద్రప్రభుత్వానికి భారతదేశంలో ఏ ప్రాంతంలోనైనా, ఏ విషయం గురించి అయినా దర్యాప్తు చెయ్యడానికి అధికారం ఉంది. అయితే దర్యాప్తు సంఘాలు సమర్పించే నివేదికలు సలహాలు మాత్రమే కాని చట్టాలు కావు. 1952 లోనే అప్పటి కేంద్ర హోంమంత్రి కైలాస్‌నాథ్ కట్జూ యీ విషయం పార్లమెంటులో స్పష్టంగా చెప్పారు. భారతరాజ్యాంగం పేరుకు ఫెడరల్ రాజ్యాంగమే అయినా, బలిష్టమైన యూనిటరీ రాజ్యాంగ లక్షణాలు అందులో ఉన్నాయని సుప్రీం కోర్టు పలు తీర్పులలో స్పష్ట పరిచింది.

1964 లో పశ్చిమ బెంగాల్, కేంద్ర ప్రభుత్వాల మధ్య ఈ వివాదం కోర్టు కెక్కింది. భారత రాజ్యాంగంలో ఫెడరల్ రాజ్య పరిపాలనా వ్యవస్థ సూత్రాలు చేర్చినందున భారత ప్రభుత్వంతో పాటు రాష్ట్రప్రభుత్వాలు కూడా సార్వభౌమత్వంలో పాలుపంచుకుంటాయన్న పశ్చిమ బెంగాల్ ప్రభుత్వ వాదనను సుప్రీం కోర్టు త్రోసి పుచ్చింది. ఏ ఒక సాంప్రదాయక పరిపాలనా వ్యవస్థకు రాజ్యాంగం కట్టుబడిలేదని, పూర్తి సార్వభౌమతం రాష్ట్రాలకు ఉందని వాదించడం సరికాదని సుప్రీంకోర్టు స్పష్ట పరిచింది.

కేంద్రంలో ఒక రాజకీయ పార్టీ, కొన్ని రాష్ట్రాలలో ఇతర రాజకీయ పార్టీలు అధికారంలో వున్నందుకే కేంద్ర-రాష్ట్రాల మధ్య విభేదాలు తలెత్తు

తున్నట్లు పైకి కనిపించినా అసలు పోరాటం సిద్ధాంతాల మధ్య కాక అధికారాల మధ్యనే ఉంది.

నిజానికి రాజాజీ రెండవసారి మద్రాసు రాష్ట్ర (తమిళనాడు) ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు కేంద్రంలో సి. డి. దేశ్‌ముఖ్ ఆర్థిక మంత్రిగా ఉండేవారు. రాష్ట్రాలకు కేంద్రం ఆర్థిక సహాయం అందజేసే విషయంపై కేంద్ర-మద్రాసురాష్ట్ర ప్రభుత్వాల మధ్య అప్పుడే తీవ్రమైన వివాదం ఏర్పడింది. భారత గవర్నర్-జనరల్‌గాను, కేంద్ర మంత్రిగాను పని చేసిన రాజాజీ ఈ విధానానికి విసుగెత్తిపోయి కేంద్రం, రాష్ట్రాలను తన జమీందారీగా భావిస్తోందనీ, ఇది సహించరాని విషయమని ప్రకటించారు.

ఎవరికి ఇష్టం ఉన్నా, ఉండకపోయినా మన దేశంలో పూర్తిగా విప్లవాత్మకమైన మార్పులు వస్తేనే తప్ప ఫెడరల్-యూనిటరీ రాజ్యాంగ వ్యవస్థల మేలు కలయికగా ఉన్న ప్రస్తుత రాజ్యాంగంతోనే మనం సరిపెట్టుకొనవలసి ఉంది. ప్రజాస్వామ్యమంటే అధిక సంఖ్యాకుల పరిపాలన అన్నమాట. అల్పసంఖ్యాకుల అంగీకారంతో అధిక సంఖ్యాకుల పరిపాలన జరగాలి. వారి అంగీకారాన్ని నిరంతర చర్చలతో సాధించాలి. కేంద్ర-రాష్ట్ర సంబంధాల మౌలిక స్వరూపం కూడా ఇదే. మన రాజ్యాంగం ప్రజాస్వామ్యాన్ని ప్రకటించడమేగాక, ఆచరణలో పెట్టడానికికూడా నిర్దేశిస్తున్నది. ప్రజాస్వామ్యాన్ని పాలకులు చిత్తశుద్ధితో అమలు పరచితే కేంద్ర-రాష్ట్ర సంబంధాలమధ్య ఘర్షణ తలెత్తే అవసరం ఉండదు. కానీ, కేంద్రం తన నిర్ణయాన్ని విచరణా రహితంగా రాష్ట్రాలతో సంప్రదింపులు జరుపకముందే వాటిపై రుద్దితే యీ సంబంధాలు బెడిసిపోతాయి. అప్పుడు ఏ రాజ్యాంగ సవరణలోకూడా ఈ సంబంధాలను పూర్తి విచ్ఛిత్తినుండి కాపాడలేవు.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలమధ్య సంబంధాలు అధికారంలో ఉన్న ఆయా పార్టీల విధానాలపై కూడా ఎక్కువ ఆధారపడి ఉంటాయి. అధికార దర్పంతో, నువ్వా-నేనా? అనే ధోరణిలో ఒకరినొకరు తూలనాడే ప్రకటనలు చేసుకుంటూ, చౌకబారు ప్రతిష్ఠలకు కోసం ప్రాకులాడితే ఈ సంబంధాలు దురదృష్టకరంగా పరిణమిస్తాయి. కేంద్ర మంత్రులు అధికారదర్పంతో రాష్ట్ర ప్రభుత్వాలను కనీస సభ్యతా సత్కారాలను పాటించకుండా విమర్శలు చేస్తూఉంటే, రాష్ట్ర ప్రభుత్వాలు

కూడా ఆ వైఖరిలోనే సమాధానాలు ఇస్తూ ఉంటాయి. కేంద్రంతో సామరస్య ధోరణితో వ్యవహరించడమంటే ఆత్మాభిమానం తాకట్టు పెట్టే ధోరణిగా రాష్ట్ర ప్రభుత్వాలు భావించరాదు. ఒకరిద్దరు కేంద్రమంత్రుల దురుసుతనం కారణంగా మొత్తం వ్యవస్థనే బలహీనపరచడం రాష్ట్ర ప్రభుత్వాలకు కారణం కారాదు. ఒక కలసికట్టు దృక్పథంతో అశేష ప్రజావాహిని సంక్షేమం కోసం కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాలు వ్యవహరించాలి.

రాష్ట్రాలను కేంద్రం శాసించే విధానాన్ని ఇందిరాగాంధీ తమ పరిపాలనలో అమలు పెట్టారు. కనుక కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల ఘర్షణకు తీవ్రరూపం అప్పుడే మొదలయింది. కేంద్రానికి అనుకూలంగా ఉండే రాష్ట్రాలకు కేంద్ర సహాయంలో ప్రథమ పరిగణన ఉంటుందని ఆమె శాసించారు. కేంద్రానికి అనుకూలత అంటే ఆమె ఉద్దేశంలో కాంగ్రెస్ (ఐ)కి అనుకూలత అన్నమాట. దురదృష్టకర విషయం ఏమిటంటే ఈ ధోరణిలో కాంగ్రెసేతర ప్రభుత్వాలు కూడా ఉంటున్నాయి. అసలు ప్రాంతీయ పార్టీలు, స్థానిక పార్టీలు పుట్టుకురావడమన్నదే గత రెండు దశాబ్దాలుగా కేంద్రం రాష్ట్రాలవైపు అనుసరిస్తున్న విధానాల ఫలితమే అన్న విమర్శ కూడా ఉంది.

ఇప్పటి మారిన పరిస్థితులలో పన్నుల వాటాలోను, అభివృద్ధి వ్యవహారాల లోను రాష్ట్రాలకు ఎక్కువ అధికారాలు ఇవ్వాలి. ప్రాంతీయ అసమానతలు తొలగించడానికి కృషి జరగాలి. ఇరుగు పొరుగు రాష్ట్రాలమధ్య తలెత్తిన వివాదాలను అంతర్ రాష్ట్రమండలి ద్వారా పరిష్కారానికి కృషి జరగాలి. ఈ మండలి తీసుకున్న నిర్ణయాలను ఆయా రాష్ట్రాలు తప్పని సరిగా అమలుపరిచేటట్లు నియమాలు చేసుకోవాలి. రాజ్యాంగంలోని 263 అధికరణలో యీ అంశం పొందుపరచబడి ఉంది.

కేంద్రం బలహీనపడకూడదు; రాష్ట్రాలు బలంగా ఉండాలి అని అన్ని పార్టీలు సర్కారియా కమీషన్ ముందు వాదించాయి.

-(0)-

# చండీగఢ్ సమస్య

దేశ విభజన సమయంలో భారత-పాకిస్తాన్ సరిహద్దుల నిర్ధారణ కొరకు వైస్రాయ్ లార్డ్ మౌంట్‌బ్యాటెన్ తన ప్రసిద్ధ బ్యారిస్టర్ మిత్రుడైన రెడ్‌క్లిఫ్‌ని భారత దేశం పిలవనంపాడు. దేశ పరిస్థితులకు పూర్తిగా కొత్త అయినా రెడ్‌క్లిఫ్ పంజాబు సరిహద్దుల నిర్ణయంలో తనకు సహకరించడానికి భారత పాకిస్తాన్ దేశాలనుంచి ఒక్కో సలహాదారును తీసుకున్నాడు. భారత దేశం తరపున మెహర్ చంద్ ఖన్నా (తరువాత సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి) పాల్గొన్నాడు. అవిభక్త పంజాబుకు రాజధానిగా ఉన్న లాహోర్‌ను పెంచి పెద్ద చేసింది. ఎక్కువ సంఖ్యలో హిందువులు, సిక్కులే కనుక లాహోర్ నగరం భారత దేశానికి చెంది తీరవలసిందనే అభిప్రాయాన్ని ఖన్నా ప్రకటించాడు. కానీ దేశాన్ని ఆర్థిక దృష్టితో కాక, మత దృష్టితో విభజించడం వల్ల ముస్లింలు అధికంగా ఉన్న లాహోర్ నగరం పాకిస్తాన్‌కు పోయింది.

## రాజధానిలేని రాష్ట్రం :

దేశ విభజనతో తూర్పు పంజాబ్ రాజధానిలేని రాష్ట్రమయింది. కొంత కాలం రాష్ట్ర రాజధానిగా జలంధర్, ఆ తరువాత సిమ్లా పని చేసింది. సిమ్లా నగరం ఒక పర్వతాగ్రం మీద ఉంది. ఇక్కడ సమప్రదేశాలు చాలా తక్కువ. పర్వత పంక్తులలో దొరికిన చోట సౌధాలు కట్టుకున్నారు. ఇరకాటంగా ఉంటున్న ప్రధాన రహదారులలో మోటారు కార్లు, ఇతర వాహనాలు పోవడాన్ని బ్రిటిష్ వారు నిషేధించారు. అప్పుడు కాలినడకన, లాగే రిక్షాలలో, గుర్రాల మీద ప్రయాణాలు చేయవలసి వచ్చేది. గవర్నర్-జనరల్, గవర్నరు, కమాండర్ ఇన్ చీఫ్‌లకు మాత్రమే మోటారులో వెళ్ళే అనుమతి ఉండేది. అందువల్ల పంజాబుకు ఒక కొత్త రాజధాని నగరాన్ని నిర్మించి పెట్టాలనే అభిప్రాయం నెహ్రూకు కలిగింది.

ప్యారిస్‌కు చెందిన అంతర్జాతీయ వాస్తుశిల్పి కార్బ్యూజర్‌కు యీ పని అప్పజెప్పారు. 1951 లో ఆయన సమర్పించిన బ్లూప్రింట్లను నెహ్రూ పండితుడు ఆమోదించారు. భారత ఇంజనీర్ల సహకారంతో చండీగడ్ పట్టణ నిర్మాణం ప్రారంభమైంది. ఈ నగరం స్వాతంత్ర భారత స్వేచ్ఛా వాయువులకు సాంకేతంగా తయారైంది. దీని నిర్మాణం ఇంకా పూర్తి కాక మునుపే 1953 లో పంజాబ్ ముఖ్యమంత్రి ప్రతాప్‌సింగ్ కైరాన్ తన ప్రభుత్వాన్ని చండీగఢ్‌కు తరలించేశాడు.

భాషా రాష్ట్రాల నిర్మాణానికి ముందు పంజాబ్ రాష్ట్రం పాటియాలా తూర్పు పంజాబ్ రాష్ట్రం పేరుతో 'బి' రాష్ట్రంగా ఉండేది. డా॥ పార్మార్ ఒత్తిడికి లొంగి నెహ్రూ హిమాచల్‌ప్రదేశ్‌ను పంజాబు నుంచి వేరు చేసినప్పుడే పంజాబ్‌లో వేర్పాటువాదానికి బీజం వేసి నట్లయింది. రాష్ట్రాల పునర్నిర్మాణ సమయంలో ఈ తప్పును సవరించుకొని, హిమాచల్‌ప్రదేశ్, పాటియాలా తూర్పుపంజాబ్ రాష్ట్రాలను కలిపి తూర్పు పంజాబ్ రాష్ట్రాన్ని ఏర్పరిచారు.

తూర్పు పంజాబు 1966 లో మరొకసారి చీలింది. ఈసారి రాష్ట్రం మూడు పాయలుగా విడిపోయి పంజాబ్‌తో పాటు హిమాచల్‌ప్రదేశ్, హర్యానా అనే రెండు కొత్తరాష్ట్రాలు భారతదేశ పటంలో ఆవిర్భవించాయి. హిమాచల్‌ప్రదేశ్ సిమ్లా నగరాన్ని రాజధానిగా చేసుకుంది. పంజాబు, హర్యానాలకు చండీగఢ్ రాజధానిగా ఉండిపోయింది. ఈ నగరాన్ని కేంద్రపాలిత ప్రాంతంగా చేసుకున్నారు.

రాష్ట్ర విభజనతో ఎక్కువ లాభం హిమాచల్‌ప్రదేశ్‌కు లభించింది. హర్యానా, పంజాబ్‌ల మధ్య తలెత్తుతున్న విభేదాలను తనకు ఉపయోగపుగా మలచుకొని ఆ రాష్ట్ర ముఖ్యమంత్రి డా. పార్మార్ బ్రిటిష్ వారి హయాంలోనే సుందర నగరంగా రూపుదిద్దుకున్న సిమ్లాను, ప్రసిద్ధమైన కాంగ్రా అడవులను, భాక్రాడామ్‌ను, సట్లెజ్ నదీ తీరాన్ని హిమాచల్ బుట్టలో వేసుకున్నాడు. ఈ విధముగా అతి ముఖ్యమైన ప్రాంతాలు పోయిన తరువాత పంజాబ్ మేల్కొన్నది. చండీగఢ్ అయినా తమకు దక్కాలన్న పట్టుదల పంజాబు వాసులకు కలిగింది. ఇక్కడ ఒక సంగతి గ్రహించడం చాలా అవసరం. శిక్కులకు తమది ప్రత్యేక జాతి అనే భావన రంజిత్‌సింగ్ పరిపాలనా కాలంలోనే కలిగింది. అప్పుడు తమ జాతికి లాహోరు కేంద్రస్థానంగా వాడుకున్నారు. లాహోరు పోయిన తరువాత వారు తమకు లభించిన పంజాబును భాషా ప్రాతిపదిక మీద కాక మత ప్రాతిపదిక

మీద లభించిన రాష్ట్రంగా భావించుకున్నారు. అయితే వారి సంఖ్య అంత ఎక్కువ ఏమీకాదు. వారు చేసే చెక్క భజనల చప్పుడు ఎక్కువ.

1966లో భాష ప్రాతిపదికమీద పంజాబ్‌ని విభజించినప్పుడు సరిహద్దుల నిర్ణయాని కోసం ఏర్పడిన షా కమీషన్ తన తీర్పులో చండీగఢ్ నగరం హర్యానాకు లభించాలని చెప్పింది. విశాల రాష్ట్రానికోసం నిర్మించిన చండీగఢ్‌ని పరిమిత ఉపయోగంతో హర్యానా పరం చేయటం అప్పటి ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీకి ఇష్టంగా ఉండలేదు. కనుక షా కమీషన్ తీర్పుపై ఏలాంటి చర్య తీసుకోలేదు. కాలం గడిచినకొద్దీ చండీగఢ్ సమస్య ఒక జటిలసమస్యగా తయారై ఇది ఇటు హర్యానాకు అటు పంజాబ్‌కు ప్రతిష్ఠాకరమైన అంశంగా నిలిచి పోయింది. చండీగఢ్ తమ రాష్ట్రానికే చెందాలని కాంగ్రెస్ నాయకుడు దర్శన్ సింగ్ ఆమరణ ఉపవాస దీక్షబూని అసువులు బాసాడు. దీనితో రాష్ట్రమంతటా అలజడులు మొదలైనాయి.

తన ప్రత్యర్థుల బెదిరింపులకు లొంగిపోయి వారు కోరిన వరాలను ఇచ్చి వేయడం ఇందిరాగాంధీ తత్వానికి విరుద్ధం. కనుక యీ విషయంలో ఏలాంటి బెదిరింపులకు ఆమె లొంగదలచలేదు. ఒకసారి లొంగిపోతే కోరికల గుర్రాలకు కళ్ళేలు వేయడం కష్టం. ఇకమీదట ప్రభుత్వం నెరపడం దుర్లభమని ఇందిరా గాంధీకి తెలుసు.

1971లో ఒక పరిష్కార మార్గం కనుగొన్నారు. పంజాబులో హిందీ మాట్లాడే ప్రాంతాలు కొన్ని ఉండిపోయాయి. వాటిని హర్యానాకు అప్పగించాలి. అవి తమకు ఇచ్చివేస్తేనే చండీగఢ్‌ని వదిలేది లేదని హర్యానా వాదన. అబోహర్, ఫజల్లా ప్రాంతాలను హర్యానాకు ఇచ్చివేసి చండీగఢ్ పంజాబ్‌కు చెందేటట్లు దాదాపు ఒక నిర్ణయమైన సమయంలో ఈ సమస్యకు ఇందిరాగాంధి తాత్సారంచేస్తూ అంతిమ పరిష్కారం సూచించలేకపోయారు. అకాలీలకుకూడా ఈ నిర్ణయం ఆమోదంగానే ఉంది.చండీగఢ్ తమకు లభిస్తుందన్న ఆశతో చండీగఢ్ కోసం దీక్షబూనిన సంత్ ఫతేసింగ్ ఈ పరిష్కారాన్ని ఆమోదించి తన దీక్షను విరమించాడు కూడా.

దేశానికి స్వాతంత్ర్యం లభించిన తరువాత ఎన్నో కొత్త రాష్ట్రాలు వెలి శాయి. కాని రాజధాని నగర విషయంలో పంజాబు ఎదుర్కొంటున్నటువంటి

జటిల సమస్య ఏ రాష్ట్రానికి ఎదురవలేదు. మద్రాసు విడిచిపెట్టిన ఆంధ్రులకు అనతికాలంలోనే హైదరాబాద్ నగరం లభించింది. బొంబాయిని విడిచిపెట్టిన గుజరాతీలు అహమ్మదాబాద్‌ని తమ రాజధానిగా చేసుకున్నారు. షిల్లాంగ్‌ని వది లేసిన అస్సామీలకు గౌహతీ రాజధాని నగరమైంది. 1966 షా కమీషన్ తీర్పును దృష్టిలో పెట్టుకొని చండీగడ్‌ని హర్యానాకు ఇచ్చివేసినా పంజాబువారు మరొక రాజధాని నగరాన్ని కట్టుకునేవారు. అబోహర్, ఫజల్లాను రాజధాని నగరంతో ముడిపెట్టకపోయినా చండీగడ్ పంజాబుకు వచ్చేది. వాస్తవంలో అకాలీలు కూడా చాలాకాలంవరకు చండీగడ్ తమకు కావాలని పట్టుపట్టనేలేదు. తాత్సారం సమస్యను జటిలంగా మార్చుతు పోయింది.

1985లో మథ్యూ కమీషన్ ఏర్పడింది. ఈ కమీషన్ ఒప్పందం ప్రకారం కేంద్రపాలిత ప్రాంతమైన చండీగడ్ పంజాబుకు, పంజాబు రాష్ట్రంలోని హిందీ మాట్లాడే ప్రాంతాలు హర్యానాకు 1986 జనవరి 26న ఒకేసారి బదిలీ కావలసి ఉంది. కానీ హర్యానాకు బదిలీ కావలసిన ప్రాంతాల విషయంలో మ్యేథూ కమీషన్ ఒక నిర్ణయం ప్రకటించనందున చండీగడ్ బదిలీ కూడా 'కొద్దికాలం' పాటు వాయిదా పడింది.

హిందీ ప్రాంతాల నిర్ధారణలో మథ్యూ కమీషన్ విఫలమైనందుకు ఆ తరువాత వచ్చిన వెంకటరామయ్య కమీషన్ అబోహర్, ఫజల్లా బదులు 70 వేల ఎకరాల హిందీ ప్రాంతాన్ని హర్యానాకు ఇవ్వాలని తీర్పు నిచ్చింది. వెంకట్రామయ్య కమీషన్ 45వేల ఎకరాలను ఉభయజన ఆమోదంతో గుర్తించింది. మిగిలిన 35వేల ఎకరాలు సమరసభావంతో నిర్ణయించుకోవాలని కోరింది. ఈ పథకంతో లాభం పొందినది హర్యానాయే. చండీగడ్ తన చేతి కిందికి రావడం మినహా పంజాబుకి జరుగేది ఏమీ లేదు.

లాంగోవాల్-రాజీవ్‌గాంధీ మధ్య కుదిరిన ఒప్పందం సమస్య పరిష్కారానికి ఒక మంచి మార్గంగా కనిపించినా, ఈ ఒప్పందాన్ని రూపొందించినవారు నానా సమస్యలను అందులో ఇరికించి ఈ పరిష్కారాన్ని కాగితాలు దాటకుండా చేశారు.

## టెర్రరిస్టుల బీభత్సం !

గత ఎనిమిది సంవత్సరాలనుండి పంజాబు టెర్రరిస్టు ఉద్యమాలతో అట్టుడికిపోతున్నది. అకాలీదళ్ నాయకత్వంలో ఉద్యమం 1981లో ప్రారంభ

మయింది. దేశ సమైక్యతకు, సమగ్రతకు భంగకరంగా, కేంద్రంలోని ఇందిరా కాంగ్రెసు ప్రభుత్వం తన ప్రయోజనాల నిమిత్తం యీ ఉద్యమాన్ని ఉపయోగించుకున్నదని కొందరు విమర్శకుల అభిప్రాయం. కేంద్ర ప్రభుత్వం అమలు పరచటానికి అకాలీదళ్ పది అంశాల చార్టర్‌ని కేంద్ర ప్రభుత్వానికి సమర్పించింది. 1973 అక్టోబరు 16, 17 నాటి ఆనందపూర్ సాహెబ్ తీర్మానం ఈ చార్టరుకు ప్రేరణ కలిగించింది. చార్టరులోని ముఖ్య విషయాలు- 'విభిన్న భాషలు, మతాలు, సంస్కృతులతో కూడిన భౌగోళిక ఖండం భారతదేశం. ఇది ఒక ఫెడరల్ రిపబ్లిక్. మతపరమయిన, భాషా సంబంధమైన అల్ప సంఖ్యాక వర్గాల ప్రాథమిక హక్కులను కాపాడడానికి, ప్రజాతంత్ర సాంప్రదాయాల డిమాండ్లను పూర్తి చేయటానికి, ఆర్థికాభివృద్ధి పథకం వేయటానికి, కేంద్ర రాష్ట్ర సంబంధాల నిర్వచనంలో మార్పు చేసి ప్రాథమికంగా భారత రాజ్యాంగ వ్యవస్థకు నిజమైన ఫెడరల్ స్వరూపం కలిగించడం అవసరం'. చార్టరులోని 6 అంశాలు మతపరమైనవి. ఇవి ఢిల్లీ గురుద్వారాలకు ప్రజాతంత్ర ఎన్నికలు, అఖిల భారత స్థాయిలో గురుద్వార చట్టం, హరిద్వార్, హృషికేష్, కురుక్షేత్ర, కాశీ సరళిలో అమృత్‌సర్‌కు పవిత్ర నగర స్థాయి, జాతీయ, అంతర్జాతీయ విమాన ప్రయాణాలలో కృపాణాలు ధరించడానికి శిక్కులకు అనుమతి, కీర్తనలు ప్రసారం చేయడానికి స్వర్ణదేవాలయములో హరిమందిర్ రేడియో స్థాపన, పాకిస్తాన్‌లోని గురుద్వారాలకు సిక్కు ఆలయాలకు యాత్రిక బృందాలను పంపించే హక్కును, స్థానిక శిక్కు ఆలయాల నిర్వహణకు సేవేదార్లను నియమించే అధికారాన్ని పునరుద్ధరించడం, మిగిలిన నాలుగు పంజాబు ప్రజలందరికీ సంబంధించిన ప్రజాతంత్ర అంశాలు. అవి, రాష్ట్రాలకు హెచ్చు అధికారాలు, స్వయం ప్రతిపత్తి ఇవ్వడానికి అవసరమైన రాజ్యాంగ సవరణ, భాషా ప్రాతిపదిక మీద పంజాబు ప్రాంతాలను చండీగఢ్‌ను పంజాబుకు విలీనం చేయడం, రాష్ట్రంలోని డాములను, ప్రాజెక్టులను పంజాబుకు అప్పగించడం, పంజాబు, హర్యానా, రాజస్థాన్‌ల మధ్య నదీ జలాలను తిరిగి పంపిణీ చేయడం, పారిశ్రామిక ఉత్పత్తుల సూచికలకు అనుగుణంగా వ్యవసాయ ఉత్పత్తులకు లాభప్రదమైన ధరలను నిర్ణయించడం, అకాలీల డిమాండ్లతో మత పరమైన అంశాలలో చాలా వాటిని ఆమోదిస్తూ కేంద్ర ప్రభుత్వం ఏక పక్షంగా ప్రకటించింది. మిగిలిన ప్రజాతంత్ర డిమాండ్ల సంగతి చర్చకు రాలేదు.

కేంద్ర ప్రభుత్వం అకాలీలతో చర్చలు జరుపుతుండగానే భింద్రన్ వాలా నాయకత్వంలోని తీవ్రవాదులు మితవాద అకాలీల మీద పైచేయి సంపాదించు కున్నారు. ఈ సమయంలో శ్రీమతి ఇందిరాగాంధి భింద్రన్ వాలాతో చేతులు కలిపారు. అమృత్‌సర్‌లోని స్వర్ణ దేవాలయంలో తీవ్రవాదులు ఆయుధాలు ప్రోగు చేస్తున్నా చిరకాలం ఆమె మౌనం వహించారు. ఇది స్వర్ణదేవాలయంమీద సైనిక చర్య అనంతరం, ప్రధాన మంత్రి ఇందిరాగాంధీ హత్య తరువాత విపరీత కల్లోలాలకు దారి తీసింది. దేశ మంతటా దీనితో సామాజిక, రాజకీయ వాతావరణం కలుషితమయింది. రాజీవ్ గాంధీ అధికారంలోకి రాగానే 1985 లో అకాలీ మిత వాద నాయకుడు సంత్ లాంగోవాల్‌తో ఒక ఒప్పందం కుదరడంతో ఆశాజనక మైన పరిస్థితులు ఏర్పడ్డాయి. గతంలోని ప్రమాదకరమైన విధానాలను మార్చ వలసిన అవసరం ఉందని గ్రహిస్తున్న సూచనలు కనిపించాయి. 1985 లో పంజాబ్‌లో ఎన్నికలు జరిగాయి. సుర్జీత్‌సింగ్ బర్నాలా ముఖ్యమంత్రిగా అకాలీ మంత్రి వర్గం ఏర్పడింది. దీనితో తీవ్రవాదులు మరింత ఏకాకులయ్యారు. కానీ, కేంద్రప్రభుత్వం పంజాబు ఒప్పందాన్ని అమలు పరచక పోవడంతో తీవ్రవాదు లకు పునర్జన్మ లభించి నట్లయినది. శాంతి భద్రతలు క్షీణించాయన్న సాకుతో హర్యానా ఎన్నికల సందర్భంగా బర్నాలా ప్రభుత్వాన్ని రద్దుచేసి ప్రజాతంత్ర వాదులను మూసివేశారు. 1987 మే నుంచి పంజాబ్‌లో రాష్ట్రపతిపాలన కొనసాగుతున్నది. 'ఆపరేషన్ బ్లూస్టార్', 'ఆపరేషన్ వుడ్‌రోజ్', 'ఆపరేషన్ బ్లాక్ థండర్' లాంటి సైనికచర్యలు పంజాబు సమస్యను పరిష్కరించలేకపోతు న్నాయి. పంజాబ్ సమస్య పరిష్కార విషయంలో కేంద్రానికి నిర్దుష్టమైన అభి ప్రాయాలు లేవని టెర్రరిస్టులకు తెలిసిపోయింది. ఈ సంగతి తెలుసుకున్న బీభత్స వాదులు మరింత విజృంభిస్తున్నారు.

## జాతీయ సమస్య :

ఏ దృష్టితో చూసినా పంజాబు సమస్య జాతీయ సమస్యే కాని ప్రాంతీయ సమస్య కాదు. పంజాబు సమస్యకు చారిత్రకమైన కొన్ని కారణాలున్నాయి. బ్రిటీష్ వారి 'విభజించి పాలించు' సిద్ధాంతం స్వాతంత్ర్యానంతరం కూడా కొన సాగడం విచారకరం. బ్రిటీష్ వాళ్ళ తమ స్వార్థం కోసం వేలాది సంవత్సరాలు సమైక్య చరిత్ర కలిగిన భారతీయుల మధ్య అనైక్యత సృష్టించి, దేశాన్ని చిన్నా భిన్నం చేసేందుకు భాషను, కులాన్ని, మతాన్ని, తెగలను ఆయుధాలుగా వాడు

కున్నారు. ఆ విధంగా సమస్యలు సృష్టించారు. కావాలనే వారే తిరిగి వాటిని పరిష్కరించారు. అలాగే అవసరమైనప్పుడల్లా ఆ సమస్యలను సృష్టించారు. ఇదే పంజాబులోను జరిగింది. ప్రత్యేక నియోజకవర్గాల ఏర్పాటు ద్వారా (1935) బెంగాల్ విభజన ద్వారా (1905) సిక్కులకు ప్రత్యేకించి 'వీరజాతి' గా (మార్షల్ రేస్) స్తుతించడం ద్వారా 1857 తిరుగుబాటు తరువాత మొదట్లో ముస్లింలను అణచివేయడం ద్వారా, ఆ తరువాత తిరిగి వారికే రాయితీలు ప్రకటించడం ద్వారా, బ్రిటిష్ పాలకులు భారత ప్రజలను విభజించి పాలించారు. ఒకరి కొకరు తగాదాలుపడి కునారిల్లేటట్లు చేశారు. ఇండియాను విచ్ఛిన్నం చేయడంలో కొంత అమెరికా 'కుట్ర' కూడా ఉన్నట్లు పలువురి అభిప్రాయం. ఈ కుట్ర ఏమిటంటే- వాయువ్యదిశలో పంజాబు, ఆగ్నేయ దిశలో అస్సాం- ఇండియా విచ్ఛిత్తికి అనువైన స్థావరాలు. ఈ రెండు ప్రాంతాలు భారతదేశం నుంచి పూర్తిగా విడివడిపోతే మిగతా భారతదేశం చుట్టూ ఏర్పడే సామ్రాజ్యవాద స్థావరాలు 'మిగతా దేశాన్ని' మరింతగా చిన్నాభిన్నం చేయడం తేలిక.

అందువల్ల పంజాబ్ సమస్య కొందరు చిత్రిస్తున్నట్లు హిందూ-సిక్కు సమస్య కానేకాదు. హిందూ, ముస్లిం, సిక్కు సామాన్య ప్రజానీకం ఎల్లప్పుడూ శాంతిని, సామరస్యాన్ని కోరుతుంటారు. ఎటు తిరిగి మత దురహంకార శక్తులే 'హిందూ సంఘటన్', 'హిందూ సురక్షా సమితి', ఒకవైపునుంచి, దళ్‌ఖాల్సా, జబ్బార్ ఖాల్సా మరొకవైపునుంచి పంజాబు ప్రజా జీవితాన్ని చిందరవందర చేస్తున్నారు. 'మతం ప్రజలపాలిటి మత్తుమందు' అని కారల్ మార్క్స్ ఏనాడో చెప్పాడు. దగాపడిన ప్రజలకు తమ బాధలను వ్యక్తం చేసుకునే ఒక సాధనంగా మతాన్ని మార్క్స్ భావిస్తూ, దురహంకారుల చేతులలో మతం మత్తుమందుగా మారుతుందని వ్యవహరించారు. ఇప్పటి పంజాబ్ సమస్యలో మార్క్స్ సూత్రం అక్షరాల నిజమయింది. ఇక్కడ ఒక సంగతి గుర్తించుకోవడం చాలా ముఖ్యం. సిక్కులంటే అర్థం ఉగ్రవాదులని కాదు. ఉగ్రవాదులంటే అర్థం అకాలీలని కాదు. ఈ విభజన తెలుసుకునేంతవరకు పంజాబు సమస్యను మనం గందరగోళ పరుస్తూనే ఉంటాం.

[ -0- ]

# డార్జిలింగ్ పరిష్కారం

డార్జిలింగ్ కొండప్రాంతంలో నేపాలీ జాతీయవాదానికీ, గుర్కా నేషనల్ లిబరేషన్ ఫ్రంటు (జి. ఎన్. ఎల్. ఎఫ్.) ఉద్యమానికి సుభాష్ ఘీషింగ్ కారణమని, విదేశీ ప్రభుత్వాలు ఆయనన్నందుకు ప్రోత్సహించి సహాయ పడుతున్నాయని చాలా మంది అభిప్రాయ పడుతున్నారు. పోతే, పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రి శ్రీ జ్యోతిబసు యీ విషయమై చేసిన విమర్శ మరింత తీవ్రంగా ఉంది. జి. ఎన్. ఎల్. ఎఫ్. ఉద్యమానికి నేపాల్ ప్రభుత్వమే ఆర్థిక సహాయం చేస్తోందని, గుర్ఖా తీవ్రవాదులకు గెరిల్లా యుద్ధ పద్ధతిలో శిక్షణ యిస్తోందని ఆయన విమర్శించారు.

వాస్తవంలో జాతీయతా గుర్తింపు కావాలన్న గుర్ఖా ప్రజల డిమాండ్ 150 సంవత్సరాల కిందటే ఆవిర్భవించింది. 19 వ శతాబ్దం మూడవ దశాబ్దిలో అప్పటి స్వతంత్ర రాజ్యమైన సిక్కింలోని డార్జిలింగ్‌ను సింగిల్లా పర్వత ప్రాంతాన్ని బ్రిటిష్ ప్రభుత్వం కౌలుకు తీసుకున్నప్పుడే యీ సమస్య ప్రారంభమయింది. బ్రిటిష్ పాలకుల 'విభజించి పాలించే' పద్ధతులు గుర్ఖాలు, బెంగాలీలు, మార్వాడీల మధ్య అపోహలను పెంచాయి. 1947 లో స్వాతంత్ర్యం సముపార్జన అనంతరం కేంద్రస్థాయిలోను, రాష్ట్రస్థాయిలోను ప్రభుత్వాలు కూడా వాటిని నిర్లక్ష్యం చేయడంతో అణచివేత విధానాలకు గురయిన గుర్ఖా ప్రజలలో క్రమంగా ప్రతిఘటన పెరిగింది. అయితే కాంగ్రెస్ మాజీ ట్రేడ్ యూనియన్ నాయకుడు, మాజీ సైనిక హవల్దారు అయిన సుభాష్ ఘీషింగ్ వెలుగులోకి రావడంతో రెండున్నర సంవత్సరాల కిందట గుర్ఖాల ఉద్యమం వేగంగా పుంజుకుంది. సిక్కిం, మణిపూర్, నాగాలాండ్ రాష్ట్రాలలో జరిగిన వివిధ సంఘటనల వల్లనే గుర్ఖాల ఫ్రంటు ఉద్యమం ఇంతటి తీవ్రరూపం దాల్చింది.

1930 వరకు సుభాష్ ఘీషింగ్ పేరు ఎవరికి తెలియదు. అతడు కొంత కాలం సైన్యంలో పని చేసినా అక్కడ పెద్ద గుర్తింపు లభించే పనులేవీ అతడు చేయలేదు. తరువాత నవలా కారుడు కావాలని విఫల ప్రయత్నం చేశాడు. ఇంతటితో అతని మనస్సు రాజకీయాలవైపు మరలింది. అతడు ఊరూర తిరిగి 1984 పార్లమెంటు ఎన్నికలలో ఎవరు పాల్గొనవద్దని ప్రచారాలు చేశాడు. కానీ, అతని బాయ్‌కాట్ ఉద్యమం ఆరు పోలింగ్ స్టేషన్లలో పాక్షికంగానే పని చేసింది. ఈ అపజయాలతో ఘీషింగ్ రాజకీయ రంగం వదులు కొనలేదు. ఎవరు విన్నా, వినకపోయినా తన ప్రచారాలు మాత్రం అతడు మానలేదు. అతని యీ దృఢ నిశ్చయమే ప్రజల దృష్టిలో ఘీషింగ్‌ని ఒక హీరోగా చేసి వేసింది.

గుర్ఖాల ఉద్యమం మత పరమైనదీ, దురభిమానంతో కూడుకున్నదనే భావం అర్థరహితం. కొంతమంది ఉద్యమ నాయకులకు సంబంధించి అయితే ఇది నిజమే కావచ్చు. కానీ మొత్తం ఉద్యమమే అలాంటిది కాదు. వీరు దశాబ్దాల తరబడీ ఇండియాలో ఉంటూ ఇప్పటికీ ఇంకా నేపాల్‌తో సంబంధాలు కోల్పోలేదు. అందుకే వారిని ఇప్పటికీ గుర్ఖాలుగానే పిలుస్తారు.

డార్జిలింగ్ కొండప్రాంతాలలో నివసించే గుర్ఖాలలో 95 శాతం మంది నేపాలీ భాషే మాట్లాడతారు. వారిలో 'లేప్చా' తెగవారు గుర్ఖాల ఉద్యమాన్ని బలపరుస్తుండగా టిబెటు నుండి వలస వచ్చిన బుతియాలు మాత్రం ఉద్యమాన్ని వ్యతిరేకిస్తున్నారు. ఇక వైద్యం, విద్యాబోధన వంటి వృత్తి రంగాలలో ఉంటూ స్థానికంగా ప్రాబల్యం సంపాదించుకున్న బెంగాలీలు కూడా చాలా వరకు నేపాలీ భాష మాట్లాడతారు. వీరుకూడా గుర్ఖా ఆందోళనలను సమర్థిస్తున్న వారి సంఘాలలో సభ్యత్వం పొందారు.

గత చరిత్రలో డార్జిలింగ్ ప్రాంతంలో తామెంతో అణచివేతకు గురయ్యామని అందువల్ల తమకు జాతీయ పరమైన గుర్తింపు కావాలని ఆ ప్రాంతంలోని గుర్ఖాలు గట్టిగా కోరుతున్నారు. తాము తిరిగి నేపాల్‌కు తిరిగి పోయే సమయము వచ్చే వరకు తమ స్వంత ప్రాంతంలో ఇకముందు ఏ మాత్రం అణచివేతను సహించ జాలమని దేశంలోని ఇతర పౌరులవలె తమకు హక్కులు ఉండాలని వారు కోరుతున్నారు. తాము తిరిగి నేపాల్ వెళ్ళిపోయే ప్రసక్తి లేదని వారు అంటున్నారు.

ఇండియాలో నివాసముండటానికి, ఉపాధి గడుపుకోడానికి అవకాశమిచ్చి గుర్ఖాలను విదేశ పౌరులుగానే పరిగణించడానికి ఇండో-నేపాల్ ఒప్పందం అవకాశం కలిగించింది. అయితే ఈ ఒప్పందాన్ని గుర్ఖాలు ఆక్షేపిస్తున్నారు. గుర్ఖాలను గౌరవనీయమైన మైనారటీ వర్గంగా గుర్తించి వారికి పౌరసత్వం కల్పించితే తప్ప గుర్ఖాల సమస్యకు పరిష్కారం లభించడం లేదు. అంతేకాదు, గుర్ఖాల ప్రాంతంలో సరి అయిన సదుపాయాలు, విద్యుచ్ఛక్తి, నీటి సరఫరా కల్పించవలసి ఉంది. అక్కడ పారిశుద్ధ్య పరిస్థితులు కూడా చాలా అధ్వాన్నంగా ఉన్నాయి. అస్తవ్యస్తంగా ఉన్న గుర్ఖాల జీవన పరిస్థితులను మెరుగుపరిచి వారికి పౌరసత్వం కల్పించడం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల కర్తవ్యం.

పోతే, గుర్ఖా జాతీయ విముక్తి సంఘటన అధినేత సుభాష్ ఘీషింగ్ ప్రత్యేకంగా గుర్ఖా రాష్ట్రంకోసం కలలు కంటున్నాడు. డార్జిలింగ్, కాలింపాంగ్, కుర్సియాంగ్ సబ్ డివిజన్లే కాకుండా మైదాన ప్రాంతంలోని సిలిగిరి, జల్పాయ్ గిరి, జిల్లాల్లోని ద్వార్ తా కూడా ఆయన పథకంలో హిల్ కౌన్సిల్ లో ఉంటాయి. అది ఎంతో అసంబద్ధమైన కోరిక.

హిల్ కౌన్సిల్ :-

కేంద్రానికి, పశ్చిమబెంగాల్ రాష్ట్ర పాలకుల మధ్యగల విభేదాలను ఉపయోగించుకొని ప్రత్యేక రాష్ట్రం సాధించుకోవాలని ఘీషింగ్ వేసుకున్న పథకాన్ని చిత్తుచేయడంలో కేంద్ర ప్రభుత్వం ప్రశంసంగా వ్యవహరించింది. ఇతర విషయాలలో విభేదాలు ఎలా ఉన్నా పశ్చిమ బెంగాల్ ని విభజించే ప్రసక్తే ఉండబోదని కేంద్రం స్పష్టం చేయడం, రాష్ట్ర ప్రభుత్వంతో కలిసి వ్యవహరించడం మెచ్చుకోదగిన సంగతి. ఈ చర్చలలో పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రి శ్రీ జ్యోతిబసు ఎంతో నిగ్రహాన్ని ప్రదర్శించారు. పశ్చిమబెంగాల్ రాష్ట్ర విభజనకు దారితీసే ప్రత్యేక రాష్ట్ర డిమాండ్ను గుర్ఖా లిబరేషన్ ఫ్రంటు వదులుకోవడం గణనీయమైన పరిణామం.

1988 జూలై 2వ తేదీన కుదిరిన అంగీకారం ప్రకారం రాష్ట్ర విభజన జరుగబోదు. డార్జిలింగ్, కుర్సియాంగ్, కాలింపాంగ్ సబ్ డివిజన్లతో 'డార్జిలింగ్ గుర్ఖాహిల్ డెవలప్ మెంట్ 'కౌన్సిల్' ఏర్పడుతుంది. గుర్ఖా పదం కూడా చేరిన ఈ కౌన్సిల్ లో 42మంది సభ్యులుంటారు. ఇందులో 28 మంది సభ్యులు మూడు సబ్ డివిజన్లు, అయిదు బస్తీల (సిలిగిరి సమీపంలోని యీ బస్తీలు

కౌన్సిల్ పరిధిలో ఉంటాయి) ప్రజలు ఎన్నుకుంటారు 14 మంది సభ్యులను ప్రభుత్వం నామినేట్ చేస్తుంది. ప్రభుత్వం నామినేట్ చేసేవారిలో మూడు సబ్ డివిజన్ల శాసనసభ్యులు, డార్జిలింగ్ పార్లమెంటు సభ్యుడు, మూడు మున్సిపాలిటీల చైర్మన్లు ఉంటారు. స్వతంత్ర ప్రతిపత్తిగల హిల్‌కౌన్సిల్ మనదేశంలో అపూర్వమైనదని చెప్పాలి. చట్టబద్ధమైన అధికారాలతో రవాణా, విద్యా, ప్రజా రోగ్యం, టూరిజం మొదలైన శాఖలను నిర్వహిస్తూ ఈ కౌన్సిల్ డార్జిలింగ్ కొండప్రాంతాల సామాజిక, ఆర్థిక, పారిశ్రామిక, సాంస్కృతిక అభివృద్ధికి అపారంగా దోహదపడుతుంది. ఈ అంగీకారం ప్రకారం టూరిస్టు, వాణిజ్య లాభాలు హిల్ కౌన్సిల్‌కే చెందుతాయి. కేంద్ర రిజర్వు పోలీసు స్థానంలో సరి హద్దు భద్రతాదళం వుంటుంది.

ఎడతెగని బంద్‌లు, లూటీలు, దహనాలు, విధ్వంసకృత్యాలు, హత్యలు విపరీతమైన హింసాకాండతో రెండున్నర సంవత్సరాలపాటు కొనసాగిన గుర్ఖా లాండ్ ఉద్యమంలో మూడువందలమందికి పైగా చనిపోయారు. వందలకోట్ల రూపాయల విలువైన ఆస్తి నష్టం సంభవించింది. డార్జిలింగ్ కొండల ప్రాంతాలు ఆర్థికంగా పది సంవత్సరాలు వెనుకకు వెళ్ళాయి. దాదాపు ఆరులక్షల జనాభా ఉన్న డార్జిలింగ్ కొండ జిల్లా ప్రధానంగా టూరిజం మీద, తేయాకు తోటల మీద ఆర్థి కంగా ఆధారపడుతున్నది. డార్జిలింగ్‌కు వచ్చిన టూరిస్టుల సంఖ్య 1985 లో ఒక లక్ష 15వేలు కాగా, 1988లో వీరి సంఖ్య ఐదు వేలు మాత్రమే. టూరిజం వల్ల లభిస్తున్న వార్షిక ఆదాయం 35 కోట్ల రూపాయలు. గత రెండు సంవత్సరాలలో ఇది 95 శాతం తగ్గిపోయింది. టూరిజం ఆర్థిక ఆదాయాన్ని 60 కోట్లవరకు పెంచవచ్చునని గూర్ఖా ఫ్రంటు అభిప్రాయపడుతున్నది. ఈ ప్రాంతంలోని 72 తేయాకు తోటలు గుర్ఖా ఉద్యమంలో తీవ్రంగా దెబ్బ తిన్నాయి. తేయాకు ఉత్పత్తిని పెంచి, ఇపుడు లభిస్తున్న 45 కోట్ల రూపాయల వార్షికాదాయాన్ని 122 కోట్ల రూపాయల స్థాయికి పెంచవచ్చు. కొండప్రాంతాలలో సగభాగం అటవీ ప్రాంతం. అటవీ సంపదతో కోట్ల రూపాయల ఆదాయం లభిస్తుంది. కొండ ప్రాంతాల ప్రజల దారిద్ర్యాన్ని తగ్గించడానికి రాష్ట్ర ప్రభుత్వం తోడ్పడితే గుర్ఖాల వేర్పాటువాద ధోరణివైపు మొగ్గడానికి అవకాశం ఉండదు. డార్జిలింగ్‌లో ప్రశాంత పరిస్థితి ఏర్పడుతుంది. పర్యాటక కేంద్రంగా ఇది అలరారుతుంది. హిల్ కౌన్సిల్‌ద్వారా బహుముఖ అభ్యుదయాన్ని సాధించడంలో గుర్ఖాలదే గురుతర బాధ్యత. దేశంలోని ఇతర వెనకపడ్డ ప్రాంతాల అభివృద్ధికి కూడా ఇటువంటి కౌన్సిళ్ళ ఏర్పాటు శ్రేయస్కరమవుతుంది.

# అడకత్తెరలో పోకచెక్క - శ్రీలంక

బ్రిటిష్ వారు తమ పరిపాలనలో భారతదేశం నుంచి చౌకగా కూలీలను తేయాకు తోటలలో పని చేయడానికి శ్రీలంకకు తెప్పించుకున్నారు. భారతదేశానికి 1947 లోను, శ్రీలంకకు 1948 లోను స్వాతంత్ర్యం లభించడంతో ఈ సమస్య కొత్త రూపం దాల్చింది.

1948 సెప్టెంబర్ 21న దాదాపు 10 లక్షల మంది భారత సంతతికి చెందిన తమిళుల పౌరసత్వం రద్దు చట్టం అమలులోకి వచ్చింది. సిలోన్ సవరణ చట్టం వల్ల భారత సంతతికి చెందిన తమిళులు తమ ఓటు హక్కు కోల్పోయారు. పలు వర్గాలకు చెందిన తమిళుల పౌరసత్వాన్ని హరించిన ఇండియా, పాకిస్తాన్ వాసుల పౌరసత్వం చట్టం 1949 లో అమలుకు వచ్చింది. ఈ అంశంపై లంక తమిళుల ప్రధాన రాజకీయ పార్టీ తమిళ కాంగ్రెసు చీలి ఫెడరల్ పార్టీ ఆవిర్భవించింది.

1949 డిశంబర్ 19న ఐక్య శ్రీలంక పరిధిలో ప్రత్యేక తమిళ రాష్ట్రం ఏర్పాటుకు ఫెడరల్ పార్టీ తీర్మానించింది. 1956 జూన్ 5న కేవలం సింహళ భాషకే అధికార హోదా కల్పిస్తూ ఎస్. డబ్ల్యు. ఆర్. డి. బండారునాయకే ప్రభుత్వం ఉత్తరువులను జారీచేసింది. ఈ చర్య రాజ్యాంగ విరుద్ధమని పేర్కొంటూ ఎస్. జె. వి. చెంగల్వనాయకం ఆధ్వర్యంలోని ఫెడరల్ పార్టీ 1957 ఆగష్టులో సత్యాగ్రహం ప్రారంభించింది.

1956 జులై 5న జాతీయ మైనారటీ భాషగా తమిళ భాషకు గుర్తింపు లభించిన ఒప్పందం బండారునాయకే, చెల్వనాయకం చర్చలలో కుదిరింది. ఈ ఒప్పందంలో ప్రాంతీయ కౌన్సిళ్ళ ఏర్పాటు, 1948 నాటి పౌరసత్వ చట్టం మార్పుల ప్రతిపాదనలు ఉన్నాయి. 1956 అక్టోబరు 4న తమిళులపై హింసాత్మక చర్య

లకు వారితీసిన కందీమార్చ్ ఉద్యమాన్ని జయవర్ధనే ప్రారంభించాడు. చెల్వ నాయకం-బండారునాయకేల మధ్య కుదిరిన ఒప్పందాన్ని భగ్నపరచడమే యీ ఉద్యమ ప్రధాన లక్ష్యం. ఈ ఉద్యమం వెర్రితలలు వేయగానే బండారునాయకే-చెల్వనాయకమ్‌ల మధ్య కుదిరిన ఒప్పందాన్ని ప్రభుత్వం 1958 ఏప్రిల్ 9న రద్దు చేస్తున్నట్లు ప్రకటించింది. దీనితో తమిళ వ్యతిరేక ఉద్యమం కొలంబో వరకు విస్తరించింది.

ఈ ఉద్యమం రోజుకొక కొత్తదారి తొక్కింది. 1959 జూన్ 2న ప్రభుత్వ నౌకలలో 9429 మంది తమిళులను కొలంబో నుండి జాఫ్నాకు, జాఫ్నా నుండి 100 మంది సింహళీయులను కొలంబోకు తరలించారు. తమిళుల పోరాటం దిన దినాభివృద్ధి చెందిందేకానీ తగ్గలేదు. చివరకు ప్రభుత్వం కొంతవరకు దిగివచ్చి 1958 సెప్టెంబర్ 3న పరిమిత స్థాయిలో తమిళ భాషను ఉపయోగించే బిల్లుకు ఆమోదం తెలిపింది. 1958 సెప్టెంబర్ 25న బౌద్ధ సాధువుల చేతుల్లో బండారు నాయకే హత్య జరగడంతో ఈ పరిస్థితులు కొత్తమలుపుకు తిరిగాయి.

**సిరిమావో-శాస్త్రి ఒప్పందం :**

1960 ఎన్నికలలో శ్రీలంక ఫ్రీడమ్ పార్టీ ఎన్నికలలో విజయం సాధిం చింది. శ్రీమతి సిరిమావో బండారు నాయకే ప్రధానమంత్రి అయ్యారు. సిలోన్ వర్కర్స్ కాంగ్రెసుకు చెందిన తొండమాన్‌ను సెనెటుకు నామినేట్ చేశారు.

సిరిమావో-శాస్త్రి ఒప్పందం 1964 లో కుదిరింది. దీని ప్రకారం ఈ ఒప్పందం కుదిరిన తేదీ నుంచి 15 సంవత్సరాలలో 5,25,000 మంది భారతీయు లను తిరిగి భారతదేశం పంపించి వేయాలి. అయితే ఈ గడువు పూర్తయ్యే నాటికి 3,46,000 మందికి భారత పౌరసత్వం లభించగా అందులో 2,87,000 మంది మాత్రమే భారతదేశానికి తిరిగి పోయారు. ఈ ఒప్పందంలోని మరో అంశం ప్రకారం 3,75,000 మంది భారతీయులకు శ్రీలంక పౌరసత్వం లభించాలి. కానీ 1,60,000 మందికి మాత్రమే శ్రీలంక పౌరసత్వం లభించింది. ఈ ఒప్పందాలు సక్రమంగా అమలు జరుగకపోవడంతో 1974లో భారత-శ్రీలంకల మధ్య మరొక ఒప్పందం కుదిరింది. 5,25,000 మంది సింహళంలోని భారతీయులు భారతదేశా నికి చేరుకున్న వెంటనే మరో 75,000 మందికి భారతదేశంలో పునరావాసం కలిగించడానికి అంగీకారం కుదిరింది. పౌరసత్వాల సమస్య ఎలా ఉన్నా సింహ

కంలో స్థిరపడ్డ భారతీయులు ఆ దేశాన్ని వదలిపెట్టడానికి పెద్దగా ఉత్సాహం చూపడం లేదు.

నిపుణులైన భారతీయ కూలీలు తక్కువ కూలీకే పని చేస్తారు. కనుక తేయాకు తోటల యజమానులకు వారిపైన అభిమానం ఉంది. పోతే తమ మాతృ దేశానికి ఇప్పుడు వెళ్ళినా వారికి పూర్వాదరణ లభించదు. భారతదేశానికి పోయి పునరావాస ఇబ్బంది ఎదుర్కోవడంకన్నా ఇక్కడే ఉండి తాత్సారం చేయడమే మేలనే దృష్టిలో వారున్నారు. చేతిలోని సంపదను వదులుకొని పవిత్ర మాతృ భూమి మీద మమకారంతో ఇక్కడి ఎండమావులను చూసి భ్రమసిపోయే అవివేకులుగారు సింహళంలోని భారతీయులు.

1965 ఎన్నికలలో శ్రీలంక ఫ్రీడం పార్టీ ఓడిపోయింది. యునైటెడ్ నేషనల్ పార్టీ అధికారంలోకి వచ్చింది చెల్వనాయకం, సేనా నాయకేల మధ్య కుదిరిన ఒప్పందం ప్రకారం తిరు చెల్వం మంత్రివర్గంలో చేరారు. 1970లో నూతన రాజ్యాంగం అమలుకు వచ్చింది. ఇందులోని భాగంగా ప్రవేశపెట్టిన విద్యాసంస్థల మార్కుల పద్ధతి తమిళుల పట్ల వివక్షతను వ్యక్తపరిచింది. దీనితో 1972లో వివిధ తమిళపార్టీలు ఐక్య ఫ్రంటుగా ఏర్పడ్డాయి.

టైగర్ల ఆవిర్భావం :

విద్యా ఉద్యోగావకాశాలలో తమిళుల పట్ల వివక్షతకు నిరసనగా కొత్త టైగర్ల పార్టీ ఏర్పాటైంది. ఇది అనంతరం తమిళ ఈలం విమోచన టైగర్ల పార్టీగా మారింది. 1974 జనవరిలో జాఫ్నాలో జరిగిన 4 వ అంతర్జాతీయ తమిళ సదస్సుపై పోలీసులు జరిపిన కాల్పులలో 9మంది తమిళులు మరణించారు. దీనితో పరిస్థితి విషమించింది. తమిళ ఐక్య ఫ్రంటు (తుల్ఫ్) తమిళులకు ప్రత్యేక రాష్ట్రమే కావాలని ప్రకటించింది. 1977 ఎన్నికలలో తుల్ఫ్ 18 సీట్లను గెలుచు కొని తన రాజకీయ సత్తా ప్రదర్శించింది.

1983 జూలైలో తమిళ ఈలం గెరిల్లాలు సైనిక శిబిరంపై దాడిచేసి 13 మంది సైనికులను హత్య చేయడంతో దేశంలో తమిళ వ్యతిరేక ఉద్యమం ప్రారంభమై అది ఎమర్జెన్సీ విధింపుకు దారి తీసింది. హత్యలు, ప్రతిహత్యలతో దేశం హోరెత్తిపోయింది. అమాయక తమిళుల హత్యలను నిరోధించేందుకు

భారత విదేశాంగ మంత్రి పి. వి. నరసింహారావు కొలంబో పర్యటించారు. శ్రీలంకలో ఫెడరల్ పద్ధతులను అమలు చేయవలసిందిగా సూచిస్తూ భారత విదేశాంగ వ్యవహారాల ప్లానింగ్ కమిటీ చైర్మన్ శ్రీ పార్థసారధి కొలంబో వచ్చారు. ఈ ప్రతిపాదనలను శ్రీలంక తిరస్కరించింది. ఐక్య శ్రీలంకపై విశ్వాసం ప్రకటిస్తూ పార్లమెంటు సభ్యులచేత నిర్బంధంగా ప్రమాణం చేయించే నిమిత్తం రాజ్యాంగంలో సవరణలు జరిగాయి. గడువు లోపల ప్రమాణ స్వీకారం చేయని తుల్ఫ్‌కు చెందిన పార్లమెంటు సభ్యుల సభ్యత్వాన్ని రద్దు చేశారు. ఈ ప్రతిష్ఠంభన ఇలా కొనసాగుతుండగా 1986 డిసెంబరు 19వ తేదీన భారత మంత్రులు శ్రీ నట్వర్‌సింగ్, శ్రీ చిదంబరంలు కొలంబో పర్యటించారు. ఇరుపక్షాల మధ్య ఆమోదయోగ్యమైన ప్రతిపాదనలకు వీరి కృషివల్ల అంకురార్పణ జరిగింది. 1987 జనవరిలో ఎల్. టి. టి. ఇ. జాఫ్నాలో పౌరపరిపాలనను స్వాధీనం చేసుకోనున్నట్లు ప్రకటించింది. దీనితో పరిస్థితి మరలా తీవ్రరూపం ధరించింది. జాఫ్నాలోని తమిళులను ఆదుకునేందుకు భారత్ పంపిన అత్యవసర సరకుల నౌకలకు శ్రీలంక అవరోధం కల్పించింది. దీనిపై భారత వైమానిక దళం విమానాలు సహాయక సామాగ్రిని జాఫ్నాకు చేర్చాయి. అనంతరం జాతి సమస్యను పరిష్కరించేందుకు భారత్ కొన్ని కొత్త ప్రతిపాదనలు చేసింది.

**శ్రీలంక–భారత్ ఒప్పందం :**

1987 లో భారత్–శ్రీలంకల మధ్య జరిగిన ఒప్పందంలో రెండు ప్రధానాంశాలు చోటు చేసుకున్నాయి. అందులో మొదటిది – తమిళులు అధిక సంఖ్యలో ఉన్న ఉత్తర తూర్పు ప్రాంతాలలో ప్రజాస్వామ్య ప్రాతిపదికపై రాష్ట్రీయ కౌన్సిళ్ళను ఏర్పాటుచేసి, వాటికి కార్యనిర్వాహణాధికారం అందజేయడం. ఈ సంస్కరణ ద్వారా యీ ప్రాంతాలలోని తమిళ ప్రజా ప్రతినిధులకు దాదాపు ఆ ప్రాంతాలలో ఆర్థిక, సాంఘిక విధాన నిర్ణయాలలోను, పరిపాలనా విషయంలోను స్వయం ప్రతిపత్తి కల్పించడం జరుగుతుంది. ఇక రెండోది–తమిళులు అధిక సంఖ్యలుగా ఉన్న ఉత్తర తూర్పు ప్రదేశాల మిళితం చేయడానికి కూడా శ్రీలంక–భారత ప్రభుత్వాల ఒప్పందం నిర్ణయించింది. ఈ విషయంలోని అంతరార్ధమేమంటే వేరువేరుగా ఉన్న తమిళ ప్రదేశాలను రాజకీయంగా ఒక పెద్ద రాష్ట్రముగా ఏర్పాటు చేయడమే. ఇదివరలో ఈ ఏర్పాటుకు శ్రీలంక ప్రభుత్వం

ఏమాత్రం అంగీకరించలేదు. 1987 జూన్‌లో జరిగిన భారత్-శ్రీలంక ఒప్పందం ద్వారానే ఇది సాధ్యమైంది. ఈ అంశాన్ని అంగీకరించడంలో అప్పటి శ్రీలంక అధ్యక్షుడు శ్రీ జయవర్ధనే విశేషమైన సడలింపు విధానాన్ని కనబరిచారు. ఇది ఆయన రాజకీయ నైపుణ్యానికి ప్రతీకగా శ్రీలంక చరిత్రలో నిలిచిపోతుంది.

శాంతిసేన కర్తవ్యం :

1987 జులైలో భారత శాంతిసేన శ్రీలంకకు శాంతి సంరక్షణ కోసం వెళ్ళింది. యుద్ధమైతే ఒక్క రోజులో ముగిసి ఉండేది. కానీ, జన నష్టం జరుగకుండా, ఒక వేళ జరిగినా అతి తక్కువ జననష్టంతో శాంతిని నెలకొల్పాలనేది ఇండో-శ్రీలంక ఒప్పందంలోని ప్రధానాంశం. రాజకీయ కారణాల మాట అటుంచి 'త్రింకోమలె' నౌకాస్థావరం అన్యుల హస్తగతం కావడం భారత రక్షణ దృష్ట్యా, సముద్రతీర సంరక్షణ దృష్ట్యా మనకి హానికరమవటం వల్ల శ్రీలంకలో జోక్యం కల్పించుకోవలసి వచ్చింది. శ్రీలంకలో జరుగుతున్నది గెరెల్లా పోరాటం రెండు వేల అయిదు వందల తమిళ పులులు (ఎల్. టి. టి. ఇ.) నలభై వేల సైన్యాన్ని ప్రతిఘటిస్తున్నాయని ఒక అభిప్రాయం ఉంది. వారి వద్ద ఆధునాతనమైన ఆయుధాలు ఉన్నాయి.

శ్రీలంకతో కుదుర్చుకున్న శాంతి ఒప్పందంపై ఆదిలో సర్వత్రా హర్షం వ్యక్తమైంది. ఈ ఒప్పందం అక్కడి తమిళులకు న్యాయం చేకూర్చుతుందని భారత ప్రభుత్వం ధృఢ అభిప్రాయంతో యీ పని చేసింది. శ్రీలంక పరిస్థితిని వియత్నాం యుద్ధంతో పోల్చరాదు. వియత్నాం యుద్ధంలో అమెరికా సైనికుడికి ఎలాంటి ప్రయోజనాలు లేవు.

తమిళ ఈలమ్ లిబరేషన్ టైగర్లను అణచి వేయడంద్వారా తమ పొరుగు దేశం (శ్రీలంక) ముక్కలు చెక్కలు కాకుండా భారతదేశం నివారించ కలిగింది. కానీ, భారత శాంతి రక్షణ దళం శ్రీలంకలో ప్రవేశించి నప్పటినుంచి ఎల్. టి. టి. ఇ. దళాలతో తలపడటం దురదృష్టకరమైన విషయంగా పరిణమించింది. తమిళ ప్రజల ప్రయోజనాలు, మన హక్కుల పరిరక్షణే ధ్యేయంగా భావించి, వాటికి దోహదం చేయడానికి శ్రీలంక ప్రభుత్వంతో ఒప్పందానికి వచ్చిన భారత ప్రభుత్వం, తమిళ ప్రజలలో ఒక వర్గమైన ఎల్. టి. టి. ఇ. లతో తలపడటం

తప్పలేదు. అప్పటి నుంచే కొంత మంది విమర్శకులు, ముఖ్యంగా కొన్ని వర్గాలు భారత ప్రభుత్వ విధానాన్ని తీవ్రంగా విమర్శించారు. అసలు శ్రీలంక ప్రభుత్వం చాకచక్యంతో ఎల్. టి. టి. ఇ. వర్గాలను ఎదుర్కొనడంలో తాను తప్పు కాని నిందతో కూడిన బాధ్యతను భారత శాంతి రక్షక దళంపై వేసిందని విమర్శలు కూడ వచ్చాయి.

శ్రీలంక సమస్య పరిష్కారాన్ని, శ్రీలంక ప్రభుత్వం అంగీకరించిన భారతదేశ సహాయాన్ని, ప్రోత్సాహాన్ని, అండను పొందిన తమిళ తీవ్రవాదులే ఈ పరిష్కారానికి అడ్డంకులు కల్పించారు. పరిశీలనా యోగ్యంగా ఉన్నాయనీ, ప్రయోజనకర మవుతాయని, భారత దేశం భావించిన పరిష్కార సూత్రాలను సైతం తమిళ పైగర్లు తిరస్కరించారు. తమిళ పైగర్లు భారత-శ్రీలంక ఒప్పందాన్ని తిరస్కరించి పోరుకు సిద్ధం కావడంతో శాంతిసేన ఎక్కువ కాలం ఉండవలసి వచ్చింది. 1989 ఫిబ్రవరి వరకు శ్రీలంకకు పంపిన శాంతి దళం సంఖ్య లక్షకు దాటింది. దానిపై భారత ప్రభుత్వం ప్రతిరోజు పది కోట్ల రూపాయలు ఖర్చు చేసింది.

జయవర్ధనే ఆహ్వానంపై శ్రీలంక చేరిన శాంతి సైన్యం చేదు అనుభవాలను చవి చూసింది. దేశంకాని దేశంలో, భాషరాని ప్రాంతంలో నెగ్గుకు రావడమన్న క్లిష్టకార్యాన్ని శాంతిసేన నిర్వర్తించవలసి వచ్చింది. తమిళ గెరిల్లాలను నిరాయుధుల్ని చేసే ప్రయత్నంలో పెక్కుమంది జవాన్లు ప్రాణాలు కోల్పోయారు. సంక్షుభిత శ్రీలంకలో శాంతిస్థాపన కోసం ప్రాణాలు తెగించి పోరాడిన ఈ రెండున్నర ఏళ్ళలో 1159 మంది భారత వీరజవానులు ప్రాణాలు అర్పించారు. 2,989 మంది క్షతగాత్రు లయ్యారు. సైనిక కార్యకలాపాలమీదే భారత ప్రభుత్వం 289 కోట్ల రూపాయలు వెచ్చించింది.

జయవర్ధనే స్థానంలో ప్రేమదాస లంక అధికార పగ్గాలు చేపట్టడంతో తమిళ తీవ్రవాద సమస్య మరొక మలుపు తిరిగింది. అప్పటిదాకా లంక ప్రభుత్వంపై పోరాడుతున్న పైగర్లు ప్రభుత్వంతో రాజీ పడ్డారు. ఈ దశలో శాంతిసేన పని ముందు నొయ్యి వెనుక గొయ్యిలా మారిపోయింది. చివరకు విజయమో, పరాజయమో, తేలని స్థితిలో భారతసేన ఎట్టకేలకు శ్రీలంక నుంచి 1990 మార్చి 24న పూర్తిగా వైదొలగింది.

భాషా సమస్య :

శ్రీలంకలో నివసించే ప్రధాన జాతులు మూడు. సింహళీయులు, తమిళులు, ముస్లింలు. భారతదేశంలో పుట్టిన ఆర్య- ద్రవిడ వివాదం శ్రీలంక సమాజాన్ని కూడా విడిచిపెట్టలేదు. అందువల్ల శ్రీలంక సమాజం తమిళ- సింహళ ఘర్షణలతో కకావికలైపోతున్నది. అయితే గమనించదగ్గ విశేషం: రెండు విభిన్న జాతులు శతాబ్దాలుగా నిన్న మొన్నటివరకు కలిసి ఉన్న చరిత్ర శ్రీలంకకు ఉన్నంతగా ప్రపంచంలో మరొక దేశానికి లేదని చరిత్రకారుల అభిప్రాయం.కాని దురదృష్ట వశాత్తు గత రెండు దశాబ్దాలుగా పౌరసత్వం పేరిట, ప్రాథమిక హక్కుల రక్షణ పేరిట రెండు జాతుల మధ్య రాజకీయవేత్తల వలువల్ల వారి స్వప్రయోజనాల ఫలితంగా చీలు బాటలు పట్టవలసివచ్చింది.

హిందీ భాష విషయంలో తమిళనాడులోని ప్రాంతీయ పార్టీలు ఏ వ్యతిరేక ధోరణిని చేబట్టాయో, అదే ధోరణిని విస్తరించి శ్రీలంకలో తమిళ పార్టీలోని ప్రాంతీయవాదులకు కొమ్ములు తెప్పించాయి. శ్రీలంక అధికార భాషపై ధ్వజ మెత్తిన ఎల్. టి. టి. ఇ తుల్ఫ్ మొదలైన తమిళ పక్షాలు క్రమంగా సమస్యను శాంతి భద్రతల సమస్యగా మార్చివేశాయి. భాషా సమస్య చివరకు పౌర హక్కుల సమస్యగా మారింది. శ్రీలంక జనాభా ఒక కోటి అరవై లక్షలు. అందులో తమిళులు నలభై లక్షలు. వీరు మెజారిటీగా శ్రీలంక తూర్పు రాష్ట్రం లోను, ఉత్తర రాష్ట్రంలోను కేంద్రీకరించి ఉన్నారు. జాఫ్నా, బట్టికోలా కేంద్రాలుగా సాగుతున్న ఈ పోరాటం పౌరసత్వ సమస్యలపై ఇండియా- శ్రీలంక మధ్య దఫా దఫాలుగా కుదిరిన ఒప్పందాలను అమలుపరచడంలో జరిగిన తాత్సార ఫలితమేనని మరవరాదు. అనేక కష్ట నష్టాల కోర్చి శాంతిదళం వెను దిరిగి వచ్చింది. సరే, ఇప్పుడు శ్రీలంక పరిస్థితి ఏమిటి? లంక తమిళ సమస్య ఇంక అలాగే ఉంది.



# జనతా విజయపతాక

1977 మార్చిలో జరిగిన లోక్‌సభ ఎన్నికలలో పాతకాంగ్రెస్, జనసంఘ్, భారతీయ లోక్‌దళ్, సోషలిస్టు పార్టీలు కలిసి ఏకైక ప్రతిపక్షంగా ఏర్పడటానికి జనతా పార్టీ ఏర్పడింది. పార్లమెంటరీ డెమోక్రసీపై ఆధారపడిన సోషలిస్టు వ్యవస్థ నిర్మాణం దీని ప్రధాన లక్ష్యం. అధికార వికేంద్రీకరణ, న్యాయ వ్యవస్థను మునుపటి అధికారాలతో పునరుద్ధరణ, పత్రికలకు పూర్తి స్వేచ్ఛ జనతా పార్టీ ఎన్నికలలో ప్రధానాంశాలు. దేశ సాంఘిక, ఆర్థిక పరిస్థితులలో గాంధేయ సిద్ధాంతాలపై మార్పులు తీసుకురావడానికి ఈ పార్టీ నిర్ణయించింది.

27 మంది సభ్యులతో 1977 జనవరి 23 న జనతా పార్టీ ఏర్పడింది. మురార్జీదేశాయి పార్టీ అధ్యక్షుడు. చరణ్‌సింగ్ ఉపాధ్యక్షుడు. భారతీయ లోక్‌దళ్ ఎన్నికల గుర్తు (నాగలి పట్టిన రైతు) తో జనతా పార్టీ ఎన్నికలలో పోటీ చేసింది. అయితే తమిళనాడులో మాత్రం సంస్థాన కాంగ్రెస్ ఎన్నికల గుర్తుతో జనతా పార్టీ ఎన్నికలలో పాల్గొన్నది.

ఈ విలీనాన్ని జయప్రకాశ్ నిండు మనస్సుతో ఆశీర్వదించారు. ప్రజా స్వామ్యమో, నియంతృత్వమో, బానిసత్వమో, స్వాతంత్రమో ప్రజలు నిర్ధుష్టంగా నిర్ణయించుకోవాలని ఆయన పిలుపు నిచ్చారు. శ్రీమతి ఇందిరాగాంధీ విజయం నియంతృత్వానికి విజయం కాగలదని ఆయన స్పష్టం చేశారు. ఈ నినాదమే సమైక్య ప్రతిపక్షానికి శ్రీరామ రక్ష అయింది. ఎన్నికల ప్రచారంలో వారు ఆర్థిక సమస్యలకు ప్రాధాన్యమే ఇవ్వలేదు. జనతా, ప్రజాస్వామ్య కాంగ్రెస్‌లను ఏకం చేసి, ఒకే పతాక ఛాయలో, ఒకే ఎన్నికల గుర్తుతో పోటీ చేసేటట్టు జె. పి. రెండింటి మధ్య సామరస్యం సాధించారు.

కాంగ్రెసుకు ఘోర పరాజయం :

ఈ ఎన్నికలలో కాంగ్రెస్‌కు 153 స్థానాలు లభించగా జనతా, దాని అనుబంధ పార్టీ ప్రజాస్వామ్య కాంగ్రెసుకు 298 స్థానాలు లభించాయి. ఉత్తరాది రాష్ట్రాలలో జనతా పార్టీ అఖండ విజయాన్ని సాధించింది. కానీ దక్షిణాదిన జనతా ప్రభంజనం కానరాలేదు. ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కర్నాటక రాష్ట్రాలలో జనతా పార్టీకి ఒక్కొక్క స్థానం మాత్రమే గెలుచుకొన గలిగింది. వింధ్య పర్వతాలను దాటి జనతా ప్రభంజనం పాకలేదనే చెప్పాలి. ఆరవ లోక్‌సభ ఎన్నికలలో ఉత్తర, దక్షిణాలు విభిన్న పార్టీలను వరించడం విచిత్ర పరిణామము. అయితే ఇది గెలుచుకున్న స్థానాలను ఆధారం చేసుకుని చెప్పేమాట. ఉత్తరాదిన కాంగ్రెస్ కానీ, దక్షిణాదిన జనతా కానీ పూర్తిగా తుడిచిపెట్టుకు పోలేదు. ఉదాహరణకు ఆంధ్రప్రదేశ్‌లో ఓడిపోయిన అన్ని నియోజక వర్గాలలో జనతా అభ్యర్థులు ద్వితీయ స్థానంలో ఉన్నారు. దాదాపు అందరికీ లక్షకు పైగానే ఓట్లు వచ్చాయి. ఈ విధముగానే ఉత్తరాది రాష్ట్రాలలో కాంగ్రెసు అభ్యర్థులకు వేలాది సంఖ్యలో ఓట్లు వచ్చాయి.

ఎన్నికలలో విజయానికి ప్రజలలో వెల్లివిరిసిన అనుకూల భావం ఒక్కటే సరిపోదు. ఆ అనుకూలతను ఓట్ల రూపంలో మార్చుకో గలగాలి. ప్రజలలోని అసంతృప్తితో పాటు పాలక వర్గానికి స్పష్టమైన ప్రత్యామ్నాయం జాతీయ స్థాయిలోనే గాక, స్థానికంగా కూడా ఉన్నదనే విశ్వాసం సామాన్యునికి కలగాలి. అప్పుడే వారు మార్పుకు అనుకూలంగా ఓటు చేస్తారు. అనగా ప్రతి స్థాయిలో ప్రతిపక్షానికి సంస్థాగతమైన బలం ఉండాలి. ప్రత్యామ్నాయ నాయకత్వం ప్రజలకు కనిపించాలి.

ఈ ఎన్నికలలో దక్షిణాది రాష్ట్రాల ప్రజలకు అవిశ్వాసం జనతా పార్టీపై కుదరలేదు. ఆంధ్రప్రదేశ్‌లో ప్రతిపక్షం నామమాత్రం. కాంగ్రెసు చీలిక తరువాత కర్నాటకలో పాతకాంగ్రెసు జీవచ్ఛవం అయింది. కామరాజ్ మరణంతోనే పాతకాంగ్రెసు తమిళనాడులో సన్నగిల్లింది. అవినీతి ఆరోపణల విచారణలవల్ల డి. ఎం. కె. ప్రతిష్ట మంట కలిసింది. కేరళలో ప్రతిపక్షంగా ఉన్న మార్క్సిస్టులు ఆందోళనల మీద ఆందోళనలు జరిపి నిస్పృహ చెందారు. ఆ స్థితిలో దక్షిణ భారత ప్రజలలో అసంతృప్తి, పరివర్తనా వాంఛ ఉన్నప్పటికీ అది కార్యరూపం ధరించలేదు.

నిర్బంధ కుటుంబ నియంత్రణ శస్త్ర చికిత్సలు, అధికారుల జులుం, సంజయ్‌గాంధీ వ్యవహారం, కాంగ్రెసు నాయకులు ఆయనకు వందిమాగధులు కావడం-ఇవన్నీ ఎన్నికల సమయంలో వెల్లడైనాయి. ప్రజలలో పెరిగిన అశాంతిని అవకాశం జారవిడిస్తే పాలకులను మార్చడానికి మరొక అవకాశం రాదని జె. పి. హెచ్చరిక ప్రజల మనస్సులను ప్రభావితం చేసింది. అత్యవసర పరిస్థితిలోని గుణదోషాలు ఈ ఎన్నికలలో ప్రధాన విషయమయింది. ఎన్నికల్లో ఓడిపోయిన శ్రీమతి ఇందిరాగాంధీ 1977 మార్చి 23 వ తేదీన ప్రధాన మంత్రి పదవికి రాజీనామా చేశారు.

## అధికార పీఠంపై మురార్జీ :

భారత రిపబ్లిక్ నాలుగవ ప్రధానిగా శ్రీ మురార్జీదేశాయ్ 1977 మార్చి 24 న పదవీ ప్రమాణ స్వీకారం చేశారు. ఇంతకు ముందు ఆయనకు ఈ పదవి రెండు సార్లు చేయి జారిపోయింది. ఇప్పుడు ఆయన చిరకాల స్వప్నం ఫలించింది. అయితే మంత్రివర్గ నిర్మాణంలోనే ఆయనకు ఎన్నో చిక్కు సమస్య లెదురైనాయి. ఉపప్రధాన మంత్రి తనకు ఇచ్చే పక్షంలో ప్రజాస్వామ్య కాంగ్రెసును విలీనం చేయడానికి జగ్‌జీవన్ సుముఖత వ్యక్తం చేశాడు. అయితే, ఆ పదవిని చరన్‌సింగ్‌కు ఇస్తానని మురార్జీ ముందుగానే వాగ్దానం చేశాడు. ఇద్దరు ఉపప్రధానులా ?

ఈ సమయంలో పరిస్థితి మించకుండా జె. పి. ఆదుకున్నాడు. ఆయన చేసిందల్లా ఒక సందేశం పంపడమే. ఆ సందేశంలో జగ్‌జీవన్‌రాంకు ఇలా తెలిపారు. 'మీరు ఒక వ్యక్తి కాదు. చైతన్య శక్తి. మీరు లేనిదే నవభారత నిర్మాణం సాగదు.' చివరకు జగ్‌వజీన్‌రాం, బహుగుణ హోదానుగాని, పోర్టు ఫోలియోను గాని కోరకుండానే మంత్రి వర్గంలో చేరారు.

## జత్తి అడ్డు కాలు :

లోక్‌సభ ఎన్నికల్లో కాంగ్రెసు పూర్తిగా ఓడిపోయిన బీహార్, హర్యానా, హిమాచల్‌ప్రదేశ్, మధ్యప్రదేశ్, ఒరిస్సా, పంజాబ్, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్ పశ్చిమ బెంగాల్ రాష్ట్రాల అసెంబ్లీలను రద్దు చేయాలని ప్రభుత్వం తీర్మానించింది. అయితే అసెంబ్లీల రద్దు ఉత్తరువుపై సంతకం చేయటానికి తాత్కాలిక రాష్ట్రపతి బి. డి. జత్తి నిరాకరించారు. దీనితో రాష్ట్రపతి-మంత్రి వర్గం మధ్య ప్రతిష్టంభన ఏర్పడే సూచనలు కనిపించాయి.

ప్రధానమంత్రి, ఆయన మంత్రివర్గం ఇచ్చిన సలహాను ఆమోదించడానికి ఇష్టపడని పక్షంలో తాత్కాలిక రాష్ట్రపతి పదవికి జత్తి రాజీనామా చేయవలసి ఉంటుంది. ఈ సందర్భంగా జనతా పార్టీ 42వ రాజ్యాంగ చట్టాన్ని ఉదాహరించింది. ప్రధానమంత్రి, ఆయన మంత్రివర్గం చేసిన నిర్ణయాన్ని లేదా ఇచ్చిన సలహాను రాష్ట్రపతి విధిగా పాటించి తీరాలని ఈ సవరణ నిర్దేశిస్తుంది. ఇప్పుడు జత్తికి గడ్డు సమస్య ఎదురైంది. తరువాత పరిణామాలు ఆయనకు తెలుసు. అందుకే మారుమాట్లాడకుండా శ్రీ జత్తి అసెంబ్లీల రద్దు ప్రకటనపై సంతకం చేశారు. ఆరుమాసాలు మాత్రమే తాత్కాలిక రాష్ట్రపతిగా పనిచేసిన శ్రీ జత్తి 'ఈ అసాధారణ చర్యతో పార్టీ పక్షపాతి' అనే మచ్చను తగిలించుకున్నారు.

1977 జూన్‌లో జరిగిన శాసనసభల ఎన్నికలలో ఉత్తరప్రదేశ్, హర్యానా, బీహార్, ఒరిస్సాలో జనతాపార్టీ లోని బి. ఎల్. డి. ఆధిక్యంలో ఉంటే మధ్యప్రదేశ్, హిమాచల్ ప్రదేశ్‌లలో జనసంఘ మెజారిటీ సీట్లను గెలుచుకుంది. జనతా పార్టీ ముఖ్యమంత్రుల నిర్ణయం ఢిల్లీలోనే జరిగింది. శాసనసభ్యులే ముఖ్యమంత్రులు కావాలన్న నిబంధనను జనతాకూడా పాటించలేదు. ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి రాంనరేశ్ యాదవ్, బీహార్ ముఖ్యమంత్రి కర్పూరీ ఠాకూర్, రాజస్థాన్ ముఖ్యమంత్రి షికావత్‌లు పార్లమెంటు సభ్యులు. ఇందిరాగాంధీ తన హయాంలో ఒరిస్సాకు నందనా శతపథి, మధ్యప్రదేశ్‌కు పి. సి. శేథీలను అలాగే ముఖ్యమంత్రులుగా నియమించలేదా అని సరిపుచ్చుకున్నారు.

జనతా పతనం :

మేధావంతుల విషయంలో స్వతంత్ర భారత దేశంలో జనతా మంత్రివర్గమే తొలి మంత్రివర్గం. 1952 నుంచి ఏర్పడిన కేంద్ర మంత్రి వర్గాలలో ప్రముఖ మేధావులు, సమర్థులు, పరిపాలనాదక్షుల పాలు తగ్గుతూ వచ్చింది. పార్టీ నాయకత్వం పట్ల అచెంచెల భక్తి విశ్వాసాలే కేంద్ర మంత్రి పదవికి చాలా సందర్భాలలో కొలబద్దగా ఉంటూ వచ్చాయి. ఆ పరిస్థితులలో జనతా మంత్రి మండలిలో చేరిన మేధావి వర్గాన్ని చూసి జాతి ఎంతో ఆనందించింది. ఉన్నతమైన ఆశయాలతో, ఉదాత్తమైన లక్ష్యాలతో అధికారంలోకి వచ్చిన ఆ మంత్రివర్గం దేశాభివృద్ధిలో గణనీయమైన ఫలితాలు సాధించగలదని అందరు ఆశించారు. కానీ, జనతా ప్రధాని మురార్జీ మొండిపట్టుదల, ఛాదస్తపు భావాలు, ఎవ్వరితో రాజీపడని ఆయన మనస్తత్వం జనతా ప్రభుత్వ విచ్ఛిత్తిని త్వరితం చేసింది.

ఇందిరాగాంధీ 'దుష్పరిపాలన'కు భరతవాక్యం పలికిస్తామని, రాజకీయ రంగంలో పారిశుద్ధ్యాన్ని సాధిస్తామని ప్రకటనల జడివానలు కురిపించిన జనతా పార్టీ ప్రజలు నాలుగు కాలాలపాటు జ్ఞాపకం వుంచుకునే ఒక్క మంచి పనైనా చేపట్టలేక పోయింది. (ఎమర్జెన్సీలో ఇందిరాగాంధీ చేసిన అకృత్యాలను రద్దు పరచడం తప్ప) ముఖ్యంగా జనతా ప్రధాని మురార్జీదేశాయ్ మతాలకు అతీతంగా వ్యవహరించలేక పోయారు. పాత వైరాలను ఆయన మరచి పోలేదు. విరోధి వర్గాలను మన్నించలేదు.

జనతా పార్టీలోని భాగస్వామ్య పక్షాలు తమ పూర్వాశ్రమాలను మరచి పోవడానికి ప్రయత్నించక పోవడంవల్ల ఆ పార్టీ ప్రభుత్వ మంటే అతుకుల బొంత ప్రభుత్వమని ముద్ర పడిపోయింది. పార్టీ మరుగున పడి వర్గాలు ముందుకు వచ్చాయి. జనసంఘానికి జనసంఘం, బి.ఎల్.డి. కి బి.ఎల్.డి., పి.ఎస్.పి. కి పి.ఎస్.పి., పాతకాంగ్రెసుకు పాత కాంగ్రెసు ఎవరికి వారు గిరి గీసుకున్నారు. అధికారంలోకి రావాలని ఏకైక ఉద్దేశంతో ఏర్పడుతున్న రాజకీయ పొత్తులను ప్రజలు విమర్శించారు.

అసలు జనతా 'ప్రయోగం'లోనే దాని విచ్ఛినానికి కారణమైన అంశాలు వున్నాయి. అంతకు ముందు వేర్వేరు పార్టీలుగా విభిన్న సిద్ధాంత, రాజకీయ వైఖరులతో మనుగడ కొనసాగించిన మాజీ కాంగ్రెసు వారు, జనసంఘం వారు, రకరకాల సోషలిస్టులు, ఎప్పటికి ఏ పార్టీయో వారికే తెలియని సర్వస్వతంత్రులు కలకూరగంపగా ఆ పార్టీ పుట్టుకలోనే దాని మరణ శాసనం నిక్షిప్తమై వుంది. మతతత్వ, అభివృద్ధి నిరోధక రాజకీయాలనుండి సెగలుకక్కే విశృంఖల సామ్యవాదుల వరకు ఆశ్రయ మిచ్చిన జనతా కొంప ఎప్పుడయినా కూలక తప్పదని అందరనుకున్నట్లే అది జరిగింది.

ఆర్. ఎస్. ఎస్. తో జనసంఘానికి గల సంబంధం పార్టీ అస్థిత్వాన్ని సవాల్ చేసింది. జనసంఘ్ జనతాపార్టీ భాగస్వామ్య పక్షమైనందున ఇంతవరకు ఈ విషయంలో నోరెత్తని వారు కూడా ఇప్పుడు జనసంఘంపై విరుచుకపడటం మొదలుపెట్టారు. సెక్యులర్ సిద్ధాంతాలు పాటించే వారికి ఆర్.ఎస్.ఎస్. సమస్య మింగుడు కాకుండా వుండిపోయింది. ఇందుకు జనసంఘ్ పాము చావకుండా, బడితె విరగకుండా ఇచ్చే సమాధానాలు ఇతర పక్షాలకు సంతృప్తి కలిగించలేదు.

జనతా పార్టీకి పటిష్ఠమైన సంస్థాగత వ్యవస్థ లేకపోవడం మరొక పెద్ద లోపం. ప్రతిచిన్న విభేదాన్నికూడా దాని భాగస్వామ్య పక్షాలు పార్లమెంటులో పెట్టి పరస్పరం విమర్శించుకుని, దూషించుకునే స్థితికి చేరుకున్నాయి. పార్లమెంటు సమావేశాలు జరుగుతున్నప్పుడు ప్రతి గంటకు నలభైఎనిమిది వేల రూపాయలు ఖర్చు అవుతుంది. ఆ లెక్కన రోజుకు 3.39 లక్షల ఖర్చు. ఒక ప్రశ్నమీద 800 రూపాయల ఖర్చు. తమ పార్టీ అంతర్గతవ్యవహారాలు పార్లమెంటుకు లాగి జనతా పార్టీ దేశాని కెంత నష్టం కలిగించిందో దీనివల్ల తెలుసుకొనవచ్చు. ఈ విధంగా జనతా హయాంలో మంత్రులు పరస్పర దూషణలవల్ల పార్లమెంటు ప్రతిష్ఠ మున్నెన్నడూ లేనంతగా దిగజారింది.

చరణ్‌సింగ్ బాధ్యుడు :

జనతాపార్టీ ప్రభుత్వంలో ఉప ప్రధానిగా ఉన్నప్పుడు చరణ్‌సింగ్‌కు ఇతర నాయకులకు లేని మహత్తరమైన యోగ్యత ఒకటి ఉండేది. సంయుక్త విధాయక్ దళ్ వంటి కూటాలను నిర్మించడంలో ఆయన ఎంత సిద్ధహస్తుడో వాటిని నిర్మూలించడంలోకూడా అంత ఘనుడే. జనతా పార్టీ మంత్రివర్గంలో ఆరోగ్యశాఖ మంత్రిగా పనిచేసిన రాజ్ నారాయణ్ - అవసరమైతే నాశనానికి ప్రతిరూపంగా మారేవాడు. చరణ్‌సింగ్ ఆయనతో లోపాయికారిగా 'మిలాఖత్' అయినాడు. పైన మటుకు రాజ్ నారాయణ్‌తో తెగతెంపులు చేసుకున్నట్లు నమ్మించాడు. చాటున ఉండి ఆయనచేత అగ్రస్థానాన్ని ఏర్పాటు చేయించాడు. జనతా పార్టీ ప్రభుత్వాన్ని కూలద్రోయించాడు. జనతా పార్టీలోని బి. ఎల్. డి వర్గం తనకు మద్దతు ఉపసంహరించుకోవడంతో మురార్జీ దేశాయ్ 1979 జూలై 15న ప్రధానమంత్రి పదవికి రాజీనామా చేయవలసి వచ్చింది.

ఇక్కడ మురార్జీ దేశాయ్ రాజకీయంగా ఘోరమైన తప్పిదం ఒకటి చేశాడు. తనకు మొదటినుంచి పోటీదారుగా ఉన్న చరణ్‌సింగ్ చర్యలను రహస్యంగా ఆయన ఒక కంట కనిపెట్టవలసింది. అదనుకోసం ఎదురు చూస్తున్న చరణ్‌సింగ్ పన్నాగాలను ఆయన గ్రహించలేకపోయాడు. 83మంది బి. ఎల్. డి సభ్యులతో జనతా పార్టీలో ఐరావతంగా పెరిగిన చరణ్‌సింగ్‌ను అదుపులో పెట్టడానికి పదునైన అంకుశం ఆయనవద్ద లేకపోయింది. అవిభక్త కాంగ్రెస్‌లో 'ఓల్డ్ గార్డ్స్'నుంచి ఇలాంటి సమస్య ఎదురైనప్పుడు ఇందిరాగాంధీ ఎంతో

యుక్తిగా తన బలాన్ని పెంచుకొని వారిని సంస్థ నుంచి వేరుచేశారు. ఆ శక్తి ఇప్పుడు మురార్జీ దగ్గర లేకపోయింది.

చరణ్‌సింగ్ మున్నాళ్ళ ముచ్చట :

జనతా సెక్యులర్, సోషలిస్టు పార్టీ (మధులిమాయే గ్రూపు) ఒరిస్సా జనతా పార్టీలతో 1979 సెప్టెంబర్ 29న లోక్‌దళ్ అనే పేరుతో కొత్త పార్టీ అవతరించింది. ఈ పార్టీకి చరణ్‌సింగ్ అధ్యక్షుడు. రాజ్‌నారాయణ్ 'వర్కింగ్ ప్రెసిడెంటు'. శ్రీమతి ఇందిరాగాంధీ నియంతృత్వం మీద వీరు విరుచుకపడినట్లే జనతా పార్టీ 'మత తత్వం' మీద వీరు విరుచుకపడ్డారు.

జనతా పార్టీ అనైక్యతకు లోనుకావడంతో చరణ్‌సింగ్‌కు ప్రభుత్వం ఏర్పాటుచేసే అవకాశం వచ్చింది. శ్రీమతి ఇందిరాగాంధీ మద్దతుతో ప్రధాని పదవిని చేబట్టిన చరణ్‌సింగ్ కనీసం ఆమెను కలుసుకోవాలన్న కనీస మర్యాదలను కూడా పాటించకపోవడంతో నెల రోజులలోనే ఆయన పదవికి రాజీనామా చేయవలసి వచ్చింది. శ్రీమతి ఇందిరాగాంధీ చరణ్‌సింగ్‌కు మద్దతు ఉపసంహరించుకోగా లోక్‌సభలో మెజారిటీ కోల్పోయిన ఆయన ప్రభుత్వం రాజీనామా చేయవలసి వచ్చింది. చరణ్‌సింగ్ ప్రభుత్వం 24 రోజులే పని చేసింది. స్వతంత్ర భారతదేశంలో అత్యల్పాయుషు కలిగిన ప్రభుత్వం చరణ్‌సింగ్‌దే. చరణ్‌సింగ్ ప్రభుత్వంలో రాజ్యాంగేతర పీఠాధిపతిగా వినూత్నవతారం దాల్చి లేని అధికారాలను చెలాయించుకున్నాడు రాజ్‌నారాయణ్.

చరణ్‌సింగ్ రాష్ట్రపతికి రాజీనామా సమర్పించడంతోపాటు లోక్‌సభను రద్దు చేస్తూ మధ్యంతర ఎన్నికలు జరుగాలని చేసిన సిఫారసు పెద్ద వివాదాస్పదంగా తయారైంది. ఈలోగా మురార్జీ స్థానంలో జగ్‌జీవన్‌రాం జనతా పార్టీ నాయకుడయ్యాడు. ప్రత్యామ్నాయ ప్రభుత్వం ఏర్పాటుకు తనకు అవకాశం ఇవ్వాలని జనతా పార్లమెంటరీ పార్టీ నాయకుడు జగ్‌జీవన్‌రాం చేసిన అభ్యర్థనను రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి మన్నించలేదు.

రాష్ట్రపతి నీలం సంజీవరెడ్డి 1979 ఆగష్టు 27న లోక్‌సభను రద్దు చేస్తూ ఆపద్ధర్మ ప్రభుత్వాధినేతగా కొనసాగడానికి శ్రీ చరణ్‌సింగ్‌కు అనుమతిస్తూ మధ్యంతర ఎన్నికలు జరుపడానికి ఆదేశాలు జారీ చేశారు. దీనితో లోక్‌సభలో

విశ్వాసం పొందని, ఆ మాటకువస్తే లోక్‌సభను ఒక్కరోజుకూడా చూడని మంత్రివర్గం దేశాన్ని కొన్ని నెలలపాటు పరిపాలించగలిగింది.

చరణ్ ప్రభుత్వ ఉదయాస్తమయాలు :

1979 జూలై 23 : తమ తమ మద్దతుదారుల జాబితాలను జూలై 25 లోగా సమర్పించాలని రాష్ట్రపతి మురార్జీదేశాయ్, చరణ్‌సింగ్‌లను కోరారు.

జూలై 25 : శ్రీ దేశాయ్, చరణ్‌సింగ్ లిరువురూ 289 మంది మద్దతుదార్ల జాబితాను రాష్ట్రపతికి సమర్పించారు.

జూలై 23 : జాబితాను పరిశీలించిన పిమ్మట రాష్ట్రపతి కొత్త మంత్రివర్గ నిర్మాణానికి చరణ్‌సింగ్‌ను ఆహ్వానించారు.

జూలై 28 : చరణ్‌సింగ్ ప్రభుత్వం పదవీ ప్రమాణ స్వీకారం చేసింది.

జూలై 30 : చరణ్‌సింగ్ పది మంది క్యాబినెటు మంత్రులు, ఏడుగురు సహాయ మంత్రులను చేర్చి మంత్రివర్గాన్ని విస్తరించారు.

ఆగష్టు 2 : న్యాయశాఖ మంత్రి హెచ్. ఆర్. ఖన్నా రాజీనామా చేశారు.

ఆగష్టు 13 : రిజర్వు బ్యాంకులో ఆందోళనను నిషేదిస్తూ నిర్బంధ పొదుపు మొత్తాల చెల్లింపును వాయిదా వేస్తూ పూర్వ ప్రభుత్వం జారీ చేసిన రెండు ఆర్డినెన్స్‌లను కాలతోషానికి గురి చేసింది.

ఆగష్టు 16 : పెట్రోలియం, కిరోసిన్ తదితర పెట్రోలియం ఉత్పత్తుల ధరలను పెంచింది.

ఆగష్టు 19 : ఇద్దరు ఏ.ఐ.డి.ఎం.కె. సభ్యులు కేంద్రమంత్రి వర్గములో చేరారు.

ఆగష్టు 20 : చరణ్ ప్రభుత్వ విశ్వాస ప్రకటన తీర్మానాన్ని వ్యతిరేకించాలని కాంగ్రెసు (ఐ) నిర్ణయించింది. అందువలన చరణ్ ప్రభుత్వం రాజీనామా చేసింది.

ఐక్యఫ్రంటు రాజకీయం :

కాంగో సమస్యను పరిష్కరించటానికి పోతూ దారిలో విమాన ప్రమాదములో మరణించిన ఐకరాజ్య సమితి మాజీ ప్రధాన కార్యదర్శి డాగ్ హేమర్ షెల్డ్ ఒక కథ చెప్పారు.

ఒక ఏటి దగ్గర ఒక తాబేలు, ఒక తేలు తారస పడ్డాయి. తేలు, తాబేలు నడిగింది. 'నాకు ఈతరాదు. నీ వీపుమీద కూర్చుంటాను. ఏరు దాటించు.'

'దాటించేందుకు నాకేమీ అభ్యంతరం లేదు. కానీ నీది విషపు బుద్ధి. నీవు నమ్మదగ్గ దానివి కాదని అందరంటారు. ఏటి మధ్యకు పోగానే నీవు నన్ను కుట్టితే' అని సందేహం వెలిబుచ్చింది తాబేలు.

'అబ్బే ఎలా కుడతాను? నీవు మునిగిపోతే నేను మునిగిపోనా? నన్ను నేను కాపాడేందుకైనా నిన్ను కుట్టను కదా!' అన్నది తేలు.

ఈ మాటలు తాబేలుకు సహేతుకంగానే తోచాయి. వీపు మీద తేలుని ఎక్కించుకొని ఏరు దాటడం మొదలు పెట్టింది.

ఎవరికైనా తన సహజబుద్ధి ఎక్కడికి పోతుంది. ఏటిమధ్య కొచ్చేయగానే తేలు ఠపీమని తాబేలును కుట్టింది.

మన దేశంలో ఐక్యఫ్రంటు రాజకీయాలు ఇలాగే ఉంటున్నాయి. వాటి ఐక్యత కాంగ్రెసు మీద ధ్వజం ఎత్తడం వరకే. ఎన్నికలలో కాంగ్రెసును ఓడించాలనే లక్ష్యంతో ఏకమవుతుంటాయి. అవి లేనప్పుడు తమలో తాము కలహించుకుంటాయి.

-(o)-

# ప్రతిపక్ష నాయకత్వం

ప్రపంచంలోని ఏ పార్లమెంటులోనైన ప్రతిపక్షం సమర్థవంతంగా వుంటే ఆ దేశంలో పాలన సక్రమంగా వుంటుందనడం నిర్వివాదం.

## బ్రిటిష్ సంప్రదాయం :

బ్రిటన్, కెనెడా, ఆస్ట్రేలియాలలో ప్రతిపక్ష నాయకునికి చట్టబద్ధమైన గుర్తింపు ఉన్నది. భారతదేశంతో సహా పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థగల కామన్‌వెల్త్ దేశాలన్నిటిలో ప్రభుత్వాలు బ్రిటిష్ ప్రభుత్వ వ్యవస్థను అనుసరించి ఏర్పాటు చేసినవే. మన దేశంలో జనతా ప్రభుత్వం ఏర్పడగానే పార్లమెంటు ఉభయ సభలలోని ప్రతిపక్ష నాయకులకు క్యాబినేటు మంత్రుల హోదా ఇస్తూ శాసనం చేశారు. ప్రతిపక్ష నాయకులకు నెలకు 2,250 రూపాయల వేతనం, ఉచిత నివాసం, ఉచిత వైద్య చికిత్స, టెలిఫోన్, సెక్రటేరియట్ సౌకర్యాలు ఈ శాసనం ద్వారా లభించాయి. అందువల్ల ఈ పదవిపై ఎన్నడు లేనంత మోజు ఇటీవలి కాలంలో ఏర్పడింది.

మన దేశంలో కాంగ్రెసు పరిపాలన ఉన్నంతకాలం ప్రతిపక్ష నాయకునికి పెద్ద గుర్తింపు, హోదా లభించకపోయినా, ఆ ముప్పై ఏళ్ళు సమర్థులైన ప్రతిపక్ష నాయకులు ఉంటూనే ఉన్నారు. డాక్టర్ శ్యాంప్రసాద్ ముఖర్జీ, డాక్టర్ రాం మనోహర లోహియా, ఆచార్య కృపలానీ మొదలైనవారు యీ రంగంలో బాగా రాణించారు. ఒకప్పుడు వారి వాగ్బాణాలు ప్రభుత్వ పక్షాలను బాగా నొప్పించాయి. ముంద్రా వ్యవహారంలో నాడి కేంద్ర ఆర్థికమంత్రి టి. టి. కృష్ణమాచారి, చైనా దురాక్రమణ సమయంలో శ్రీ కృష్ణమీనన్ రాజీనామా చేయడానికి ప్రతిపక్ష నాయకులు ఒత్తిడే ముఖ్య కారణం.

కాబోయే ప్రధాని :

బ్రిటన్‌లో సభా నాయకునికి ప్రతి నాయకుడుగా ప్రతిపక్ష నాయకుడు వ్యవహరిస్తాడు. 'మహారాణిగారి ప్రభుత్వ ప్రతిపక్ష నాయకుడు' అంటే ప్రత్యామ్నాయ సభా నాయకుడే నన్నమాట. అందువల్ల ఆ దేశంలో ప్రతిపక్ష నాయకుణ్ణి 'కాబోయే ప్రధాని' అని సంబోధించడం కద్దు. బల్ఫోర్, బాల్డ్విన్, చర్చిల్ అట్లీ మొదలైన ప్రసిద్ధులు ఈ పదవిని అలంకరించి ఈ వ్యవస్థకు వన్నె తెచ్చారు.

1937 నుంచి బ్రిటన్‌లో ప్రతిపక్ష నాయకునికి ఏటా రెండువేల పౌన్ల వేతనం లభిస్తున్నది. ప్రతిపక్షం నుంచి నిర్మాణాత్మకమైన విమర్శలను, సలహాలను ప్రభుత్వం ఆహ్వానిస్తుంది. ప్రజాస్వామ్య విధానం పటిష్టం కావడానికి బలమైన ప్రతిపక్షం అవసరమని బ్రిటన్ విశ్వాసం.

ప్రతిపక్ష నాయకునికి ప్రభుత్వ పరమైన బాధ్యతలు లేకపోయినా గురుతరమైన ఇతర బాధ్యతలు చాలా ఉన్నాయి. సభలో ఇతడు సభానాయకుని విధానాలను ఖండిస్తాడు. తన పక్షం అనుసరించే విధానాన్ని నిర్ణయిస్తుంటాడు. తన పార్టీ విప్‌లను తన అదుపులో ఉంచుకుంటాడు. ముఖ్యమైన విషయాలపై ప్రభుత్వ నాయకులతో సంప్రదింపులు జరుపుతుంటాడు. ప్రధానమంత్రిని, మంత్రి వర్గాన్ని పరీక్షకు పెడతాడు. అల్ప సంఖ్యాక ప్రజల హక్కులను ప్రభుత్వం కబళించి వేయకుండా అనేక జాగ్రత్త చర్యలు తీసుకోవడం ప్రతిపక్ష నాయకుని విధి. పార్లమెంటులో ఘాటైన విమర్శలకు తట్టుకోలేని మంత్రుల బేలతనాన్ని బయటపెడతాడు. ప్రభుత్వ పక్షం వేసే ఎత్తులకు ప్రతి ఎత్తులను వేయడం అతని ప్రధాన విద్య. అందుకోసం అతడు ఎల్లప్పుడూ శస్త్రధారి అయి ఉండాలి. ప్రభుత్వం చేసే గోరంత తప్పునుకూడా కొండంతగా చేసి విమర్శించడంలో ప్రతిపక్ష నాయకుని పదవికి రాణింపు వస్తుంది. ఈ పదవిలో అతడు పొందిన అనుభవం ప్రతిపక్షానికి ప్రభుత్వం ఏర్పాటు చేసే అవకాశం లభించినప్పుడు బాగా ఉపయోగపడుతుంది.

**ప్రధాని వేరు, సభా నాయకుడు వేరు :**

ఆశ్చర్యం కలిగించే విషయం ఏమంటే బ్రిటన్‌లో ప్రధాని పదవిలో ఉన్న వ్యక్తే సభానాయకునిగా ఉండాలన్న ఆచారం లేదు. మన దేశంలో ఒక్క

రాజ్యసభలో మాత్రమే సభానాయకుడు వేరుగా ఉంటాడు. 1940 లో బ్రిటన్‌లో ఏర్పడిన జాతీయ ప్రభుత్వంలో సర్ విన్‌స్టన్ చర్చిల్ ప్రధాన మంత్రి.

చర్చిల్ యుద్ధ వ్యవహారాలకే తన సమయమంతా వినియోగించుకొని, సభావ్యవహారాలను అట్లేకి వదలిపెట్టాడు. 1945 లో అట్లే ప్రధాన మంత్రి అయినప్పుడు హెర్బర్ట్ మారిసన్‌ను సభా నాయకునిగా చేశాడు. 1951 ఎన్నికల తరువాత చర్చిల్ తిరిగి ప్రధాన మంత్రి అయినప్పుడు క్రూక్‌షక్‌ని సభా నాయకునిగా నియమించాడు. సర్ ఆంథోని ఈడెన్ ప్రధాన మంత్రిగా ఉన్నంతకాలం కూడా ఇతని సభా నాయకత్వం కొనసాగింది.

ప్రధాన మంత్రి కామన్స్ సభ్యుడై ఉన్నప్పుడు హౌస్ ఆఫ్ లార్డ్స్‌లో తన పక్షం తరపున ఒక ఉపనాయకుణ్ణి నియమిస్తాడు. బాల్డ్‌విన్ 1935 లో సర్‌జాన్‌షోర్‌ని ఇలాగే నియమించాడు. కానీ 1931 లో ప్రధాన మంత్రిగా ఎన్నికయిన చాంబర్లేన్ ఉభయ సభలకు తానే నాయకునిగా ఉన్నాడు.

బాధ్యత, సంసిద్ధత :

బ్రిటన్‌లో పార్టీ ఎప్పుడు అధికారానికి వస్తుందో, ఎప్పుడు పోతుందో చెప్పలేని విధంగా ఉంటాయి ఎన్నికల ఫలితాలు. ప్రతి ఎన్నికలలోనూ నువ్వా ? నేనా ? అన్నట్లు కన్సర్వేటివ్, లేబర్ పార్టీల మధ్య తీవ్రమైన పోటీ జరుగుతుంది. 1964 లో లేబర్ పార్టీ కేవలం నాలుగు స్థానాల మెజారిటీతో గెలిచింది. 1924 లో సర్ మెక్‌డోనాల్డ్ ఒకే ఒక ఓటు మెజారిటీతో తాను ప్రధానిగా లేబర్ పార్టీ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశాడు. పార్టీ సభ్యులలో ఏ ఒక్కరూ తన మద్దతును ఉపసంహరించుకున్నా ప్రభుత్వం పతనమైపోయే పరిస్థితి అది.

అందుచేత అక్కడ ప్రతిపక్ష నాయకునికి ఏ క్షణంలోనైనా ప్రభుత్వం ఏర్పాటు చేసే అవకాశం, అవసరం రావచ్చు. ఈ కారణంగా ఆ పదవికి ఎంతో ప్రాముఖ్యం, బాధ్యత ఉన్నాయి. ప్రజలు ప్రతిపక్ష నాయకుని ప్రతి చర్యనూ ఎంతో శ్రద్ధగా, వెయ్యి కళ్ళతో గమనిస్తుంటారు.

మన దేశంలో కూడా ప్రతిపక్ష నాయకుని పట్ల ప్రజలకు ఆసక్తి ఉంది. ఇప్పుడు వస్తున్న రాజకీయ పరిణామాల దృష్ట్యా మరింత కుతూహలం కలగడం సహజం. వెనుకటి సమైక్య కాంగ్రెసు 1977 ఎన్నికలలో ఓడిపోయి ప్రతిపక్ష

మైనప్పుడు శ్రీ వై. బి. చవాన్ లోక్‌సభలోను, శ్రీ భోలా పాశ్వాన్‌శాస్త్రి రాజ్య సభలోను ప్రతిపక్ష నాయకులయ్యారు. వారిద్దరూ చాలా మైత్రిగా, కొన్ని సంద ర్భాలలో జనతా పార్టీకి అనుకూలంగా వ్యవహరించారని శ్రీమతి ఇందిరాగాంధీ వర్గం భావించింది.

## కాంగ్రెస్ (ఐ) నాయకులు :

ఆ తరువాత కాంగ్రెస్ నుండి చీలిపోయిన కాంగ్రెస్ (ఐ) వర్గం క్రమంగా పార్లమెంటులో స్వరన్‌సింగ్ కాంగ్రెసు కంటె ఎక్కువ బలం సంపాదించుకుంది. శ్రీ చవాన్, శ్రీ శాస్త్రిల స్థానంలో ఇందిరా అనుకూలురైన శ్రీ సి. ఎం. స్టీఫెన్ (లోక్‌సభ), శ్రీ కమలాపతి త్రిపాఠీ (రాజ్యసభ) ప్రతిపక్ష నాయకులయ్యారు. కాంతి దేశాయ్ వ్యవహారంలోను, ప్రత్యేక కోర్టుల బిల్లుపై చర్చ జరిగినప్పుడూ పార్లమెంటులో కాంగ్రెసు (ఐ) పక్షం ప్రదర్శించిన ధోరణి జనతా వారికి, మరి కొందరికి చీకాకు కలిగించినా దానివల్ల ప్రతిపక్ష నాయకుల ప్రాముఖ్యం మరింత పెరిగింది.

## శ్రీ రాజీవ్ గాంధీ :

1989 డిశంబర్ లోక్‌సభ ఎన్నికలలో కాంగ్రెసు (ఐ) పార్టీ మరల అధి కారం కోల్పోయింది. అందువల్ల పార్లమెంటులో ప్రధాన ప్రతిపక్షంగా కాంగ్రెస్ కొత్తపాత్రను శ్రీ రాజీవ్‌గాంధీ నాయకత్వంలో చేబట్టింది. రాష్ట్రపతి పార్ల మెంటు ఉభయ సభల నుద్దేశించి చేసిన ప్రసంగానికి ధన్యవాదాలు తెలిపే తీర్మా నంపై జరిగిన చర్చ, ప్రధాని శ్రీ విశ్వనాధ ప్రతాప్‌సింగ్ కోరిన విశ్వాస తీర్మా నంపై జరిగిన చర్చలు తొమ్మిదవ పార్లమెంటు మొదటి సమావేశంలో ఒక హైలైటుగా మారాయి. ఎందుకంటె, ఈ రెండు సందర్భాలలో శ్రీ రాజీవ్‌గాంధీ ప్రసంగించిన తీరు తన పార్టీ సభ్యులను ఉత్తేజ పరచడమే గాక రాజకీయ పండి తులను కూడా ఆశ్చర్య పరిచింది. దాదాపు రెండు గంటలకుపైగా ప్రతిపక్ష నాయ కుడు శ్రీ రాజీవ్‌గాంధీ అనర్గళంగా ప్రసంగిస్తుంటే ప్రభుత్వ సభ్యులు ఆయన ఎక్కువ సమయాన్ని తీసుకుంటున్నారని గొడవ చేశారు కూడా.

పార్లమెంటులో ప్రధాన పక్షంగా సమర్థంగా తమ పాత్ర నిర్వహించడానికి కాంగ్రెసుపార్టీ నాయకుడు రాజీవ్‌గాంధీ ఒక షాడో క్యాబినెటును కొన్ని గ్రూపులుగా ఏర్పాటు చేశారు. వివిధ అంశాలపై నిష్ణాతులైన వారిని సభ్యులుగా చేర్చారు. ఆయా విషయాలను వీరు పార్లమెంటు దృష్టికి తెస్తారు.

చెరగని చిరునవ్వు, ఆత్మవిశ్వాసంతో చురుకుగా కన్పించే రాజీవ్‌గాంధి ప్రతిపక్ష నాయకుడుగా ఎన్నికైన కొద్ది రోజులలోనే ఆ పదవిలో బాగా రాణించారు. తన షాడో క్యాబినెటుతో పార్లమెంటులో రాజకీయ పోరాటాలకు ఆయుత్తమవుతున్నారు. ఇది మన దేశ పార్లమెంటు చరిత్రలో నూతనాధ్యాయం.



# సతీ సహగమన నిషేధం - పూర్వాపరాలు

1932లో ఒక మహిళ సహగమనానికి పాల్పడగా పోలీసులు సకాలంలో జోక్యం చేసుకొని చితి మంటల మధ్యనుంచి ఆ నిర్భాగ్యురాలి ప్రాణాలను కాపాడారు. ఆ సందర్భంగా ఏర్పడిన ఉద్రిక్త వాతావరణంలో ముగ్గురు అమాయకులు చనిపోయారు. ఇది జరిగిన యాభై అయిదు సంవత్సరాలలో మన దేశం ఎన్నో రంగాలలో అద్భుత విజయం సాధించింది. అయితేనేం ? ఇలాంటి అమానుష చర్య మళ్ళీ జరిగిందంటే అది మన చరిత్రకే సిగ్గుచేటు.

మన దేశంలో సతీ సహగమనం అమల్లో ఉన్న కాలంలోకూడా ఇది కొన్ని వర్గాలకు, కొన్ని ప్రాంతాలకు మాత్రమే పరిమితంగా ఉండేది. ఈ దురాచారం బెంగాల్, పంజాబు, రాజస్థాన్ రాష్ట్రాలలో ఎక్కువగా వ్యాపించి ఉండేదని చరిత్రాధారాలు చాటి చెప్పుతున్నాయి. ముఖ్యంగా క్షత్రియ కులస్థులలో ఎక్కువగా వ్యాపించి ఉండేదని చరిత్రాధారాలు చాటి చెప్పుతున్నాయి. ముఖ్యంగా క్షత్రియ కులస్థులలో ఇది ప్రబలంగా ఉండేది. ఇది ఎంతటి క్రూరమైన, అమానుష చర్య అంటే హిందూ మతంపై కత్తి కట్టిన ముస్లిం పాలకులు సైతం దీనిని నిషేధించటానికి కొన్ని చర్యలు తీసుకున్నారు. సతీ సహగమనాన్ని నిషేధిస్తున్నట్లు ఔరంగజేబు ఒక శాసనం కూడా విడుదల చేశాడు. అయితే, ఔరంగజేబుపై తమకు గల సహజ ద్వేషంతో రాజపుత్ర రాజులు ఈ శాసనాన్ని ఖాతరు చేయలేదు. 1780లో మేవాడ్ రాజు చనిపోయినప్పుడు అతని 64మంది రాణులు అతని చితిపై పడి ఆ అగ్గిలో బుగ్గి అయిపోయారు. ఆ రోజులలో సిక్కురాజు మరణిస్తే అతని 10 మంది రాణులు, 300మంది ప్రేయసులు అతనితో సహగమనం చేశారు. ఒక్క బెంగాల్ రాష్ట్రంలోనే 1785లో 375 మంది స్త్రీలు సతికి ఆహుతి అయితే అలాంటి నిర్భాగ్యుల సంఖ్య 1810లో 839కి పెరిగింది.

కంపెనీ ప్రభుత్వాల కృషి :

ఆంగ్లేయులు 1771లో బెంగాల్‌పై ఆధిపత్యాన్ని చేజిక్కించుకొని, పరిపాలన ప్రారంభించిన తరువాత చేసిన మొదటి పని మత విశ్వాసాలతో ముడిపడిన హిందువుల ఆచార వ్యవహారాలను ఒకచోట క్రోడీకరించడం. తమ న్యాయస్థానాలకు మార్గదర్శకంగా ఉండడం కోసం వివిధ ప్రాంతాలకు ప్రాతినిథ్యం వహించే 11 మంది బ్రాహ్మణ పండితులకు వారెన్ హేస్టింగ్స్ ఈ బాధ్యతను అప్పగించాడు. వారు ధర్మ శాస్త్రాలలోను, ఇతర మత గ్రంథాలలోను ఉన్న విషయాలను క్రోడీకరించి హిందూ న్యాయశాస్త్రాన్ని తయారుచేశారు. దీనిని 'జెంటూ కోడ్'గా పిలిచారు. అయితే ఇందులో సతీ సహగమనాన్ని నిర్బంధంగా పాటించవలసిన మత విధిగా ఎక్కడా పేర్కొనలేదు. కాని సతిని పుణ్యకార్యంగా అక్కడక్కడ ప్రస్తుతించడం మాత్రం జరిగింది.

'సతి'ని చూచి బ్రిటిష్‌వారు చెలించిపోయినా దేశీయుల మత విశ్వాసాలలో జోక్యం చేసుకోకూడదని భావించి ఈ ఆటవిక చర్యను సహించేవారు. ఈ విషయంలో కంపెనీ ప్రభుత్వపు ఉదాసీన వైఖరిని సొంత ఉద్యోగులైన కలెక్టర్లు, మెజిస్ట్రేట్లు, పోలీసు సూపరింటెండెంట్లు సైతం విమర్శించేవారు.

సతీ సహగమనం శాస్త్ర సమ్మతం కాదని, ఇది స్త్రీ జాతిని వంచించడానికి పురుష జాతి పన్నిన కుట్ర అని దేవేంద్రనాథ్ టాగూర్, రాజా రామ్‌మోహన రాయ్‌లు నిగ్గుదీసి తేల్చినప్పుడే భారత ప్రజలు కన్ను తెరిచారు. కంపెనీ అధికారంలో ఉన్న రాష్ట్రాలలో ఈ దురాగతాన్ని అరికట్టడం ఎంతవరకు సాధ్యమవుతుందో తనకు సలహా ఇవ్వవలసిందని గవర్నర్-జనరల్ లార్డ్ వెల్లస్లీ 1803లో కలకత్తాలోని సుప్రీంకోర్టుని కోరారు. ఇది మతపరమైన చిక్కులతో ముడిపడిన సమస్య కనుక సతీ సహగమన నిరోధానికి ప్రజాభిప్రాయం అనుకూలంగా ఉన్నప్పుడే ఇది శాసనరీత్యా సాధ్యమవుతుందని సుప్రీంకోర్టు గవర్నర్-జనరల్‌కు తెలియచేసింది. దీనిపై కంపెనీ ప్రభుత్వం కొంత చొరవ తీసుకొని ఈ అమానుష చర్యనుంచి తమ బిడ్డలను కాపాడుకోవాలని ప్రజలకు విజ్ఞప్తితో కూడిన శాసనం ఒకటి 1812లో విడుదల చేసింది. అంటే దీని అర్థం-ఇష్టం ఉన్నవారు సతిని పాటించవచ్చు. కాని నిర్బంధం చట్ట సమ్మతం కాదు. మన దేశంలో నిర్బంధం లేని ఏ చట్టం ఆచరణకు రాదు కనుక ఆ దుస్థితే ఈ చట్టానికి కూడా పట్టింది. ఈలోగా సతీసహగమనానికి విరుద్ధంగా ప్రజాభిప్రాయం వెల్లువలా పైకి వచ్చింది. లండన్‌లోని బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్‌కి ఎన్నో వినతి

పత్రాలు పరంపరగా అందుతూ వచ్చాయి. బెంగాల్ రాష్ట్ర పల్లపు ప్రాంతాలకు చెందిన పోలీస్ సూపరింటెండెంట్ డీఈవర్ ఈ సందర్భంగా ఒక సర్వే చేయగా నూటికి తొంభై అయిదుమంది ప్రజలు సతీ సహగమన నిరోధానికి అనుకూలంగా ఉన్నట్లు వెల్లడైంది. అంతేకాదు, ఇష్టపూర్వకంగా సతిని పాటించే స్త్రీలు ఏ ఒకరు ఇద్దరు మాత్రమే ఉంటారని, ఈ నిషేధాన్ని కంపెనీ ప్రభుత్వం కఠినంగా అమలు చేస్తే భావితరాల ప్రజలు ఈ ప్రభుత్వానికి కృతజ్ఞులై ఉంటారని కూడా అతడు తన నివేదికలో పేర్కొన్నాడు.

మత విశ్వాసాలతో ముడిపడిన చోట్ల 'సతి'ని అనుమతించాలని, మిగిలిన ప్రదేశాలలో దానిని నిరోధించాలని 1812 లో గవర్నర్-జనరల్ ఉత్తరువు ఇవ్వడంతో ప్రభుత్వం ఈ ఆచారాన్ని ఆమోదించిందని ప్రజలు అనుకున్నారు. అంతేకాదు వారిలో కొందరు మత దురభిమానులు దీనిద్వారా ప్రోత్సాహం పొంది 'సతి' సంఘటనలు అధిక సంఖ్యలో జరగటానికి ప్రోత్సహించారు. తదుపరి సంవత్సరాలలో ఈ సంఘటనలు పెరగడమే దీనికి నిదర్శనం. 1815 లో 375, 1818 లో 839, 1821 లో 654, 1823 లో 557, 1825 లో 839 సతీ సంఘటనలు జరిగాయి.

సతి నిషేధంపై తమ ప్రభుత్వంలోని సివిల్, మిలిటరీ అధికారుల ఒత్తిడి నానాటికి అధికం కావడంతో లండన్‌లోని బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ కార్యాలయం వారు 1823 జూన్ 17 న భారత గవర్నర్-జనరల్‌కు విడుదల చేసిన ఉత్తరువులో హిందూ మతస్తులను రెచ్చగొట్టే విధంగా ఉండకుండా సతిని అడ్డుకోవలసిందని గోడ మీది పిల్లిలాంటి ఉత్తరువులు జారీ చేశారు. ఆనాటి గవర్నర్-జనరల్ లార్డ్ అమ్‌హెర్స్ట్ మీన మేషాలు లెక్క పెట్టుకుంటూ తన పదవీ కాలం గడిపాడే కానీ ఏలాంటి తీవ్ర చర్యలు తీసుకోలేదు. ఈ లోగా కొందరు సనాతన వాదులు గవర్నర్-జనరల్ హిందూ మతంలో అనవసర జోక్యం కలుగ జేసుకొనటానికి ప్రయత్నాలు చేస్తున్నారని బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్‌కి ఫిర్యాదు చేశారు. దీనిపై రాజా రామ్‌మోహన్‌రాయ్ సతీ నిషేధంపై గవర్నర్-జనరల్ తీసుకునే ఏ చర్య కూడా మత జోక్యంగా భావించరాదని, ఇది సాంఘిక దురాచారంపై కత్తి కట్టడమే అని వాదించగా, ఆయనను హత్య చేస్తామంటు బెదిరింపు లేఖలు వచ్చాయి.

### బెంటింగ్ చొరవ :

1828 లో లార్డ్ విలియం బెంటింగ్ భారత గవర్నరు జనరల్‌గా కలకత్తా వచ్చారు. సతీ సహగమన నిరోధక చట్టం స్వచ్ఛందంగానో, నిర్బంధంగానో

అమలు పరిచే విషయంలో బోర్డ్ ఆఫ్ డైరెక్టర్స్ ఆయనకు పూర్తి అధికారం ఇచ్చింది. అంతకు ముందే ఢిల్లీ ప్రాంతంలో రెసిడెంటుగా ఉన్నప్పుడు సతీ నిషేధాన్ని విజయవంతంగా అమలు చేసిన చార్లెస్ మెట్కాఫ్ అప్పుడు గవర్నర్ జనరల్ మంత్రి వర్గంలో సభ్యుడైనాడు. నిషేధానికి ఎదురయ్యే వ్యతిరేకత తాత్కాలిక మైనదేనని, దీర్ఘకాలంలో ఇది మంచి ఫలితమిస్తుందని అతడు గవర్నర్-జనరల్‌కు నచ్చ చెప్పాడు.

బ్రిటిష్ ఇండియాలో సతీ సహగమనాన్ని నిషేధించే శాసనం 1879 డిశంబరు 4న విడుదలయింది. పోతే, దీనికి వ్యతిరేకంగా మత ఛాందస వాదులు లండన్‌కు పోయి ప్రీవీ కౌన్సిల్‌కు, బోర్డు ఆఫ్ డైరెక్టర్స్‌కు అప్పీలు చేసుకున్నారు. కానీ రాజా రామమోహనరాయ్ లక్షలాది మంది భారతీయుల సంతకాలతో సతీ సహగమనం శాస్త్ర సమ్మతం కాదని చేసిన వాదన లండన్‌లోని పార్లమెంటులోను, ప్రీవీ కౌన్సిల్‌లోను గెలిచింది. దీనితో మత ఛాందస వాదులకు గట్టి దెబ్బ పెట్టు తగిలింది. వారాసించిన విధంగా సతీ నిరోధక చట్టం దేశంలో ఎక్కడా అలజడి సృష్టించలేదు. ప్రతిచోట ప్రజలు ఈ చట్టాన్ని హృదయ పూర్వకంగా స్వాగతించారు.

సతీ నిషేధం చట్టం సంపూర్ణంగా అమలుకు వచ్చినా రాజస్థాన్‌లోని కొన్ని మాజీ సంస్థానాలలో ఈ దురాచారం అప్పుడప్పుడూ తలెత్తుతూనే ఉన్నది. 1816లో ఉదయపూర్‌లో ఒక సతీ సంఘటన జరిగింది. 1932లో జరిగిన సంఘటన కూడా రాజస్థాన్‌కు చెందినదే.

1987 అక్టోబర్‌లో రాజస్థాన్‌లో జరిగిన సంఘటన దేశవ్యాప్తంగా తీవ్ర సంచలనం సృష్టించింది. సతిని నిషేధిస్తూ రాజస్థాన్ గవర్నర్ చేసిన శాసనం బట్టి చూస్తే ఈ రాష్ట్రం ఈ విషయంలో తన సోదర రాష్ట్రాలకన్నా కనీసం ఒక వంద సంవత్సరాలైనా వెనుకబడి ఉందని చెప్పవచ్చు. ఏది ఏమైనా ఇలాంటి చర్యలు ముందు జరుగకుండా చూడవలసిన బాధ్యత రాజస్థాన్ ప్రభుత్వంపై ఉంది.

1987 డిశంబర్‌లో సతీ నిరోధక బిల్లును పార్లమెంటు ఏకగ్రీవంగా ఆమోదించింది. సతీ సహగమనాన్ని ప్రోత్సహించిన వారికి, ఈ దురాచారాన్ని అనుసరించినవారికి మరణశిక్షగాని, జీవిత ఖైదు విధించడానికిగానీ ఈ బిల్లు అవకాశం కల్పించింది.

[ -o- ]

# అలీనోద్యమం

రెండవ ప్రపంచ యుద్ధం తరువాత ప్రపంచం కమ్యూనిస్టు, కమ్యూనిస్టు వ్యతిరేక కూటాలుగా చీలిపోయింది. రెండు అగ్రరాజ్యాల కూటాలు పరస్పరం యుద్ధ సన్నద్ధమై మోహరించిన రెండు శిబిరాలుగా రూపొందాయి. భారతదేశం యీ రెండు కూటాలకు దూరంగా ఉండటానికి నిశ్చయించుకుంది. 1946 సెప్టెంబర్‌లో తాత్కాలిక జాతీయ ప్రభుత్వం ఏర్పడినప్పుడు జరిగిన మొదటి పత్రికా సమావేశంలో జవహర్‌లాల్ నెహ్రూ ఏమన్నారంటే- 'ఇంతవరకు ప్రపంచ యుద్ధాలకు దారితీసిన రాజకీయాలకు, రాజకీయ కక్షలకు మేము దూరంగా ఉండదలచాం. ఇలాంటి రాజకీయాలు మున్ముందు ఇంకా తీవ్రమై విధ్వంసక యుద్ధాలకు దారి తీయవచ్చు. ప్రపంచంలో ఎన్నో తగాదాలు, సంఘర్షణలు, పరస్పరం ద్వేషాలు ఉన్నప్పటికీ, క్రమంగా సన్నిహిత సహకారంవైపు ప్రపంచం సాగుతుంది. భారతదేశం ఇటువంటి అంతర్జాతీయ సామరస్యం కోసం కృషి చేస్తుంది. అంతర్జాతీయ వ్యవహారాలలో అత్యంత ప్రధాన పాత్ర నిర్వహించవలసిన బాధ్యత దైవికంగా మన మీద పడింది. అమెరికా ప్రజలకు మనం శుభాకాంక్షలందజేస్తున్నాం. సోవియట్ యూనియన్‌కు కూడా మనం స్వాగతం పలుకుతున్నాము'.

క్రొత్తగా స్వాతంత్ర్యం పొందిన దేశాలు ఏ రాజ్యకూటంలోను చేరకుండా తటస్థంగా ఉండటానికి భారత ప్రధాని నెహ్రూ, యుగొస్లావియా అధక్షుడు టిటో, ఈజిప్టు అధ్యక్షుడు నాసర్ అలీనోద్యమానికి రూపకల్పన చేశారు. ప్రపంచంలో నెలకొన్న ప్రచ్ఛన్న యుద్ధ పరిస్థితికి వ్యతిరేకంగా అలీనోద్యమ దేశాలు తమ కార్యక్రమాలను ప్రారంభించాయి. అంతటితో ఆగకుండా సామ్రాజ్యవాదానికి, వలస విధానానికి, ఆర్థిక అసమానతలకు, ఆయుధ పోటీకి, అణ్వాయుధాలకు,

సైనిక స్థావరాలకు వ్యతిరేకంగా కార్యక్రమాలను చేపట్టాయి. నూతన అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థ, నూతన అంతర్జాతీయ సమాచార వ్యవస్థకు కృషిచేశాయి. జాతీయ విముక్తి పోరాటాలకు మద్దతు పలికాయి. ఎన్నో చెప్పుకోదగ్గ విజయాలను కూడా సాధించాయి.

శిఖరాగ్ర సమావేశాలు :

బాండుంగ్ సమావేశంలో అలీన సిద్ధాంతానికి నిర్దిష్టమైన స్వరూపం ఏర్పడింది. 1961 సెప్టెంబర్‌లో బెల్‌గ్రేడ్‌లో జరిగిన మొదటి అలీన శిఖరాగ్ర సమావేశంలో 25 దేశాలు పాల్గొన్నాయి. మొదటి సమావేశం తరువాత గడచిన 25 సంవత్సరాలలో అలీనోద్యమం ఎంతో పురోగమించింది. రెండవ శిఖరాగ్ర సమావేశం 1964 సెప్టెంబర్‌లో కైరోలో జరిగింది. అందులో 47 దేశాలు పాల్గొన్నాయి. 1970 సెప్టెంబర్‌లో లూసాకాలో జరిగిన మూడవ శిఖరాగ్ర సమావేశంలో అలీన దేశాల సంఖ్య 54 వరకు పెరిగింది. నాల్గవ శిఖరాగ్ర సమావేశం 1973 సెప్టెంబర్‌లో అల్జీరియాలో ఏర్పాటైంది. ఈ సమావేశంలో 75 దేశాలు పాల్గొన్నాయి. కొలంబోలో 1975 ఆగష్టులో నిర్వహించిన ఐదవ శిఖరాగ్ర సమావేశంలో పాల్గొన్న దేశాల సంఖ్య 86. అలీన దేశాధినేతల ఆరవ శిఖరాగ్ర సమావేశం 1979లో హవానాలో జరిగింది. అప్పుడు 92 దేశాలు అందులో సభ్యత్వం కలిగి ఉన్నాయి. 1982 సెప్టెంబర్‌లో ఏడవ సమావేశం ఇరాన్ రాజధాని బాగ్దాద్‌లో జరుగవలసింది. కానీ ఇరాన్-ఇరాక్ యుద్ధం కారణంగా అక్కడ జరుగలేదు. ఏడవ సమావేశం మార్చి 1983లో ఢిల్లీలో జరిగింది.

ఢిల్లీ సమావేశం :

ఢిల్లీలో జరిగిన అలీన దేశాల శిఖరాగ్ర సమావేశానికి అప్పటి భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ అధ్యక్షత వహించారు. ఈ సమావేశం ప్రపంచం ఎదుర్కొంటున్న క్లిష్టమైన రాజకీయ ఆర్థిక సమస్య లన్నింటిని సమీక్షించింది. ఆఫ్ఘనిస్తాన్, కంపూచియా, ఇరాన్-ఇరాక్ యుద్ధం, పశ్చిమ సహారా, పశ్చిమాసియా, హిందూ మహాసముద్రంలో సైనిక సమీకరణ, లాటిన్ అమెరికా, నమీబియా, ఆగ్నేయాసియా, నిరాయుధీకరణ, ఆర్థికాభివృద్ధి తదితర సమస్యలు ఢిల్లీ సమావేశపు చర్చలలో, ప్రసంగాలలో ప్రాధాన్యం వహించాయి. అలీనోద్యమ ఐక్యత పరిరక్షించడానికి అలీన దేశాలు తమ ద్వైపాక్షిక సమస్యలను శాంతి

యుత చర్చల ద్వారా పరిష్కరించు కోవాలని ఢిల్లీ సమావేశం విజ్ఞప్తి చేసింది. అగ్రరాజ్యాల ఒత్తిడులను తట్టుకొని స్వాతంత్ర్యాన్ని పరిరక్షించు కోవాలని ఢిల్లీ సమావేశం అలీన దేశాలన్నింటికి సందేశ మిచ్చింది. సమగ్ర నిరాయుధీకరణ, ఆయుధాల పోటీ అంతమొందించడం తక్షణ అవసరమని ఈ సభ రాజకీయ ప్రకటన వివరించింది. అలీన దేశాలలో అస్థిత్వం కల్పించడానికి, ఆ దేశాల అంతరంగిక వ్యవహారాలలో జోక్యం కల్పించుకోడానికి అగ్రరాజ్యాలు చేస్తున్న ప్రయత్నాలను ఢిల్లీ సమావేశం గర్హించింది. ఢిల్లీ సమావేశపు ఆర్థిక ప్రకటన కూడా గణనీయమైనది. ప్రతిష్ఠంభన ఏర్పడిన అంతర్జాతీయ సంప్రదింపులు తిరిగి వెంటనే ప్రారంభం కావలసిన తక్షణ అవసరాన్ని ఇది నొక్కి చెప్పింది. పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాల కుట్రలకు గురికాకుండా ఉండడానికి, అలీన దేశాలు పరస్పరం సహకారం, సమిష్టి కృషి ద్వారా స్వయం పోషకత్వం సాధించుకోవాలని ఢిల్లీ సమావేశం అభిప్రాయ పడింది. ఆర్థిక రంగంలో కేవలం తమ ప్రయోజనాలను మాత్రం రక్షించు కోవడానికి అభివృద్ధి చెందిన దేశాలు అనుసరిస్తున్న విధానాలను ఢిల్లీ సమావేశం విమర్శించింది. అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థలోని లోపాలను దూరం చేయడానికి తీసుకోవలసిన తాత్కాలిక, శాశ్వత చర్చలకు ఏడవ అలీన దేశాల సమావేశం ప్రాధాన్యం ఇచ్చింది. చాలా స్వల్ప వ్యవధిలో భారత దేశం ఏడవ శిఖరాగ్ర సమావేశం నిర్వహించవలసి వచ్చింది. అయినా మన దేశ విదేశాంగ శాఖ అధికారులు, ఆ నాటి విదేశాంగ మంత్రి శ్రీ పి. వి. నరసింహారావు నిరంతర కృషివల్ల ఏడవ శిఖరాగ్ర సమావేశం అపూర్వమైన రీతిలో విజయవంతమైనది. శ్రీమతి ఇందిరాగాంధీ రానున్న మూడు సంవత్సరాల వరకు అలీన ఉద్యమానికి అధ్యక్షత వహించ వలసి ఉంది. కానీ, ఆమె హత్యతో ఈ గురుతర బాధ్యతను అనంతరం ప్రధాని శ్రీ రాజీవ్ గాంధీ స్వీకరించి ఈ ఉద్యమానికి నూతన స్ఫూర్తి నిచ్చారు.

హరారే సమావేశం :

అలీనోద్యమ ఎనిమిదవ శిఖరాగ్ర మహాసభ సెప్టెంబరు 1988 లో జింబాబ్వే రాజధాని హరారేలో జింబాబ్వే అధినేత రాబర్టు మొగాబే అధ్యక్షతన జరిగింది. ఆయన రాజీవ్‌గాంధీ వారసునిగా అలీనోద్యమ అధినేత పదవిని స్వీకరించారు.

అలీనోద్యమంలోని 102 దేశాలలో 51 దేశాలు ఆఫ్రికా దేశాలే కావడం వల్ల అవి యీ ఉద్యమంలో ప్రధాన పాత్ర వహిస్తున్నాయి. ఆఫ్రికాలోని సహారా దక్షిణ భాగంలో అలీనోద్యమ (నామ్) శిఖరాగ్ర సభ జరపడం ఇది రెండవ సారి. ఇంతవరకు జరిగిన ఎనిమిది శిఖరాగ్ర సమావేశాలలో నాలుగు ఆఫ్రికాలోనే జరిగాయి. వాటిలో రెండు ఉత్తర ప్రాంతాన, రెండు దక్షిణ ప్రాంతాన జరిగాయి. దీనిని బట్టి అలీనోద్యమంలో మధ్య ఆఫ్రికా పాత్ర ఎటువంటిదో అర్థమౌతుంది.

హరారే సమావేశంలో ఆఫ్రికా నిధి ఏర్పాటు నిర్ణయం తీసుకున్నారు. శక్తివంతమైన మిత్ర దేశాల సహాయంతో ఎల్లకాలం ఆధిక్యతలో ఉంటామని ప్రిటోరియా ప్రభుత్వం భావించ రాదు. అలాంటి అవకాశం దానికి ఇవ్వరాదని దక్షిణాఫ్రికా నిధి విరాళ సభలో ప్రసంగిస్తూ అప్పటి భారత ప్రధాని రాజీవ్‌గాంధీ 1987 జనవరి 24 తేదీన న్యూఢిల్లీలో అన్నారు. ఆఫ్రికా నిధి సమావేశానికి జింబాబ్వే ప్రధాని ముగాబే, జాంబియా అధ్యక్షుడు కెన్నెత్ కౌండా హాజరైనారు.

బెల్‌గ్రెడ్ సమావేశం

అలీన దేశాల తొమ్మిదవ శిఖరాగ్ర సమావేశం ఇరవై ఎనిమిది సంవత్సరాల అనంతరం మళ్ళీ యుగోస్లావియా రాజధాని బెల్‌గ్రెడ్‌లో సెప్టెంబర్ 1989 లో జరిగింది. ఈ సమావేశం ఆర్థిక సమస్యలపై ఎక్కువ దృష్టి కేంద్రీకరించింది. మూడవ ప్రపంచ దేశాల ఆర్థిక సమస్యల పట్ల సంపన్న దేశాల ఉదాసీన వైఖరి, రుణభారం, నిధుల కొరత, సాంకేతిక పరిజ్ఞాన లోపం ఇవన్నీ చర్చకు వచ్చాయి. సంపన్న దేశాలకు, వర్ధమాన దేశాల మధ్య ఆగిపోయిన చర్చలు మళ్ళీ సాగాలన్నారు. అంతర్జాతీయ ఆర్థిక మహాసభ ఏర్పాటు కావాలని ఇండియా, ఈజిప్టు, వెనుజుల, సెనిగల్ దేశాలు పారిస్ శిఖరాగ్ర సభలో ఇచ్చిన పిలుపును సమర్థించాయి. పర్యావరణ పరిరక్షణకు 'భూగోళ నిధి' ఒకటి ఏర్పాటు కావాలని భారత ప్రధాని చేసిన ప్రతిపాదనను అందరు హర్షించారు.

సాఫల్య వైఫల్యాలు :

ఆనాడు అలీనోద్యమానికి పునాదులు వేసిన నెహ్రూ, నాసర్, టిటో, సుకర్నో ప్రభృతులు ఈనాడు లేకపోయినా అది మానవాళిలో అరవై అయిదు శాతం మహా ప్రజలకు ప్రాతినిధ్యం వహించే ప్రపంచ సంస్థగా ఎదిగింది.విభిన్న సంస్కృతులు, జాతులు, మతాలు, వ్యవస్థలు, అగ్రరాజ్య శిబిరాలతో వేర్వేరు అనుబంధాలు కలిగిన నూట రెండు దేశాలు అలీనోద్యమ మౌలిక లక్ష్యాలకు

నిబద్ధమై సంఘటితంగా నిలబడ్డమన్నది సామాన్య విషయం కాదు. ఈ భేదాలకు, భిన్నత్వానికి అతీతంగా అన్నిటికీ వలసపాలన చరిత్ర, నయా వలసవాదం, జాతి వివక్ష, ఆర్థిక దుర్బలత, అగ్రరాజ్యాలు ఆధిపత్యం వహించే ప్రపంచంలో తమ మూగ గొంతులు, తమ సార్వభౌమాధికారం స్వాతంత్ర్యం ప్రమాదంలో పడ్డా యనే భీతి వగైరా ఉమ్మడి అంశాలు అలీనోద్యమ అభివృద్ధికి దోహదం చేశాయి. ఆనాటి బెల్గ్రేడ్ సమావేశం రాజకీయ స్వాతంత్ర్యం, శాంతి, సహజీవనాలు ప్రధాన లక్ష్యాలుగా భావి కార్యాచరణకు బాట వేసింది. ఆనాటి నుంచి నేటివరకు అలీనోద్యమ రాజ్యాలు జాతీయ విముక్తి పోరాటాలకు రాజకీయ, నైతిక భౌతిక సహకారాలు అందిస్తూనే వచ్చాయి. నమీబియా విమోచన సమరంలోను, దక్షిణాఫ్రికా శ్వేత జాత్యహంకారులకు వ్యతిరేకంగా నల్లజాతి ప్రజలకు వెన్నుదన్నుగా ప్రపంచ ప్రజాభిప్రాయాన్ని సమీకరించే కృషిలో అలీనోద్యమం చేసిన సేవలు ప్రత్యేకంగా పేర్కొనదగ్గవి. 1983 నుంచి 1986 వరకు ఇండియా నాయకత్వంలో అలీనోద్యమ కార్యకలాపాలు 'శాంతి, నిరాయుధీకరణ, అభివృద్ధి' అనే మూడంశాలపై విశేషమైన కృషి జరిగింది. హిందూ మహాసముద్రాన్ని శాంతి మండలంగా చేయటానికి అలీనోద్యమం నేటికీ పాటు పడుతున్నది.

అలీనోద్యమ మహాసభలలో వాక్చాతురత ప్రదర్శించడమే తప్ప కార్యశూరత శూన్యమనే అపవాదు ఉంది. కంపూచియా సమస్యను పరిష్కరించడంలో అలీనోద్యమం విఫలమైంది. ఇరాన్-ఇరాక్‌ల మధ్య ఏడేళ్ళు హోరాహోరీగా సాగిన భీకర పోరు చివరకు ఐక్యరాజ్య సమితి జోక్యంతోనే నివారించడం జరిగింది. లిబియాపై అమెరికా దాడిని ఖండించడం మేరకైనా సభ్యదేశాల మధ్య సంపూర్ణ ఏకీభావం కనిపించలేదు. ఆఫ్ఘనిస్తాన్ సమస్య అపరిష్కృతంగానే ఉంది. భారత-పాకిస్తాన్‌ల మధ్య విభేదాలు తగ్గడం లేదు. ఆర్థిక, వాణిజ్య రంగాలలో చేస్తున్న తీర్మానాలు నిష్ప్రయోజన మవుతున్నాయి. అభివృద్ధి చెందుతున్న దేశాల ఎగుమతులకు పారిశ్రామిక దేశాల మార్కెట్లలో ఎదురవుతున్న ఇబ్బందుల్ని అధిగమించడానికి, విదేశ రుణభారం నుంచి విముక్తికి లేదా కొంత వెలుసుబాటుకు నిర్మాణాత్మకమైన వ్యూహరచన జరగాలి. సంపన్న దేశాలతో విజయవంతంగా సంప్రదింపులు జరుపగల నైపుణ్యం వుండే కమిటీలను ఏర్పాటు చేసుకోవాలి. వర్ధమాన దేశాల ఆర్థికాభివృద్ధి సమస్యలకు సంతృప్తికర పరిష్కారాలు లభించినప్పుడే అలీనోద్యమం సత్తా వ్యక్తమవుతుంది. ఈ సంగతిని అలీనోద్యమ దేశాల నేతలు గుర్తించి, తగు చర్యలు తీసుకోవలసి ఉంది.

# కాలానుగుణంగా మారిన కామన్‌వెల్త్

ఆధునిక సామ్రాజ్యతత్వం మన కాలంలో మనం ఎరిగిన రూపంలో 1870లో ఆరంభమయింది. ఈ కాలనిర్ణయం కొంతవరకు అడ్డుదిడ్డంగా జరిగినా, ఆ కాలం చరిత్రలో చాలా ప్రాముఖ్యమైనది. పెట్టుబడిదారీ శక్తిని బాగా కలిగి ఉన్న దేశాలు ప్రపంచంలోని పెద్ద పెద్ద ప్రదేశాలను అనేకం తమ వశం చేసు కోవలసిన అవసరాన్ని 1870 పరిస్థితులు మరీ ఎక్కువ చేశాయి. 1870 సంవత్స రానికి ముందు సామ్రాజ్యతత్వం పుష్కలంగానే ఉంది. కానీ, అప్పటి నుంచి మరింత ఎక్కువయింది.

బ్రిటీష్ సామ్రాజ్యాధిపత్య నిర్మాణానికీ, సామ్రాజ్యాధిపత్య నిర్మూలనకూ భారతదేశమే ప్రధాన పాత్ర వహించిందని చెప్పాలి. భారతదేశానికి స్వాతం త్ర్యం లభించగానే బ్రిటిష్ సామ్రాజ్యంలోని అనేక వలస దేశాలకు విముక్తి లభించడం మొదలయింది. 1945లో ప్రపంచ జనాభా 2,225 మిలియన్లు. అప్పుడు వారిలో 600 మిలియన్లు బ్రిటిష్ పాలనక్రింద ఉన్నారు.

1961 సంవత్సరం వచ్చేసరికి 'వైట్‌హాల్' పరిపాలనలో ఉన్నవారి సంఖ్య 50 మిలియన్లు కూడా లేదు. అంటే 550 మంది మిలియను ప్రజలు ఏదో ఒకవిధంగా స్వతంత్రులై కూర్చున్నారు. బ్రిటిష్ సామ్రాజ్యం ఇలా అంతరించి పోవడం ఒక పరివర్తన క్రమానికి పెద్ద ఉదాహరణ. నూరు సంవత్సరాల కిందట బ్రిటిష్, ఫ్రాన్స్, జర్మనీలు వలస రాజ్యాలను అతి సులభంగా స్థాపించుకొనడానికి వెనుకబడిన ప్రాంతాలలో జాతీయ భావం కొరవడిన లక్ష్యమే ప్రధాన కారణం. నేడు ఆ పరిస్థితులలో పెద్ద మార్పు వచ్చింది. జాతీయత అనేది తీవ్రమయిన శక్తి. వెనుకబడిన ప్రతి దేశంలోను ఇది మహా ప్రచండంగా వీస్తున్నది. ఈ స్వాతంత్ర వాంఛ స్వాభావికమయినది. ఒక దేశం మరొక దేశాన్ని పాలించ

డానికి అర్హత లేదనే సాధారణ సూత్రం వలసరాజ్య నిర్మూలనకు ప్రధానాంశ మయినది. ఇది ప్రపంచమంతటా ఒక గొప్ప శక్తిగా పైకువికింది. ఈ జాతీ యాభిమానమే కొత్త రాజ్యాలు నిర్మించుకొనడానికి, ఉన్నవాటిని నిలబెట్టుకోడానికి ప్రబల విరోధం అయింది.

సామ్రాజ్యాలు నిర్మించుకున్న దేశాలలో బ్రిటన్ కొంత ఉదార వైఖరి అవ లంబించింది. అందుకు తార్కాణంగా తిరిగి భారత దేశాన్నే తీసుకోవాలి. 'బ్రిటిష్ పాలనలో భారత దేశంలో రాగల ఫలితాలు' అనే వ్యాసంలో మార్క్స్ యీ విధంగా చెప్పాడు.

'రైళ్ళకు పని కలిగించాలంటే వాటిని నడపవలసిన అవసరాన్ని తెచ్చి పెట్టే పరిశ్రమలు నిర్మించడం అవసరం. లేకపోతే, అతి విస్తీర్ణమైన, దేశ వ్యాప్తమైన రైలుమార్గాల పోషణను భరించడం కష్టం. అందువల్ల రైళ్ళకు సం బంధంలేని ఇతర పరిశ్రమలు కూడా ఆరంభమవుతాయి. కాబట్టి ఆధునిక పారి శ్రామికాభివృద్ధికి రైళ్ళు దోహదమిస్తాయి. అంతేకాదు, భారత అభివృద్ధికి ప్రబల నిరోధకంగా ఉన్న కుల పద్ధతిని ఇది కొంతవరకైనా తొలగిస్తుంది.' భారత దేశంలో గొప్ప పరివర్తన తెచ్చిన అంశాలలో రైల్వేల పాత్ర గణనీయమైనది.

**సభ్య దేశాలు :**

బ్రిటన్ నుంచి విముక్తి చెందిన దేశాల కూటమిగా వర్థిల్లుతున్న కామన్ వెల్తులో 49 దేశాలు సభ్యత్వం కలిగి ఉన్నాయి. సీటోలో అమెరికాతో కలిసిఉన్న దేశాలు, సంపన్న ఉత్తర దేశాలు, సోవియెట్ యూనియన్‌తో స్నేహ ఒప్పం దాలు ఉన్న దేశాలు, కొన్ని నిరుపేద దేశాలు కామన్‌వెల్తులో కలిసి ఉన్నాయి. సంపన్న దేశాలకు కామన్‌వెల్తులోని ఇతర బీద దేశాల మధ్య వారధి బ్రిటన్. వర్థమాన దేశాలకు కామన్‌వెల్తుకు ఒకవైపు, సోవియెట్ యూనియన్‌కు కామన్ వెల్తుకు మరొకవైపు భారత దేశం మధ్యవర్తి స్థానంలో ఉన్నది.

కామన్‌వెల్తులోని సభ్య దేశమైన గ్రెనెడా కరిబియన్ సముద్రంలో అతి చిన్న ద్వీపం. దీని జనాభా ఒక లక్ష మాత్రమే. బ్రిటన్‌నుంచి స్వాతంత్ర్యం పొందిన దేశాలలో బర్మా ఒక్కటే కామన్‌వెల్తులో చేరలేదు. 1949 ఐర్లాండ్, 1961లో దక్షిణాఫ్రికా, 1956లో సుడాన్, 1971లో పాకిస్తాన్ కామన్‌వెల్తు నుంచి

విడవద్దాయి. (తరువాత పాకిస్తాన్ కామన్‌వెల్తులో తిరిగి చేరింది). 1987లో కామన్ వెల్తు నుంచి ఫిజీని తొలగించారు. కామన్‌వెల్తు ఆశయాలకు ప్రాతిపదికగా సమస్యలు పరిష్కరించుకున్న అనంతరమే ఫిజీని మళ్ళా కామన్‌వెల్తులో తీసుకుంటారు. అంటే, అధిక సంఖ్యాకులయిన భారతీయులపట్ల వివక్షకు స్వస్తి చెప్పినప్పుడే కామన్‌వెల్తులో ఫిజీకి స్థానం లభిస్తుందన్నమాట. జాతి వివక్షకు స్వస్తి చెప్పి, ప్రజాస్వామ్యానికి కట్టుబడి ఉంటామని ప్రకటించినప్పుడే ఫిజీక్ మళ్ళా స్థానం లభిస్తోంది. ఫిజీ తిరుగుబాటు నాయకుడు కర్నల్ రబూకా 1987 అక్టోబర్ 7న ఫిజీని రిపబ్లిక్‌గా ప్రకటించాడు. 1952 నుంచి బ్రిటిష్ రాణి కామన్‌వెల్తు దేశాలకు లాంఛనప్రాయమైన అధినేతగా ఉంటున్నారు.

పోటీ సంస్థ కాదు :

ప్రపంచంలోని నాల్గో వంతు దేశాల సభ్యత్వం కలిగిన కామన్‌వెల్త్ ఐక్యరాజ్య సమితికి పోటీ సంస్థ కాదు. అనుబంధ సంస్థ కూడా కాదు. దీనికి ప్రత్యేక పతాకం ఏదీ లేదు. కామన్‌వెల్త్ ప్రధానుల సమావేశాలను బ్రిటిష్ రాణి లాంఛనంగా ప్రారంభిస్తారు. ఈ దేశాల రాయబారులను 'హైకమీషనర్' అనే ప్రత్యేక పేరుతో పిలుస్తారు.

కామన్ వెల్త్ దేశాల కార్యక్రమాలను నిర్వహించడానికి 1956 లో లండన్‌లో కామన్‌వెల్తు సెక్రటేరియట్ ఏర్పడింది. దాని ప్రధాన కార్యనిర్వాహకుణ్ణి కామన్‌వెల్తు సెక్రటరీ జనరల్ అంటారు. కామన్‌వెల్తు దేశాల ప్రధానుల సమావేశాలు సాధారణంగా రెండు సంవత్సరాల కొకసారి జరుగుతాయి. ఈ సమావేశాలను ఏర్పాటు చేయడానికి, ఇతర రంగాలలో జరిగే వివిధ చర్చలకు కామన్ వెల్తు సెక్రటరీ జనరల్ వివిధ దేశాలతో సంప్రదింపులు జరిపి తేదీలు నిర్ణయిస్తారు.

కామన్‌వెల్తు దేశాలకు ఆర్థిక సహకారం అందించడానికి 'కామన్‌వెల్తు ఫండ్ ఫర్ టెక్నికల్ కో-ఆపరేషన్' అనే సంస్థ ఏర్పడింది. దీని కింద అయ్యే ఖర్చులలో డెబ్బయి శాతం బ్రిటన్, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్‌లు భరిస్తాయి. ప్రపంచంలోని నాల్గో వంతు వాణిజ్యం కామన్‌వెల్తు దేశాల మధ్య జరుగుతుంది.

ప్రపంచ శాంతికి ముప్పు వాటిల్లిన అనేక సందర్భాలలో కామన్‌వెల్తు ముందుకొచ్చి పరిస్థితిని అదుపులోకి తెచ్చింది. 1955 లో ఇండో-చైనా సమస్య

తీవ్ర రూపం దాల్చినప్పుడు బ్రిటన్ ప్రధాని ఈడెన్, భారత ప్రధాని నెహ్రూ కృషి వల్ల ప్రపంచ ఉద్రిక్తత తగ్గింది. ఈజిప్టు అధ్యక్షుడు నాసర్ సూయజ్ కాలువను జాతీయం చేసినప్పుడు నెహ్రూ చొరవ తీసుకొని ప్రపంచ యుద్ధాన్ని నివారింగ గలిగారు.

కామన్‌వెల్తు లో 'కామన్'గా భావించ వలసిన విషయం ఒక్కటైనా లేదు. ముఖ్యంగా 'వెల్తు'లో అని చమత్కరించారు కృష్ణమీనన్. సర్ రాబర్టు హాల్ అనే చరిత్రకారుడు ఏమన్నాడంటే 'ఈ నాటి కామన్ వెల్తు స్వతంత్ర దేశాల స్వేచ్ఛా కూటమి. ఇలాంటి కూటములలో ఇది అపురూపమైనది. విభిన్న జాతులు, విభిన్న మతాలు, విభిన్న అభిప్రాయాలతో ఈ కూటమి అలరారు తున్నది. పరస్పర సదవగాహన ఉన్నంత వరకు ఈ కూటమి కొనసాగుతూ ఉంటుంది.' మారిన పరిస్థితులకు అనుకూలంగా కామన్ వెల్తును రూపుదిద్దిన వారిలో నెహ్రూ, బి. ఎన్. రావ్, కృష్ణమీనన్, అట్లీల పాత్ర ప్రధానమైనది.

సహజీవన సిద్ధాంతంపై ఆర్థిక, సాంకేతిక రంగాలలో పరస్పరం సహక రించుకుంటూ, విశాల మానవాభ్యుదయానికి కృషి సల్పుతున్న కామన్ వెల్తు ప్రపంచ శాంతికి ఆశాకిరణం. కామన్‌వెల్తు దేశాల ప్రధాన మంత్రుల సమావే శము 1983 నవంబరులో శ్రీమతి ఇందిరాగాంధీ నాయకత్వంలో భారత దేశంలో జరగడం మన దేశానికి గర్వకారణం.



# సహకారానికి సేతువు 'సార్క్'

దక్షిణాసియాలో భారత దేశం, పాకిస్తాన్, శ్రీలంక, నేపాల్, భూటాన్, బంగ్లాదేశ్, మాల్దీవులతో ఒక ఆసియన్ తరహాలో బృందాన్ని రూపొందించాలనే ఆలోచన 1981 లో అప్పటి బంగ్లాదేశ్ అధ్యక్షుడు కీ.శే. జియావుర్ రహమాన్‌కు కలిగింది. ఈ దేశాలలోని కొన్ని ప్రభుత్వాల ప్రతినిధులు, కొన్ని రాజకీయ పార్టీలు, కొన్ని వాణిజ్య వ్యాపార సంస్థలు ఈ సమావేశం ఏర్పాటుకు దీక్షగా కృషి చేశాయి.

వలస విధానం నుంచి విముక్తి పొందిన ఈ ఆధునిక దేశాలన్నీ దాదాపు ఒకే విధమైన ఆర్థిక ఇబ్బందులను ఎదుర్కొంటున్నాయి. కనుక తమ ఆర్థిక సమస్యలను తమలో తాము చర్చించుకోవడంలో అభ్యంతరకరమైన విషయం ఏమీ ఉండదు. ప్రాంతీయ సహకార మన్నది ప్రపంచ మంతటా కనిపిస్తున్న పరిణామమే. మండల స్థాయిలో ఆర్థిక, సాంస్కృతిక సహకారం పెంపొందించుకునే లక్ష్యంతో నైతే ఇలాంటి బృందం ఏర్పడటం వలన ఈ దేశాలకు ఉపయోగకరంగానే ఉంటుంది.

ఢాకాలో సూచించిన శిఖరాగ్ర సమావేశం వెంటనే ఆచరణలోకి రాకపోయినా దక్షిణ ఆసియాలోని ఈ ఏడు దేశాలు వివిధ స్థాయిలలో జరిగిన చర్చల పట్ల తమ సుముఖతను వ్యక్తం చేశాయి. దేశాధినేతల శిఖరాగ్ర సమావేశానికి ముందు నాలుగుసార్లు ప్రభుత్వ కార్యదర్శుల స్థాయిలో సమావేశాలు జరిగాయి. విదేశాంగ మంత్రుల స్థాయిలో కూడా సమావేశాలు జరిగాయి. పౌర ఆరోగ్యం, టెలికమ్యూనికేషన్లు, గ్రామీణాభివృద్ధి, శాస్త్ర విజ్ఞానం, రవాణా, వాతావరణ శాస్త్రం, పోస్టల్ శాఖలు మొదలైన రంగాలలో సహకారానికి సంబంధించి కొంత ముందంజ వేశారు.

పూర్వ రంగం :

1983 ఏప్రిల్‌లో ఢిల్లీలో ఎగుమతి సంస్థల సమాఖ్య ఆధ్వర్యాన ఈ ఏడు దక్షిణ ఆసియా రాజ్యాల ఆర్థిక సహకారంపై ఒక సదస్సు జరిగింది. దానికి ఈ దేశాలకు సంబంధించిన ప్రైవేటు రంగంలోని ప్రధాన వాణిజ్య సంస్థల ప్రతినిధులు దాదాపు 200 మంది హాజరైనారు. ఈ సమావేశంలో పాల్గొన్న అప్పటి భారత రాష్ట్రపతి శ్రీ జ్ఞానీ జైల్‌సింగ్, అప్పటి కేంద్ర ఆర్థిక మంత్రి శ్రీ వి.పి. సింగ్ ఈ మండల దేశాల మధ్య సన్నిహిత సహకారం అవసరమని నొక్కి చెప్పారు.

సమాఖ్య అధ్యక్షుడు శ్రీ భాయ్ మోహన్‌సింగ్ తమ ప్రసంగంలో కొన్ని ఆసక్తిదాయకమైన విషయాలు బైట పెట్టారు. ఈ ఏడు దేశాలు దిగుమతి చేసు కుంటున్నవి ఎగుమతి చేసుకునే వాటి కన్న 75 శాతం ఎక్కువని అన్నారు. అప్లయిడ్ ఎకానమిక్ రీసర్చి జాతీయ సమితి అధ్యక్షుడు శ్రీ పి. ఎల్. టాంకన్ తమ ప్రసంగంలో ఈ ఏడు దేశాలు తమ పెట్టుబడుల ఉత్పత్తులను సమీకరించు కొని ఈ మండలాన్ని బలమైన వాణిజ్య శక్తిగా రూపొందించు కోవాలని సూచిం చారు. అందుకు గాను ఈ దేశాలలోని సాంకేతిక వేత్తలు, పరిశోధకులు పరస్పర లాభసాటి అయిన ప్రణాళికలను సృష్టించుకోవాలని చెప్పారు.

ప్రఖ్యాత ఆర్థికవేత్త శ్రీ ఎల్. కె. ఝా ఈ సభ ముగింపు ఉపన్యాసంలో చేసిన సూచనలు చాలా ముఖ్యమైనవి. అభివృద్ధి చెందిన దేశాల నుంచి కొను గోళ్లు, వాటి అమ్మకాల విషయంలో వర్థమాన దేశాలు ఉమ్మడి కార్యాచరణను రూపొందించుకునే మార్గాలను అన్వేషించు కోవాలని కోరారు. ఉత్తర దేశాలనుండి మేం కొనుగోళ్ళను ఆపివేస్తామని దక్షిణ దేశాలు ముక్త కంఠంతో ప్రకటించి నట్లయితే, దక్షిణ దేశాల నుండి కొనుగోళ్ళను నిషేధించేందుకు ఉత్తర దేశాలు విధించిన ఆంక్షలన్నీ పటాపంచలు కాక తప్పవని ఆయన అభిప్రాయ పడ్డారు.

పెట్టుబడిదారీ దేశాలతో వర్థమాన దేశాల ద్రవ్య, ఆర్థిక సంబంధాల స్వరూపాన్ని మార్చేందుకు కొన్ని నిర్దుష్టమైన చర్యలు తీసుకొనవలసి వస్తుంది. అందులో కొన్ని 1) ముడి పదార్థాలను ఉత్పత్తిచేసే దేశాల అసోసియేషన్ల కార్య కలాపాలను విస్తరింపచేయటం, 2) ఈ పదార్థాల ఎగుమతి ధరలను నిలబెట్టడంలో

వర్ధమాన దేశాలకు ఉపయోగపడే విధంగా ముడిపదార్థాల ఉమ్మడి నిధిని ఒక దానిని ఏర్పాటుచేయడం, 3) వర్ధమాన దేశాలు తమ సొంత ఆర్థిక స్తోమతను ఆధారం చేసుకొని, ప్రత్యామ్నాయ మారక ద్రవ్యాన్ని ప్రవేశపెట్టడం, 4) వర్ధమాన దేశాలు సొంత అంతర్జాతీయ బ్యాంకునీ, వర్తక చెల్లింపుల బాంధవ్యాలను ఏర్పాటు చేసుకోవడం ఈ ప్రతిపాదనలకు ఆచరణ రూపం ఇవ్వడానికి ఎంతో కృషి జరుగవలసి ఉంది.

## భారతదేశం పాత్ర :

1986లో బెంగుళూరులో జరిగిన దక్షిణాసియా దేశాల ప్రాంతీయ సమావేశంలో భారత ఉపఖండంలోని దేశాల మధ్యగల ఉద్రిక్తతలు, అనుమానాలు, సమస్యలు మొత్తంగా కాకపోయినా కొంత మేరకు వెల్లడయ్యాయి. ఈ ఏడు సభ్య దేశాలలోనే ప్రజాస్వామ్యం నుంచి సైనిక, రాజరిక పాలన వరకూ ప్రభుత్వాలలో ఉన్న వైవిధ్యంలాగానే, భిన్న సమస్యలు ఈ దేశాలను పట్టి పీడిస్తున్నాయి. అసమాన అభివృద్ధివల్ల ఏర్పడిన వ్యత్యాసాలతోపాటు భిన్న దృక్పథాలు కలిగిన పాలకవర్గాలు- పాలన చేస్తున్న దేశాలమధ్య పై వైరుధ్యాలు కాకతాళీయం కాదు. ప్రత్యేకించి వెనుకబడిన దేశాలు, అభివృద్ధి చెందుతున్న దేశాలు, తమ దేశాభివృద్ధికి సంబంధించిన కార్యకలాపాలు అగ్రరాజ్యాల కనుసన్నలలో మెలగాల్సిన పరిస్థితిలో ఆయా దేశాలలోని సమస్యలకు మరింత రాజకీయం సంతరించుకోవడం జరుగుతున్నది. సహజంగానే గతంలో వలస పాలనకు, దోపిడీ దురాక్రమణలకు గురైన దేశాలు స్వాతంత్ర్యం పొందినప్పుడు సరిహద్దు సమస్యలు ప్రధానాంశాలుగా ఉంటూ వచ్చాయి. తమ తమ దేశాలలో అధికారంలో కొనసాగటానికి, తమ ప్రత్యర్థి వర్గాలనుంచి రక్షణకు తమ పొరుగు దేశాలతో కలిగిన తగాదాల పరిష్కారం కొరకు అగ్రరాజ్యాల శరణు జొచ్చడం వల్లనే ఇవి మరింత పరాధీన దేశాలుగా మారిపోతున్నాయి. అభివృద్ధి చెందుతున్న దేశాలు, వెనుకబడ్డ దేశాలు జాత్యహంకారంతో పరస్పరం కలహించుకుంటూ, అనుమానాలతో, అపోహలతో ఘర్షించుకునే పరిస్థితికి సార్క్ దేశాల పరిస్థితి భిన్నమేమీ కాదు. అయితే, ఈ పరిస్థితినుండి బయటపడటానికి, అభివృద్ధి చెందుతున్న దేశాలు తమదైన ఒక తరహా గొంతుకతో అనేక పరిమితులకు లోనై, పై చర్యలకు భిన్నంగా ఉంటూ స్వతంత్రించి జీవించటానికి ప్రయత్నంలో ఉన్నాయి. పెట్టుబడిదారీ దేశాలు, సామ్రాజ్యవాద విధానం అవలంబించినప్పటినుండి దోపిడీకి గురి అవుతున్న ఈ

వలస, నయా వలస దేశాలు రాజకీయ స్వాతంత్ర్యంతోపాటు ఆర్థిక స్వాతంత్ర్యం కోసం కూడా పోరాడుతున్నాయి. ఆర్థికంగా వెనుకబడిన యీ దేశాలకు స్వాతంత్ర్యం లభించగానే అవి వలస, నయావలస విధానాలకు దూరంగా ఉండటానికి ప్రయత్నిస్తున్నాయి. అయితే అగ్రరాజ్యాలు తమ భల్లూకపు పట్టుతో మరింత కేంద్రీకృతమైన పెత్తనం కింద వెనుకబడిన యీ దేశాలను తమ ఆధీనంలో ఉంచుకొనటానికి ప్రయత్నాలు కొనసాగిస్తున్నాయి.

## సార్క్ మనుగడ:

ఈ పరిణామాలవల్ల తమ దేశాల జాతీయ భద్రతకు, సార్వభౌమత్వానికి, జాతీయ అభివృద్ధికి తీరని హాని కలుగుతుందని ఈ దేశాలు గుర్తించగలిగాయి. వాటివల్ల జరిగే నష్టాన్ని అవి అంచనా వేసుకొని, ప్రాంతీయాభిమాన ప్రేరేపితమై పరస్పర నిందలు, ఘర్షణలకు స్వస్తి చెప్పుకుంటున్నాయి. ఈ మార్పుల కారణంగా ఏర్పడినదే సార్క్. అంతేకాదు, ఇటీవలి కాలంలో ముఖ్యంగా ఇండియా, పాకిస్తాన్, శ్రీలంక దేశాల్లోని రాజకీయ పరిణామాలు, టెర్రరిజం మొదలైన అనేక అంశాల మాటున అగ్రరాజ్యాల పరోక్ష జోక్యంతో సతతమౌతూ, తమ తమ దేశాల భద్రతలకే ముప్పు ఏర్పడుతున్న పరిస్థితి సార్క్ ఏర్పాటుకు సహాయపడిందన్న అంశాన్ని ఈ దేశాలు గుర్తించగలిగాయి. అయితే, ఈ నేపథ్యంలో సార్క్ దేశాలను పట్టి పీడిస్తున్న సమస్యలను మనం గమనించవలసి ఉంది.

## సమస్యలు - అనుమానాలు :

వలస పాలకులు భారత ఉపఖండంలో సుదీర్ఘమైన తమ పాలన ముగించుకొని స్వాతంత్ర్యంతో పాటు దారిద్ర్యం, మత ఘర్షణలు, సరిహద్దు సమస్యలు, పరాధీనత బహూకరించి వెళ్లారు. దేశ విభజన జరుగగానే మత పరమైన ఘర్షణలతో ఉపఖండం హోరెత్తి పోయింది. ఇండియా-పాకిస్తాన్ అసహజంగా పంచుకున్న కాశ్మీర్ సమస్య నేటికి ఈ రెండు దేశాల మధ్య చిచ్చును రగుల్కొలుపుతూనే ఉంది. కాశ్మీర్ సమస్య శాశ్వత పరిష్కారమయ్యే వరకు ఈ రెండు దేశాల మధ్య ఘర్షణలు చెలరేగుతూనే ఉంటాయి. దేశ విభజనే ఉద్రేకపూరిత వాతావరణంలో జరిగింది. అందువల్ల ఇండియా-పాకిస్తాన్‌ల మధ్య శత్రువైఖరి ఏనాటికి తగ్గలేదు. తనకంటె పెద్ద దేశమైన ఇండియాను దృష్టిలో పెట్టుకొని

ఇండియాతో సమానంగా, ఆ మాటకు వస్తే మిన్నగా తన సైనిక శక్తిని పెంచుకోవాలని పాకిస్తాన్ తీవ్ర ప్రయత్నంలో ఉంది. అందువల్ల అది సెంటో, సీటో సైనిక కూటాలలో చేరి అమెరికా నుంచి పెద్ద ఎత్తున ఆయుధాలను దిగుమతి చేసుకుంటున్నది. తమ దేశ ప్రయోజనాలకు భిన్నంగా ఇండియా ఏక పక్షంగా గంగా నదిపై ఫరక్కా బ్యారేజిని నిర్మించుకున్నదని బంగ్లాదేశ్ అభిప్రాయం. నేపాల్ కూడా గంగా జలాల సమస్యను చర్చల ద్వారా పరిష్కరించుకోవాలని అభిప్రాయపడుతూనే, చైనా-ఇండియా రెండు పెద్ద దేశాల మధ్య తానున్నందుకు ఈ రెండు దేశాలు నేపాల్‌ను శాంతి మండలంగా ప్రకటించమని అడిగింది. దీనికి చైనా అంగీకరించింది. కానీ ఇండియా అంగీకరించ లేదు. భారత-రష్యా ఒప్పందం (1971), సిక్కిం విలీనీకరణ తరువాత నేపాల్, భూటాన్‌లు ఇండియాను చూసి భయపడుతున్నాయి. శ్రీలంక తమిళ టెర్రరిస్టులకు ఇండియా ఆశ్రయ మిస్తోందని శ్రీలంక ఆరోపిస్తోంది. ఇటీవల తమిళనాడులో పెద్ద ఎత్తున టెర్రరిస్టుల వద్ద ఆయుధాలు లభించడం ఈ ఆరోపణలను బలపరుస్తుంది. ఇక పంజాబ్ టెర్రరిస్టులకు పాకిస్తాన్ ఆశ్రయ మివ్వడం ఉండనే ఉన్నది.

భిన్న దృక్పథాలు కలిగి కేవలం అధికారంలో కొనసాగడమే ధ్యేయంగా ఉన్న రాజకీయ శక్తుల వల్ల అగ్రరాజ్యాలు తమ రాజకీయ కార్యకలాపాలను సజావుగా జరుపుకుంటాయి. ఒక సిద్ధాంతం ఆధారంగా ప్రజా పునాది కలిగి, నిజమైన ప్రజాతంత్ర సోషలిస్టు వ్యవస్థ కోసం శ్రమించే అంతర్జాతీయ శక్తులు బలహీనంగా ఉన్న నేటి దశలో అగ్రరాజ్యాల విధానాలకు పట్టపగ్గాలుండవు. వెనుకబడిన దేశాలు స్వతంత్రించి, ఒక వ్యవస్థగా ఏర్పడినా తమ విధానాల కొనసాగింపు కష్టమని భావిస్తే సార్క్ నిరుపయోగ మవుతుంది. ఇండియా సార్క్ దేశాల మధ్య కీలకమైన స్థానంలో ఉంది. మిగతా దేశాల కంటె ఇది భౌగోళికంగాను జనాభా రీత్యా పెద్ద దేశం. కనుక భారత దేశం గతంలో అనుసరించిన విధానాలకు భిన్నంగా ఇచ్చి పుచ్చుకునే రీతిలో వ్యవహరించాలి. ప్రాంతీయ సమస్యలను పరిష్కరించుకునే క్రమంలో అగ్రరాజ్యాల ప్రభావానికి దూరంగా ఉంటూ సహన స్థాయిలో చర్చించుకో కలగాలి. శ్రీలంక విషయంలో రాజీవ్‌గాంధీ, జయవర్ధనే చూపించిన చొరవ, శ్రద్ధా గమనించ తగ్గవి. అలాగే గంగా నీటి సమస్యపై బంగ్లాదేశ్, నేపాల్‌తో ఇండియా జరుపుతున్న చర్చలు కూడా ఆరోగ్య

కరమైనవే. ఒక దేశ ప్రాదేశిక సమగ్రతను మరో దేశం గౌరవిస్తూ, శాంతి యుతంగా ఉద్రిక్తతలను పోగొట్టుకోనంత కాలం అగ్రరాజ్యాల పట్టు దృఢతర మవుతూనే ఉంటుంది. సార్క్ లాంటి సమావేశాలు విజయవంతం కావడమనేది అగ్రరాజ్యాల ప్రభావం నుంచి ఈ దేశాలు ఏ మేరకు బయట పడగలవన్న దాని మీద ఆధారపడి ఉంటుంది.

సార్క్ దేశాల మొదటి సమావేశం ఢాకాలో, రెండవ సమావేశం ఖట్మాండులో, మూడవ సమావేశం బెంగుళూరులో, నాల్గవ సమావేశం ఇస్లామా బాద్‌లో జరిగాయి. ఐదవ సమావేశం శ్రీలంకలో జరుగనున్నది.



# భారత - బ్రిటన్ సంబంధాలు

భారతదేశానికి స్వాతంత్ర్యం లభించగానే భారత బ్రిటన్‌ల మధ్య సంబంధాలకొక కొత్త స్వరూపం లభించింది. విద్యా, వైజ్ఞానిక, రాజకీయ, పరిపాలన మొదలయిన పలు రంగాలలో మనదేశం బ్రిటన్‌ను అనుసరిస్తున్నది. అదే విధంగా బ్రిటీష్‌వారు కూడా మన సంస్కృతివల్ల ప్రభావితులవుతున్నారు. భారతీయ కళలు, వాస్తు శిల్పం ఇంగ్లాండ్ మీద మహత్తరమైన ముద్ర వేశాయి. భారతీయ సంస్కృతీ సంపదలను విస్తృతస్థాయిలో యూరప్ దేశాలకు పరిచయం చేయడంలో బ్రిటన్ ఎంతో శ్రద్ధ చూపింది.

ఆర్థిక రంగంలో :

మన దేశంలో పెట్టుబడులు పెద్ద ఎత్తున పెట్టుతున్న దేశాలలో ఇంగ్లాండ్ ఒకటి. 1978 మార్చి నెల రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా బులిటెన్ అందిస్తున్న వివరాల ప్రకారం (ఇదే తాజా సమాచారం) 1974 మార్చి చివరినాటికి మన దేశంలో బ్రిటన్ పెట్టుబడులు 689 కోట్ల రూపాయలు. మనదేశంలోని వివిధ దేశాల పెట్టుబడులలో ఇది 35 శాతం. ఇంతకుముందు బ్రిటన్ పెట్టుబడులు తోటలకు, చమురు రంగాలకు మాత్రమే పరిమితంగా ఉండేవి. ఇప్పుడు బ్రిటన్ పెట్టుబడులు పరిశ్రమలకు కూడా విస్తరిస్తున్నాయి. మనదేశంలో మొత్తం బ్రిటిష్ పెట్టుబడులలో పరిశ్రమల భాగం 60 శాతం వరకు ఉంటుంది. విమానాలు, మోటారు వాహనాలు, నౌకలు, అత్యాధునిక విద్యుత్ పరికరాలు, యంత్రాల పరిశ్రమలలో ఈ రెండు దేశాలు సంయుక్త భాగస్వాములుగా పాల్గొంటున్నాయి. 1957 నుంచి ఇటువంటి సంయుక్త భాగస్వామ్య పరిశ్రమల సంఖ్య గణనీయంగా పెరిగింది. 1957–82 సంవత్సరాల మధ్య 7212 పారిశ్రామిక సహకార ఒప్పందాలు మన దేశంలో జరిగాయి. అందులో బ్రిటిష్ పరిశ్రమలకు సంబంధించినవి

1841. అంటే 23 శాతం అన్నమాట. మన దేశంలో ప్రధాన పరిశ్రమలలో ఐ. సి. ఐ., బి. ఇ. సి., యునిలెవర్, బూట్స్, గ్లాక్సో, డన్‌లప్, బ్రిటిష్ లేలాండ్, లూకాస్, రోల్స్‌రాయిస్ పరిశ్రమలు బ్రిటిష్ పరిశ్రమలలో సహకార సంబంధాలు కలిగి ఉన్నవి. మన దేశ పారిశ్రామికాభివృద్ధికి అవసరాలైన ఎన్నో చిన్న పరిశ్రమలకు సైతం బ్రిటన్ సహకరిస్తున్నది. మన అభివృద్ధి పథకాలకు అవసరమైన ఆర్థిక సహాయం కూడా ఇంగ్లండ్ నుంచి పెద్ద ఎత్తున మనకు లభిస్తున్నది. 1982-83 సంవత్సరంలో యీ ఆర్థిక సహాయం దాదాపు 171.6 కోట్ల రూపాయలు. ద్వైపాక్షిక ప్రాతిపదిక మీద మనకు ఇంగ్లండ్ ఇస్తున్నంత ఆర్థిక సహాయం మరే దేశం ఇవ్వడం లేదు. ఈ సహాయంలో దాదాపు పదో వంతు భాగం సాంకేతిక సహకార కార్యక్రమానికి వర్తిస్తున్నది. 1983 ఆర్థిక సంవత్సరంలో దాదాపు ఎనిమిది వందల మంది భారతీయులు ఉన్నత శిక్షణ కోసం ఇంగ్లాండ్ వెళ్ళారు. ఈ సంఖ్య ఏటేటా పెరుగుతూనే ఉన్నది. ఈ సహాయం గ్రాంట్ల రూపంలో లభిస్తున్నది. ఈ గ్రాంట్ల మీద వడ్డీ ఉండదు. వాటిని తిరిగి చెల్లించ వలసిన అవసరం లేదు.

బ్రిటన్ భారీ ఎత్తున నిధులు సమకూర్చిన ప్రపంచ బ్యాంకు, ఇతర ఐక్యరాజ్య సమితి సంస్థలు, ఇ.ఇ.సి. మొదలైన వాటి నుండి కూడా భారత దేశానికి సహాయం అందుతున్నది. ద్వైపాక్షిక వాణిజ్యం వల్ల ఉభయ దేశాలు లాభపడుతున్నాయి. 1982 లో ఈ ద్వైపాక్షిక వాణిజ్యం విలువ 1184 మిలియన్ పౌనులు. తేయాకు, పొగాకు, నూలు వస్త్రముల వంటివి ఇంగ్లాండ్‌కు భారత దేశం ఎగుమతి చేస్తున్న వస్తువులలో ముఖ్యమైనవి. ఇంజనీరింగ్, యంత్ర సామాగ్రి, విడి భాగాలు కూడా భారతదేశం ఎగుమతి చేస్తున్నది. భారత ఆర్థిక వ్యవస్థ పెరుగుదలకు, అవసరాలకు అనుగుణంగా ఇంగ్లాండ్ నుంచి మన దిగుమతులలో కూడా మార్పు వచ్చింది. భారీ యంత్రాలు, విద్యుచ్ఛక్తి ఉత్పాదన, ఉక్కు, బొగ్గు, రైల్వే, ఎలక్ట్రానిక్, టెలికమ్యూనికేషన్స్, చమురు, పెట్రోలు, రసాయనిక పదార్థాలు మొదలయిన పరిశ్రమలలో ఉపయోగించే యంత్రాలు ఇంగ్లాండ్ నుంచి మన దిగుమతులలో ముఖ్యమైనవి.

ఇంగ్లాండ్ నుంచి 'సీహారియర్' ఫైటర్ విమానాలను మన నౌకా బలం దిగుమతి చేసుకొని, భారత దేశం తన రక్షణ చర్యలను పటిష్టం చేసుకున్నది.

భారత దేశానికి అవసరమైన రక్షణ సామగ్రిని ఇంగ్లాండ్ ఇప్పటికే పెద్ద ఎత్తున సరఫరా చేస్తున్నది. భారత వైమానిక దళం అవసరాలను తీర్చడానికి వీలుగా ఒక బహూళార్థ సాధక యుద్ధ విమానాన్ని బ్రిటన్ రూపొందించింది. ఈ రెండు దేశాల ప్రధాన మంత్రులు పెక్కుసార్లు కలుసుకున్నారు. ఈ రెండు దేశాలలో వివిధ రంగాలకు చెందిన వారు - రాజకీయ వేత్తలు, సైనికాధికారులు, విద్యా వేత్తలు, వాణిజ్య వేత్తలు మొదలైన వారు వివిధ స్థాయిలలో కలుసుకొని విలువైన చర్చలు జరుపుకుంటు ఉన్నారు. ఈ సంబంధాలు రెండు దేశాల మధ్య ద్వైపాక్షిక మైత్రీ బంధాల పటిష్టతకు ఎంతగానో తోడ్పడుతున్నాయి.

అభిప్రాయ భేదాలు :

అయితే, ఉభయ దేశాల మధ్య అభిప్రాయ భేదాలు లేనేలేవవి భావించరాదు. అనేక అంతర్జాతీయ సమస్యల మీద ఇంగ్లాండ్ భారత దేశాలు విభిన్న వైఖరిలో వ్యవహరిస్తున్నాయి. ప్రపంచ శాంతి భద్రతలకు విఘాతం కలిగిస్తూ భయంకర ఆయుధాల పోటీని కొనసాగిస్తున్నందు వల్ల అంతర్జాతీయ ఉద్రిక్తత హెచ్చుతున్న సమయాన యూరప్‌లో అమెరికన్ అణుక్షిపణుల మోహరింపును ఇంగ్లాండ్ అంగీకరిస్తున్నందుకు భారత దేశం ఆందోళన చెందుతున్నది. ఒక వంక యూరప్‌లో జపాన్ అణ్వస్త్రాలకు వ్యతిరేకంగా పెద్ద ఎత్తున ప్రజా ఉద్యమం, ప్రజా ప్రదర్శనలు చెలరేగుతుండగా మరొక వంక ఇంగ్లాండ్ అగ్ర రాజ్యాల ఆయుధ పోటీలో పాల్గొనడం భారత దేశానికి ఇష్టంగా లేదు. ఇంగ్లాండులో ఇటీవల కాలంలో భారతీయులు అనేక అవమానాలకు గురి కావలసి వచ్చింది. లండన్‌లోని హిత్‌రో విమానాశ్రయంలో భారత మహిళలను కన్యత్వ పరీక్షకు గురి చేసినందుకు భారత దేశం నిరసన తెలిపింది. దక్షిణాఫ్రికాలోని జాత్యహంకారపు శ్వేత ప్రభుత్వం పట్ల ఇంగ్లాండ్ మెతక ధోరణిని భారత దేశం హర్షించడం లేదు. ఏ మైనప్పటికీ, అప్పుడప్పుడు ఉత్పన్నమవుతున్న ఈ విభేదాలు భారత బ్రిటన్ సంబంధాల ప్రాధాన్యతను తగ్గించలేక పోతున్నాయి. బ్రిటిష్ రాణి ఎలిజబెత్ కామన్ వెల్త్ ప్రధానుల సమావేశాన్ని ప్రారంభించడానికి 1983లో ఢిల్లీకి రావడం ఇరు దేశాల మధ్య సత్సంబంధాలతో ఒక నూతన అధ్యాయనం ప్రారంభమైనదని అనాలి. ఎలిజబెత్‌రాణి భారత దేశాన్ని సందర్శించడం ఇది మొదటిసారి కాదు. ముప్పయి సంవత్సరాల కింద ఆమె ఈ దేశాన్ని ఒకసారి పర్యటించారు.

[ -o- ]

# భారత - అమెరికా సంబంధాలలో ఆటు పోటులు

'అమెరికా వంటి దేశం నూటయాభై, రెండు వందల సంవత్సరాలలో అంత అభ్యుదయం సాధించిందంటె దాని రహస్యం ఏమిటి ? తప్పకుండా ఏదో అంతస్సత్యం ఉండాలి. ఈ అద్భుత ప్రగతి అమెరికాను, ప్రపంచ అగ్రశ్రేణి దేశంగా మలిచింది. దాని నుంచి ఇతరులు ఎంతో నేర్చుకోవాలి. ఇండియా ప్రాచీన దేశం. వేలకొలది సంవత్సరాల చరిత్ర కలది. పాత గుణాలు, పాత లోపాలు దీనిలో కలగలసి పోయాయి. మరి అమెరికా నూతన భావాలు గల దేశం. నూతన జవసత్వాలున్న దేశం. ఈ రెండింటి సంబంధం పవిత్రమైనది' అని నెహ్రూ 1949 లో మొదటిసారి అమెరికా పర్యటించినప్పుడు అన్నారు.

ప్రారంభంలో అమెరికాతో భారత సంబంధాలు మైత్రీపూర్వకంగానే ఉన్నాయి. 1949 లో కాశ్మీర్‌పై భారత-పాకిస్తాన్ సమస్యను పరిష్కరించడానికి అమెరికా ఎంతో కృషి చేసింది కూడా. కానీ భారతదేశం అనుసరించిన స్వతంత్ర అలీన విధానం అమెరికాకు కన్నెర్ర అయింది.

### సైనిక సంధులు :

రెండవ ప్రపంచ యుద్ధానంతరం అమెరికా, సోవియట్ యూనియన్ యా బూచిని చూపి సైనిక కూటాలను నిర్మించడం ప్రారంభించింది. ట్రూమన్ కాలం లోనే ఇవి తలెత్తడం మొదలు పెట్టాయి. 1949లో నాటో, ఆ తరువాత 1951లో అంజుస్ ఏర్పడ్డాయి. ఐసన్‌హోవర్ అదే విధానాన్ని కొనసాగించాడు. ఫలితంగా 1954 లో 'సీటో', 1955 లో బాగ్దాద్ ఒప్పందం (దాన్నే తరువాత 'సెంటో' అని పేరు మార్చారు) ఏర్పడ్డాయి. ఈ కూటాలన్నిటిలోను ఆస్ట్రేలియా, న్యూజి

లాండ్, ఫిలిప్పైన్, థాయిలండ్, పాకిస్తాన్, ఇరాన్, టర్కీ, ఇరాక్‌లను కమ్యూనిస్టు వ్యతిరేక యుద్ధ రథానికి కట్టివేసింది అమెరికా.

అయితే అప్పుడప్పుడే స్వతంత్రం సంపాదించుకున్న పెక్కు ఆసియా దేశాలను తన సైనిక కూటాల వ్యవస్థలోకి లాగడంలో అమెరికా ప్రయత్నం విఫలమైంది. భారత దేశం, ఇండోనేషియా, బర్మా, శ్రీలంక, ఈజిప్టు, ఆఫ్గనిస్తాన్ తదితర స్వేచ్ఛాకాముక దేశాలు ఈ సైనిక కూటాలను తిరస్కరించాయి. దీనితో కినుక చెందిన అమెరికా కాశ్మీర్ సమస్య చర్చకు వచ్చిన ప్రతి సందర్భంలోను పాకిస్తాన్‌ను సమర్థించి భారత్‌ను దెబ్బ తీయటానికి ప్రయత్నించింది.

బెదరింపు రాజకీయాలు :

ఇంత చేసినా థాయిలాండ్, పాకిస్తాన్, ఫార్మోజా, దక్షిణ కొరియా, ఫిలిప్పైన్స్‌లు కలుపుకుంటే అవి ఆసియా జనాభాలో 12 శాతం మాత్రమే. 60 కోట్ల భారత ప్రజానీకంతో వైరం పెట్టుకోవటం అమెరికాకు విజ్ఞతగా కనిపించలేదు. అలాగే ఒక శక్తివంతమైన ప్రజాస్వామిక దేశంతో భారత దేశం పూర్తిగా దూరం కాలేక పోయింది. పరస్పరం బెదరింపులతో, అనుమానాలతో నయినా ఈ రెండు దేశాలు తమ స్నేహాన్ని కొనసాగించు కోవలసి వచ్చింది.

1950 లో భారత దేశానికి ఆహారధాన్యాల కొరత తీవ్రంగా ఏర్పడింది. తక్షణ సహాయంగా 20 లక్షల టన్నుల గోధుమలు కావాలని భారత దేశం అమెరికాను కోరింది. కాంగ్రెస్ దానికి వ్యతిరేకించినా ప్రెసిడెంటు ట్రూమన్ ఒత్తిడిపై కొంత అలస్యంగానైనా భారత దేశానికి గోధుమ రవాణా ప్రారంభమయింది. ఇందుకు భారత దేశం అమెరికాకు 19 కోట్ల డాలర్లను చెల్లించినది.

1952 లో జనరల్ ఐసన్‌హోవర్ అమెరికా అధ్యక్షుడుగా ఎన్నికయ్యారు. రెండవ పంచవర్ష ప్రణాళికను అమలు పరచనున్న భారత దేశానికి అమెరికా సహాయం తప్పనిసరి అయింది. 1956 లో భారత ప్రధాని నెహ్రూ రెండవసారి అమెరికా పర్యటనకు వచ్చారు. ఐసెన్‌హోవర్-నెహ్రూ అరమరికలు లేకుండా మాట్లాడుకున్నారు. దాని ఫలితంగా రెండు దేశాల మధ్య అలుముకున్న కారు మేఘాలు కొంత వరకు తొలగిపోయాయి. ఆగష్టు నెల నాటికి అమెరికా బియ్యం, ప్రత్తి, గోధుమలు మొదలైన వ్యవసాయ ఉత్పత్తులు 30 కోట్ల డాలర్ల విలువ

కలవి భారత దేశానికి సరఫరా చేసింది. 1957 లో ఐసెన్‌హోవర్ భారత పర్యటన చారిత్రకంగా ఎంతో ప్రాముఖ్యాన్ని సంతరించుకున్నది. ఎందుకంటే భారత దేశాన్ని సందర్శించిన మొదటి అధ్యక్షుడు ఆయనే. అమెరికా-భారత సంబంధాల మధ్య ఉద్రిక్తతను అమెరికా సడలించి భారత దేశానికి ఆర్థిక సహాయం ఎక్కువ చేయడానికి సిద్ధపడింది. ఈ కాలంలో సోవియట్ యూనియన్ భారత దేశానికి ఎక్కువ ఆర్థిక సహాయం చేయడంతో అమెరికా కూడా అదే పద్ధతి అనుసరించవలసి వచ్చింది. వర్తమాన దేశాలను శీఘ్రంగా అభివృద్ధి పరచడంలో రష్యాతో అమెరికాకు పోటీ తప్పనిసరి అయింది.

## మార్పులు తెచ్చిన కెన్నెడీ :

అమెరికా విదేశాంగ విధానంలో వచ్చిన మార్పు కూడా ఈ సందర్భంలో బాగా పని చేసింది. అలీన విధానం పట్ల వాషింగ్టన్ వైఖరిలో 1950 వ శకం చివరి సంవత్సరాలలో ఒక మార్పు వచ్చింది. 'మనతో లేనివాళ్లు మనకు వ్యతిరేకులు' అనే శత్రు వైఖరిని అమెరికా విడనాడి అలీన దేశాలతో స్నేహ సంబంధాలను మొదలు పెట్టింది.

1961 లో జాన్ ఎఫ్. కెన్నెడీ అమెరికా అధ్యక్షుడుగా ఎన్నిక కాగానే భారత-అమెరికా సంబంధాలలో కొత్తమలుపు వచ్చింది. 1961 నవంబర్‌లో నెహ్రూ మూడవసారి అమెరికా పర్యటించారు. ఈ పర్యటన ముగిసిన కొద్ది రోజులలోనే భారతదేశం గోవా నుంచి పోర్చుగీసు వారిని తరిమి వేసింది. దీనితో తిరిగి భారత-అమెరికాల మధ్య సంబంధాలు విష మించాయి. దీనికి ప్రతీకార చర్యగా అంతర్జాతీయ సహాయక సంస్థల నిధుల నుంచి అమెరికా వాటాలో 25 శాతం ఆర్థిక సహాయం భారత దేశానికి తగ్గించబడింది. మొదలే అంతంతగా ఉన్న భారత-అమెరికా సంబంధాలు ఈ కోతతో మరింత సన్నగిల్లాయి. భారత ప్రజాస్వామ్యం పట్ల సానుభూతి కలిగిన కెన్నెడీ స్వయంగా జోక్యం కలుగజేసుకొని భారత దేశానికి 107 కోట్ల డాలర్ల ఆర్థిక సహాయాన్ని ఈ అంతర్జాతీయ ఆర్థిక సంస్థ ద్వారా అందజేయ గలిగారు. దీనితో ప్రధాని నెహ్రూకు కొంత సంతృప్తి కలిగింది.

1962 చైనా భారత దేశముపై పెద్ద ఎత్తున దురాక్రమణ చర్యలకు దిగింది. ఈ సందర్భంలో పశ్చిమ రాజ్యాలే ముఖ్యముగా బ్రిటన్, అమెరికాలు

భారత్‌కు అండగా నిలిచాయి. సైనిక సహాయ కార్యక్రమం క్రింద 1962-63లో 5 కోట్ల డాలర్ల తాత్కాలిక సహాయాన్ని, 1963-64 లో 6 కోట్ల డాలర్ల సహాయాన్ని అందజేసేందుకు అమెరికా వాగ్దానము చేసింది. మన రక్షణ మంత్రి వై. బి. చవన్ అమెరికా రక్షణ మంత్రి మెక్‌నమారాతో 1964 మేలో జరిపిన చర్చల ఫలితముగా 1964-69 మధ్య కాలంలో అమెరికా 50 కోట్ల డాలర్ల సైనిక సహాయం అందజేయడానికి ఒప్పందము కుదిరింది. అందులో సగం గ్రాంటుగాను సగం రుణంగాను ఉండాలనుకున్నారు. కాని 1965 సెప్టెంబర్‌లో భారత-పాకిస్తాన్ యుద్ధం జరగడం వల్ల ఈ సహాయాన్ని మొత్తంగా అమెరికా ఆపివేసింది. 1962 అక్టోబర్, 1965 సెప్టెంబరు మధ్యకాలంలో 80 కోట్ల డాలర్ల సాధన సామాగ్రిని అందచేయడానికి అమెరికా వాగ్దానం చేసింది. కాని వాస్తవంగా అందచేసింది సుమారు 61 కోట్ల డాలర్లు మాత్రమే.

ఈ సహాయ కార్యక్రమం అమల్లో ఉన్న రోజులలో కూడా యుద్ధ వాహనాలు, ఫిరంగులు, టాంకులను, చివరకు తనంతట తానే తూటాలు దట్టించుకునే ఎం-14 రైఫిల్‌ని కూడా స్వయంగా ఉత్పత్తి చేసుకునే సాంకేతిక పరిజ్ఞానాన్ని భారత దేశానికి అందించడానికి తాము సిద్ధంగా లేమని అమెరికా ప్రభుత్వం భారత్‌కు స్పష్టం చేసింది. భారతదేశం యుద్ధ విమానాలు కోరినప్పుడు అమెరికా తన విమానాలతోను, తన మిత్రదేశాల విమానాలతోను భారతదేశానికి వైమానిక రక్షణ కల్పించ గలమని చెప్పింది. సరఫరా సామాగ్రిని రవాణా చేసే సి-130 రకం విమానాలను అందజేయమని భారత్ కోరితే తమ విమాన దళానికి చెందిన సి-130 విమానాలు పాలం విమానాశ్రయం నుండి పని చేస్తూ సరఫరా సామాగ్రిని రవాణా చేస్తుంటాయని అమెరికా వారు అన్నారు. ఇదంతా చూస్తుంటే చైనా సైన్యాన్ని ఎదిరించి నిల్వలేని స్థితికి భారత సైన్యాన్ని దిగజార్చి వేయాలన్నదే అమెరికా లక్ష్యంగా తేలుతుంది.

రెండు సర్వసత్తాక రాజ్యాలమధ్య సంబంధాలు దానం మీద లేదా గ్రాంటుల మీద ఆధారపడినవి అయినట్లయితే అవి ఎక్కువ కాలం కొనసాగలేవు. అమెరికాతో అనుభవం దృష్ట్యా భారతదేశం ఈ సంగతిని గ్రహించ గలిగింది.

### పాక్-చైనా-అమెరికాల స్నేహం :

భారత-పాకిస్తాన్‌ల మధ్య, చైనా - భారతదేశాల మధ్య ఘర్షణలు దీర్ఘ కాలం కొనసాగలేక పోయాయి. 1970 లో తూర్పు పాకిస్తాన్ (బంగ్లాదేశ్) లో తలెత్తిన సంక్షోభం పాకిస్తాన్ మిత్ర రాజ్యాలకు దిగ్భ్రాంతిని కలిగించింది.

యహ్యాఖాన్ ప్రభుత్వం తూర్పు పాకిస్తాన్‌లో అవలంభించిన ప్రతీకార విధానం, ఇస్లామాబాద్‌కు వాషింగ్టన్ మద్దతు మూలంగా తూర్పు బెంగాల్ నుండి భారత దేశానికి తలదాచుకొనటానికి వచ్చే ప్రజల సంఖ్య నానాటికి పెరగ సాగింది. మొత్తంలో ఒక కోటి మంది భారత దేశంలోకి వచ్చి పడ్డారు. వారి పోషణకు భారత ప్రభుత్వం రోజుకు 20-30 లక్షల డాలర్ల వరకు ఖర్చు చేయ వలసి వచ్చింది. చివరినాటికి లెక్కలు వేస్తే మొత్తం వ్యయం 50 కోట్ల డాలర్లకు తేలింది. అనుకోని విధంగా తనపై పడ్డ ఈ భారంవల్ల భారతదేశం అనేక అభి వృద్ధి కార్యక్రమాలను వాయిదా వేసుకోవలసి వచ్చింది. దీనివల్ల భారతీయులకు జరిగిన హాని ఇంతా అంతా కాదు.

1971 డిశంబర్‌లో భారత-పాకిస్తాన్ మధ్య చెలరేగిన యుద్ధంలో అమెరికా భారతదేశాన్ని 'దురాక్రమణ దారు'గా చిత్రించింది. భారత దేశానికిచ్చే ఆర్థిక సహాయాన్ని ఆపివేసింది. విమాన వాహక నౌక 'ఎంటర్ ప్రైజ్' నాయకత్వాన ఒక నౌకాదళాన్ని బంగాళాఖాతానికి పంపింది. ఈ చర్యలన్నీ అమెరికా బల ప్రద ర్శనలనీ, భారత దేశంపై వొత్తిడి తేవడానికి ఉద్దేశించిన బాహాటమైన దురుద్దేశ మనీ, ఘర్షణను ఉధృతం చేయడానికి పాకిస్తాన్‌ను ప్రోత్సహించడమేనని యావత్ ప్రపంచం అభిప్రాయ పడింది.

భారత దేశం 1971 యుద్ధంలో విజయం సాధించిన తరువాత ఉప ఖండ ములోని బలాబలాలలో పెద్ద మార్పు వచ్చేసింది. ఆసియాలో చైనా ఒక్కటే కాదు, భారత దేశం కూడా శక్తివంతమైన దేశంగా వెల్లడైంది. పాకిస్తాన్ చీలి పోవడం వల్ల ఆ దేశం బలం తగ్గింది. భారతదేశం సోవియట్ యూనియన్‌ల మధ్య శాంతిసంధి కుదురటంతో భారత్ వంటరి దేశం కాదని తెలిసింది. ఈ పరి ణామాలు అమెరికా వ్యూహాలలో పెద్ద మార్పులు తెచ్చాయి.

1971 లో తూర్పు పాకిస్తాన్ విడిపోయినా పాకిస్తాన్ సైనిక వ్యయం తగ్గ లేదు. పోగా అది మరింత పెరుగుతూ వచ్చింది. 1980 జనవరి తొలి రోజుల్లోనే అధ్యక్షుడు కార్టర్ 1.5 కోట్ల డాలర్ల ఆయుధాలను పాకిస్తాన్‌కు సత్వరంగా సర ఫరా చేసే ఉత్తరువులను జారీ చేశారు. రీగన్ హయాంలో పాకిస్తాన్ అమెరికా మధ్య సైనిక సహకారాలు జోరందుకున్నాయి. 1982 లో పాకిస్తాన్ అధ్యక్షుడు జనరల్ జియా వాషింగ్టన్ పర్యటన ఈ సహకారానికి కొత్త ఊపు ఇచ్చింది.

ఉదాహరణకు : అమెరికా ఆధునిక ఎలక్ట్రానిక్ యంత్ర పరికరాలను, అణు బాంబులు మోసుకెళ్ళేందుకు ప్రత్యేక యంత్రాలు అమర్చిన ఎఫ్-16 విమానాలను పాకిస్తాన్‌కు సరఫరా చేయడానికి అంగీకరించింది. ఈ విమానాల సహాయంతో పాకిస్తాన్ తన పొరుగు దేశాల లోతట్టు ప్రాంతాలలోని లక్ష్యాలపై కూడా మిస్సీలలను, బాంబులను ప్రయోగించ గలుగుతుంది. భారత దేశం తలసరి రక్షణ వ్యయం ఎనిమిది డాలర్లు మాత్రమే. అయితే పాకిస్తాన్ తలసరి రక్షణ వ్యయం 20 డాలర్లు. మొత్తం పాక్ బడ్జెటులో ఇది 40 శాతం.

భారత వ్యతిరేక చర్యలు :

భారత దేశానికి వ్యతిరేకంగా ఇటీవల అమెరికా తీసుకున్న చర్య 'ఖలిస్తాన్' ఆందోళనకు బహిరంగ మద్దతు ఇవ్వడమే అయింది. స్వయం నియమిత ఖలిస్తాన్ అధ్యక్షుడు చౌహాన్ భారతదేశం నుంచి తప్పించుకొని పోయి అమెరికాలో ఆశ్రయం పొందినప్పుడు భారత ప్రభుత్వం తన నిరసనను వ్యక్తం చేసింది. దీనిపై అమెరికా ఎట్టి చర్య తీసుకొనలేదు. ఈ చౌహాన్ ఇప్పుడు బ్రిటన్‌లో నివసిస్తున్నట్లు చెపుతున్నారు. అతడు ఎప్పుడు అమెరికా సందర్శించాలన్నా అమెరికా ప్రభుత్వం ఆయనకు వెంటనే వీసా ఇస్తుంది.

భారత దేశాన్ని చీల్చటానికి కొన్ని విదేశీ శక్తులు కుట్రలు పన్నుతున్నాయని స్వర్గీయ ప్రధాన మంత్రి శ్రీమతి గాంధీ పదేపదే హెచ్చరించే వారు. 'స్వతంత్ర ఖలిస్తాన్' కార్యాలయాలను అమెరికాలో తెరవడం, ఆ ప్రభుత్వ అధ్యక్షుడు చౌహాన్‌కు యదేచ్ఛగా అమెరికను వీసాలు ఇవ్వడం, పాశ్చాత్య దేశాలలో ఖలిస్తాను బ్యాంకు నోట్లు చెలామణిలో పెట్టడం, భారత దేశంలోని ఈశాన్య రాష్ట్రాలలో 'సామాజిక అధ్యయనం' అనే బ్రహ్మపుత్ర ప్రాజెక్టు-ఇవన్నీ దేశ విభజనకు దారితీసే కుట్రలుగా అనుమానం కలుగ జేస్తున్నాయి.

అమెరికా డిగోగార్షియా దీవిలో తన స్థావరాన్ని 100 కోట్ల డాలర్ల ఖర్చుతో విస్తరించడానికి నిర్ణయించింది. ఈ చర్యతో ఈ దీవి హిందూ మహాసముద్రంలో అమెరికాకు ప్రధానమైన నావికా, వైమానిక స్థావర మవుతుంది. 1988 నాటికే 12,000 మంది నౌకాదళ సిబ్బందికి అవసరమైనంత మందుగుండుతో ఏడు రవాణా నౌకలను సిద్ధంగా ఉంచారు. ఈ స్థావరంలో అణ్వాయుధాలతో సహా పెద్ద ఎత్తున ఆయుధాలను, యుద్ధ సామాగ్రిని నిల్వ చేశారు. అమెరికా సైనిక

యంత్రాంగం డిగోగార్షియాను హిందూ మహాసముద్రం నడిబొడ్డున 'ముంచివేయ వీలులేని విమాన వాహక నౌక'గా దురాక్రమణకు అగ్ర స్థావరంగా మార్చి వేసింది. హిందూ మహాసముద్రంలోని ఏ దేశానికైనా ఇక్కడి యుద్ధ నౌకలు రెండు రోజులలో, యుద్ధ విమానాలు కొన్ని గంటలలో చేరుకుంటాయి. దీనివల్ల తీరప్రాంతం ప్రజలకు ఎంత ప్రమాదమో ఊహించుకోవచ్చు. డిగోగార్షియా స్థావర నిర్మాణం 1971 మేలో, అంటే బంగ్లాదేశ్ విముక్తి పోరాటం ప్రారంభ మైన వెనువెంటనే ఆరంభ మయిందనే విషయం గమనార్హం.

ఇరు దేశాల మధ్య అపోహలు కొన్ని తీవ్ర పరిణామాలకు దారి తీశాయి. అందులో అతి తీవ్రమైనది తారాపూర్ అణు విద్యుత్ కేంద్రానికి అమెరికా ఇస్తా నని ఒప్పందం చేసుకున్న యురేనియం ఇంధనం సరఫరా. 1963 లో ఉభయ దేశాలమధ్య జరిగిన ఒప్పందం ప్రకారం తారాపూర్ అణు విద్యుత్ కేంద్రానికి శుద్ధి చేసిన యురేనియం ఇంధనాన్ని ముప్పయి ఏళ్ళ పాటు అమెరికా సరఫరా చేయాలి. కాని, తర్వాత అంటే 1978 లో అమెరికా కాంగ్రెసు ఒక శాసనం చేసింది. ఆ శాసన ప్రకారం-అమెరికా నుంచి ఏ దేశమైనా సరే యురేనియం ఇంధనాన్ని దిగుమతి చేసుకోవాలనుకుంటె ఆ దేశం ఇంధనాన్ని ఇతర ప్రయోజ నాలకు ఉపయోగించకూడదు. వాటిని అవసరమైతే తనిఖీలు చేసే అధికారం అమె రికాకు ఉండాలి. కానీ, యీ షరతులను భారత దేశం తిరస్కరించింది. పర్యవ సానంగా ఇంధనం సరఫరాను అమెరికా ఆపివేసింది. 1984 మే నెలలో భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ అమెరికా అధ్యక్షుడు రోనాల్డు రీగన్ ఆహ్వానంపై అమెరికా పర్యటించి వచ్చారు. ఈ జటిల సమస్యకు కొంత పరిష్కార మార్గం లభించింది.

## సూపర్ - 301 :

భారతదేశం, బ్రెజిల్, జపాన్ అక్రమ వాణిజ్య కార్యకలాపాలు నిర్వ హిస్తున్నాయని అధ్యక్షుడు జార్జ్ బుష్ ఈ దేశాలమీద నిందారోపణ చేస్తున్నారు. అమెరికన్ కాంగ్రెసు ఇటీవల ఆమోదించిన వాణిజ్య చట్టంలోని 'సూపర్ 301' అస్త్రాన్ని ఈ దేశాల మీద ఆయన సంధించనున్నారు. రానున్న 18 మాసాలలో 1990 డిశంబరు నాటికి ఈ దేశాలు నిర్దిష్ట వాణిజ్య అవరోధాలను తొలగించి నట్ల యితే ఆంక్షలను ఎదుర్కొన వలసి వస్తుందని బుష్ ప్రభుత్వం స్పష్టం చేసింది. అంటే, ఈ దేశాల ఎగుమతులమీద అమెరికన్ సుంకాలు వంద శాతం వరకు

పెరుగుతాయన్నమాట. మొత్తంమీద ప్రాధాన్యం గల ఆరు అంశాలు అమెరికాకు అభ్యంతరకరంగా కన్పిస్తున్నాయి. ఈ ఆరు అంశాలను అమలు జరిపే ఏ దేశమయినా అమెరికన్ చట్టం కింద శిక్ష అనుభవించ వలసి వస్తుంది. అమెరికా కోపానికి కారణమైన అంశాలు : భారత దేశంలో పెట్టుబడులు పెట్టాలన్నా, పెట్టుబడులు విస్తరించాలన్నా భారత ప్రభుత్వం అనుమతి పొందాలి. మొత్తం పెట్టుబడిలో విదేశ ఈక్విటీ పెట్టుబడి ఎంత ఉండాలన్న సూత్రంతో సహా పలు సూత్రాలకు లోబడి ఈ అనుమతి లభిస్తుంది. విదేశీ పెట్టుబడిదారులు భారత దేశములో ఉత్పత్తి చేసే సరుకులలో స్థానిక వస్తువులను ఉపయోగించాలి. సాంకేతిక పేరిట బయటనుంచి దిగుమతి చేసుకునే వీలులేదు. పలు సందర్భాలలో ఈ పారిశ్రామికులు ఎగుమతులకు సంబంధించి నిర్దిష్ట లక్ష్యాలను పూర్తిచేయాలి. ఇటువంటి నియమాల కారణంగా విదేశీ పెట్టుబడిదారులు పలు వ్యయప్రయాసాలకు లోనవుతున్నారని పలు అవకతవకలకు అవకాశం ఉంటోందని అమెరికన్ వాణిజ్యవేత్తల అభిప్రాయం.

ప్రపంచ వాణిజ్య సంస్థను పటిష్టం చేయడానికి, నియమాలను రూపొందించడానికి అమెరికా తదితర వంద దేశాలు ప్రస్తుతం జనీవాలో కృషి చేస్తున్నాయి. ఒక వంక 'గాట్' (జనరల్ అగ్రిమెంటు ఆన్ ట్రెడ్ అండ్ టారిఫ్) ద్వారా బహుముఖ చర్చలతో వాణిజ్య సమస్యలను పరిష్కరించడానికి వంద దేశాలు కృషి చేస్తుండగా అమెరికా ఏకపక్ష నిర్ణయాలు తీసుకుంటున్నది. గాట్ స్ఫూర్తికి విరుద్ధంగా ద్వైపాక్షిక వాణిజ్య ఒప్పందాలు కుదుర్చుకోవడానికి తన వాణిజ్య భాగస్వాముల మీద ఎందుకు ఒత్తిడి తెస్తున్నది ? అనుచిత వాణిజ్య కార్యాల మీద ఏవయినా వివాదం ఏర్పడితే ఇప్పటి వరకు బహుదేశాల అధికారుల బృందం పరిశీలన జరుపుతున్నది. ఈ బృందం రెండు పక్షాల వాదనను వింటుంది. తన అభిప్రాయాలను వ్యక్తం చేస్తుంది. అవసరమయితే ఏమయినా జరిమానాలు విధిస్తుంది. ఈ పద్ధతిని అమెరికా మార్చాలనుకున్నది. ఉరుగ్వేలో గాట్ సంప్రదింపులలో అమెరికా ఆదేశాలను భారత్, బ్రెజిల్ ప్రతిఘటించాయి. అందువల్ల ఈ రెండు దేశాల మీద అమెరికా ప్రత్యేకంగా నిఘా పెట్టింది. అమెరికా వాణిజ్య చట్టపు సూపర్ 301 విభాగం క్రింద భారత దేశానికి గుణపాఠం నేర్పగలమని బుష్ ప్రభుత్వం బెదిరిస్తున్నది. అయితే ఈ విభాగాన్ని అమెరికా యూరోపియన్ మండలి దేశాలకు వర్తింప చేయలేక పోతున్నది.

ఇది ఇలా ఉన్నా అమెరికా-భారత దేశాల మధ్య వాణిజ్యం విస్తరిస్తూనే ఉన్నది. 1988 లో భారత-అమెరికా ద్వైపాక్షిక వాణిజ్యం 28 శాతం పెరిగింది. భారత దేశానికి అమెరికన్ ఎగుమతులు 70 శాతం హెచ్చాయి. ఈ వాస్తవాలను అమెరికా విస్మరించింది. భారత దేశంలో అమెరికన్ పెట్టుబడులను 1984 లో దాదాపు 9 కోట్ల రూపాయలు మాత్రమే. ఈ పెట్టుబడి 1985 లో దాదాపు 40 కోట్ల రూపాయల స్థాయికి, 1988 లో 97 కోట్ల రూపాయల స్థాయికి పెరిగింది. అయితే ఏం ? అమెరికా తీసుకున్న ఇటీవల వాణిజ్యపరమైన ఆంక్షలు సహకారానికి హానికరంగా ఉన్నాయి.

అమెరికా-భారత్ సంబంధాలు మిత్ర వైఖరిలో లేకపోయినా, శత్రు వైఖరిలో కూడా లేవు. అమెరికా అధ్యక్షుడు ఐసెన్‌హోవర్ భారతదేశ పర్యటన కొచ్చినప్పుడు పదివేల మైళ్ళ దూరంలో ఉన్న భారతదేశంతో మైత్రీ సంబంధాలు కుదుర్చుకోవడంలో ఆ దూరం ఒక ఆటంకం కాజాలదని అన్నాడు. ఎందుకంటె ఈ రెండు పెద్ద దేశాలను ప్రజాస్వామ్యం అనే అంతస్సూత్రం బంధించి ఉంచిందని ఆయన ఉద్ఘాటించారు. ప్రజాస్వామ్యంపై ప్రగాఢ విశ్వాసం గల వారందరికీ అమెరికా-భారత దేశాల మధ్య దృఢమైన స్నేహం ప్రపంచ శాంతికి ఒక ఆశా కిరణంగా కనిపిస్తుంది.

# భారత - సోవియట్ సంబంధాలు

భారత-సోవియట్ సంబంధాల చరిత్రలో ఒక మహత్తర అధ్యాయం 1971 అగష్టు 9న భారత-సోవియట్ దేశాల మధ్య స్నేహ సహకార ఒప్పందం కుదరడంతో ప్రారంభమయింది. అంతర్జాతీయ రంగంలో ఈ ఒప్పందం అపూర్వమయినదంటే అతిశయోక్తి కాదు. ప్రతి అయిదు సంవత్సరాలకు ఈ ఒప్పందం సహజంగానే (భారతదేశం గాని, సోవియట్ రష్యా గాని రద్దు చేయాలని కోరితే తప్ప) పొడగింప బడుతుంది. క్రమంగా ఉభయ దేశాల మధ్య సుదృఢ మవుతున్న స్నేహ సంబంధాలను గమనించి నట్లయితే, 1991 తరువాత-అంటే ఇరవయ్యేళ్ళ తరువాత కూడా ఈ ఒప్పందం మరింత ప్రయోజనకారిగా కొనసాగుతుందని చెప్పవచ్చు.

మనకు స్వాతంత్ర్యం లభించిన నాటినుంచి ఇరు దేశాల మధ్య దౌత్య సంబంధాలున్నాయి. ఆ తరువాత రెండు దేశాల మధ్య క్రమంగా పటిష్టమవుతూ బహుముఖంగా, ప్రయోజనాత్మకంగా విస్తరిస్తున్న స్నేహానికి ప్రబల నిదర్శనం, సజీవ తార్కాణం ఈ స్నేహ సహకార ఒప్పందం. రెండు దేశాల జనాభా మొత్తం వంద కోట్లు. యురేసియాకు చెందిన రెండు పెద్ద దేశాల మైత్రి ఈ దేశాల ప్రయోజనాల దృష్ట్యానే గాక, అంతర్జాతీయ ప్రయోజనాల దృష్ట్యానూ అత్యంత ప్రాముఖ్యత వహిస్తోంది. రష్యాలో సోషలిస్టు విప్లవం భారత జాతీయోద్యమం మీద రవీంద్రుడు, జవహరలాల్ వంటి ప్రముఖుల మీద ప్రభావం ప్రసరింప చేసింది. శైశవదశలోని స్వతంత్ర భారతం సహజంగానే సోవియట్ యూనియన్ వైపు ఆకర్షితమైంది. వలసతత్వ శక్తులకు వ్యతిరేకంగా యుద్ధోన్మాద కూటములకు దూరంగా స్వతంత్ర, అలీన విధానాలను అనుసరిస్తున్న భారతదేశం తన జాతీయ అంతర్జాతీయ ప్రయోజనాల పరిరక్షణ కోసం సోవియట్ మీద అధికంగా ఆధారపడిందని చెప్పవచ్చు. అది చారిత్రకంగా సహజ పరిణా

మమే. భారత స్వతంత్ర అలీన విధానం, సోవియట్ యూనియన్‌తో స్నేహం నచ్చని అమెరికా తదితర దేశాలు కొన్నిమార్లు ఒత్తిడి తెచ్చినా ఈ స్నేహ వారధి చెక్కుచెదరకుండా నిలబడింది. తూర్పు పాకిస్తాన్ (బంగ్లాదేశ్) లో ముజిబుర్ రహమాన్ నాయకత్వంలో సాగిన విముక్తి సమరానికి భారతదేశం సహాయ మందించింది. పాకిస్తాన్‌లో యహ్యాఖాన్ సైనిక నియంతృత్వానికి అండగా అమెరికా సప్తమ నౌకాదళాన్ని మోహరించి భారతదేశాన్ని భయపెట్టడానికి ప్రయ త్నించింది. ఆ సమయంలో సోవియట్ నైతిక బలం మన కెంతగానో ఉపయోగ పడింది.

తొలి సహకారాలు :

భారత-సోవియట్ దేశాల మధ్య ఆర్థిక సహకారం శీఘ్రగతిన ప్రారంభ మయింది. మన దేశం గట్టి ఆర్థిక పునాదిని నిర్మించుకోడానికి, అవసరమైన కీలక పరిశ్రమలను అభివృద్ధి పరచుకోవడంలో సోవియట్ యూనియన్ భారతదేశానికి సహాయం చేసింది. ఉక్కు ఉత్పత్తిని భారతదేశం పెంచుకోవలసిన అవసరం లేదని, పెట్టుబడిదారీ దేశాలు ప్రభుత్వ ఉక్కు పారిశ్రామికాభివృద్ధికి సహాయం ఇవ్వడానికి నిరాకరించినప్పుడు భిలాయ్ ఉక్కు ఫ్యాక్టరీని నిర్మించటానికి సోవి యట్ యూనియన్ ముందుకు వచ్చింది. ఆ తరువాతనే ఇతర దేశాలు మన దేశా నికి సహాయం అందించడానికి సంసిద్ధమయ్యాయి. రూర్కెలా, దుర్గాపూర్ ఫ్యాక్ట రీలు ఈ విధంగా నిర్మాణమైనవే.

బొకారో ప్రాజెక్టు విషయంలో ఎంతో వ్యతిరేక ప్రచారం జరిగింది. బొకారో భారతదేశానికి మోత బరువు అని, ఐరావతం వంటిదని అన్నారు. ఒకప్పుడు ఒక గుమాస్తా మాత్రమే ఉండినచోట 1960 దశకం చివరినాటికి బొకారో పని ప్రారంభించడంతో విమర్శకుల నోళ్లు మూతపడ్డాయి. ఇపుడు బొకారో మన దేశంలోని పెద్ద పారిశ్రామిక సముదాయానికి కేంద్రం. దేశ పున రుజ్జీవనానికి సాంకేతం. బొకారో ఇపుడు భారత దేశంలో కెల్ల శ్రేష్ఠమైన ఉక్కును తయారు చేస్తుంది. భారత దేశంలోని మొట్టమొదటి కేంద్రీకృత కంప్యూటరు వ్యవస్థను ఇక్కడే నెలకొల్పారు. ఈ కర్మాగారం 35,000 మంది కార్మికులకు, ఇంజనీర్లకు ఉపాధి కలిగిస్తూ ఉంది. బొకారో ఉక్కు నగరంలోని అనేక ఇతర అనుబంధ సంస్థలలో మరో 50 వేల మందిదాకా పని చేస్తున్నారు.

అయినప్పటికీ, బొకారో ఉక్కు కర్మాగారం విస్తృతమూ, బహుముఖమైన సోవియట్-భారత సహకారంలోని ఒక చిన్న అంశం మాత్రమే.

మన ఆర్థిక వ్యవస్థలోని ఇతర కీలక రంగాల అభివృద్ధిలో కూడా సోవియట్ యూనియన్ విశేషంగా తోడ్పడింది. రాంచీలోని భారీ యంత్ర నిర్మాణ ఫ్యాక్టరీ, హరిద్వార్‌లోని భారీ విద్యుత్ యంత్రాల ఫ్యాక్టరీ, దుర్గాపూర్‌లోని గనుల యంత్ర నిర్మాణ ఫ్యాక్టరీ, కోటాలోని సున్నిత పరికరాల ఫ్యాక్టరీ, కోర్బాలోని అల్యూమినా ఫ్యాక్టరీ, రిషికేష్‌లోని శస్త్ర చికిత్స పరికరాల ఫ్యాక్టరీ, హైదరాబాద్‌లోని మిశ్రమ ఔషధాల ఫ్యాక్టరీ వీటిలో కొన్ని.

రోదసీ రంగంలో సోవియట్ యూనియన్-భారత దేశాల మధ్య భాగస్వామ్య సహకారాలు 1962 నుంచి కొనసాగుతున్నాయి. తుంబా భూమధ్యరేఖ రాకెటు ప్రయోగ కేంద్రాన్ని నెలకొల్పడంలో సహాయ మందించిన మూడు దేశాలలో సోవియట్ ఒకటి. శబ్దాన్నిబట్టి కొలతలు తెలియజేసే రాకెట్లను ప్రయోగించి, అంతరిక్షంలోని పైపొరలను గురించి శాస్త్రీయ పరిశోధనలు సాగించడం కోసం ఈ కేంద్రం నెలకొల్ప బడింది. రోదసీ రంగంలో మన దేశం పురోగతికి 'ఆర్యభట్టు' తార్కాణం. 1975 ఏప్రిల్‌లో ఆర్యభట్టు ఉపగ్రహాన్ని సోవియట్ కాస్మోడ్రోమ్ నుంచి రోదసీలోకి పంపారు. దీన్ని భారత దేశంలో విదేశాల సాంకేతిక సహాయం తీసుకొనకుండా తయారు చేశారు. దీనితో స్వంత ఉపగ్రహాలను అంతరిక్షంలో పంపిన దేశాలలో భారత దేశం ఆరవ దేశం అయినది. ఒక భారతీయుణ్ణి రోదసీ నౌకలో అంతరిక్షంలో తీసుకు వెళ్ళిన మొదటి దేశం సోవియట్ దేశమే.

### రక్షణ రంగంలో :

దక్షిణాసియాలో అమెరికా తన వ్యూహానికి పాకిస్తాన్‌ను ఉపయోగించుకుంటూ భారత దేశం మీద పలు విధాలా ఒత్తిడి తెస్తున్నది. తత్ఫలితంగా, 1971 లో భారత-సోవియట్ శాంతి, సహకార ఒప్పందం అనివార్యమైనది. ఈ ఒప్పందానికి అనుగుణంగా సోవియట్ యూనియన్ భారత దేశానికి ఆయుధ సహాయం అందిస్తున్నది. రక్షణ రంగంలో సోవియట్ ఆయుధాలను ఉత్పత్తి చేయడానికి అవకాశం లభించింది. కడచిన కొన్ని సంవత్సరాల కాలంలో ఉభయ దేశాల సహకారం ఫలితంగా మిగ్-29 విమానాలు, టి. యు. 142 విమానాలు, తీరరక్షణ

విమానాలు, జలాంతర్గామి విధ్వంసక విమానాలు, టి-72 టాంకులు మొదలయినవి భారత సైన్యంకు అందుబాటులోకి వచ్చాయి. మన నావికులకు శిక్షణ నిమిత్తం సోవియట్ యూనియన్ తన అణుశక్తి చోదిత జలాంతర్గామిని కౌలుకు ఇస్తున్నది. 1988 నవంబరులో సోవియట్ నేత గోర్బచెవ్ భారతదేశంలో పర్యటించారు. ఈ సందర్భంగా మరికొన్ని ఒప్పందాలు జరిగాయి. మనకు రక్షణ సహాయము ఇతోధికంగా విస్తరించి అమెరికన్ అబ్రామ్స్ టాంకుకు సమానమైన టి-80 టాంకులు, బి ఎమ్.పి. సాయుధ సిబ్బంది శకటాలు, భూతలానికి వచ్చే నౌకలు, పాక్ క్షిపణి నౌకలు, ఎస్.ఎస్.ఎన్. 2 క్షిపణులు, కాపలా విమానాలు, నట్యా మైన్ స్వీపర్లు, మూడు రకాల సోవియట్ అత్యాధునిక విమానాలు (సివిల్ సరఫరాల నిమిత్తం) మనకు లభించనున్నాయి.

## శాంతి కోసం కృషి :

నిరాయుధీకరణ, అణ్వస్త్రాలపై నిషేధం, ప్రపంచ శాంతి, నూతన అంతర్జాతీయ వ్యవస్థ, మూడవ ప్రపంచ దేశాల అభివృద్ధి వంటి అంశాలలో రెండు దేశాలు మొదటినుంచి ఏకాభిప్రాయం కలిగి ఉన్నాయి. ప్రాంతీయ వ్యవహారాలపట్ల ఉభయ దేశాల దృక్పథం ఒకే తీరుగా ఉంది. అలీన ఉద్యమములో ఐక్యరాజ్య సమితిలో, ఇతర అంతర్జాతీయ వేదికల మీద, మధ్య అమెరికా, అంగోలా, నమీబియా, జాత్యహంకార దక్షిణాఫ్రికా, పశ్చిమ సహారా, కంపూచియా, ఆఫ్ఘనిస్తాన్ తదితర సమస్యల మీద భారతదేశం ప్రదర్శిస్తున్న వైఖరిని, నిర్వహిస్తున్న పాత్రను సోవియట్ యూనియన్ హర్షిస్తున్నది. అందువల్లనే రెండు దేశాలు అంతర్జాతీయ సామరస్యం కోసం సంయుక్త కృషి జరుపగలుగుతున్నాయి. లాటిన్ అమెరికాలో కాంటడోరా చొరవకు ఆఫ్రికా దక్షిణ భాగంలో ఫ్రంటులైన దేశాలకు, భారతదేశం, సోవియట్ యూనియన్ ఇస్తున్న తోడ్పాటును ఈసందర్భంగా ఉదహరించాలి. అంతర్జాతీయ వ్యవహారాలలో, ప్రపంచ సమస్యలపై భారతదేశానికి, సోవియట్‌యూనియన్‌కు మధ్య సంపూర్ణమైన ఏకీభావం ఉంది. ఉభయ దేశాలు పరిపూర్ణమైన విశ్వాసంతో వ్యవహరించ గలుగుతున్నాయి. ఆఫ్గనిస్తాన్ నుంచి తన సేనలను ఉపసంహరించ బోతున్నట్లు ప్రకటించడానికి పది గంటలకు ముందే సోవియట్ యూనియన్ ఒక ప్రత్యేక దూతను ఢిల్లీకి పంపి ఆ విషయాన్ని ప్రధాని రాజీవ్‌గాంధీకి తెలియజేయడం ఈ సందర్భంగా గమనించ వలసిన విశేషం.

వాణిజ్య రంగంలో :

సోవియట్ యూనియన్‌తో వాణిజ్యంలో, వర్ధమాన దేశాలలో భారతదేశం ప్రథమ స్థానం ఆక్రమిస్తున్నది. సోవియట్ యూనియన్‌తో వాణిజ్యం చేస్తున్న సోషలిస్టేతర దేశాలలో భారతదేశం ఆరవ స్థానంలో ఉంది. భారత-సోవియట్ వాణిజ్యం విలువ 1953 లో రూ. 1.3 కోట్లు. 1987 లో రూ. 4400 కోట్లు. ఇది 1988 లో ఐదు వేల కోట్లకు చేరింది. 1995 నాటికి ఇది 10 వేల కోట్ల రూపాయల వరకు పెరుగుతుందని అంచనా.

మొత్తం భారతదేశం ఎగుమతులలో సోవియట్ భాగం 15 శాతం కన్న హెచ్చు. భారతదేశం దిగుమతులలో సోవియట్ భాగం 10 నుంచి 12 శాతం. భారతదేశం దిగుమతులలో క్రూడాయిల్, ఇతర చమురు పదార్థాలు ముఖ్యమైనవి. రెండు దేశాల మధ్య వాణిజ్యం శీఘ్రంగా విస్తరించడం కోసం సోవియట్ యూనియన్ రెండు వేలకోట్ల రూపాయల రుణాన్ని (ఆర్థిక, సాంకేతిక సహకార విస్తరణ కోసం) ఇస్తున్నది. ఈ రుణం మొత్తాన్ని ఇండియా వస్తువులు కొనడానికే సోవియట్ యూనియన్ ఉపయోగిస్తుంది. అంటే దానివల్ల భారతదేశానికి స్థిరమైన మార్కెటు లభిస్తోందన్న మాట. తెహ్రీలోని జల విద్యుత్ కేంద్రం నిర్మాణం, బొకారో ఆధునీకరణ, ఝరియా బొగ్గుగనుల నిర్మాణం, పశ్చిమ బెంగాల్‌లో చమురు అన్వేషణ తదితర భారీ, కీలక పారిశ్రామిక పథకాల నిమిత్తం సోవియట్ రుణం ఉపయోగ పడుతుంది. సోవియట్ యూనియన్‌లో హోటళ్ళ నిర్మాణం కాంట్రాక్టులు భారత ప్రైవేటు సంస్థలకు లభిస్తున్నాయి. అపూర్వ రీతిలో శాస్త్ర పరిశోధనా రంగంలో (బయోటెక్నాలజీ, వైద్య, ఆరోగ్య, వ్యవసాయ విషయాలలో) సహకార కార్యక్రమం కోసం రెండు దేశాలు కృషి జరుపుతున్నాయి. పరిశోధన-అభివృద్ధి నిమిత్తం ఉమ్మడి నిధిని ఏర్పాటు చేయడం మరో ముఖ్య సంఘటన. భారత-సోవియట్ శాస్త్రజ్ఞుల సంయుక్త పరిశోధనలకు ఇది ఎంతో ప్రోత్సాహం కలిగిస్తుంది. సముద్ర పరిశోధన, అంతరిక్ష పరిశోధన, విద్యుదుత్పాదన, లోహశాస్త్రం, సెమీ కండక్టర్, లేసర్ టెక్నాలజీ రంగాలు సైతం ఉభయదేశాల శాస్త్ర సాంకేతిక ఒప్పందం పరిధిలో చేరాయి.

నెహ్రూ పాత్ర :

భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ 1955 వేసవిలో మాస్కో నుంచి ఢిల్లీ వెళుతూ ఆ రోజు ఉదయం లండన్ కొచ్చి, 'చెక్కర్స్' (బిటిష్ ప్రధాని

వేసవి విడిది) లో అప్పటి బ్రిటిష్ ప్రధాని ఆంథోనీ ఈడెన్‌ను కలుసుకున్నారు. ఇండో-చైనా మీద ఏర్పాటైన జెనీవా కాన్ఫరెన్స్‌కు బ్రిటన్, రష్యాలు రెండు సహ అధ్యక్ష దేశాలు. ఇండో-చైనా మీద ఏర్పాటైన మూడు అంతర్జాతీయ కంట్రోలు కమీషన్లకు ఇండియా అధ్యక్షురాలు. ఇండో చైనా సమస్య అప్పట్లో చాలా క్లిష్టంగా ప్రమాద భరితంగా తయారైంది. అప్పుడు ప్రపంచం పగులు చూపిన అగ్నిపర్వతం కొనమీద ఉన్న సంగతి చాలామందికి తెలియదు. ఆ ప్రళయం అప్పట్లో ఎలాగో సర్దుకుంది.

ఇండో-చైనా కారణంగా ప్రపంచ యుద్ధం ప్రారంభమై ఉండేది. జెనీవా ఒప్పందాలు అనుకున్న మేరకు పాటించాలన్నా, అధ్యక్షదేశాలైన బ్రిటన్-రష్యాల మధ్యగల సంబంధాలు మరింత సౌహార్ద సామరస్య భరితంగా ఉండవలసిన ఆవశ్యకతను మాస్కోకు బయలుదేరే ముందు నెహ్రూ గ్రహించారు.

చెక్కర్స్ సమావేశానికి ఈడెన్ పిలుపుమీద హెరాల్డ్ మాక్మిలన్ (తరువాత బ్రిటిష్ ప్రధాని) కూడా వచ్చారు. ప్రాసంగికంగా నెహ్రూ సోవియట్ యూనియన్‌లో వచ్చిన మార్పును ప్రస్తావించారు. రష్యాలోని నిర్బంధ కృతిక వాతావరణం పొగమంచు వలె చెదిరి పోయిందని, స్వేచ్ఛాభానుడు మింట వెలుగుతున్నాడని ఆయన బ్రిటిష్ అగ్రనాయకులకు నొక్కి పలికారు. రష్యాలో నూతన శకోదయం జరిగిందని, ఆ యదార్థాన్ని గుర్తించి అర్థం చేసుకోవడం చాలా అవసరమని. అది ఎల్లరకు శ్రేయస్కరమని ఆయన నొక్కి చెప్పారు. ప్రపంచ కనుక ఆ వాస్తవాన్ని ఆకళించుకోలేక పోతే ఆత్మహాని తప్పదని, ఆయన హెచ్చరించారు. నెహ్రూ మాటలు ఈడెన్ మీద బాగా పని చేశాయి. సోవియట్ రష్యాలో వచ్చిన మార్పుల అంతర్యాన్ని పాశ్చాత్య రాజ్యాలు గ్రహించేటట్లు చేయడంలో నెహ్రూ ఉదాత్తమైన పాత్రను నిర్వహించారు.

నిజానికి విభిన్న వ్యవస్థలు గల దేశాలు, శాంతి సామరస్యాలు కలిగి, ఉమ్మడి శ్రేయస్సు కోసం మనుగడ కొనసాగించ వచ్చుననే అభిప్రాయం భారత సోవియట్ స్నేహంతోనే ప్రపచానికి వెల్లడయింది. 1955 లో సోవియట్ నాయకులు మొదటిసారి భారతదేశ పర్యటనకు వచ్చినప్పుడు కాశ్మీర్, గోవా విషయాలలో భారతదేశానికి పూర్తి అండదండలు వ్యక్తం చేసి, అమెరికా పాశ్చాత్య దేశాల నాయకుల కుయుక్తులకు తగిన బుద్ధి చెప్పారు.

1962 నాటి భారత చైనా సంఘర్షణ భారత-సోవియట్ స్నేహానికి అగ్ని పరీక్ష అయింది. ఆ విషమ సందర్భంలో భారతదేశాన్ని సోవియట్ యూనియన్ బలపరిచి, తన శాంతికాముకత్వాన్ని వెల్లడించుకుంది. ఒక కమ్యూనిస్టేతర దేశంతో, ఘర్షణపడ్డ కమ్యూనిస్టు దేశాన్ని, మరొక కమ్యూనిస్టు దేశం బలపరచకపోగా, దానిని విమర్శించడం, ఆ కమ్యూనిస్టేతర దేశంపట్ల సానుభూతి ప్రకటించడం చరిత్రలో బహుశా ఇదే మొదటిసారి.

భారతదేశం సమగ్రతకు దెబ్బతీయగల సంక్షోభాలన్నింటిలోను ఆ ప్రమాదం ఏటువైపు నుంచి వచ్చినా పోర్చుగల్, పాకిస్తాన్, చైనా నుంచి వచ్చినదైనా సరే సోవియట్ యూనియన్ భారతదేశానికి కొండంత అండగా నిలిచిన సంగతిని భారత ప్రజలు మరచిపోలేరు.

**సాంస్కృతిక ఆదాన ప్రదానాలు :**

విద్యారంగంలో భారత-సోవియట్ సహకారం ఎంతో గణనీయమైనది. 1954 నుంచి అనేక రంగాలలో విస్తరించిన సహకారం పౌర విద్యకు సంబంధించిన వివిధ రంగాలకు విస్తృతి చెందింది. సోవియట్ ప్రచురణాలయాలు హిందీ, ఉర్దు, బెంగాలీ, తమిళం, తెలుగు, మళయాళం, గుజరాతీ, పంజాబీ, మరాఠీ భాషలలో పుస్తకాలను ప్రచురిస్తున్నాయి. కన్నడ, ఒరియా, అస్సామీ, కాశ్మీరీ భాష రచనల అనువాదాలను కూడా వెలువరిస్తున్నాయి. సోవియట్ యూనియన్‌లోని వివిధ భాషలలో ప్రచురించిన భారతీయ గ్రంథాల మొత్తం ప్రతులు 30 మిలియనులకు పైబడ్డాయని అంచనా. జవహర్‌లాల్ నెహ్రూ స్మారకార్థం 'సోవియట్ ల్యాండ్' నెహ్రూ అవార్డులు 1964 నుంచి ప్రారంభమైనాయి. సాహిత్య, కళ, పత్రికా రంగాలలో సోవియట్-భారతదేశాల స్నేహాభివృద్ధిని దృష్టిలో పెట్టుకొని విశేషంగా కృషి చేసిన భారతీయులకు ఏటేట అవార్డులు లభిస్తున్నాయి.

భారత-సోవియట్ దేశాల మధ్య సాంస్కృతిక సంబంధాల అభివృద్ధి భాషా సమస్య పెద్ద అవరోధకంగా ఉంది. సోవియట్ దేశానికి సంబంధించినంత వరకు భారతీయ భాషా సాహిత్యాల అధ్యయనాన్ని అక్కడ ఎంతగానో అభివృద్ధి పరిచారు. కాని, భారతదేశంలో ఆ అభివృద్ధి ప్రాథమిక స్థాయిని దాటలేదు. ఇవి అభివృద్ధి చెందినప్పుడే రెండు దేశాలమధ్య ఉన్న సాంకేతిక, శాస్త్ర విషయాలలో వున్న అఘాతాన్ని పూడ్చడం సాధ్యమవుతుంది. ఇది ఎంతో ముఖ్యం కూడా.

భారత్-సోవియట్ సంబంధాలు చారిత్రాత్మకమైనవి. మహత్తరమైనవి. ఇవి సహస్ర దళాలతో, బహుముఖంగా విస్తరిస్తూ అంతర్జాతీయ సఖ్యతకూ, ప్రపంచ శాంతికి పెట్టని కోటగా రూపొందుతున్నాయి. సోవియట్ యూనియన్‌లో భారత సాంస్కృతిక ఉత్సవాలు, భారతదేశంలో సోవియట్ సాంస్కృతిక ఉత్సవాలు, స్నేహ సంబంధాల సజీవ చరిత్రిలో వినూత్న అధ్యాయాన్ని విరచించాయి. ఉభయ దేశాల ప్రజల హృదయాల మధ్య సాంస్కృతిక వారధులను నిర్మించాయి. సరిహద్దుల సమస్యలు, ఇతర విభేదాలు, వివాదాలు లేని స్నేహ, సౌభాతృత్వాలు ఉభయ దేశాలను అల్లుకున్నాయి. ఈ స్నేహం దినదిన ప్రవర్ధమాన మవుతున్నది.

[ -o- ]

# నేపాల్‌లో ప్రజాస్వామ్య శంఖారావం

ప్రజాశక్తి ముందు నేపాల్ రాజు తల వంచక తప్పలేదు. 1990 ఏప్రిల్ 20న నేపాల్‌లో కృష్ణప్రసాద్ భట్టారియా నాయకత్వంలో ప్రజాతంత్ర, కమ్యూనిస్టు పార్టీ చరిత్రాత్మక మిశ్రమ ప్రభుత్వం తాత్కాలికంగా ఏర్పడింది.

హిమాలయా రాజ్యమైన నేపాల్ అతి ప్రాచీన దేశం. బుద్ధ భగవానుడు అవతరించింది ఈ దేశంలోనే. ధరిత్రిపై మిగిలిన ఏకైక హిందూదేశం కూడా ఇదే. అనాదికాలం నుంచి మొదలు పెట్టుకొని, బ్రిటిష్ వారు భారత దేశాన్ని పాలించే రోజులలో కూడా నేపాల్ స్వతంత్రంగానే ఉన్నది. దేశ పరిపాలనను వంశ పారంపర్యంగా హస్తగతం చేసుకున్న రాణాలు (ప్రధాన మంత్రులు) దేశములో రాజకీయోద్యమాలను నిషేధించడం వల్ల, విప్లవకారులు రామాయణ పురాణం చెపుతూ ప్రజలలో రాజకీయ చైతన్యం కలిగించే వారు.

రాణాల నిరంకుశ చర్యలు :

1848 లో మహారాజా జంగ్ బహదూర్ రాణా ప్రధాన మంత్రి పదవిని వంశ పారంపర్యమైన హక్కుగా సంపాదించాడు. రాణాలు భోగభాగ్యాలతో జీవితం గడిపితే ప్రజలు దుర్భర దారిద్ర్యం అనుభవించారు. 1950 లో త్రిభువన విక్రమ్‌సింగ్ బహదూర్‌షా కొత్తగా సింహాసనం అధిష్టించిన మొదటి రోజులలో సాయంకాలం షికారుకు పోయి తిరిగివస్తూ రోడ్డు ప్రక్కన కాళ్ళకు, చేతులకు బేడీలు వేసుకొని కొంత మంది పని చేయడం చూశాడు. 'ఏనుగులను కట్టివేసే ఆ ఇనుప గొలుసులు మీకు ఆభరణాలా ? ఎందుకంత కష్టపడుతున్నారు ? ఇంతకంటె మీరు చేయదగిన పని ఏదీ లేదా ?' అని వాళ్ళని ప్రశ్నించాడు. రాజు వెంట ఉన్న అధికారులు వెంటనే అందుకొని, వాళ్లు ఖైదీలని, పగలంతా ఆ విధ

ముగా కష్టపడితేనే గాని వాళ్ళకి అరకాసులు రావనీ, ఆ డబ్బు వస్తేనే గానీ వారు తిండి తెచ్చుకోలేరని చెప్పారు. తన రాజ్యంలో ఇలాంటి ఘోరాలు జరుగుతున్నందుకు రాజు విచారపడి, అక్కడికక్కడే వాళ్ళకు అయిదు రూపాయలు ఇవ్వాలని ఉత్తరువులు జారీ చేశాడు. ఆ ప్రకారం వారికి అయిదు రూపాయలు అందుతూ వచ్చాయే గాని మహారాజాధి రాజును ఆవైపుకు తీసుకుపోయినందుకు ఆనాడు ఆయన వెంట ఉన్నవారి ఉద్యోగాలు ఊడిపోయాయి.

భారతదేశంలోని స్వాతంత్రోద్యమాల ప్రభావం నేపాల్ మీద పడటం సహజమే. ఆ దేశములో ఆర్యసమాజం వేళ్లానుకొని పోయింది. కోయిరాలా సోదరులు దేశంలోని సహాయ నిరాకరణోద్యమాలకు నాయకత్వం వహించారు. భారతదేశాన్ని కేంద్రంగా చేసుకొని గుర్ఖాలీగ్ రాణాల నిరంకుశత్వంపై ధ్వజమెత్తింది. తంకాప్రసాద్ ఆచార్య మొదలైన తీవ్రవాదులు 1935 లోనే ప్రజా పరిషత్‌ని స్థాపించారు. 1940 వరకు దాదాపు 500 మంది దేశభక్తులు స్వాతంత్ర్యోద్యమాలలో అసువులు బాశారు. 1942 లో నేపాల్‌లో సైతం 'క్విట్ ఇండియా' ప్రభావం కనిపించింది.

## ప్రజాస్వామ్య వ్యతిరేకం :

భారతదేశంలో బ్రిటిష్ ప్రభుత్వం అధికారంలో ఉన్నప్పుడు నేపాల్ రాణాలు బ్రిటన్‌కు మద్దతు నిచ్చే వాళ్ళు. 1857 లో భారతీయులు స్వాతంత్ర్య సమర శంఖం పూరించినప్పుడు, ఆ యుద్ధాన్ని అణచివేయడానికి నేపాల్ పది సైనిక పటాలాలను పంపి బ్రిటన్‌కు సాయపడింది. 1901 లో చైనాలో బ్రిటన్ జోక్యం చేసుకున్నప్పుడు, మొదటి, రెండవ ప్రపంచ యుద్ధాల సమయంల్లోనూ నేపాల్ బ్రిటన్‌కే అండగా నిలిచింది. ఈ కారణాలవల్ల భారతదేశానికి స్వతంత్రం వచ్చినప్పటి నుంచీ అది నేపాల్‌లోని రాణాలతో అంతగా సహకరించలేదు. నేపాల్ ప్రతిపక్షాల వారు భారతదేశంలో ఉంటూ తమ రాజకీయాలను నడిపారు. 1950 లో నేపాలీ కాంగ్రెస్ పార్టీ సమావేశం కలకత్తాలో జరిగింది. నామమాత్రంగా ఉన్న రాజు త్రిభువన్ అప్పట్లో నేపాల్ నుంచి తప్పించుకొని వచ్చి ఢిల్లీ చేరారు. త్రిభువన్ నేపాలీ కాంగ్రెసుతో చేతులు కలిపి మొత్తం మీద 1951 లో రాణాల పరిపాలనను అంతమొందించ గలిగారు. నేపాలీ కాంగ్రెసు తమ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయగలిగింది.

తిరిగి నిరంకుశాధికారం :

1955లో రాజు త్రిభువన్ మరణించగా రాజు మహేంద్ర పాలన ప్రారంభ మయింది. 1959 లో దేశంలో ఎన్నికలు జరిగాయి. 109 స్థానాలు గల నేపాల్ శాసన సభలో 74 స్థానాలను కాంగ్రెసు గెలుచుకొని ఆ పార్టీ నాయకుడు బి. పి. కొయిరాలా ప్రధానిగా ఎన్నికయ్యాడు. నేపాల్ చరిత్రలో ఎన్నికైన ప్రధాను లలో కొయిరాలా మొదటి వాడు. కానీ, రాజుమహేంద్ర 'కాంగ్రెస్ డిక్టేటర్‌షిప్' ని సహించలేక 1960 డిశంబర్‌లో కొయిరాలా ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేశాడు. సర్వాధికారాలను రాజు చేజిక్కించుకున్నాడు. రాజకీయ పార్టీలను రద్దుచేసి, దేశ ములో పంచాయితీ విధానాన్ని ప్రవేశపెట్టాడు. 1972 నవంబర్ 31 న రాజు మహేంద్ర మరణించడంతో బీరేంద్ర బీర్ విక్రమ్ షా రాజు అయ్యాడు.

రాజు బీరేంద్ర అధికారంలోకి వచ్చి రాచరిక పాలనను మరింత పటిష్టం చేశారు. బంగ్లాదేశ్ అవతరణ నుంచి (1971), సిక్కిం ప్రజాస్వామికరణ (1975) నుంచి పొందిన ప్రేరణలో నేపాల్ కాంగ్రెసు మళ్ళీ పుంజుకొని రాజును, పంచాయితీ వ్యవస్థను ఢీకొనడానికి ప్రయత్నించింది. మారిన రాజకీయాలను దృష్టిలో ఉంచుకొని 1976 డిశంబరులో బి. సి. కొయిరాలా నేపాల్‌కు వెళ్ళారు. వెంటనే ప్రభుత్వం ఆయనను జైలులో పెట్టింది. ఈ విధంగా మొత్తం మీద మొదటినుంచీ భారతదేశానికీ, నేపాల్‌కు వైరుధ్యం కొనసాగుతునే ఉంది.

రాజు మహేంద్ర అధికారంలో ఉన్న రోజులలో భారతదేశంతో ఒక ఒప్పందం కుదుర్చుకున్నారు. నేపాల్ రాచరిక పాలన కొనసాగుతున్నా ఏదో ఒక రూపంలో రాజ్యాంగం అనేది ఒకటి ఉండాలని, బహుపార్టీ విధానం అమలు లోకి తేవాలని భారతదేశం చేసిన ప్రతిపాదనను రాజుమహేంద్ర అంగీకరించారు. కానీ నేపాలీ కాంగ్రెస్ ప్రభుత్వాన్ని రద్దు చేయడంతో ఈ ఒప్పందాన్ని ఉల్లం ఘించినట్లయింది.

బీరేంద్ర తప్పుడు చర్యలు :

ప్రజలు రాజు బీరేంద్రపై తిరుగుబాటు చేయడానికి అనేక కారణాలు ఉన్నాయి. దారిద్ర్యం, ఆకలి, నిత్య జీవితావసర వస్తువుల కొరత, నిరుద్యోగం వంటివి నేపాల్ ప్రజలు ఎదుర్కొంటున్న తీవ్ర సమస్యలు. నేపాల్ తన దిగు మతుల కోసం భారతదేశం మీద ఆధారపడాలి. నేపాల్‌లోకి భారతదేశం నుంచి

ఇరవయి ప్రవేశ కేంద్రాలున్నాయి. భారత ప్రభుత్వం ఈ కేంద్రాలను మూసి వేయడానికి నిర్ణయిస్తే నేపాల్‌కు దిగ్బంధనం తప్పదు. బయటి ప్రపంచం నుంచి నేపాల్‌కు ఏదీ వెళ్ళలేదు. ఇటువంటి భౌగోళిక స్థితిలో ఉన్న నేపాల్ మన దేశంతో స్నేహ సంబంధాలు కలిగి ఉండాలి. భారత-నేపాల్ వాణిజ్య రవాణా ఒప్పందం 1989 మార్చి 23న ముగిసేవరకు నేపాల్ ప్రజలకు అవసరమయిన వస్తువులన్నీ భారతదేశంనుంచి సులభంగా వెళ్లాయి. ప్రజల అవసరాలను గుర్తించని రాజు బీరేంద్ర, ఆయన నియమించిన పంచాయతీ కీలుబొమ్మ ప్రభుత్వం దూరదృష్టిలేని, విజ్ఞతారహిత విధానాలను అవలంబించడంతో భారత-నేపాల్ వాణిజ్య, రవాణా ఒప్పందాన్ని కొనసాగించడం సాధ్యం కాలేదు. అనేక సంవత్సరాలనుంచి అమలులో ఉంటున్న ఈ ఒప్పందం నేపాల్‌కు చాలా అనుకూలంగా ఉంది. ఈ ఒప్పందం ప్రకారం నేపాల్ కలకత్తా ఓడరేవు సదుపాయాలను నామమాత్రపు వ్యయంతో ఉపయోగించుకోగలిగింది. భారతదేశంలో ఉన్నత విద్య కోసం నేపాలీ విద్యార్థులకు ఉపకార వేతనాలు లభించాయి. నేపాల్‌లోని పలు పథకాల మీద భారతదేశం ఏటా రు. 25 కోట్ల చొప్పున ఖర్చు చేసింది. భారత దేశం నుంచి ఇన్ని సదుపాయాలు, సహాయం పొందుతూ బీరేంద్ర చైనా వైపు మొగ్గు చూపుతూ భారత ప్రయోజనాలకు భంగం కలిగించారు. నేపాల్‌లోని భారత వర్తకులు, కార్మికుల తదితరులమీద రాజు బీరేంద్ర విపరీత ఆంక్షలు విధించారు.

### ప్రజల దుర్భర పరిస్థితి :

రాజు బీరేంద్ర ధోరణిని భారత ప్రభుత్వం తీవ్రంగా భావించింది. రవాణా, వాణిజ్యం ఒప్పందం వ్యవధి పూర్తికాగానే భారత ప్రభుత్వం ప్రవేశ కేంద్రాలన్నింటినీ మూసివేసింది. దైనందిన జీవితానికి అవసరమైన వస్తువులన్నిటి సరఫరా నిలిచిపోవడంతో నేపాల్ ప్రజలు కటకటలాడారు. వారి రోజు వారీ జీవితం నరకంగా మారింది. హటాత్తుగా భారతదేశంనుంచి సరఫరాలు నిలిచిపోయి నేపాల్‌లో ఆహారం, ఔషధాలు, పెట్రోల్ తదితర దైనందిన వస్తువులన్నిటి ధరలు ఆకాశాన్ని కంటాయి.

భారతదేశం తనను ఆర్థిక దిగ్బంధనానికి గురి చేస్తోందని నేపాల్ చేసిన వాదనను అమెరికా సైతం తిరస్కరించింది. వాణిజ్యం, సరుకుల రవాణాకు సంబంధించి భారత-నేపాల్ మధ్య ఇటీవల తలెత్తిన సమస్య ఇది. వ్యాపార,

సరకుల రవాణా ఒప్పందం రద్దయిపోయినప్పటికీ భారత్ ఏకపక్షంగా నిర్ణయించి పెట్రోలియమ్‌కు, ఆహార పదార్థాల సరఫరాకు అనుమతించింది. భారత్‌పై వొత్తిడి తెచ్చేలా అమెరికాను ప్రేరేపించగలననే ఆశాభావంతోనే అమెరికాను ఆశ్రయించి, ఇరుగుదేశమయిన తనను లొంగదీసుకోవడానికి భారత్ ప్రయత్నిస్తోందంటు మొర పెట్టుకుంది. అయితే, ఈ సమస్యను రాజకీయ స్థాయిలో ద్వైపాక్షిక సంప్రదింపులద్వారా పరిష్కరించుకోవలసిందిగా అమెరికా సలహా ఇచ్చింది. తరతరాలుగా స్నేహ సుహృద్భావాలతో మెలగుతున్న ఉభయదేశాలు అన్ని అంశాలపై ఏకాభిప్రాయానికి రావాలి.

### ప్రత్యేక రాయితీలు :

రెండు అగ్రరాజ్యాల పోటా పోటీలమధ్య బ్రతికి బట్టకట్టుకున్న రాజ్యం నేపాల్. కాని భారతదేశంతోనే దీని సంబంధా లెక్కువ. నేపాల్ అభివృద్ధికి భారత్ ఎంతగానో సహాయ మందించింది. 1986 మార్చి వరకు భారతదేశం నేపాల్‌కు 262 కోట్ల రూపాయల మేరకు ఆర్థిక సహాయ మందజేసింది. రోడ్ల నిర్మాణం, ఇరిగేషన్-జల విద్యుత్ పథకాలు, గ్రామీణ విద్యుదీకరణ, నీటి సరఫరా, విద్య, ఆరోగ్యం తదితర రంగాలలో నేపాల్‌కు ఇండియా ఎంతగానో సహాయం చేస్తున్నది. 1950 ఇండో-నేపాల్ ఒప్పందం ప్రకారం వీసాలు, పాస్ పోర్టులు, అనుమతి పత్రాలు లేకుండా ఈ రెండు దేశాల ప్రజలు రెండు దేశాలలో ఏ దేశంలోనైనా స్వేచ్ఛగా జీవించవచ్చు. ఆస్తులు సంపాదించుకోవచ్చు. భారత ప్రభుత్వం ఇటీవల ప్రకటించిన ప్రకారం లక్ష యాభై వేలమంది భారతీయులు నేపాల్‌లో నివసిస్తున్నారు. కానీ తమ దేశంలో 20 లక్షలమంది భారతీయు లున్నట్లు నేపాల్ చెబుతోంది. నేపాల్‌లోని భారతీయులపై ఆంక్షలు విధిస్తే అలాంటి ప్రతీకార చర్యలనే భారతదేశంలో నివసిస్తున్న లక్షలాది నేపాలీలపై భారత ప్రభుత్వం తీసుకోవచ్చు.

నేపాల్-భారత సంబంధాలు ఆది నుంచి కొన్ని అపోహలకు తావిస్తు వచ్చాయి. భారతదేశం తనను చిన్నచూపు చూస్తుందని నేపాల్ ఇప్పుడు బాధ పడుతోంది. కాగా, చైనావద్ద ఆయుధాలు కొనుగోలుచేసి నేపాల్ తన ప్రాధాన్యం తగ్గించివేసిందని భారత్ భావన. మిత్రదేశంగా ఉంటూనే భారత్‌తో ప్రతిఘట నాత్మక విధానం నేపాల్ అనుసరించడం దాని విదేశాంగ విధానంలోని ముఖ్యాంశ

మైనది. ఇది భారత-నేపాల్ మైత్రీ సంబంధాలలో కొన్ని కొత్త చిక్కులను తెచ్చిపెట్టింది. వాటిని సత్వరమే తొలగించడం అవసరం.

నేపాల్ వైశాల్యం 147.141 చదరపు కిలోమీటర్లు. అంటే ఒరిస్సా కంటె కొంచెం పెద్దది, తమిళనాడు కన్నా కొంచెం చిన్నదన్నమాట.

రాచరికపు వ్యవస్థ కొనసాగించడంపై నేపాలీ ప్రజలకు ద్వంద్వాభిప్రాయం లేదు. వాస్తవానికి తమ రాజును మానవ శరీరాన్ని ధరించిన మహా విష్ణువు అని, రాచరికాన్ని దూషిడంచడమంటే దైవదూషణ చేయటమేనని నేపాల్‌లోని సామాన్య ప్రజల విశ్వాసం. అందువల్ల నేపాల్ ప్రజానీకంలో చోటు చేసుకున్న అసంతృప్తి రాచరికం పట్ల కాదు. ఆ అసంతృప్తి కేవలం పెరుగుతున్న అవినీతి, రాణి నిర్వహిస్తున్న రాజ్యాంగేతర కీలకపాత్ర పట్ల మాత్రమే. నేపాల్ ప్రజల అభిప్రాయం పరిస్థితులలో మార్పుకు అనుకూలంగా ఉన్నదే కాని, రాచరికం రద్దుకు మాత్రం అనుకూలంగా లేదు. అందుకే ఆఖరుకి నేపాలీ కాంగ్రెస్ కూడా రాచరికం రద్దు కోరడం లేదు. వీరందరూ కోరుతున్నది రాజ్యాంగబద్ధమైన పరిపాలన మాత్రమే. నేపాల్‌లో ప్రజాస్వామ్య పునరుద్ధరణ జరిగి, భారత-నేపాల్ సంబంధాలు తిరిగి పటిష్టమవడం, ఇరుదేశాల ఉమ్మడి ప్రయోజనాలకు ఎంతో శ్రేయస్కరం.



# అలజడుల సుడిగుండంలో బర్మా

1935 ఇండియా చట్టం క్రింద 1937లో భారతదేశం నుంచి బర్మా విడిపోయి ప్రత్యేక దేశంగా ఏర్పడింది. 1948 సెప్టెంబరు 24వ తేదీన బర్మాకు బ్రిటిష్ పరిపాలన నుండి స్వాతంత్ర్యం లభించింది. స్వాతంత్ర్యం లభించిన మూడు నెలల్లోనే కమ్యూనిస్టు సానుభూతిపరులు దేశవ్యాప్తంగా జరిపిన దౌర్జన్య కాండలో విపరీతమైన జననష్టం, ఆస్తి నష్టం జరిగింది. ఈ అలజడులను సైన్యాలు అడ్డుకున్నాయి. బర్మాలో సోషలిస్టు విధానం అమల్లోకి వచ్చింది. వ్యాపార రంగంనుంచి, ఉద్యోగాలనుంచి క్రమంగా విదేశీయులను తొలగించారు. కామన్‌వెల్త్ నుంచి బర్మా విడిపోయింది.

యూను :

స్వాతంత్ర్యం పొందిన పిదప బర్మాలో యాంటీ ఫాసిస్ట్ లీగ్ ప్రభుత్వం అధికారంలోకి వచ్చింది. ఇందులో అన్ని జాతుల ప్రతినిధులు, రైతులు, చిన్న తరగతుల ఉద్యోగులు, కార్మికులు, స్వల్ప ఆదాయం కలిగిన ప్రజలు ప్రతినిధులుగా ఉన్నారు. 1951 ఎన్నికలలో కమ్యూనిస్టుల్ని, ఫాసిస్టుల్ని ఓడించి యాంటీ-ఫాసిస్టు లీగ్ తిరిగి అధికారంలోకి వచ్చింది. దేశంలోని ఫాసిస్టులు ఆంగ్ సాంగ్‌ని హత్య చేసిన పిదప యూనూను తమ దేశ ప్రధానిగా ఎన్నుకున్నారు. 1956లో జరిగిన ఎన్నికలలో కూడా మరలా యాంటి ఫాసిస్టులీగ్ అధికారంలోకి వచ్చింది. ఈసారి లీగ్‌లో భాగస్వామ్య పక్షమైన సోషలిస్టు నాయకుడు యుబాస్వా ఏకగ్రీవంగా ప్రధానిగా ఎన్నికయ్యాడు. ఈ ఎన్నికలలో కమ్యూనిస్టులు ఎంత తీవ్రంగా ప్రయత్నించినా చాలా స్వల్పసంఖ్యలోనే గెలిచారు. అధికారంలోకి వచ్చిన సోషలిస్టు ప్రభుత్వం విప్లవాత్మకమైన ఎన్నో మార్పులను దేశంలో ప్రవేశపెట్టింది. ముఖ్యంగా భూమిని జాతీయం చేసి, సేద్యం చేసుకునే రైతులకు

పంచింది. 1958లో దేశంలో అల్లరులు పెరిగి, ప్రభుత్వం వాటిని అణచలేని పరిస్థితి ఏర్పడినప్పుడు సైన్యాధ్యక్షుడుగా నెవిన్ కలుగజేసుకొని 1960లో ఎన్నికలు జరిపించాడు. ఆ ఎన్నికలలో యూనూ తిరిగి ప్రధాని అయినాడు. యూనో అంటే నెవిన్‌కు అసలు పడదు. అందుకే 1962 మార్చి ఒకటిన యూనూను జైలులో పెట్టి దేశ పాలనాధికారాన్ని నెవిన్ హస్తగతం చేసుకున్నాడు.

యూనూ చాలాకాలం బర్మా ప్రధానిగా ఉన్నాడు. ఇతడుకూడా తాను సోష లిస్టునని భుజకీర్తులు తగిలించుకున్నవాడే. ఐతే ఎన్నికలలో ప్రజల కిచ్చిన వాగ్దాలను అమలుపరిచేందుకు ఎన్నడూ ప్రయత్నించలేదు. విదేశీ గుత్త వ్యాపారులకు, ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదులకు తాబేదారుగా వ్యవహరించాడు. ప్రజానీకంలో అప్రదిష్ట పాలైనప్పుడల్లా రాజకీయంగా అస్త్ర సన్యాసం చేస్తానని కబుర్లు చెపుతూ బౌద్ధ పుణ్యక్షేత్రాలకు, తీర్థయాత్రలకు వెళ్ళి వచ్చేవాడు. బౌద్ధ మతస్థులైన ప్రజల సానుభూతి కొరకు యిలా నాటకమాడటం ఆయనకు పరిపాటి. తిరిగి ప్రధానిగా అధికారం చేబట్టడం, యథాప్రకారం ఆంగ్లో-అమెరికన్ సామ్రాజ్యవాదుల అడుగులకు మడుగులొత్తడం ఆయనకు మామూలే.

## అధికారంలో నేవిన్ :

దేశానికి స్వాతంత్ర్యం లభించగానే నేవిన్ బర్మా సైన్యాధ్యక్షుడయ్యాడు. ఆధునిక బర్మా చరిత్రలో నేవిన్‌కు ఎంతో ప్రాముఖ్యం ఉంది. 1824 నుంచి 1948 వరకు బ్రిటిష్ పాలనక్రింద స్వాతంత్ర్యం అనుభవించిన దేశం బర్మా. దేశానికి స్వతంత్రం సాధించుకొని తీరాలన్న తపనతో బర్మాలో పలువురు పలురకాలుగా పోరాటాలు జరిపారు. వారిలో ఒక బృందానికి '30 మంది కామ్రేడ్' లని పేరు. రెండో ప్రపంచ యుద్ధకాలంలో జపాన్ సైన్యాల సాయంతో బర్మాకు స్వాతంత్ర్యం సంపాదించుకోవాలని ఆశించిన యువ జాతీయవాదుల బృంద మది. ఆ బృందంలో నేవిన్ కూడా ఒకరు. నేవిన్ అన్నది ఆయన అసలు పేరుకాదు. 1911 మే 24న రంగూన్‌కు 200 మైళ్ళ దూరంలో ఉన్న ప్రోమ్ నగరంలో జన్మించిన నేవిన్‌కు తల్లిదండ్రులు పెట్టిన పేరు 'షుమవుంగ్'. డాక్టరు కావాలనుకొని, ఆ చదువులో రెండో ఏడాది తప్పిపోయి రైల్వేలో గుమస్తాగా చేరి, తర్వాత రాజకీయాలలో దిగాడు షుమవుంగ్. రాజకీయాలలో '30 మంది కామ్రేడ్‌ల' బృందంలో

చేరగానే తన పేరు 'నేవిన్'గా మార్చుకున్నాడాయన. జపాన్ దళాల సహాయంతో దేశానికి స్వాతంత్ర్యం సాధించుకోవాలని ఆశించినా, కాలక్రమేణా 30 మంది కామ్రేడ్‌లకూ జపాన్‌కూడా తమను అణచి ఉంచుతుందనే భయమే పెరిగింది. దానితో హఠాత్తుగా దారిమార్చి బ్రిటిష్‌వారికి మద్దతు పలికి, జపాన్ సైనికులపై ఎదురు దాడులు జరిపారు. అది మెచ్చుకుంటూ బ్రిటిష్‌వారు నేవిన్‌కు సైన్యంలో ఉన్నత పదవి ఇచ్చారు. 1948లో దేశానికి స్వాతంత్ర్యం లభించాక, నేవిన్ సైన్యాధ్యక్షుడయ్యాడు.

1962లో రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకున్న నేవిన్ ఆ తరువాత తన ఉక్కుహస్తంలాంటి పరిపాలనలో దేశాన్ని దినదినాభివృద్ధిలోకి కాక, దిన దిన క్షయంలోకి నడిపించాడు.

**ఆర్థికంగా చితికిపోయిన బర్మా :**

దేశాధికారానికి రాగానే నేవిన్ 'సోషలిజానికి బర్మా పథకం' పేరుతో మార్క్సిజం, బుద్ధిజం, జాతీయవాదం అన్నిటినీ కలగలిపి ఓ కొత్త విధానాన్ని సృష్టించాడు. దేశంలో వాక్స్వాతంత్రం, ప్రయాణ స్వాతంత్ర్యం రద్దయినాయి. బర్మాలో కోట్లాది పెట్టుబడులు పెట్టిన భారతీయులనూ, చైనీయులనూ దేశం నుండి వెళ్ళగొట్టారు. అలా వెళ్ళిపోతున్న వారికి ఏ నష్టపరిహారమూ ఇవ్వలేదు. దేశం స్వశక్తిమీదే పైకి రావలెకాని విదేశీయులపైన, విదేశీ సహాయంపైన ఆధారపడకూడదనే భావంతో ఆయన దేశాన్ని క్రమంగా ఒంటరితనంలోకి నడిపించాడు. దాని ఫలితమే–ఒకప్పుడు ఆగ్నేయాసియా మొత్తంలోను సంపన్న దేశమని పేరుగాంచిన బర్మా ఇప్పుడు అతి బీద దేశంగా అట్టడుగు స్థానంలో ఉంది. దేశ జనాభా దాదాపు నాలుగు కోట్ల మందిలో అత్యధికులు దారిద్ర్య రేఖకు దిగువననే ఉన్నారు. ఒకప్పుడు దేశానికి ఎంతో వెలలేని విదేశీ నిల్వలను తెచ్చి పెట్టిన బియ్యం ఎగుమతులు ఇపుడు అసలు లేనేలేవు. సరికదా, దేశంలోని ప్రజల ఆకలినే తీర్చలేక పోతున్నాయి. దేశంలో నూనె, ఇతర ఖనిజాలు ఎన్ని ఉన్నా అవేవీ దేశాన్ని బీదరికంలోంచి గట్టున పడెయ్యలేక పోయాయి. దీనాదానా విదేశీ రుణం 2400 కోట్ల డాలర్లకు పెరిగిపోయింది.

**నెవిన్ పతనం :**

బర్మాలో ఇరవై ఆరేళ్ళ పాటు ఏకచ్ఛత్రాదిపత్యం సాగించిన జనరల్ నేవిన్ ప్రజాభిప్రాయం తనకు వ్యతిరేకంగా పరిణమించగానే 1988లో స్వచ్ఛం

దంగా రాజకీయాలనుంచి తప్పుకుంటూ, దేశంలోని ఏకైక రాజకీయ పార్టీ 'బర్మీస్ సోషలిస్టు ప్రోగాం పార్టీ' అధ్యక్ష పదవికి రాజీనామా చేశారు. ఈ రాజీనామాతో బర్మా చరిత్రలో ఒక యుగం ముగింపునకు వచ్చింది. రాజకీయ ఆశ్రయం కోసం నేవిన్ చేసుకున్న విజ్ఞప్తిని బ్రిటిష్, ఫ్రాన్స్, స్విట్జర్లాండ్ దేశాలు తోసిపుచ్చాయి. చివరకు ఆయన దేశం వదలి పారిపోయే దుస్థితి ఏర్పడింది.

**అనంతర పరిణామాలు :**

1962 లో తిరుగుబాటు జరిపి నేవిన్ అధికారంలోకి వచ్చిన తరువాత మొట్టమొదటి పౌర ప్రభుత్వనేతగా 1988 అక్టోబరు 19న మౌంగ్‌మౌంగ్‌ను ఎన్నిక చేశారు. ఆయన బహుళ పార్టీలు పాల్గొనే విధంగా దేశంలో ఎన్నికలు జరిపించ వలసిందిగా అధికార సోషలిస్టు పార్టీకి ఒక ప్రతిపాదన చేశారు. అయితే ఈ ప్రతిపాదనను వ్యతిరేకిస్తూ అల్లరులు జరిగాయి. అల్లరులతో అట్టుడికి పోతున్న బర్మాలో 1988 సెప్టెంబర్ 18 న సైనిక దళాలు తిరుగుబాటు జరిపి అధికారాన్ని హస్తగతం చేసుకున్నాయి. దేశంలో శాంతి భద్రతలను పరిరక్షించి ప్రజాస్వామిక పద్ధతిలో ఎన్నికలు నిర్వహిస్తామని సైనిక నాయకులు ప్రతిజ్ఞ చేశారు. అయితే సైనిక తిరుగుబాటుపై ప్రజా తిరుగుబాటు జరిగింది. ఈ తిరుగుబాటులో అనేక వందల మంది చనిపోయారు. సైనిక తిరుగుబాటువల్ల అధ్యక్షుడు మౌంగ్‌మౌంగ్ పదవీచ్యుతు డయినప్పటికి ప్రస్తుత సైనిక పాలకుడు కూడా మౌంగ్‌మౌంగ్ మాదిరిగానే మాజీ పాలకుడు జనరల్ నేవిన్‌కు విధేయుడు. బర్మా సైనిక నేత సామౌంగ్ బర్మా ప్రధానిగా ఎన్నికయ్యాడు. సాధారణ ఎన్నికల తరువాత పదవినుంచి దిగిపోవడానికి సైనికనేత సామౌంగ్ సంసిద్ధత వ్యక్తం చేశాడు. సైనిక ప్రభుత్వం ఒకవైపు పని చేస్తుండగానే మాజీ ప్రధాని ప్రతిపక్ష శాంతి ప్రజాస్వామ్య కూటమి నేత ఉనూ ఒక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసినట్లు ప్రకటించాడు. ఆయన వయస్సు 82 ఏళ్ళు.

పాతికేళ్ళ నేవిన్ అధికారంలో బర్మా అతి బీద దేశంగా తయారైంది. మన పొరుగు దేశమైన బర్మాలో ప్రజాస్వామ్యం మృగ్యం కావడం స్వాతంత్ర్య ప్రియులకు బాధాకరమే.

**అంతర్యుద్ధాలు :**

స్వాతంత్ర్య ప్రతిపత్తి పొందినప్పటి నుంచి బర్మా ప్రభుత్వాలు అనేక బాధలు అనుభవించాయి. స్వాతంత్ర్యప్రాప్తికి తొలి బలిగా స్వాతంత్ర్య సంపాదకు

డయిన ఆంగ్ సాంగ్‌ను అతని సహచర మంత్రులను కోల్పోవలసి వచ్చింది. ఆంగ్‌సాగ్‌ను, అతని అనుచర మంత్రులను అల్లరిమూకలు చంపివేశాయి. ఆ దుఃఖాన్ని మింగుతూ థాచన్‌నూ బర్మా పరిపాలనాధికారాన్ని స్వీకరించాడు. అప్పుడు బర్మాలో అంతర్యుద్ధం కొనసాగుతుంది.

ఆ సమయంలో కరేన్‌లు ప్రత్యేక రాష్ట్ర వాంఛతో ప్రభుత్వంపై కత్తి కట్టారు. అశాంతి వాతావరణ పరిస్థితులలో అధికారం హస్తగతం చేసుకోవడానికి ప్రయత్నించే కొన్ని కమ్యూనిస్టు ప్రాబల్యం గల ముఠాలకు యీ అవకాశం బాగా వినియోగ పడింది. తెల్లపట్టి దళాలవారు కూడా కరేన్‌లతో చేతులు కలిపి ప్రభుత్వంపై ధ్వజమెత్తారు. కరేన్‌లను తృప్తి పరచి దేశంలో శాంతి భద్రతలను కాపాడటానికి థాకిన్‌నూ జరిపిన కృషి ఫలించలేదు. ప్రత్యేక రాష్ట్రాన్ని కోరుతున్న కరేన్‌లు మిగతా ముఠాల ఆసరా చూచుకొని బిర్రబిగిసి కూర్చున్నారు. కనుక ప్రభుత్వం కరేన్‌లతోను, తెల్లపట్టీ దళాలతోను నిర్విరామంగా యుద్ధం చేయవలసి వచ్చింది.

అప్పుడు అరకాన్ ప్రాంతంలోని ముస్లింలు కూడా విప్లవ పతాకం ఎగురవేయడానికి సిద్ధంగా ఉన్నారు. అరకాన్ ముస్లింలకు బర్మా ప్రజలతో సంబంధం లేదనీ, పద్దెనిమిదవ శతాబ్ది చివరి భాగంలో బర్మావాసుల చేతిలో ఓడిపోయే వరకు అరకాన్ రాజులు స్వతంత్రులుగా ఉండేవారని పిమ్మట యాభై ఏళ్ళకు అరకాన్‌ను, దిగువబర్మాను జయించిన బ్రిటిష్‌వారు వారికి బర్మా ప్రజలతో కృతిమ సంబంధాన్ని ఏర్పరచారని వీరి వాదం. కాబట్టి వారు అరకాన్‌లో తమ పరిపాలన ఉండి తీరాలని పట్టుబట్టారు. తూర్పు పాకిస్తాన్ (బంగ్లాదేశ్) లో కలిసిపోయే హక్కు కూడా తమకు ఉందని వారు వాదించడం మొదలు పెట్టారు. వీరితో రాజీ పడటానికి బలహీనమైన బర్మా ప్రభుత్వం శాంతి సంఘాలద్వారా సమస్యను పరిష్కరించుకోవాలని చూసింది.

ఈ విధంగా ఏ పుణ్యదినాన బర్మాకు స్వాతంత్ర్యం లభించిందోకాని అప్పటి నుంచి ఆ దేశంలో హత్యలు, కమ్యూనిస్టులు, వారి అనుబంధ ముఠాల ఘర్షణలు, కరెన్‌ల విప్లవం, అరకాన్ ముస్లింల తిరుగుబాటు ఒకదాని వెంట ఒకటి బర్మాను వెన్నాడుతూ వచ్చాయి. చైనాలో సరిహద్దు సమస్య అప్పటికి ఒక కొలిక్కిరాలేదు. బర్మా ఆర్థిక పరిస్థితి ఈ చిక్కులవల్ల బాగా దిగజారి పోయింది.

ఇతర దేశాల సహాయం లేనిదే దేశంలోని సంక్షోభాన్ని ఎదుర్కోవడం అసాధ్యమని బర్మా ప్రధాని థాకిన్‌నూ కామన్‌వెల్తు రాజ్యాల సహాయం కోరాడు. కామన్‌వెల్తు ప్రధానుల సమావేశానికి ముందే థాకిన్‌నూ భారత-పాకిస్తాన్ ప్రధాన మంత్రులతో సంప్రదింపులు జరిపాడు. ఈ సంప్రదింపుల దృష్ట్యా లండన్‌లో భారత, సింహళ, బ్రిటిష్ ప్రధానుల మధ్య సంభాషణలు జరిగాయి. ఈ దశలో అవి బర్మాకు సహాయం చేయడానికి అంగీకరించాయి.

నైతిక సహాయమే :

ముఖ్యంగా బర్మాకు అతి సన్నిహితంగా ఉన్నది భారతదేశమే. ఇలా ఉండటానికి చారిత్రక, భౌగోళిక కారణాలతోపాటు ఆర్థిక రాజకీయ కారణాలు కూడా ఉన్నాయి.

బర్మా ప్రజలు బౌద్ధ మతస్థులు. బుద్ధుని జన్మస్థలం భారతదేశంలోనే ఉంది. అనేకమంది భారతీయులు ఉద్యోగరీత్యా బర్మాలో స్థిరపడిపోయారు. ఆ నాటికి బర్మాలో ఎనిమిది లక్షల మంది భారతీయులున్నారు. భారతీయుల క్షేమం దృష్ట్యానైనా ఇండియా బర్మాతో శాంతిని కోరుతుంది. బర్మాలో జోక్యం చేసుకోవడం తప్పనిసరి అని బ్రిటిష్ ప్రధాని అప్పుడు గట్టి పట్టుదలతో ఉండేవారు. కానీ, నెహ్రూ ఆయన అభిప్రాయాలకు ముక్కుతాడు తగిలించేవారు.

'బర్మాలో నివసిస్తున్న ఎనిమిది లక్షల మంది భారతీయుల విషయం మనం గమనించాలి. బర్మా శాంతి భద్రతలు మనకు వాంఛనీయం. థాకిన్‌నూ ప్రభుత్వమే శాంతి భద్రతలను చేకూర్చగలదని నా విశ్వాసం. బర్మా వ్యవహారాలలో సైనికంగా చిక్కుకోవడం మన అభీష్టం కాదు. బర్మాలో జోక్యం చేసుకోకుండా కేవలం మిత్ర రాజ్యానికి చేయగల సహాయమే చేస్తాం' అని నెహ్రూ నిర్ద్వంద్వముగా ప్రకటించి బ్రిటిష్ ప్రధాని ఆశలను పటాపంచలు చేశాడు.

ఏది ఏమైనా ఆనాడు ప్రధాని నెహ్రూ బర్మా అంతరంగ వ్యవహారాలలో జోక్యం చేసుకొనలేదు. సైనికపరమైన చిక్కులలో పడకుండా, బర్మా అంతరంగిక వ్యవహారాలలో తల దూర్చకుండా ఆపదలో ఉన్న మిత్ర దేశానికి నెహ్రూ అందజేసిన సహాయం మనం గుర్తుకు తెచ్చుకోవాలి. ఇది పొరుగు దేశాలతో శాంతిని కోరుతున్నప్పుడు సైనిక జోక్యం అవసరం లేదని, నైతిక సహాయంతో ఆ పని నెరవేర్చవచ్చునని నెహ్రూ ఆనాడు చూపిన దారి మనకు శిరోధార్యం కావాలి.

# శాంతికి దూరంగా బంగ్లాదేశ్

ఆకలి, అనారోగ్యం, తుఫాను బాధలు, రాజకీయ అస్థిరత్వం మొదలైన అరిష్టాలతో 1971 లో పుట్టింది బంగ్లాదేశ్. దాదాపు ఇరవై ఏళ్ళ ప్రాయానికి వచ్చినా ఈ బాలారిష్టాలను ఆ దేశం వీడలేకపోతున్నది. ఆ దేశ చరిత్రను పరిశీలిస్తే ఎన్నో హత్యలు, విప్లవాలు, కుట్రలు ఒకదాని వెనుక ఒకటి కనిపిస్తాయి.

**అలజడులే ఆ దేశ చరిత్ర :**

అవిభక్త పాకిస్తాన్ పార్లమెంటు ఎన్నికలు 1970 డిశంబరులో జరిగాయి. ఆ ఎన్నికలలో తూర్పు పాకిస్తాన్ నాయకుడైన షేక్ ముజిబుర్ రహమాన్ నాయకత్వంలోని అవామీలీగ్‌కు ఎక్కువ స్థానాలు లభించాయి. అందువల్ల అప్పుడు పాకిస్తాన్ నాయకత్వం చట్టరీత్యా ముజిబుర్ రహమాన్‌కే దక్కాలి. కానీ, తూర్పు పాకిస్తాన్‌కు చెందిన నాయకుడు ఇస్లామాబాద్ గద్దె ఎక్కడం పశ్చిమ పాకిస్తాన్ నాయకులకు సహించరాని విషయమైంది. ఫలితంగా అవామీలీగ్ పార్టీ మీద, తూర్పు పాకిస్తాన్ ప్రజల మీద పాకిస్తాన్ అధ్యక్షుడు జనరల్ యహ్యాఖాన్ ఎన్నో అత్యాచారాలు జరిపించాడు. దీనితో పాకిస్తాన్‌తో విడిపోతేనే తప్ప తమకు ముక్తిలేదని భావించిన బంగ్లా ప్రజలు 'ముక్తి వాహిని' పేరుతో గెరిల్లా పోరాటం ప్రారంభించారు. ఆ పోరాటంలో లక్షలమంది నిర్వాసితులై మన దేశంలోకి శరణార్థులుగా వచ్చారు. వారిని భరించడం మన దేశానికి నానాటికి దుర్భరమైపోయింది. చివరకు అది సైనిక జోక్యానికి దారి తీసింది. 1971 డిశంబర్ 17న తూర్పు పాకిస్తాన్, పాకిస్తాన్ నుంచి విడవడి 'బంగ్లాదేశ్' పేరిట కొత్త స్వతంత్ర రాజ్యంగా ఆవిర్భవించింది. జైలునుంచి విడుదలైన ముజిబుర్ రహమాన్ దేశ నాయకత్వం చేబట్టారు.

**అశాంతి పర్వం :**

ముజిబుర్ రహమాన్ అధికారంలో బంగ్లాదేశ్‌లో ఆశ్రిత పక్షపాతం, అవినీతి మొదలైన దుర్లక్షణాలు స్వైర విహారం చేశాయి. 1975 ఆగష్టులో ముజీబ్‌ను అతని కుటుంబ సభ్యులను కొందరు సైనికులు హతమార్చడంతో బంగ్లాదేశ్‌లో అశాంతి పర్వం మొదలయినది. ముజీబ్ మంత్రి వర్గంలో విదేశాంగ శాఖను నిర్వహిస్తున్న ముక్త్యార్ అహమ్మద్ ఖోండ్‌గారి నాయకత్వంలో కొత్త ప్రభుత్వం ఏర్పడింది. 1975 డిశంబరులో అధ్యక్షుడు ముక్తార్ అహమ్మద్‌ను బ్రిగేడియర్ ఖలీద్ ముషర్రఫ్ పడగొట్టినా, నాలుగు రోజులు తిరగకుండానే ముషర్రఫ్‌ను చంపివేశారు. 1977 ఏప్రిల్‌లో జియాఉల్ రహమాన్ దేశ నాయకత్వం చేబడితే, నాలుగేళ్ళకు ఆయనను హత్య చేశారు. 1982 మార్చిలో జనరల్ ఎర్షాద్, అప్పటి దేశాధ్యక్షుడు అబ్దుస్‌సత్తార్‌ని పడగొట్టి అధికారం తన సొంతం చేసుకున్నాడు.

**ఎర్షాద్ ఎత్తులు :**

ఎర్షాద్ సైనిక నాయకుడు. అతని 'జాతీయ పార్టీ' నామమాత్రం. కనుక దేశాన్ని సైనికపాలన నుంచి తప్పించుకోవాలన్న ఉద్యమం 1986 లోనే ఆరంభమైంది. కానీ, దేశంలోని ప్రతిపక్షాల మధ్య విభేదాలను వినియోగించుకొని ఎర్షాద్ 1986 మేలో పార్లమెంటు ఎన్నికలు జరిపారు. ఈ ఎన్నికలలో అవామీ లీగ్ లోని పదిహేను రాజకీయ పక్షాల కూటమి పోటీ చేసింది. కానీ, ఎన్నికల ఫలితాలు రాగానే 'ఎన్నికలలో ఎర్షాద్ పార్టీ వారు ఎన్నో అక్రమాలకు పాల్పడ్డా రంటూ ఆరోపణలు చేసింది. ఈ ఎన్నికలను బహిష్కరించిన బంగ్లాదేశ్ నేషనల్ పార్టీ, అసలు ఎర్షాద్ పాలకుడుగా ఉన్నంతవరకు ఎన్నికలు న్యాయబద్ధంగా జరుగవని ప్రకటించింది. దీనితో ఇంతవరకూ తూర్పు, పడమరలుగా ఉంటున్న అవామీలీగ్, సోషలిస్టు పార్టీలు ఇప్పుడు ఏకమై ఎర్షాద్ ఉద్వాసనే తమ లక్ష్యమని ఆందోళనకు దిగాయి. ఎర్షాద్‌పై ఉద్యమాస్త్రాలు సంధిస్తున్న ఇరు పార్టీల నాయకులు స్త్రీలే కావడం మరొక విశేషం. అవామీలీగ్ నాయకురాలు షేక్ హసీనా–ముజీబ్ కూతురు. రెండో ప్రధాన ప్రతిపక్ష కూటమి అయిన బంగ్లాదేశ్ నేషనలిస్టు పార్టీ నాయకురాలు బేగమ్ ఖలీదా జియా–జియాఉల్ రహమాన్ భార్య.

**రాజకీయ వేషంలో ఎర్షాద్ :**

1987 నవంబరులో ప్రతిపక్ష నాయకురాళ్ళయిన బేగమ్ కలీదాజియా, షేక్ హసీనాల నేతృత్వంలో జరిగిన ప్రభుత్వ వ్యతిరేక ఉద్యమం ఎర్షాద్

గద్దెను ఒక ఊపు ఊపి చివరకు ఎర్షాద్ ఎమర్జెన్సీ విధించే స్థాయికి వెళ్ళింది. నవంబరు 27న దేశంలో ఎమర్జెన్సీ విధించారు. ప్రభుత్వం దేశభద్రతకు ముప్పు వాటిల్లిందని చెప్పి తనకుతాను అపారమైన అధికారాలను సంక్రమింప జేసుకుంది. క్రిందటి స్థానిక సంస్థల ఎన్నికల సందర్భంగా ఘర్షణలు హింసాత్మక రూపం దాల్చి 160 మంది ప్రాణాలను బలిగొన్నాయి. ప్రధాన ప్రతిపక్షాలు రానున్న ఎన్నికలను బహిష్కరించడమే కాకుండా అసలు జరుగకుండా నిరోధించే అవకాశాలు ఉన్నందున ప్రభుత్వం అపూర్వ స్థాయిలో కట్టుదిట్టమైన భద్రతా ఏర్పాట్లు చేసింది. ప్రతిపక్షాలు 1988 మార్చి 2 మొదలుకొని ఏకధాటిగా 36 గంటలపాటు దేశవ్యాప్తంగా బంద్ పిలుపు నిచ్చాయి. ఈ బంద్ పిలుపు ఎన్నికలు జరిగే రోజు సాయంత్రం వరకు వర్తించడం గమనార్హం. అధికారాన్ని అంటిపెట్టుకొని ఉండేందుకు ప్రభుత్వం నిర్వహిస్తున్న ఈ బూటకపు ఎన్నికల యత్నాన్ని వమ్ము చేయవలసిందిగా ప్రతిపక్షాలు ప్రజలకు విజ్ఞప్తి చేశాయి.

అయితే ఎర్షాద్ సంగతి వేరు. ఎవరు పాల్గొన్నా పాల్గొనక పోయినా ఎన్నికలు యథాప్రకారం జరిపించారు. ఈ ఎన్నికలను అనుకున్న ప్రకారం ప్రతిపక్షాలు బహిష్కరించాయి. 1988 మార్చిలో బంగ్లాదేశ్‌లో జరిగిన నాల్గవ పార్లమెంటు ఎన్నికలలో బంగ్లా అధ్యక్షుడు జనరల్ ఎర్షాద్ నాయకత్వంలోని జాతీయ పార్టీకి మూడింట రెండు వంతుల మెజారిటీ లభించింది. మళ్ళీ ఎర్షాద్ దేశాధ్యక్షుడయ్యాడు.

మతం బూచి :

బంగ్లాదేశ్ అధ్యక్షుడు జనరల్ హుసేన్ మహమ్మద్ ఎర్షాద్ కోరికపై ఆ దేశ ప్రధాని 'ఇస్లాం బంగ్లా ప్రభుత్వ మతం' అనే బిల్లును పార్లమెంటులో ఆమోదింపజేశాడు. దేశంలో అంతరంగిక కల్లోలాలు రేగినప్పుడల్లా ఇస్లామిక్ దేశాలకు మతం జ్ఞాపకం వస్తుంది. ఆ పనే బంగ్లాదేశ్‌లో జనరల్ ఎర్షాద్ ఇపుడు చేశాడు.

దేశంలో రాజకీయ అల్లకల్లోలాన్ని అణచటానికి తగిన చర్యలు తీసుకోలేని ఎర్షాద్, ఈ విధంగా మతం ముసుగులో రక్షణ పొందడం ఆ దేశంలోని ప్రతిపక్ష పార్టీల నాయకులే కాదు, మేధావులు, వకీళ్ళు మొదలయిన వారు వ్యతిరేకత ప్రకటించారు. పార్లమెంటులో వ్యతిరేకతే లేనప్పుడు ఈ బిల్లు నెగ్గకపోవడ

మనే సమస్యే లేదు. దీన్ని కేవలం జనరల్ ఎర్షాద్ తన అధికారాన్ని సుస్థిరత పరచుకోడానికి చేసిన ఎత్తుగడగా ప్రజలు భావించారు.

ముజిబ్ హత్యానంతరం అధికారంలోకి వచ్చిన తన భర్త జియా ఉల్ రహమాన్ కాలంలోనే బంగ్లాదేశ్ రాజ్యాంగానికి ఇస్లామిక్ దుస్తులు ధరించడం జరిగిందని, ప్రస్తుతం ప్రత్యేకంగా కొత్త చర్యలేమీ అవసరం లేదని బేగమ్ జియా ఉల్‌హక్, ఎర్షాద్ ప్రయత్నాన్ని తీవ్రంగా ఖండించింది. అధికార మత చట్టానికి వ్యతిరేకంగా ప్రతిపక్ష పార్టీలు దేశవ్యాప్తంగా నిరసన ప్రదర్శనలు నిర్వహించాయి. ఈ ప్రదర్శనల సందర్భంగా అనేక ఘర్షణలుకూడా జరిగాయి. బంగ్లాదేశ్‌ని ఇస్లామిక్ దేశంగా మార్చితే దానికి అరబ్ దేశాలనుంచి ఆర్థిక సహాయం లభించవచ్చుననే జనరల్ ఎర్షాద్ ఈ పని చేసినట్లు విమర్శకుల అభిప్రాయం.

## సైన్యానిదే పైచేయి :

ఎవరు అధికారంలోకి వచ్చినా బంగ్లాదేశ్‌లో సైన్యానిదే పైచేయి. సైన్యంలో జనరల్ ఎర్షాద్ పట్ల గౌరవాభిమానాలు ఉన్నందుకే ఆయన 1982 నుంచి అధికారంలో ఉంటున్నాడు. సైన్యాన్ని తన గుప్పెట్లో ఉంచుకొనటానికి ఆయన ఎన్నో తంటాలుకూడా పడవలసివచ్చింది. ఉన్నతాధికారులకు ప్రమోషన్ల అవకాశాలు ఎక్కువ చేశాడు. వారి వ్యాపారాలకు ఎన్నో రాయితీలు కల్పించాడు. వారిలో కొందరికి రాజకీయ పదవులు అంటగట్టాడు. అయితేనేం? బంగ్లాదేశ్‌లో ఎర్షాద్‌కు వ్యతిరేకంగా అల్లరులు జరుగని రోజు లేదు. దీనివల్ల దేశం ఎంతో నష్టపోయింది. ఆందోళనకారులు రైలు పట్టాలు తొలగించారు. ఎన్నో రైల్వే స్టేషన్లు అగ్నికి ఆహుతి అయిపోయాయి. బ్యాంకులు, ఆహార గిడ్డంగులు లూటీల పాలయ్యాయి. ప్రభుత్వ భవనాలు, వాహనాలు నాశనమైపోయాయి. వ్యాపారం పూర్తిగా స్తంభించిపోయింది. 1987 ఎన్నికలకు ముందు ఎర్షాద్ పాలనకు వ్యతిరేకంగా ప్రతిపక్షాల ఉద్యమం ఉధృతమైన రోజులలో రోజుకు కనీసం 50 కోట్ల రూపాయల నష్టం జరిగింది. ఇప్పుడు బంగ్లా ఆర్థికంగా ఎంతో చితికిపోయిన దేశం. సైనిక పాలనలో ఇలాంటి దుస్థితి ఏ దేశానికైనా తప్పదు. గత 20 సంవత్సరాల కాలంలో 17 సంవత్సరాలు బంగ్లాదేశ్‌లో సైనిక పరిపాలనలోనే

గడిచింది. ఇలాంటి పరిస్థితులలో సైనిక అండతో జనరల్ ఎర్షాద్ పరిపాలన కొనసాగుతున్నది. ఇది ఎంతకాలం కొనసాగుతుందో కాలమే నిర్ణయించాలి.

భారత సాయం కోరుతున్న బంగ్లా ప్రజ :

పొరుగు దేశాలలో బంగ్లాదేశ్‌తో ఉన్నంతటి గాఢ స్నేహ సంబంధాలు నేడు భారతదేశానికి ఇంకే దేశంతోను లేవు. ఇస్లాంను ప్రభుత్వ మతంగా పాటించినప్పటికీ, బంగ్లాదేశ్‌లో ముస్లిం మతతత్వం హెచ్చలేదు. హిందూ వ్యతిరేక భావాలు ప్రబలలేదు. దాదాపు కోటిమంది హిందువులు బంగ్లాదేశ్‌లో నివసిస్తున్నారు.

భారతదేశానికి బంగ్లాదేశ్‌కు మధ్య మూడు ముఖ్య సమస్య లున్నాయి. అన్నిటికన్న క్లిష్ట సమస్య జలాల పంపిణీకి సంబంధించినది. పాకిస్తాన్ అంతర్భాగంగా బంగ్లాదేశ్ ఉన్నప్పుడే ఈ సమస్య ఉత్పన్నమైంది. కరువు కాటకాలు, వరదలు ఏవి సంభవించినా వాటికి మూలకారణం ఫరాకా బ్యారేజి అని గోరంతలు కొండంతలు చేస్తున్నారు. తమ వైఫల్యాలు ఏవీ బయటపడకుండా బంగ్లాదేశ్ ప్రభుత్వాలు ప్రయత్నిస్తున్నాయి. అసలు సమస్య ఎనిమిది నుంచి పది వారాలకే పరిమిత మవుతుంది. ఫిబ్రవరి మధ్యభాగం నుంచి ఏప్రిల్ వరకు ఈ రోజుల్లో గంగానది నుంచి (గంగానది మీదనే బ్యారేజి నిర్మించారు) బంగ్లాదేశ్ చేరే జలాలు సరిపోవు. సంవత్సరంలోని మిగతా రోజులలో జలాలు అపారంగా ప్రవహిస్తాయి. 1977లో ఒక ఒప్పందం కుదిరింది. ఈ ఒప్పందం ప్రకారం జనవరి 1 నుంచి మే నెల 31 వరకు ప్రవహించే 55వేల క్యూసెక్కుల జలాలను 67:33 నిష్పత్తి ప్రాతిపదికను విభజిస్తారు. ఈ విభజనతో బంగ్లాదేశ్‌కు 34,500 క్యూసెక్కులు, భారతదేశానికి 20,500 క్యూసెక్కులు లభిస్తాయి. 1977 నుంచి జలాలు దాదాపు ఈ పరిణామంలోనే ప్రవహిస్తున్నాయి. ఈ ఒప్పందం శాశ్వతపరచాలని బంగ్లాదేశ్ అభిమతం.

మూడు సమస్యలు :

బంగ్లాదేశ్-భారత దేశాలమధ్య ఉన్న జటిల సమస్య నీటి సరఫరా విషయంలోనే. ఇది దీర్ఘకాలిక సమస్య. బ్రహ్మపుత్ర నదిమీద స్టోరేజి రిజర్వాయర్లను నిర్మించడం ఒక పరిష్కార మార్గమని బంగ్లా నిపుణుల అభిప్రాయం. బెరూబారీకి బదులుగా తీన్‌బిగాను బంగ్లాదేశ్‌కు బదిలీ చేయడం రెండవ సమస్య. బెరూబారీ

ఇదివరకే మనకు లభించింది. భారత ప్రభుత్వం తీన్‌బిగాను బదిలీ చేయటానికి సిద్ధంగా ఉంటే దాన్ని సుప్రీంకోర్టులో సవాల్ చేశారు. ఇది సత్వర పరిష్కారం కావాలి. బౌద్ధులయిన చక్మాలు భారతదేశానికి వలస రావడం మూడవ సమస్య. ఇక్కడికి వచ్చిన దాదాపు 40 వేలమంది చక్మాలను తిరిగి తమ దేశంలోనికి తీసుకుని, వారిని ఏ భూములనుంచి నెట్టివేశారో ఆ భూములలోనే వారికి పునరావాసం కల్పించటానికి ఎర్షాద్ ప్రభుత్వం అంగీకరించింది. కానీ, భారత భూభాగంనుంచి వెళ్ళిపోవడానికి చక్మాలు ఇష్టపడడం లేదు.

బంగ్లాదేశ్‌లో జనరల్ ఎర్షాద్‌కు వ్యతిరేకంగా సంక్షోభాగ్ని పర్వతాలు కుత కుతలాడుతున్నా, రెండు ప్రధాన ప్రతిపక్షాలు ఎర్షాద్‌తో ఢీకొనడానికి బదులు తమలో తామే కలహించుకుంటున్నాయి. దీనితో ఎర్షాద్ పరిపాలనకు తక్షణ ఢోకా ఏమీ ఉండదని విమర్శకుల అభిప్రాయం. అయితేనేం? బంగ్లాదేశ్‌లో పేదరికం, నిరక్షరాస్యత నానాటికి పెరిగిపోతున్నాయి. మధ్యతరగతివారు మరింత బలహీనులై, ధనవంతులు మరింత శ్రీమంతులవుతున్నారు. ప్రజలలో ఎక్కడ చూసినా నిస్పృహ వ్యాపించి ఉంది. ఏదయినా తిరుగుబాటు మాత్రమే తమ దేశంలో మార్పు తీసుకురాగలుగుతుందని అక్కడి మేధావులు అభిప్రాయపడుతున్నారు. ప్రస్తుత భారత ప్రభుత్వం బంగ్లాదేశ్ అంతరంగిక వ్యవహారాలలో తలదూర్చకపోవచ్చు. అదే సముచిత నిర్ణయం కూడా. అయితే తమ దేశంలో పరిశ్రమల స్థాపన విషయంలో బంగ్లా ప్రజలు భారతదేశం సహాయం కోరుతున్నారు. 'మాకు విముక్తి కలిగించారు. మా కాళ్ళమీద మేం నుంచోడానికి సహాయం ఎందుకు చేయరు?' అని ఆ దేశ మేధావులు ప్రశ్నిస్తున్నారు. భారతదేశం వంటి పెద్ద దేశం బంగ్లాదేశ్ నిర్మాణంలో తోడ్పడగలుగుతుందని సామాన్యులు అనుకుంటారు. కానీ భారతదేశ పరిమితులు వారికి తెలియవు. బంగ్లాదేశ్‌కు ఆర్థిక సహాయం అందజేసే ఒప్పందాలపై సంతకం చేస్తే ఎర్షాద్ సైనిక ప్రభుత్వం సుస్థిరం కావడానికి ఈ ఒప్పందాలు పరోక్షంగా దోహదపడతాయి. ఇది పాకిస్తాన్‌కుకూడా ఇష్టం లేదు. భారత ప్రభుత్వం ఈవిధంగా ఒప్పందాలు చేసుకుంటే ఒక సైనిక ప్రభుత్వానికి గౌరవం ఇచ్చినట్లవుతుందని పాక్ మేధావులు భావిస్తున్నారు. బంగ్లా రాజకీయాలలో భారతదేశం తలదూర్చకపోయినా వారి డిమాండ్లలలో కొన్నిటినయినా ఏవిధంగా పూర్తిచేయడం అన్నది జనతాదళ్ ప్రభుత్వ సమస్య. బంగ్లా ప్రజలు భారతదేశంపై కొండంత ఆశలు పెట్టుకున్నారు.

# భారత - జపాన్ సంబంధాలు

జపాన్‌తో మన దేశానికున్న సంబంధాలు ప్రాచీనమైనవి. క్రీ.శ. ఆరో శతాబ్ది కాలంలోనే ఇరు దేశాలమధ్య సంబంధాలు నెలకొన్న దృష్టాంతాలుఉన్నాయి. అసలు బౌద్ధమతం కొరియా మీదుగా జపాన్ చేరిన నాటి నుంచే మన దేశంపై జపాన్ ప్రజలకు అభిమానం ఏర్పడింది. అప్పటినుంచి పరోక్షంగానైనాసరే మన చరిత్ర, సంస్కృతి జపాన్‌మీద ప్రభావం చూపించాయి. 1968 నుంచి 1912 వరకు గల మెయిజీ కాలంతో రెండు దేశాలు ప్రత్యక్ష సంబంధాల అవగాహన కుదుర్చుకున్నాయి. రెండో ప్రపంచ యుద్ధ కాలం నుంచి మన దేశంమీద జపాన్‌కు ప్రత్యేకాభిమానం ఏర్పడింది. రాస్‌బిహారీ బోస్, సుభాష్‌చంద్ర బోస్ లాంటి మేటి నాయకులు భారత స్వాతంత్ర్య సమరానికి జపాన్‌ను కార్యస్థానంగా ఎంచుకున్న సంగతి మన చరిత్రలో ఉజ్జ్వల ఘట్టమైనది.

యుద్ధానంతరం యుద్ధ నేరస్థుల విచారణకు అంతర్జాతీయ సైనిక విచారణా సంస్థ సిద్ధపడినప్పుడు మన దేశానికి చెందిన న్యాయమూర్తి రాధావినోద్‌పాల్ జపానీయుల తరఫున వాదించి వారి మన్ననలకు పాత్రుడయ్యాడు. 1949 లో జపాన్ ఇంకా రెండవ ప్రపంచ యుద్ధ గాయాలనుంచి తేరుకోని సమయంలో భారత ప్రధాని నెహ్రూ జపాన్ రాజధాని టోకియోలోని జూకు ఒక ఏనుగును బహూకరించారు. ఈ చిరుకానుక రెండు దేశాలమధ్య స్నేహానికి ప్రతీకగా పెంపొందింది. రెండవ ప్రపంచ యుద్ధానికి కారణమైన దేశంగా ప్రపంచ దృష్టిలో జపాన్ గౌరవం దెబ్బతిన్న సమయంలో నెహ్రూ ఆ దేశానికి తమ స్నేహ హస్తం అందించి ఆ దేశ ప్రజలకు ఎంతో ఆదరణీయుడయ్యాడు. రెండు దేశాల మధ్య దౌత్యసంబంధాలు 1952 లో ఏర్పడ్డాయి.

**పరస్పర సహకారం :**

భారత-జపాన్‌ల మధ్య ఆర్థిక సహకారం పరస్పరాభివృద్ధి చెందుతున్నది. మన దేశం నుంచి జపాన్‌కు ముడి ఇనుము ఎక్కువ ఎగుమతి అయ్యేది. కానీ

సరిఅయిన రేవు సౌకర్యాలులేక ఎగుమతులు దెబ్బతిన్నాయి. అటు ఆస్ట్రేలియ
బ్రెజిల్, ఆఫ్రికా దేశాల నుంచి జపాన్‌కు ముడి ఇనుము లభించడంవల్ల కూ
మన ఎగుమతులు తగ్గాయి. ఈ ఇబ్బందులను తొలగించడానికి మన దేశం రే
లను అభివృద్ధి పరచి, ఆధునీకరించడం మొదలుపెట్టింది. గత ముప్పయి సం
త్సరాల కాలంలో జపాన్ అందజేసిన ఆర్థిక, సాంకేతిక సహాయాలతో మన
ములో పలు కర్మాగారాలు నెలగొన్నాయి. ట్యూటికోరిన్, కోటా, భటిండా, పా
పత్‌లలో ఎరువుల కర్మాగారాలు, విశాఖపట్నంలోని ఔటర్ హార్బర్, కొచ్చి
షిప్‌యార్డు, నాగార్జున సాగర్, జయక్వాది హైడల్ ప్రాజెక్టులు, బైలదిల్లా మ
ఇనుము గనుల అభివృద్ధి ఇలా పథకాలు జపాన్ దేశ సహకారంతో రూపుదిద్దు
గలిగాయి. ఇవి గాక మరెన్నో ప్రాజెక్టులు రెండు దేశాల సన్నిహిత సంబం
లకు నిదర్శనాలుగా నిలుస్తున్నాయి. కానీ, ఉభయ దేశాలమధ్య ఆర్థిక బం
ఉండవలసినంత పటిష్టంగా లేదని చెప్పాలి. 1984 లో జపాన్ ప్రధాని నకసొ
మన దేశాన్ని, 1985 లో భారత ప్రధాని రాజీవ్‌గాంధీ జపాన్‌ను సందర్శిం
డంతో ఇరు దేశాల మధ్య మైత్రీపర్వం కొత్తచిగురులు సంతరించుకున్న
రవాణా, టెలికమ్యూనికేషన్స్, పెట్రోకెమికల్స్, ఎలక్ట్రానిక్స్, ఉక్కు
బొగ్గు, విద్యుత్పాదన వంటి రంగాలవైపు జపాన్ నిపుణులు ఆసక్తి చూ
తున్నారు. దాదాపు వంద జపాన్ కంపెనీలు మన దేశంలో వ్యాపారం చే
న్నాయి. ఇరవై కంపెనీల ప్రతినిధులు భారతదేశంలో వుంటూ పని చేస్తున్నా
అయితే వీరిలో ఎక్కువ మంది మన దేశంలోని నిబంధనలు, ఆంక్షలు, చెప్ప
నన్ని ఆ సాలెగూళ్ళను తొలగించుకొని బయట పడడం జపాన్ వారికి అసా
ముగా ఉన్నది. మనవారికి టైం అంటే లక్ష్యం లేకపోవడం కూడా జపాన్‌వా
బాధాకరంగా ఉన్నది. ఒక ఒప్పందం మీద సంతకం పెట్టిన రోజే ఆ పథ
ప్రారంభమయ్యే తేదీ నిర్ణయం జరిగినా అది అమలు జరిగేసరికి కొంత జాప
జరుగుతున్నది. ఇది జపాన్‌వారికి ఇబ్బందులను కలగజేస్తున్నది.

## కనబరుస్తున్న ఉత్సాహం :

బలహీనతలు ఎలా ఉన్నా భారతదేశంతో సంబంధాల అభివృద్ధికి జపా
ఉత్సాహం దీనికి కొన్ని కారణాలున్నాయి. జపాన్ దిగుమతుల రంగంలో వ
దేశం 0.8 శాతంతో ఇరవైఆరో స్థానంలో ఉంది. అదే మన దేశంలో అయి
9.2 శాతం ఎగుమతులతో జపాన్ మూడవ స్థానంలో ఉంటుంది. వాణిజ్య ర

మన్రో ఈ అసమానతలు తొలగించాలని మన దేశం చాలా కాలంగా పట్టుబడుతోంది. ఆ కోరికను ఇంతకాలంగా పట్టించుకోక పోయినా ఇపుడు అంతర్జాతీయంగా జపాన్ పెట్టుబడి, ఉత్పత్తుల దాడిపై ఏర్పడిన వ్యతిరేకతల కారణంగా జపాన్ తప్పనిసరిగా మన దేశంపై దృష్టి మరలుస్తోంది. 'గతంలో మేం ఆగ్నేయాసియా దేశాలపై దృష్టి కేంద్రీకరించాం ఇపుడు భారత దేశం మా దృష్టిని ఆకర్షిస్తోంద'ని జపాన్ అంతర్జాతీయ వాణిజ్య వ్యవహారాల మంత్రి స్వయంగా ఒప్పుకున్నాడు. పెట్టుబడులు పెట్టగల వ్యాపార సుక్షేత్రం కోసం జపాన్ అన్వేషిస్తోంది. ఎగుమతులను పెంచుకోడానికి మన దేశం ప్రయత్నిస్తోంది. రెండు సరిగ్గా కుదిరాయి. గతంలో ముడి పదార్థాలు, ప్రాథమిక ఉత్పత్తుల ఎగుమతితో సరిపెట్టుకున్న దేశం ఇప్పుడు ఇంజనీరింగ్, రసాయనిక ఉత్పత్తులు, నగలు, రెడీమేడ్ వస్త్రాలు, కాటను దుస్తులు, గృహాలంకరణ వస్తువులు, తోట ఉత్పత్తి వంటి వాటిని ఎగుమతి చేస్తున్నది. దీనికి ప్రతిగా కాకపోయినా జపాను గత ఒకటి రెండేళ్ళలో మొత్తం 104 సంయుక్త ప్రాజెక్టులలో పెట్టుబడులు పెట్టడానికి రుణాలు ఇచ్చేందుకు సిద్ధమైంది. అస్సాంలో గ్యాస్ టర్బైన్ ఏర్పాటు చేసేందుకు జపాను 160 కోట్ల రూపాయల సహాయం ప్రకటించింది. ఏటా 390 కోట్ల యన్‌ల ఆర్థిక సహాయం చేయడానికి జపాను ఇటీవల అంగీకరించింది.

నలభై సంవత్సరాల క్రితం రెండవ ప్రపంచ యుద్ధంలో జపాను ఓడిపోయింది. అయితే ఈ దేశం ఆర్థికంగా మహాకాయుడిగా పెరిగింది. అంతర్జాతీయ రంగంలో మరుగుజ్జుగా ఉండిపోయింది.

జపాను విదేశాంగ విధానానికి కీలకం అమెరికాతో అది ఏర్పరచుకున్న పొత్తు. అమెరికా జపానుకు అణుశక్తి కలిగిస్తుంది. అలా రక్షణ ఖర్చు తప్పడముతో జపాను తన ధనాన్ని ఆర్థిక పునర్నిర్మాణానికి ఉపయోగించ కలిగింది.

అమెరికా, జపాను వాణిజ్యం తీవ్రరూపం ధరిస్తోంది. జపానులో విక్రయించబడే అమెరికా సరుకులకన్నా, అమెరికాలో అమ్మే జపాను సరుకులు హెచ్చుగా ఉన్నాయి. జపాను-రష్యాల మధ్య సత్సంబంధాలు లేవు. మన ప్రధానులలో నెహ్రూ, ఇందిరాగాంధీ, రాజీవ్ గాంధీ జపాన్‌ను పర్యటించి ఆ దేశంతో మన దేశ సంబంధాల వృద్ధికి కృషి చేశారు.

[ -o- ]

# బెంగాల్‌లో సుస్థిర ప్రభుత్వం

డాక్టర్ బిధాన్ చంద్రరాయ్ మరణంతోనే పశ్చిమ బెంగాల్ రాష్ట్రంలో కాంగ్రెస్‌కు చెడ్డ రోజులు ప్రారంభమైనాయి. దాదాపు ఒక దశాబ్దం తరువాత శ్రీ సిద్ధార్థ శంకర్ రే ఆ పార్టీకి కొంత జీవం పోసినా అది మునుపటి స్థానాన్ని తిరిగి పొందలేకపోయింది.

## స్పీకరు వినూత్న చర్య :

1967 ఎన్నికలలో కమ్యూనిస్టు పార్టీ మొదటిసారి పోటీచేసి రాష్ట్ర అసెంబ్లీలోని 280 స్థానాలలో 43 స్థానాలను గెలుచుకుంది. ఈ ఎన్నికల అనంతరం బంగ్లా కాంగ్రెస్ అధినేత శ్రీ అజయ్ ముఖర్జీ నాయకత్వంలో 14 పార్టీల ఐక్యఫ్రంటు ప్రభుత్వం ఏర్పడింది. ఈ ఫ్రంటుకు 151మంది మార్క్సిస్టేతర సభ్యుల బలం ఉండేది. అయితే వీరి సహకారం ఎక్కువ కాలం కొనసాగలేదు. ఫ్రంటులోని 17మంది సభ్యులుగల ఒక చిన్న ముఠాకు నాయకత్వం వహించిన పి. సి. ఘోష్, మంత్రివర్గంపై తిరుగుబాటు చేసి అజయ్ ముఖర్జీ ప్రభుత్వాన్ని మైనారిటీలో పడవేశాడు. అప్పుడు 1967 నవంబర్ 21న పి. సి. ఘోష్ మంత్రివర్గం ఏర్పడింది. మార్క్సిస్టు పార్టీ నాయకుడైన జ్యోతిబసు ఉప ముఖ్యమంత్రి అయ్యారు. తన ప్రభుత్వం విశ్వాసం పొందటానికి అసెంబ్లీని సమావేశపరచమని స్పీకరుని పి. సి. ఘోష్ కోరితే స్పీకరు అందుకు సిద్ధపడక దేశంలోనే ఒక వినూత్న రాజ్యాంగ సంక్షోభాన్ని సృష్టించాడు. స్పీకరు-ముఖ్యమంత్రి మధ్య విభేదాలు వీధి పోరాటాలకు దారి తీశాయి. ఈ ఉద్యమంలో ఎంతోమంది ప్రజలు తమ ప్రాణాలు పోగొట్టుకున్నారు. 1968 ఫిబ్రవరి 20న రాష్ట్రంలో రాష్ట్రపతి పాలన విధించడంతో ఈ వివాదం ముగిసింది.

**భావస్వామ్యం లేని ప్రభుత్వాలు :**

1969 ఎన్నికల అనంతరం మార్క్సిస్టుపార్టీతో సహా 14 కాంగ్రెసేతర పార్టీల సహకారంతో అజయ్‌ముఖర్జీ రాష్ట్రంలో రెండవసారి మంత్రివర్గం ఏర్పాటు చేశారు. జ్యోతిబసు ఉప ముఖ్యమంత్రి అయ్యాడు. అధికారం చేబట్టగానే పూర్తిగా అవకాశం లభించినా దాన్ని చాపక్రింది నీరుమాదిరి విస్తరింపజేయటం కమ్యూనిస్టు పార్టీ సిద్ధాంతం. తన పార్టీ బలాన్ని పెంపొందించటానికి మంత్రి పదవిని బాగా ఉపయోగించుకున్నాడని జ్యోతిబసుపై విమర్శలు వచ్చాయి. దీనితో ప్రజల దృష్టిలో ముఖ్యమంత్రి చులకనైపోయాడు. ముఖ్యమంత్రి, ఉప ముఖ్యమంత్రి అధికార కుమ్ములాటల మధ్య ప్రభుత్వ యంత్రాంగం పూర్తిగా స్తంభించిపోయింది. అరాచక శక్తులు స్వైర విహారం చేశాయి. 1969లో రాష్ట్రంలో 95 హత్యలు జరిగితే 1970లో వీటి సంఖ్య 220 వరకు పెరిగింది. సి.పి.ఎం.తో కలిసి కాపురం చేయడం తనవల్ల సాధ్యంకాదని చెప్పి అధికారం చేపట్టిన 15 నెలలకే అంటే 1970 మార్చిలో అజయ్ ముఖర్జీ తన ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేశారు. అప్పుడు గవర్నర్ 80 మంది శాసనసభ్యులకు నాయకత్వం వహిస్తున్న జ్యోతిబసును మంత్రివర్గం ఏర్పాటు చేయవలసిందని కోరారు. కానీ భావస్వామ్యంలేని పార్టీలతో బాంధవ్యం నెరపజాలనని జ్యోతిబసు నిరాకరించడంతో రాష్ట్రంలో 1970 మార్చి 19న రాష్ట్రపతిపాలన విధించారు.

**తిరిగి రాష్ట్రపతి పాలన :**

1970లో శాసనసభకు ఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికలలో సి.పి.ఎం.కు 111 స్థానాలు, కాంగ్రెస్‌కు 105 స్థానాలు లభించాయి. బంగ్లా కాంగ్రెస్ నాయకుడు అజయ్ ముఖర్జీ నాయకత్వంలో కాంగ్రెస్ సహకారంతో మిశ్రమ ప్రభుత్వం ఏర్పడింది. కేంద్రంలో విద్యాశాఖ మంత్రిగా ఉన్న సిద్ధార్థ శంకర్‌రేని పోర్టుఫోలియో లేని మంత్రిగా చేసి ఆయనకు బెంగాల్ రాష్ట్ర వ్యవహారాలను శ్రీమతి ఇందిరాగాంధీ అప్పగించారు. ఢిల్లీనుంచి రే ఆదేశాలు జారీచేస్తూ ఉంటే వాటిని ముఖ్యమంత్రి పాటించవలసి వచ్చింది. ఈ పద్ధతి ప్రజాస్వామ్య విరుద్ధమైనదని పార్లమెంటులో ప్రొఫెసర్ హిరేన్ ముఖర్జీ దీన్ని తీవ్రంగా దుయ్యబట్టారు. రాష్ట్రంలో హింసా సంఘటనలు పెచ్చరిల్లిపోయాయి. ముఖ్యమంత్రి సిఫారసుపై 1971 జూన్ 21వ తేదీన రాష్ట్రంలో తిరిగి రాష్ట్రపతి పాలన విధించారు.

మార్క్సిస్టులకు శృంగభంగం :

1972 మార్చి 10వ తేదీన లోక్‌సభకు జరిగిన మధ్యంతర ఎన్నికలతోపాటు రాష్ట్ర శాసనసభకు కూడా ఎన్నికలు జరిగాయి. ఈ ఎన్నికలలో మార్క్సిస్టులకు 14 స్థానాలు లభించగా కాంగ్రెసుకు 216 స్థానాలు లభించాయి. ఒక్క పశ్చిమ బెంగాల్‌లోనే కాదు, దేశవ్యాప్తంగా ఈ సారి మార్క్సిస్టులకు ఈ గతే పట్టింది. వివిధ రాష్ట్రాల అసెంబ్లీ ఎన్నికలలో ఆ పార్టీ గెలుచుకున్న స్థానాల సంఖ్య 105 మాత్రమే. మార్క్సిస్టు పార్టీ జరిపే హింసాచర్యలకు ఈ ఎన్నికలు చక్కని గుణ పాఠం నేర్పాయి. నిరంతరం రాష్ట్ర బంద్‌లు, ఫ్యాక్టరీల బంద్‌లు, నగర బంద్‌లు జరిపి మార్క్సిస్టు పార్టీ వారు ప్రజలలో ఎంతో భయాందోళనలు కలిగింప జేశారు. కార్మిక లోకంలో అశాంతివల్ల ఫ్యాక్టరీ ఉత్పత్తులు బాగా దెబ్బతిన్నాయి. పశ్చిమ బెంగాల్ నుంచి ఎన్నో పరిశ్రమలు ఇతర రాష్ట్రాలకు తరలిపోయాయి. ఈ విధమైన అస్థిరతా రాజకీయాలవల్ల ప్రజల ఆర్థిక పరిస్థితి దయనీయంగా మారిపోయింది.

రే చతురత :

1972 ఎన్నికల అనంతరం ముఖ్యమంత్రి పదవి చేబట్టిన సిద్ధార్థ శంకర రేకు నెహ్రూ కుటుంబానికి ఆప్తుడనే పేరు ఉంది. ఆయన రాష్ట్ర ముఖ్యమంత్రి గా అధికారం స్వీకరించిన తొలి రోజునే కాంగ్రెసులోని వేరువేరు ముఠాలమధ్య వైరుధ్యాలను ప్రేరేపించి తన బలాన్ని పెంచుకున్నాడు. ఎమర్జెన్సీ కాలంలో తనను తొలగించే ప్రమాదం నుంచి సిద్ధార్థ శంకర్ రే బయటపడి సంజయ్‌గాంధీ ఎత్తులను విజయవంతంగా ఎదుర్కొన్నాడు. ఈ విధంగా ఢిల్లీని ధిక్కరించే బలం తనకున్నదని నిరూపించుకున్నాడు.

అధికారంలో జ్యోతిబసు :

1977లో జరిగిన లోక్‌సభ ఎన్నికలలో పశ్చిమ బెంగాల్ నుంచి కాంగ్రెస్ పార్టీకి మూడు స్థానాలే లభించాయి. జనతా పార్టీ అధికారంలోకి రాగానే తొమ్మిది రాష్ట్రాలలో అసెంబ్లీలను రద్దుపరచి ఎన్నికలు జరిపించిన వాటిలో పశ్చిమ బెంగాల్ ఒకటి. 294 స్థానాలు గల పశ్చిమ బెంగాల్ రాష్ట్ర అసెంబ్లీలో మార్క్సిస్టు పార్టీ దాన్ని బలపరచే వామపక్ష ఫ్రంటుకు ఈ ఎన్నికలలో 225

స్థానాలు లభించాయి. గత ఎన్నికలలో 35 స్థానాలు గెలిచిన సి. పి. ఐ. ఈసారి రెండు స్థానాలతోనే తృప్తిపడవలసి వచ్చింది. జనతాపార్టీకి 29, కాంగ్రెస్‌కు 20, ఇతర పార్టీలు_ఇండిపెండెంట్లకు వెరసి 63 స్థానాలు లభించాయి. సి. పి. ఎం. ఒక్కటే 213 స్థానాలను గెలిచింది. ఈ ఎన్నికలలో మార్క్సిస్టు పార్టీ నాయకుడు జ్యోతిబసు కాంగ్రెసు అభ్యర్థిని 38,443 ఓట్ల మెజారిటీతో ఓడించి గెలుపొందిన అభ్యర్థు లందరిలోను ఎక్కువ సీట్లు సంపాదించి రికార్డు నెలకొల్పారు. ఈ ఎన్నికలలో ముస్లిం ప్రజల ఎక్కువ ఓట్లు మార్క్సిస్టు పార్టీకే పడ్డాయి. ఎన్నికల అనంతరం జ్యోతిబసు ముఖ్యమంత్రి అయి 1982 ఎన్నికల తరువాత కూడా ఆ పదవికి తిరిగి ఎన్నికైనారు.

అయితే 1984 లో జరిగిన లోక్‌సభ ఎన్నికలలో ఇతర ప్రతిపక్షాలకు పట్టిన ఓటమి ఈ రాష్ట్రంలో మార్క్సిస్టు పార్టీకి పట్టింది. కాంగ్రెసు పార్టీ 16 లోక్‌సభ స్థానాలలో గెలిచింది. 1980 లోక్‌సభ ఎన్నికలలో కాంగ్రెసు పార్టీ కేవలం నాలుగు చోట్ల గెలిచింది. అందువల్ల 1984 ఎన్నికలలో పశ్చిమ బెంగాల్‌లో కూడా కాంగ్రెసు ప్రభంజనం బాగా వీచిందనే చెప్పవచ్చు. సమర్ ముఖర్జీ వంటి మార్క్సిస్టుపార్టీ నాయకులు ఎందరో ఈ ప్రభంజనంలో కొట్టుకుపోవడం వల్ల కాంగ్రెస్ పార్టీ వామపక్ష ప్రంటు నుంచి పదెండు సీట్లను కైవసం చేసుకో గలిగింది. వామపక్ష ప్రంటుకు 20 సీట్లు లభించాయి.

1984 లో శ్రీ రాజీవ్‌గాంధీ అఖండ మెజారిటీతో గెలుపొందిన తరువాత బెంగాల్‌లో కాంగ్రెసు పార్టీకి మంచి రోజులు వస్తాయని ఆశ కనిపించింది. కానీ 1987 మార్చిలో జరిగిన అసెంబ్లీ ఎన్నికలలో వామపక్ష సంఘటనకు మరల 251 స్థానాలు లభించడంతో ఈ ఆశ పటాపంచలై పోయింది. అందులో సి. పి. ఎం. కు వచ్చినవే 187 స్థానాలు. కాంగ్రెసు (ఐ) 40 స్థానాలతో తృప్తి పడవలసి వచ్చింది. జ్యోతిబసు జనాకర్షణశక్తి ముందర రాజీవ్‌గాంధీ వాగ్దాన పరంపరలు పని చేయలేక పోయాయి. ఈ ఎన్నికల అనంతరం జ్యోతిబసు తిరిగి మూడవసారి రాష్ట్ర ముఖ్యమంత్రి అయినారు.

### ప్రజాభిమానమే ఆయనకు బలం :

రాజకీయాలలో జ్యోతిబసు లాంటి వ్యక్తులు అరుదని మాజీ రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి అన్నారు. ఆయన మచ్చలేని రాజకీయవేత్త. గొప్ప పరిపాలనా

దక్షుడు. బసు కేవలం మార్క్సిస్టు పార్టీ నాయకుడే కాదని, పశ్చిమబెంగాల్ నాయకుడని తాను రాష్ట్రపతిగా ఉన్నప్పుడు శ్రీమతి ఇందిరాగాంధీతో అనేవాడినని శ్రీ నీలం సంజీవరెడ్డి పేర్కొన్నారు.

తెల్లని ధోతి, తెల్లని కుర్తా ధరించే జ్యోతిబసు పల్లెటూరి ఉపాధ్యాయుడిలా కనిపిస్తారు. తన బట్టలను తానే ఉతుక్కుంటాడు. స్వయంగా ఇస్త్రీ చేసుకుంటారు. భారతదేశంలో స్వంత ఇల్లు లేని ముఖ్యమంత్రి ఎవరైన ఉన్నారా అంటే అందుకు జ్యోతిబాబునే పేర్కొనాలి. జ్యోతిబసు లండన్‌లో బారిష్టరు చదువు తున్నప్పుడు మార్క్స్ ప్రభావానికి లోనయ్యారు. ఆయన తండ్రి కలకత్తాలో సంపన్నుడైన డాక్టరు. తన కొడుకు ప్రాక్టీసు పెంచుకొని బాగా వృద్ధిలోనికి రావాలని ఆ తండ్రి ఎన్నో కలలు కన్నాడు. తమ తండ్రిగారి అభీష్టానికి విరుద్ధంగా జ్యోతిబసు 'కమ్యూన్' జీవితం ప్రారంభించారు. దానితో ఆయన తండ్రిగారికి ఆయనపై ఎంతో ఆగ్రహం కలిగింది. తన కొడుకు జ్యోతిబసుకు చెందవలసిన ఆస్తిని తన కోడలు శ్రీమతి కమలాబాసు పేర వ్రాసేశాడు. ఇప్పుడు పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రిగారు నివసిస్తున్నది తమ అర్ధాంగి గృహంలో. శ్రీమతి కమలబసు తప్ప పశ్చిమబెంగాల్ ముఖ్యమంత్రుల భార్యలందరూ తమ భర్తలకు రాజకీయాలలో చేదోడు వాదోడుగా ఉన్నవారే.

తమ పదేళ్ళ పాలనలో శ్రీ జ్యోతిబసు ప్రజాభ్యుదయమైన పనులెన్నో చేశారు. ముఖ్యంగా ఘర్షణ పంథానుంచి మార్క్సిస్టుపార్టీని దూరంగా ఉంచటంలో ఆయన రాజకీయ సత్తా బయటపడింది. ఆపరేషన్ బార్గా అనే పేరుతో ప్రవేశపెట్టిన భూసంస్కరణలు పేద ప్రజలకు ఎంతో మేలు చేకూర్చిపెట్టాయి. ఈ చట్టం వల్ల లభించిన 7.51 లక్షల ఎకరాల భూమిని నిరుపేదలకు పంచి ఇచ్చారు. ఈ లాభం పొందిన ప్రతి ఐదుగురు వ్యక్తులలో ఒకరు హరిజన వర్గాలకు, రెండో వ్యక్తి నిమ్న జాతులకు చెందినవారు. జ్యోతిబసు సహాయంతో దాదాపు లక్ష ఇళ్లు కొత్తగా నిర్మించి పేదలకు పంచారు.

ప్రభుత్వాదాయంలోని దాదాపు 30 శాతం ధనాన్ని జ్యోతిబసు ప్రభుత్వం విద్యారంగానికే కేటాయించింది. 1979 నుంచి రాష్ట్రంలో 1000 సెకండరీ పాఠశాలలు, 6000 ప్రాథమిక పాఠశాలలు కొత్తగా ఏర్పడ్డాయి. 1977లో రాష్ట్రంలో అన్నిరకాల వైద్యశాలలు 2358 వుంటే 1981లో వాటి సంఖ్య 2837కి పెరిగింది.

రాష్ట్రంలో ప్రశాంత పరిస్థితులేర్పడటంవల్ల పారిశ్రామిక రంగం బాగా వర్ధిల్లింది.

జ్యోతిబసు గతంలో నిప్పులు కురిపించిన తీవ్రవాది. కానీ, ఇప్పుడు ఆయన ఒక ఇంటి పెద్దగా వ్యవహరిస్తున్నారు. తత్ఫలితంగా ఆయన ఓట్లు సంపాదించ గలుగుతున్నారు. ఆయన ఇప్పుడు విప్లవవాది కాడు. ప్రస్తుతం ఆయన సామాజిక ప్రజాతంత్రవాది. డార్జిలింగ్‌లో గొడవలు ఉన్నప్పటికీ ఇతర రాష్ట్రాలతో పోల్చితే పశ్చిమబెంగాల్‌లో శాంతిభద్రతల పరిస్థితి మెరుగ్గా ఉంది. మతతత్వ వాదులతో రాష్ట్ర ప్రభుత్వం కఠినంగా వ్యవహరిస్తున్నది. అందువల్ల మత కల హాలు కొన్ని గంటల సమయంలోనే అదుపులోకి వస్తున్నాయి. జ్యోతిబసు బి. సి. రాయ్‌వలె స్వతంత్రంగా కేంద్రానికి లొంగక వ్యవహరించగల దిట్ట. ఆయన వయస్సు 73 సంవత్సరాలు.

బెంగాల్ ప్రజలకు తమ నాయకులపై అభిమానం ఎక్కువ. మహాత్మా గాంధీ కన్న దేశబంధు చిత్తరంజన్‌దాస్ వారి దృష్టిలో గొప్పవారు. నెహ్రూ కన్న సుభాష్ చంద్రబోస్ మిన్న. శ్రీమతి ఇందిరాగాంధీ కన్న జ్యోతిబసు ఎక్కువ పరిపాలనాదక్షుడని వారి అభిప్రాయం. అవకాశం లభిస్తే తమ నాయకుడు దేశాన్ని సైతం పరిపాలించగల అర్హత కలవాడని వారి విశ్వాసం. అందుకు శ్రీ జ్యోతిబసు అన్నివిధాలా సమర్థుడేనని ఆయన చరిత్ర చెబుతున్నది.



# కన్నడ ప్రభుత్వాల కథా కమామిషు

1989 ఏప్రిల్‌లో కర్నాటకలో బొమ్మయ్ ప్రభుత్వాన్ని బర్తరప్ చేసి, ఆ రాష్ట్ర గవర్నరు ప్రజాస్వామ్యానికి గట్టి వాతలు తగిలించారు. తన వెంట ఉన్న శాసన సభ్యుల బలాబలాలను అప్పటికప్పుడే రాజ్‌భవన్‌లో గాని, వారం రోజుల వ్యవధిలో శాసన సభలోకాని నిరూపించడానికి ముఖ్యమంత్రి సంసిద్ధత ప్రకటిస్తే అందుకు గవర్నర్ నిరాకరించారు. తనకు తానే బొమ్మయ్ మెజారిటీ కోల్పోయినట్లు గవర్నర్ సంతృప్తి చెందారు. ఆయన ప్రభుత్వాన్ని క్షణాలపై బర్తరఫ్ చేసి, దాని స్థానంలో రాష్ట్రపతి పాలనకు సిఫారసు చేశారు. అసెంబ్లీని సైతం రద్దు చేయించారు.

అసెంబ్లీలో మెజారిటీ సభ్యుల మద్దతు గల ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేయడమే తప్పు. మెజారటీలేదని తనకు అనుమానం కలిగితే ఆ విషయాన్ని అసెంబ్లీలో కాని, వెలుపల గాని నిర్ధారించుకోనకుండా గవర్నర్ ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేయడం మరింత తప్పు. రాజ్యాంగరీత్యా గవర్నరుకు కొన్ని విచక్షణాధికారాలు ఉన్నమాట నిజమే. కాని ఆయనకున్న విచక్షణాధికారాలు నిరంకుశాధికారాలు కావు. విచక్షణాధికారాలనే మాటకు అర్థం నిరంకుశాధికారాలే అయితే ఇక ఎన్నికలు, శాసనసభలు, రాజ్యాంగాలు దేనికి? ఎప్పుడు బుద్ధిపుడితే అప్పుడు గవర్నరు ఏ ప్రభుత్వానైనా అందలం ఎక్కించవచ్చు. కర్నాటక గవర్నరు తీసుకున్న ఈ చర్యపై దేశవ్యాప్తమైన నిరసనలు, విమర్శలు బయలు దేరాయి. గవర్నర్ు పదవి మరొకసారి నవ్వుల పాలయింది.

**పాటిల్ హయాంలో :**

1969 లో కాంగ్రెసు రెండుగా చీలినప్పుడు కర్నాటకలో సంస్థా కాంగ్రెస్ అధికారంలో ఉంది. అప్పుడుకూడా వీరేంద్రపాటిల్ ముఖ్యమంత్రిగా ఉండేవారు.

1971 లో లోక్‌సభకు జరిగిన ఎన్నికలలో కర్నాటకలోని అన్ని లోక్‌సభ స్థానాలను అధికార కాంగ్రెసు గెలుచుకుంది. దీనితో రాష్ట్రంలో శాసన సభ్యుల ఫిరాయింపుల పర్వం మొదలయింది. ఈ చర్యతో విసుగెత్తిపోయిన వీరేంద్రపాటిల్ తమ ప్రభుత్వ రాజీనామాను గవర్నరుకు సమర్పించారు. దీనిపై గవర్నరు అధికార కాంగ్రెసు ప్రభుత్వ ఏర్పాటుకు అవకాశమివ్వదలచినా ఆ పార్టీవారు ఉపయోగించుకోలేదు. అందువల్ల రాష్ట్రంలో 1971 మార్చి 21వ తేదీన మొదటిసారి రాష్ట్రపతి పాలన విధించారు. తిరిగి ఎన్నికలు జరిగేవరకు అంటే 1972 మార్చి 20 వరకు కర్నాటకలో రాష్ట్రపతి పాలన కొనసాగింది.

### నిజలింగప్ప :

1956 వరకు పాత మైసూరు రాష్ట్రానికి ముఖ్యమంత్రులుగా ఉన్నవారు కె. సి. రెడ్డి, హనుమంతయ్య తదితరులు ఒక్కలిగాలు. 1956 తరువాత ప్రస్తుత కర్నాటక రాష్ట్రానికి ముఖ్యమంత్రులైన శ్రీ బి.డి. జత్తి, నిజలింగప్ప, వీరేంద్రపాటిల్ లింగాయతులు, ఒక్కలిగాలకూ లింగాయత్‌లకూ వచ్చిన పోటాపోటీల మధ్య నిజలింగప్ప నలిగిపోయారు. బి. డి. జత్తి ఆయన మీద పెట్టిన అవిశ్వాస తీర్మానం నెగ్గడంతో ఆయన తన పదవికి రాజీనామా చేశారు. కానీ 1967 లో పోటీలేకుండా నెగ్గి తిరిగి ముఖ్యమంత్రి పదవి చేబట్టారు. తరువాత ఆయన అఖిల భారత కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడు కావడంతో వీరేంద్రపాటిల్ ముఖ్యమంత్రి అయ్యారు. ఈ రెండు ప్రధాన కులాల వారికే కాకుండా వెనుకబడిన కులాల వారికి కూడా రాజకీయ, ఆర్థిక రంగాలలో సముచిత ప్రాతినిథ్యం ఉండాలన్న ఉద్దేశంతో అప్పటికే చాలాకాలంగా మంత్రిగా ఉంటున్న దేవరాజ్ అర్స్ శ్రీమతి ఇందిరాగాంధీ పక్షంలో చేరిపోయాడు.

### అధికారంలో అర్స్ :

శ్రీమతి ఇందిరాగాంధీ వ్యూహం మేరకు 1972 అసెంబ్లీ ఎన్నికలలో నూటికి 60 సీట్లను వెనుకబడిన వర్గాలకు, హరిజనులకు, మహిళలకు కేటాయించారు. దీనివల్ల ముస్లింలకు 12 సీట్లు, స్త్రీలకు 11 సీట్లు, ఇతర వెనుకబడిన వర్గాలకు 31 సీట్లు లభించాయి. కులాధిక్యత రాజకీయాల నుంచి విసుగెత్తిపోయిన ప్రజలకు ఇది ఎంతో సంతృప్తి కలిగించింది.

216 సీట్లుగల శాసనసభలో అధికార కాంగ్రెస్‌కు 185 స్థానాలు లభించగా, గత ఎన్నికలలో 104 స్థానాలు పొందిన సంస్థా కాంగ్రెస్‌కు 25 స్థానాలే లభించాయి. శ్రీ అర్స్ మొదటిసారి ముఖ్యమంత్రి అయినారు. అధికారం స్వీకరించగానే శ్రీ అర్స్ హావనూర్ కమీషన్ నియమించారు. ఈ కమీషన్ సిఫారసుపై కర్నాటక ప్రభుత్వోద్యోగాలలో హరిజనులకు 15 శాతం, గిరిజనులకు 3 శాతం, వెనుకబడిన వర్గాలకు, అల్పసంఖ్యాక వర్గాలకు 40 శాతం వెరసి 58 శాతం రిజర్వేషన్లు అమలు పరిచారు. ఇది ఎంతో చాకచాక్యంతో తీసుకున్న నిర్ణయం. ఈ చాకచక్యం లోపించడంవల్లనే బీహార్‌లో కర్పూరీ ఠాకూర్, ఉత్తరప్రదేశ్‌లో రాంనరేశ్ యాదవ్ ప్రభుత్వాలు దెబ్బతిన్నాయి. భూ సంస్కరణలనుకూడా ఆయన నిజాయితీగా అమలుపరిచారు.

1978 శాసనసభ ఎన్నికలలో 224 స్థానాలలో కాంగ్రెస్ (ఐ) 156 స్థానాలను గెలుచుకుంది. శ్రీ దేవరాజ్ అర్స్ తిరిగి ముఖ్యమంత్రి అయినారు.

శ్రీమతి ఇందిరాగాంధీ నిరంకుశ విధానాలే కాంగ్రెస్ ఓటమికి ప్రధాన కారణమని గుర్తించినవారిలో అర్స్ ఒకరు. సంజయ్‌గాంధీ తిరిగి రాజకీయాలలో రావడాన్ని ఆయన తీవ్రంగా నిరసించారు. ఆయన చేసిన నేరం మరొకటుంది. ముఖ్యమంత్రిగా కొనసాగుతున్న అర్స్‌ను కర్నాటక ప్రదేశ్ కాంగ్రెస్ (ఐ) కమిటీ అధ్యక్ష పదవికి మరొకరిని నియమించడానికి వీలుగా ఆమె రాజీనామా చేయమంది. కాంగ్రెస్ సంప్రదాయం ప్రకారం పి. సి. సి. అధ్యక్ష పదవినుంచి వైదొలగడానికి అయనకు ఎటువంటి అభ్యంతరం లేదు. కానీ, కొత్త అధ్యక్షుణ్ణి పి. సి. సి. ఎన్నుకోవాలని ఆయన కోరారు. ఇది సరి అయిన ప్రజాస్వామ్య పద్ధతే అయినా, కొత్త అధ్యక్షుణ్ణి తానే నామినేట్ చేస్తానని ఆమె పట్టుపట్టారు. దీనితో ఆరేళ్ళపాటు అర్స్‌ని కాంగ్రెస్ పార్టీనుంచి బహిష్కరించారు. ఇది శ్రీమతి ఇందిరాగాంధీ నియంతృత్వ ధోరణికి పరాకాష్ట.

శ్రీమతి ఇందిరాగాంధీతో విభేదించి అర్స్ 1979లో కర్నాటక కాంగ్రెస్‌ను ఏర్పాటుచేశారు. దీనితో రాష్ట్రంలోని పి సి.సి. రద్దయినట్లే అయింది. ఎందుకంటే పి.సి.సి.లోని 265 మంది సభ్యులలో 190 మంది అర్స్ వర్గంలో చేరిపోయారు. కానీ, 1980లో జరిగిన లోక్‌సభ ఎన్నికలలో కాంగ్రెస్ (యు)కి ఒక్క సీటైన రాలేదు. ఈ ఓటమికి నైతికబాధ్యత వహిస్తూ అర్స్ ముఖ్యమంత్రి పదవికి రాజీ

నామా చేశారు. ప్రతిపక్ష నాయకుడైన గుండూరావును మంత్రివర్గం ఏర్పాటు చేయవలసిందని గవర్నరు ఆహ్వానించారు. 225మంది సభ్యులున్న కర్నాటక అసెంబ్లీలో కాంగ్రెస్ (ఐ) కి అప్పుడు ఉన్నవి 47 స్థానాలే. జనవరి 12వ తేదీన కాంగ్రెస్ (యు)కు చెందిన 70మంది సభ్యులు కాంగ్రెస్ (ఐ)కి తమ మద్దతు ప్రకటించారు. గుండూరావు ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేసినరోజున కాంగ్రెస్ (ఐ) సభ్యుల సంఖ్య 137కి. పెరిగింది. ఫిరాయింపుల బలంతో గుండూ రావు ప్రభుత్వం కొంతకాలం పనిచేసింది. గుండూరావుది వెన్నెముక లేని మంత్రివర్గం.

హెగ్డే సారథ్యం :

1983లో జరిగిన ఎన్నికలలో 224 సీట్లుగల కర్నాటక అసెంబ్లీలో జనతా-క్రాంతిరంగ 96, కమ్యూనిస్టు పార్టీ 3, మార్క్సిస్టు పార్టీ 3, బి.జె.పి. 18, ఇండిపెండెంట్లు 14 స్థానాలు గెలుచుకోగా, కాంగ్రెసుకు 80 స్థానాలే వచ్చాయి. గుండూరావు అవినీతి, నిరంకుశ పాలనపట్ల కర్నాటక ప్రజలు ఈ విధంగా పగ తీర్చుకున్నారు. శ్రీ రామకృష్ణ హెగ్డే నాయకత్వంలో మొదటిసారి రాష్ట్రంలో కాంగ్రెసేతర ప్రభుత్వం ఏర్పడింది.

1984లో జరిగిన లోక్‌సభ ఎన్నికలలో కర్నాటకలోని అన్ని స్థానాలను కాంగ్రెస్ (ఐ) గెలుచుకుంది. తన పార్టీ ఘోర పరాజయానికి బాధ్యత వహిస్తూ రామకృష్ణ హెగ్డే ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేశారు. అయితే అనంతరం జరిగిన అసెంబ్లీ మధ్యంతర ఎన్నికలలో జనతా పార్టీ ఘనవిజయం సాధించింది. ఇది శ్రీ హెగ్డే వ్యక్తిగత విజయమనే చెప్పాలి. రద్దయిన శాసనసభలో 90 స్థానాలు మాత్రమే గల జనతా స్వయంగా పూర్తి ఆధిక్యత సంపాదించడంతో క్రాంతిరంగ గతంలో ప్రచారం చేసుకున్నట్లు తన బలమే జనతా బలం అనే వాదనలో బలం లేకపోయింది. పార్టీల బలాబలాలు : జనతా 140, కాంగ్రెస్ 62, కాంగ్రెస్ (ఎస్) 2, బి.జె.పి 4, సి.పి.ఎం 2, డి.ఎం.ఆర్. పార్టీ 1, ఇతరులు 10 స్థానాలు. ఈసారి మాజీ ముఖ్యమంత్రి గుండూరావుకి టిక్కెటు లభించలేదు.

అయితే శ్రీ హెగ్డేలాంటి నాయకునికి సైతం కర్నాటక రాష్ట్రంలోని వర్గ రాజకీయాల బురద అంటక తప్పలేదు. కొన్ని గ్రూపుల ఒత్తిడులకు లొంగి

1987 ఏప్రిల్‌లో ఆయన అనేకమందిని తన మంత్రివర్గంలో తీసుకొనవలసి వచ్చింది. ప్రతి నలుగురు జనతాపార్టీ సభ్యులలో ఒకరు మంత్రిగా నియమితులైనారు. దీనితో మిగిలిన శాసనసభ్యులలో అధికార దాహం ప్రబలింది. గ్రూపు రాజకీయాలు విశృంఖలంగా పెరిగాయి. అవినీతి, ఆశ్రిత పక్షపాతం లాంటి దుర్గుణాలు కూడా పెరిగాయి. అయితే వాటిని అరికట్టడానికి హెగ్డే ఎప్పటికప్పుడు చర్యలు తీసుకోవడం వేరే విషయం.

ఐతే, జాతీయస్థాయిలో జనతాపార్టీ అనైక్యతకూడా రాష్ట్ర రాజకీయాలపై తన ప్రభావాన్ని చూపింది. రామకృష్ణ హెగ్డే, జనతా అధ్యక్షుడు చంద్రశేఖర్‌ల మధ్య చెలరేగిన వివాదంలో రాష్ట్ర నీటిపారుదల శాఖామంత్రి దేవగౌడ చంద్రశేఖర్‌వైపు మొగ్గారు. కర్నాటక జనతాపార్టీలో హెగ్డే ప్రత్యర్థి వర్గానికి దేవగౌడ నాయకత్వం వహించారు.

1988 జూన్‌లో స్థానిక సంస్థలనుంచి విధాన పరిషత్‌కు జరిగిన ఎన్నికలు రామకృష్ణ హెగ్డే, అసమ్మతివర్గం నాయకుడు దేవగౌడలకు ప్రతిష్ఠాత్మకంగా పరిణమించాయి. కర్నాటక జనతా రెండు వర్గాలమధ్య తీవ్రంగా పోటీ జరిగింది. పట్టభద్రులు, ఉపాధ్యాయ నియోజకవర్గాలనుంచి జరిగిన ఎన్నికలలో అధికార జనతా అభ్యర్థులంతా ఓడిపోవడం హెగ్డేకు గట్టి దెబ్బ.

**ఎనిమిది నెలలకే కూలిన బొమ్మయ్ :**

కర్నాటకలో రామకృష్ణ హెగ్డే అధికారం ఐదున్నర ఏళ్ళు కొనసాగింది. టెలిఫోన్ సంభాషణల బగ్గింగ్ ఆరోపణపై ముఖ్యమంత్రి పదవికి హెగ్డే 1988 ఆగష్టులో రాజీనామా చేశారు. హెగ్డే-దేవగౌడ వివాదం మధ్యన మధ్యవర్తిగా శ్రీ బొమ్మయ్ ముఖ్యమంత్రి అయ్యారు.

బొమ్మయ్‌కూడా కొన్ని పొరపాట్లు చేశారు. శ్రీ హెగ్డే సిఫారసు చేసిన నంజగౌడని మంత్రివర్గంలో తీసుకొనక ఆయనతో విరోధం తెచ్చిపెట్టుకున్నారు. తన ఎనిమిది మాసాల ప్రభుత్వంలో బొమ్మయ్ మూడుసార్లు తన మంత్రివర్గాన్ని విస్తరించినా అధికారపార్టీలో అసంతృప్తివాదుల సంఖ్య తగ్గలేదు. అలాంటి

వారికోసం కార్పొరేషన్ పదవులను సృష్టిస్తున్నట్లు చెప్పి ముఖ్యమంత్రి వారిని దువ్వుతూ వచ్చారు.

కర్ణాటక రాష్ట్ర 12వ ముఖ్యమంత్రిగా పనిచేసిన సోమప్ప రాయప్ప బొమ్మయ్ అధికారం రాష్ట్రపతి పాలనతో అంతమైంది.

1989 నవంబర్‌లో జరిగిన లోక్‌సభ ఎన్నికలలో కాంగ్రెస్ (ఐ) 27 స్థానాలు, జనతా ఫ్రంటు ఒకస్థానం గెలిచాయి. అసెంబ్లీకి జరిగిన ఎన్నికలలో కాంగ్రెస్ మూడింట రెండువంతుల మెజారిటీతో తిరిగి అధికారాన్ని హస్తగతం చేసుకుంది. అధికారం కోసం హోరాహోరీగా పోరాడిన కాంగ్రెసుకు 177 స్థానాలు లభించగా జనతాదల్‌కు 24 స్థానాలు లభించాయి. కాంగ్రెస్ (ఐ) తుఫాను నుండి బ్రతికి బయటపడ్డ అతి కొద్దిమంది ప్రముఖుల్లో జనతాదళ్ ఉపాధ్యక్షుడు రామకృష్ణ హెగ్డే ఒకరు. రాష్ట్రంలో తృతీయ శక్తినని ప్రగల్భాలు పలికిన జనతాపార్టీ ఒకే ఒక స్థానం (కోలార్) గెల్చుకొని వెల్లకిలా పడింది. బి. జె. పి. 4 స్థానాలను గెలిచింది. శ్రీ వీరేంద్రపాటిల్ రెండవసారి కాంగ్రెస్ ముఖ్యమంత్రి అయ్యారు.



# ద్రవిడపార్టీల రాజకీయాలు

1967 ఎన్నికలలో ద్రవిడ మున్నేట్ర కజగమ్ మద్రాసు రాష్ట్రం (తమిళ నాడు)లో ఇరవై ఏళ్లుగా సాగిన కాంగ్రెస్ పాలనను అంతమొందించింది. అన్నా దొరై ముఖ్యమంత్రి అయ్యారు.

కంజీవరం నటరాజన్ అన్నాదొరై జస్టిస్ పార్టీకి చెందిన వారే. పెరియర్ రామస్వామి నాయకర్ అనుచరుడుగా ఉంటూ కాలదోషం పట్టిన ఆయన సిద్ధాంతా లతో ఏకీభవించలేక 1949 లో జస్టిస్ పార్టీతో తెగతెంపులు చేసుకొని తన నాయ కత్వంలో ద్రవిడ మున్నేట్ర కజగమ్ పార్టీని స్థాపించారు. డెమోక్రసీ, సోష లిజమ్ సూత్రాలపై రూపుదిద్దుకున్న డి. ఎం. కె. కాంగ్రెసుకు ప్రత్యామ్నాయంగా దక్షిణాది అంతటా త్వరలోనే విస్తరిస్తుందని ఆయన ఆశించారు.

డి. ఎం. కె. పుట్టీ పుట్టగానే అధికారంకోసం ఆరాటపడలేదు. తన పార్టీ యంత్రాంగాన్ని పటిష్ట పరచుకోడానికి ఆ పార్టీకి ఏడు సంవత్సరాలు పట్టింది. 1956 లో తిరుచురాపల్లిలో జరిగిన పార్టీ సమావేశంలో ఎన్నికలలో ఈ పార్టీ పోటీ చేయడానికి నిర్ణయించారు. 1957 లో జరిగిన అసెంబ్లీ ఎన్నికలలో ఈ పార్టీ 15 సీట్లను గెలుచుకుంది. 1959 లో డి. ఎం. కె. మద్రాసు కార్పొరేషన్ వశపరచుకొని కాంగ్రెసుకు ప్రత్యామ్నాయ శక్తిగా రూపొందింది. 1962 శాసన సభ ఎన్నికలలో ఈ పార్టీ 50 సీట్లను గెలుచుకుంది. కానీ, అన్నా ఓడిపోయారు. ఆయన రాజ్యసభ సీటు సంపాదించుకో గలిగారు.

అన్నాదొరై జస్టిస్‌పార్టీలో ఉన్నప్పుడు రాజాజీ ప్రభుత్వం ఆయనను అనేకసార్లు అరెస్టు చేసింది. తన బద్ధవ్యతిరేకి అయిన రాజాజీ కాంగ్రెసు పార్టీని విడిచిపెట్టి స్వతంత్ర పార్టీ స్థాపించగానే రాష్ట్రంలో కాంగ్రెసును కూలద్రోయ డానికి అన్నాదొరై స్వతంత్ర పార్టీతో చేతులు కలపడానికి వెనుకాడలేదు.

**అన్నా చతురత :**

అన్నాదొరై రాజకీయ చతురుడు. కాంగ్రెసును దుయ్యబట్టడమే ఆయన తన కర్తవ్యంగా భావించుకొనలేదు. ఆయన అధికారం స్వీకరించిన వెంటనే ఆయన మంత్రివర్గ సభ్యులు రాజాజీముందు నిలబడి తలలు వంచి ఆశీర్వదించ మని అడిగితే రాజాజీ 'శుభం' అని దీవించాడు. పూర్వపు ముఖ్యమంత్రులైన కామరాజ్, భక్తవత్సలంలను ఆయన మర్యాదపూర్వకంగా కలుసుకున్నారు. డిప్యూటీ స్పీకరు పదవిని కాంగ్రెస్‌కు ఇవ్వజూపితే వారే దాన్ని తిరస్కరించారు.

డి. ఎం. కె. పెద్దలందరు సినిమా రంగం పెద్దలే. అధికారంలోకి రాక ముందు అన్నాదొరైకు పత్రికా రచయితగా గొప్ప పేరుండేది. ఆయన నవ యుగం, కుడియరసు విడుదలై-పత్రికలకు సంపాదకత్వం వహించారు. తర్వాత నాటక రచయితగా ప్రసిద్ధుడైనారు. ఒరుగురువు, కాదల్ జ్యోతి, చంద్రమోహన్, చంద్రోదయం, నీతిదేవన్, మయక్కం మొదలైన నాటకాలలో నటించారు. ఆయన రావణబ్రహ్మ, జమీందార్, దొంగసన్యాసి పాత్రలలో బాగా రాణించారు. అనేక తమిళ చిత్రాలకు అన్నా కథలు వ్రాశారు. ముఖ్యమంత్రి అయ్యేవరకు 'శంఖు' అని అర్థం వచ్చే పత్రికకు సంపాదకత్వం వహించేవారు. ఎం. జి. రామ చంద్రన్ మేటి నటుడు. మరో డి. ఎం. కె. నాయకుడు రాజేంద్రన్ కూడా నటుడే. సినీ రచయితలలో కరుణానిధిది అగ్రపీఠం.

అన్నాదొరై ప్రభుత్వం అధికారంలోకి రాగానే ప్రభుత్వ కార్యాలయాల భవనాలపైన, వాహనాలపైన ఉన్న ఇంగ్లీషు బోర్డులను తొలగించి, తమిళ బోర్డు లను తగిలించింది. మంత్రులు చిన్నకార్లను ఉపయోగించే వారు. మద్రాసులో స్వంత ఇల్లు ఉన్న మంత్రులకు ప్రభుత్వం గృహాలు కేటాయించలేదు. అయిదు వందల రూపాయల వేతనంతోనే ఆనాటి మంత్రులు తృప్తి పడ్డారు. కేంద్ర సహకారం పూర్తిగా లభించనందుకే రూపాయికి కిలో బియ్యం సరఫరా పథకం ఫలించ లేదు. ప్రపంచ తమిళ మహాసభలను జరిపించి అన్నా తమిళ ప్రజల ప్రాచీన ఔన్నత్యాన్ని చక్కగా ప్రదర్శించారు.

అన్నా రెండు సంవత్సరాలే అధికారంలో ఉన్నారు. 1969 ఫిబ్రవరి 3న ఆయన కేన్సర్ వ్యాధితో మరణించారు. ప్రాంతీయాభిమానం తప్పుకాదని,

అయితే అది దేశ ప్రయోజనాలకు హాని కలిగించరాదని చాటి చెప్పిన ప్రాంతీయ పార్టీల తొలి నాయకుడుగా అన్నా చరిత్రలో నిలిచిపోయాడు.

## చీలికలు తగ్గని కాంగ్రెస్ :

అధికారం కోల్పోయినా కాంగ్రెసులో ముఠా తగవులు తప్పలేదు. ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడైన సి. సుబ్రహ్మణ్యంను నామమాత్రం చేసి పార్టీ పగ్గాలను తన చేతులలోనే వుంచుకోవాలని కామరాజ్ అభిలషించారు. 1968 లో నాగర్ కోయిల్ లోక్‌సభ స్థానానికి కామరాజ్ పోటీ చేసారు. పార్టీ యంత్రాంగమంతా కామరాజ్ గెలుపుకి కృషి చేసింది. కామరాజ్ లోక్‌సభకు ఎన్నిక అయితే రాష్ట్ర రాజకీయాలలో ఆయన పెత్తనం తగ్గుతుందని వారు భావించారు. లోక్‌సభ సీటును కామరాజ్ గెలుచుకున్నా, పార్టీ సేవలకే ఆయన అంకితమయ్యారు. దీనితో రాష్ట్ర రాజకీయాలలో కామరాజ్ వ్యతిరేకులకు తీరని ఆశాభంగం కలిగింది.

## డి. ఎం. కె. లో చీలిక :

డి.ఎం.కె. పార్టీలోను, ప్రభుత్వంలోను అన్నాదొరై తర్వాత 'నెంబర్-టు' స్థానం నెడుంచెజియన్‌దే. 1957-62 మధ్య అన్నా మద్రాసు అసెంబ్లీలో ప్రతిపక్ష నాయకుడుగా ఉన్నప్పుడు నెడుంచెజియన్ ఆ పార్టీకి ఉపనాయకుడు. 1962-67 మధ్య నెడుంచెజియన్ అసెంబ్లీలో ప్రతిపక్ష నాయకుడుగా ఉన్నప్పుడు కరుణానిధి దాని ఉపనాయకుడు. అన్నా మరణించగానే గవర్నర్ ఉజ్జల్‌సింగ్ నెడుంచెజియన్ చేతనే తాత్కాలిక ముఖ్యమంత్రిగా ప్రమాణస్వీకారము చేయించారు.

డి. ఎం. కె. లెజిస్లేచర్ పార్టీ సమావేశం 1969 ఫిబ్రవరి 9 న జరిగింది. కరుణానిధి ఏకగ్రీవంగా పార్టీ నాయకుడుగా ఎన్నికయ్యారు. ఆదిలో కరుణానిధి ప్రభుత్వంలో చేరనని భీష్మించుకొని కూర్చున్న నెడుంచెజియన్ ఆరు మాసాల తరువాత బేషరతుగా మంత్రి పదవిని స్వీకరించారు. కాంగ్రెసు నాయకులు అధికార దాహంతో జోడు పదవులను విడువలేక పోతున్నారని ఆ పార్టీని పరిహాసించిన డి. ఎం. కె. పార్టీ అధినేతలుకూడా అదే దారిలో నడిచారు. ముఖ్యమంత్రితో పాటు, పార్టీ అధ్యక్ష పదవిని కూడా కరుణానిధి తన చేతుల్లోనే ఉంచుకున్నారు.

1969 లో రాష్ట్రపతి ఎన్నికల సమయములో అఖిల భారత కాంగ్రెసు కమిటీ రెండుగా చీలింది. ఇందిరాగాంధీ నాయకత్వంలోని కాంగ్రెసు (ఐ) కి

సుబ్రహ్మణ్యం అధ్యక్షుడయ్యారు. టి. టి. కె., భక్తవత్సలం ప్రభృతులు ఇందిరా గాంధీ పక్షంలోనే ఉన్నారు. 1969 మార్చిలో పాండిచ్చేరిలో జరిగిన ఎన్నికలలో కాంగ్రెసు తరపున స్వయంగా కామరాజ్ నాడార్ ప్రచారానికి పూనుకున్నారు. కానీ, డి. ఎం. కె. మెజారిటీ స్థానాలను రాబట్టుకుంది. ముఖ్యమంత్రి వెంకటసుబ్బ రెడ్డియార్ కూడా ఓడిపోయారు. డి.ఎం.కె. ఇందిరాగాంధి అభ్యుదయ విధానాలను సమర్థించింది. బ్యాంకుల జాతీయకరణ జరిగినప్పుడు, రాజభరణాలను రద్దు చేసి నపుడు ఆమెకు పూర్తిగా మద్దతు నిచ్చింది. (1968లో మద్రాసు రాష్ట్రం పేరును తమిళనాడుగా మార్చేశారు)

1970 జనవరి 5వ తేదీన తమిళనాడు శాసన సభను ముఖ్యమంత్రి కరుణానిధి సిఫారసుపై గవర్నరు రద్దు చేశారు. పార్లమెంటు ఎన్నికలతోపాటు శాసన సభ ఎన్నికలు కూడా జరుగుతాయని రాజ్‌భవన్ నుండి ప్రకటన వెలువడింది.

కాంగ్రెస్ చీలికతో కేంద్రంలో ఇందిరాగాంధీ ప్రభుత్వం మైనారటీలో పడిపోయింది. అందువలన ఆమె నాలుగవ లోక్‌సభను 1970 డిశంబర్ 21 నాడు రద్దు చేయించారు. అసెంబ్లీ ఎన్నికలలో డి.ఎం.కె. తన పూర్వ మెజారిటీని నిల బెట్టుకుంది. కరుణానిధి తిరిగి ముఖ్యమంత్రి అయ్యారు.

అజేయమనుకున్న డి. ఎం. కె. కోట త్వరలో బీటలు వారడం మొదలు పెట్టింది. ఈసారి కూడా ఎం. జి. ఆర్. ను మంత్రివర్గంలో తీసుకోక ఘోర తప్పిదం చేశాడు కరుణానిధి. సినిమా గ్లామర్, ప్రభుత్వ యంత్రాంగము ఒక చోట ఇముడలేవని ఆయన సిద్ధాంతము. పార్టీ కార్యదర్శిగా ముఖ్యమంత్రి కరుణానిధిపై ఎన్నో అవినీతి ఆరోపణలు చేశారు ఎం. జి. ఆర్. ఈ ఇద్దరు నాయకుల మధ్య వివాదాలు తీవ్రమై చివరకు ఎం. జి. ఆర్. ను డి. ఎం. కె. పార్టీ నుండి సస్పెండ్ చేశారు. కానీ, ఎం. జి. ఆర్. లేని డి. ఎం. కె. పార్టీని ప్రజలు సహించలేక పోయారు. డి. ఎం. కె. చీలినప్పుడు పార్టీలోని సీనియరు నాయకులంతా ముఖ్యమంత్రి పక్షంలోనే ఉన్నా ప్రజానీకం మాత్రం ఎం. జి. ఆర్. పక్షాన నిలిచింది. ప్రజాబలం ఎరిగిన ఎం. జి. ఆర్. 1972లో అఖిల భారత అన్నా డి. ఎం. కె. పార్టీని స్థాపించారు. డి. ఎం. కె. చీలిక తమిళనాడు రాజకీయ రంగాన్నే మార్చివేసింది. లోక్‌సభలో 9 మంది డి. ఎం. కె. సభ్యులు అన్నా డి. ఎం. కె. లో చేరిపోయారు.

కరుణానిధి ప్రభుత్వం ఐదేళ్ళ కాలపరిమితి 1976 మార్చి 21న ముగియ నున్నదనగా, అందుకు 50 రోజులకు ముందే అంటే 1976 జనవరి 31న కేంద్ర ప్రభుత్వం కరుణానిధి ప్రభుత్వాన్ని బర్తరఫ్‌చేసి తమిళనాడులో రాష్ట్రపతి పాలన విధించింది.

దేశానికి ముఖ్యంగా తమిళనాడు రాష్ట్రానికి ఎంతో సేవచేసిన కామరాజ్ నాడార్ 1975 అక్టోబరు 2న చనిపోయారు. అత్యయిక పరిస్థితి కామరాజ్ హృదయాన్ని ఎంతో బాధ పెట్టింది. శ్రీమతి ఇందిరాగాంధీ నియంతృత్వం వైపు పయనిస్తున్నందుకు ఆయన ఎంతో బాధపడ్డారు. జాతిని ఆర్థికంగాను, రాజకీయంగాను సమైక్యపరిచే కృషిలో ఏమాత్రం జాప్యం జరిగినా దేశం విచ్ఛిన్నం కావచ్చునని, ఉత్తర-దక్షిణ భారతాలు విడిపోయే ప్రమాదం రావచ్చునని ఆయన భయపడేవారు. అత్యయిక పరిస్థితికి పూర్వం పాతకాంగ్రెస్‌ను కొత్త కాంగ్రెస్‌లో విలీనం చేయడానికి ఆయన ఇష్టపడ్డారు. అయితే, ఈ విలీనీకరణ జాతీయస్థాయిలో జరగాలనీ, పాత కాంగ్రెస్‌లోని రాష్ట్ర నాయకులందరికి కాంగ్రెస్‌లో స్థానం ఉండాలని ఆయన పట్టుబట్టారు. కామరాజ్ మరణంతో పాత కాంగ్రెస్ తమిళనాడులో పేరుకు మాత్రమే నిలిచింది.

అధికారంలో అన్నా డి. ఎం. కె :

ఆరవ లోక్‌సభకు 1977 మార్చిలో ఎన్నికలు జరిగాయి. అన్నా డి.ఎం.కె 23 స్థానాలను, డి.ఎం.కె. ఒక స్థానాన్ని గెలుచుకున్నాయి. దీనితో డి.ఎం.కె. అధినేత కరుణానిధి ప్రతిష్ఠ బాగా దెబ్బతినిపోయింది. పార్టీ మేలుకోసం అధ్యక్ష పదవికి రాజీనామా చేయమని కరుణానిధిపై ఆయన అనుచరులు ఎంతో వొత్తిడి తెచ్చారు. కానీ అందుకాయన అంగీకరించలేదు. మునుగుతున్న కరుణానిధి ఓడ నుంచి తప్పించుకొని చాలామంది డి.ఎం.కె సభ్యులు సురక్షితమనుకున్న అన్నా డి.ఎం.కె. కోటలో ప్రవేశించారు.

1977లో జరిగిన శాసనసభ ఎన్నికలలో అన్నా డి.ఎం.కె. దాని మిత్ర పక్షానికి 143 స్థానాలు, జనతాపార్టీకి 10, కాంగ్రెస్‌కు 27, సి.పి.ఐ.కి 5, డి.ఎం.కె.కు 48, ఇతర పార్టీలకు - ఇండిపెండెంట్లకు చెరో స్థానం లభించాయి. ఈ ఎన్నికలలో కొన్ని విచిత్ర పరిణామాలు వెల్లడైనాయి. 1971 ఎన్నికలలో

37 స్థానాలకు పోటీచేసి ఒక్క స్థానంలోనైనా ధరావతు నిలబెట్టుకోని మార్క్సిస్టు పార్టీ ఈ ఎన్నికలలో 12 స్థానాలను గెలిచింది. మద్రాసు నగరంలోని 14 నియోజక వర్గాలలో 13 నియోజక వర్గాలను డి.ఎం.కె. గెలిచి ఒక నియోజక వర్గాన్ని మాత్రమే అన్నా డి.ఎం.కె.కు హస్తగతం చేసింది. తమిళనాడులో అన్నా డి.ఎం.కె. నాయకుడు ఎం. జి. రామచంద్రన్ అధికారం ప్రారంభమైంది.

అత్యయిక పరిస్థితి ప్రకటనకు పూర్వం ఉన్న స్థితిని పునరుద్ధరించటానికి జనతా ప్రభుత్వం తీసుకున్న చర్యలన్నింటినీ పార్లమెంటులో అన్నా డి.ఎం.కె. బలపరిచింది. రాష్ట్ర ప్రభుత్వ తగాదాలను పరిష్కరించే ఉద్దేశంతో కృష్ణా జలాలను మద్రాసు నగరానికి సరఫరా చేయడానికి సంబంధించి ఆంధ్రప్రదేశ్, కర్నాటక, మహారాష్ట్ర ప్రభుత్వాలు ఎం.జి.ఆర్. 1977 అక్టోబర్ 27న ఒక ఒప్పందం కుదుర్చుకున్నారు. చరణ్‌సింగ్ ఆపద్ధర్మ ప్రభుత్వంలో ఇద్దరు అన్నా డి.ఎ.కె. సభ్యులు చేరారు.

1980లో లోక్‌సభకు జరిగిన మధ్యంతర ఎన్నికలలో కాంగ్రెస్ (ఐ) డి.ఎం.కె.తోను, జనతాపార్టీ అన్నా డి.ఎం.కె.తోను పొత్తులు కుదుర్చుకున్నాయి. ఈ ఎన్నికలలో కాంగ్రెస్ (ఐ) డి.ఎం.కె. కూటమి గెలచుకున్న 37 సీట్లలలో కాంగ్రెస్‌కు 20 సీట్లు లభించాయి. అన్నా డి.ఎం. కె. 2 స్థానాలతో తృప్తిపడవలసి వచ్చింది.

శ్రీమతి ఇందిరాగాంధీ మళ్ళీ అధికారంలోకి రాగానే లోక్‌సభ ఎన్నికలలో కాంగ్రెస్ (ఐ) మెజారిటీ సాధించిన రాష్ట్రాల అసెంబ్లీలను రద్దు చేసినప్పుడు తమిళనాడు అసెంబ్లీకూడా రద్దయింది. తిరిగి ఎన్నికలు జరిగేవరకు రాష్ట్రంలో రాష్ట్రపతి పాలన విధించారు.

1980లో జరిగిన శాసనసభ ఎన్నికలలో అన్నా డి.ఎం.కె. 128 సీట్లను గెలుచుకొని ప్రభుత్వం ఏర్పాటుకు పూర్తి మెజారిటీ సంపాదించుకుంది. కాంగ్రెస్ (ఐ)కి 30, డి. ఎం. కె. కు 30 స్థానాలొచ్చాయి. సి. పి. ఎం 11, సి. పి. ఐ. 10, జనతాపార్టీ 2, ముస్లింలీగ్ ఒకటి, మిగిలిన సీట్లను ఇతర పార్టీలవారు, ఇండిపెండెంట్లు గెలచుకున్నారు. ఎం. జి. ఆర్. రెండవసారి ముఖ్యమంత్రి అయ్యారు.

పార్లమెంటు ఎన్నికలతోపాటు మద్రాసు శాసనసభ ఎన్నికలు 1984 డిశంబర్‌లో జరిగాయి. కాంగ్రెస్ (ఐ) తో ఎన్నికల అవగాహన కుదుర్చుకున్న అన్నా డి. ఎం. కె. విజయభేరి మ్రోగించి వరుసగా మూడవసారికూడా మంత్రి వర్గాన్ని ఏర్పాటు చేసింది. ఎన్నికలు నిర్వహించిన 232 స్థానాలలో అన్నా డి. ఎం. కె. కు 135, దాని మిత్రపక్షమైన కాంగ్రెస్ (ఐ) 62 సీట్లను గెలుచుకోగా, డి. ఎం. కె. 22, సి. పి. ఎం. 5, జనతా 3, గాంధీ-కామరాజ్ నేషనల్ కాంగ్రెస్, సి. పి. ఐ. చెరి రెండేసి సీట్లను గెలుచుకున్నాయి. అఖిల భారత ఫార్వర్డ్‌బ్లాక్ ఒక స్థానం సంపాదించింది. రెండు స్థానాలను ఇండిపెండెంట్లు స్వాధీనం చేసుకున్నారు. అధికారం హస్తగతం చేసుకోవడానికి ఉభయ కమ్యూనిస్టు పార్టీలు, ఇండియన్ యూనియన్ ముస్లింలీగ్ మద్దతుతో తీవ్రకృషి చేసిన డి. ఎం. కె. తిరిగి మరొకసారి ఘోరపరాజయం చెందింది. శాసనసభలో ప్రతిపక్ష హోదా పొందటానికి అవసరమైన 24 మంది సభ్యులు కూడా అది యీసారి కోల్పోయింది.

ఎన్నికల సమయంలో ఎం. జి. ఆర్. న్యూయార్క్‌లో చికిత్స పొందుతున్నా తమిళనాడు ప్రజానీకం ఆయన మీదగల అభిమానాన్ని ఓట్ల రూపములో కురిపించింది. డి. ఎం. కె. ఇంత చిత్తుగా ఓడిపోవడానికి కారణం ఆ పార్టీ అధినేత కరుణానిధి నిరంకుశ విధానాలే అని విమర్శకుల అభిప్రాయం. డి. ఎం. కె. తన ఎన్నికల ప్రణాళికలో తమిళనాడుకు స్వయం ప్రతిపత్తి కావాలని, కేంద్రములో ఉమ్మడి పాలన ఉండాలని పునరుద్ఘాటించింది. హిందీని బలవంతముగా రుద్దడాన్ని నిర్ద్వందంగా ఖండించింది. హిందీ విషయములో అన్నా డి. ఎం. కె. విధానముకూడా ఇదే. కేంద్రముతో సామరస్యంగా వ్యవహరించి కేంద్రం నుంచి అభివృద్ధి పథకాలకు ఎక్కువ నిధులను రాబట్టుకుంది. ఎం. జి. ఆర్. సంయమన విధానమే ఆయన ప్రభుత్వానికి గీటురాయిగా నిలిచింది.

అన్నా డి. ఎం. కె. వ్యవస్థాపక అధ్యక్షుడు, తమిళనాడు ముఖ్యమంత్రి మరుధుర్ గోపాలరామచంద్రమీనన్ తన 70వ ఏట 1987 డిశంబర్ 24న చనిపోయారు. దేశంలో అత్యున్నతమైన 'భారత రత్న' అవార్డుతో ఆ దివంగత నాయకుణ్ణి కేంద్ర ప్రభుత్వం సత్కరించింది.

బీటలు వారిన అన్నా డి. ఎం. కె. కోట :

ఎం. జి. ఆర్. ఉండగానే అన్నా డి. ఎం. కె. లో కలతలు బయలు దేరాయి. కె. వి. కృష్ణస్వామి, అన్వార్ జగదీశన్‌లు 1987 మార్చిలో మంత్రి వర్గంలో స్థానం కోల్పోయారు. పెక్కు సినిమాలలో ఎం. జి. ఆర్. సరసన నటించిన జయలలిత 1988లో అన్నా డి. ఎం. కె. కార్యదర్శిగా ఎన్నిక కాగానే పార్టీలో విభేదాలు తీవ్రమైనాయి. ఆయన మరణంతో పార్టీ నిలువునా చీలింది. వీరప్పన్ వర్గానికి శ్రీమతి జానకీ రామచంద్రన్, జయలలిత వర్గానికి నెడుంచెజి యన్ లెజిస్లేచర్ పార్టీ నాయకులుగా యెన్నికైనారు. శ్రీమతి జానకి రామచం ద్రన్‌కు మద్దతు ఇచ్చిన 97 మంది ఎం. ఎల్. ఏ. లు గవర్నరు ఖురానా ముందర హాజరయ్యారు. జయలలిత వర్గం ఎం. ఎల్. ఏ. లు గవర్నరును కలుసుకున్నారేకానీ తమకు మద్దతు ఇస్తున్న వారి సంఖ్యను బయటపెట్టలేదు. 1988 జనవరి 3వ తేదీన ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయవలసిందిగా శ్రీమతి జానికిని గవర్నర్ ఆహ్వానించారు. జనవరి 7వ తేదీన శ్రీమతి జానకి రామచంద్రన్ నాయకత్వంలో 8 మంది సభ్యులు గల అన్నా డి. ఎం. కె. మంత్రివర్గం ఏర్ప డింది. దీన్ని జయలలిత వర్గం విమర్శించింది. ముఖ్యమంత్రి అధికారంలో ఉండ టానికి అసెంబ్లీలోని మొత్తం సభ్యుల బలగంలో సంపూర్ణ మెజారటీ సాధించ వలసిన అవసరం లేదని గవర్నరు ఖురానా అభిప్రాయ పడ్డారు.

శ్రీమతి జానకి రామచంద్రన్ రాజకీయాలకు కొత్త. ముఖ్యమంత్రి కావటా నికి ఆమెకున్న ఏకైక అర్హత ఎం. జి. ఆర్. అర్ధాంగి కావడమే. వీరప్పన్ ముఖ్యమంత్రి కావాలని ఆశించినప్పటికీ ఎం. జి. ఆర్. మరణంతో ప్రజల సాను భూతి పొందుతున్న శ్రీమతి జానకి రామచంద్రన్‌ను ప్రస్తుతానికి ముఖ్యమంత్రిగా చేయడం మంచిదని భావించి ఆమెకు ఆ పదవి కట్టబెట్టారు. కానీ, అధికారమంతా వీరప్పన్ చేతులలోనే ఉండిపోయింది.

నెడుంచెజియన్-జయలలితవర్గానికి 34 మంది సభ్యులున్నారు. కాంగ్రెసు (ఐ) ఆ వర్గాన్ని బలపరచినప్పటికీ ఆ వర్గం అధికారానికి రాలేదు. అందుచేతనే అన్నా డి. ఎం. కె. లోని రెండు వర్గాలు స్పర్థలు విస్మరించి కలసి పని చేయా లని ప్రధానమంత్రి రాజీవ్‌గాంధీ తనను కలుసుకున్న ముఖ్యమంత్రి జానకీ రామ చంద్రన్‌కు హితవు చెప్పారు. జానకి ముఖ్యమంత్రిత్వాన్ని కాంగ్రెస్ (ఐ) సమ

ర్థించక పోయినా, తటస్థవైఖరి వహించినా ఆమె ప్రభుత్వం కొనసాగుతుంది. జయలలిత వర్గం వలె కాంగ్రెస్ (ఐ) కూడా వ్యతిరేకిస్తే ఆమె మంత్రివర్గం కూలిపోతుంది.

అయితే జయలలిత ప్రధాని రాజీవ్‌గాంధీని కలుసుకొని అధికార పార్టీ అయిన అన్నా డి. ఎం. కె. ప్రస్తుత రాజకీయాల విషయంలో తటస్థంగా ఉండే టట్లు కాంగ్రెస్ (ఐ)ని ఒప్పించడంలో విజయం సాధించింది. జనవరి 28న మధ్యాహ్నం ఒకసారి, సాయంత్రం మూడు గంటలకు మరొకసారి శాసనసభ జానకీ రామచంద్రన్ ప్రభుత్వంపై విశ్వాసం ప్రకటించడానికి సమావేశ మైనప్పుడు తీవ్ర గందరగోళం జరిగింది. దేశ పార్లమెంటరీ చరిత్రలో మున్నె న్నడూలేని విధంగా పోలీసులు శాసనసభలో ప్రవేశించారు. అసెంబ్లీలోని 222 మంది సభ్యులలో 110 మంది సభలో ఉన్నప్పుడు వోటింగ్ నిర్వహించటానికి గవర్నరు అంగీకరించలేదు. జనవరి 30న తమిళనాడులో రాష్ట్రపతి పాలన విధిం చడంతో 23 రోజులు అధికారంలో ఉన్న జానకీ రామచంద్రన్ ప్రభుత్వం అధి కారం కోల్పోయింది.

జానకీ రామచంద్రన్ తమిళనాడు మొదటి మహిళా ముఖ్యమంత్రిగా భర్త తర్వాత భార్య అయిన ముఖ్యమంత్రిగా ప్రజలపై ఏవిధమైన ఆశ్చర్యకరమైన ప్రభావం వ్యక్తపరచలేకపోయింది. ఆమె నెల రోజుల అధికారంలో చేసిన ఘన కార్యం ఒక్కటే. ఉద్యోగులకు రు. 350/- చొప్పున పొంగల్ బోనస్ ప్రక టించి రాష్ట్ర ఖజానాపై 35 కోట్ల భారం వేసింది.

తిరిగి అధికారంలో డి. ఎం. కె. :

1989 జనవరిలో తమిళనాడు శాసనసభకు జరిగిన ఎన్నికలలో అన్నా డి. ఎం. కె. రెండు పిట్టల తగువులను డి. ఎం. కె. పిల్లి తీర్చింది. ఈ ఎన్నిక లలో కరుణానిధి నాయకత్వంలోని డి. ఎం. కె. కు 148 స్థానాలు, కాంగ్రెస్ (ఐ) 26, అన్నా డి. ఎం. కె. జయలలిత వర్గానికి 27, సి. పి. ఎం. కు 15, జనతా 4, ఎ ఎల్. ఎం. ఎల్ 3, సి. పి. ఐ. 3, అన్నా డి. ఎం. కె. జానకి వర్గం ఒక స్థానం, మిగతా స్థానాలను ఇండిపెండెంట్లు, ఇతరులు గెలుచుకున్నారు. 177 సీట్లకు పోటీచేసి ఒక్క సీటు మాత్రమే గెలుచుకున్న జానకి అధ్యాయం దీనితో సమాప్తమైంది. ఆమె తన స్వంత సీటునే గెలుచుకొనలేకపోయింది. 198

స్థానాలకు పోటీచేసి తానే కాబోయే ముఖ్యమంత్రినని ప్రచారం చేసుకున్న జయలలితకు తీరా దక్కిన సీట్లు మూడు పదులలోపే. కాంగ్రెస్ విడిచి స్వంత పార్టీ పెట్టుకున్న శివాజీ గణేశన్ సీటు గల్లంతైనది. తమిళనాడులో పండెండు ఏళ్ళ తరువాత కరుణానిధి నాయకత్వంలో తిరిగి డి. ఎం. కె. ప్రభుత్వం ఏర్పడినది.

1989 డిసెంబర్‌లో జరిగిన లోక్‌సభ ఎన్నికలలో డి. ఎం. కె. చిత్తుగా ఓడిపోయింది. ఈ ఎన్నికలలో కాంగ్రెస్‌కు 24, అన్నా డి. ఎం. కె. కు 11, సి. పి. ఐ. 1, ఇతరులు 2 స్థానాలను గెలుచుకున్నారు. కేంద్ర మంత్రులు ముగ్గురు—అరుణాచలం, చిదంబరం, ఆర్. ప్రభు గెలిచారు. లోక్‌సభ ఎన్నికలలో కాంగ్రెసును, శాసనసభ ఎన్నికలలో ప్రాంతీయ పార్టీని అభిమానించడం తమిళ ప్రజల ప్రత్యేకత.

-:0:-

# ఆంధ్ర రాజకీయార్ణవంలో ఆటు పోటులు

ఆంధ్ర రాజకీయార్ణవంలో ఎప్పుడూ ఆటుపోటులే. ఒక్కొక్క రాజకీయ పరిణామం ఒక్కొక్క ఉత్తుంగ తరంగం లాంటిది. ఇరవయ్యో శతాబ్ది రెండవ దశకం నుంచి తెలుగునాట కాంగ్రెసు రాజకీయాలు మొదలయినాయి. ఆంధ్ర నాయకులు పాల్గొనని స్వాతంత్రోద్యమం లేదు. వారు చేయని త్యాగాలు లేవు. ఆంధ్రులు వందలు, వేల సంఖ్యలో జైళ్ళకు వెళ్ళారు. కష్టాలను అనుభవించారు. కానీ అవన్నీ ఒక ఎత్తు. అంతరంగిక రాజకీయాలు మరొక ఎత్తు. కుమ్ములాటలు లేని అధ్యాయం ఆంధ్రరాజకీయ చరిత్రలో కనిపించదు.

1918లో ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం ఏర్పడింది. 'ఆంధ్ర భీష్మ' న్యాపతి సుబ్బారావు పంతులు రాష్ట్రకాంగ్రెసు మొదటి అధ్యక్షుడు. ఆయన మిత వాది. కాంగ్రెసు సహాయనిరాకరణోద్యమాన్ని చేబట్టగానే అందుకు నిరసనగా ఆయన తన పదవికి రాజీనామా చేశారు. ఆయన స్థానంలో కొండా వెంకటప్పయ్య ఎన్నికయ్యాడు.

1921 నుంచి టంగుటూరి ప్రకాశం పంతులు పూర్తికాలం రాజకీయాలలో పనిచేయడం ప్రారంభించాడు. మద్రాసు నగరంలో ఉండే న్యాయవాదుల్లో మొట్ట మొదట న్యాయవాద వృత్తి విడిచిపెట్టింది ప్రకాశమే. ప్రకాశం రాజకీయాలలో ప్రవేశించిన మొదటి రోజులలో గాంధీజీ తమ గృహ సంబంధమైన విషయాలు కూడా ఆయనతో చెప్పుకునేవాడు. ఈ ఇద్దరు నాయకుల మధ్య అన్యోన్య భావం అలా ఉండేది. ప్రకాశం 'స్వరాజ్య' పత్రిక పెట్టి, రాజకీయాలలో దిగి తా నార్జిం చిన లక్షలాది సంపదను పోగొట్టుకున్నాడు.

ఏక నాయకత్వం లేదు :

ఆంధ్ర కాంగ్రెసు సంఘానికి దాదాపు 20 సంవత్సరాలు ప్రకాశమే అధ్యక్షుడు. సహాయ నిరాకరణోద్యమం నుంచి ఉప్పు సత్యాగ్రహం వరకు జరిగిన అన్ని ఉద్యమాలకు ఆయనే నాయకుడు. అందుకే 'ప్రజలంటే ప్రకాశం; ప్రకాశం అంటే ప్రజలు' అనే నానుడి ఆంధ్రలో ప్రచారానికి వచ్చింది. 1924, 29, 30, 34 సంవత్సరాలలో దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు.

సర్కారు జిల్లాలలో ఒక విశేషం ఉంది. ఆ జిల్లాలలో ఏనాడు ఏక నాయకత్వం లేదు. జాతీయోద్యమం రోజులలో గుంటూరు ప్రాంతంలో కొండా వెంకటప్పయ్య, గోదావరి ప్రాంతంలో ప్రకాశం, కృష్ణాజిల్లాలో పట్టాభి నాయకత్వం ఉండేది. చివరకు జస్టిస్‌పార్టీ రాజకీయాలలో కూడా ఏకనాయకత్వం సమకూరలేదు. ఇందుకు ఆ జిల్లాల ఆర్థిక సాంఘిక పరిస్థితులే కారణం. ఆంధ్ర కురువృద్ధులలో సైతం ఏనాడు ఐక్యతలేదు. 1917 నుంచి 1930 వరకు వెంకటప్పయ్య, పట్టాభిల మధ్య స్పర్థలుండేవి. ఖాదీ సంఘాల నిర్మాణం, వాటి మేనేజిమెంటు వ్యవహారాలపై ఈ ఇద్దరు నాయకులు ఘర్షణ పడేవారు. సహాయ నిరాకరణోద్యమం జరుగుతున్న రోజులలో గాంధీజీ వద్ద తనకున్న స్థానాన్ని పట్టాభి ఆక్రమించుకున్నాడని వెంకటప్పయ్య బాధపడేవాడు.

ఆ తరువాత దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, పట్టాభిలమధ్య కొంత బెడిసింది. 1918 లో గాంధీజీ భారత రాజకీయ రంగంలో ప్రవేశిస్తున్న రోజులలోనే గోపాలకృష్ణయ్య చీరాల ఉద్యమాన్ని విజయవంతంగా నడిపాడు. 1924 లో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శి పదవికి దుగ్గిరాల పోటీచేయగా కొండా వెంకటప్పయ్య, బులుసు సాంబమూర్తి, పట్టాభి-ముగ్గురు ముగ్గురూ ఏకమై ఆయనను ఓడించారు.

మొదటి స్థానం రాదు, రెండోదివద్దు :

ఆచార్య రంగా ఆంధ్రరాష్ట్ర రైతు ఉద్యమ నిర్మాత. 1928లోనే ఆయన ఆంధ్ర రాష్ట్ర రైతు ఉద్యమాన్ని స్థాపించాడు. ఆ రోజులలో రైతు సంఘాలు కాంగ్రెసు పార్టీలోని అంగాలే. రంగాకు ఇతరులను అనుసరించే అలవాటు లేదు. 1935 నుంచి రంగా కేంద్ర శాసనసభ సభ్యుడు.

కాంగ్రెసును నిరంతరం దుయ్యబడుతూనే కాంగ్రెసులోని పదవికై పోరాడేవాడు రంగా. ఆయనవి బెదిరింపు రాజకీయాలు. ఈనాడు సోషలిస్టులు, కమ్యూనిస్టులు చేస్తున్న పని ఆ రోజులలో రంగా చేస్తుండేవాడు. ఆంధ్ర ప్రదేశ్‌లో అతివాద కాంగ్రెసేతరులు చాలా వరకు రంగా శిష్యులే. ఆయనకు మొదటి స్థానం రాదు; రెండో స్థానం అంగీకరించడు' అని ఖాసా సుబ్బారావు విమర్శలందుకున్న రంగా అందుకు అనుకూలంగానే నడుచుకున్నాడు. తనకు ఎలాగు మొదటి స్థానం రాదు కనుక, మొదటి స్థానం కోసం పోరాడుతున్న పట్టాభి, ప్రకాశంల మధ్య ఆయన విభేదాలు పెంచుతూ వచ్చాడు.

1937 లో రాజాజీ మంత్రివర్గంలో ప్రకాశం చేరిపోగానే ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్ష పదవికి రాజీనామా చేయవలసి వచ్చింది. రంగాతో జరిగిన పోటీలో ప్రకాశం బలంతో పట్టాభి కాంగ్రెసు అధ్యక్షుడయాడు. ఆ ఓడించడం కూడా నామమాత్రం కాదు. 143 ఓట్ల తేడాతో ఓడించాడు. కార్యదర్శి పదవికి జరిగిన పోటీలో పుచ్చలపల్లి సుందరయ్యను గొట్టిపాటి బ్రహ్మయ్య ఓడించాడు.

పైకి తెచ్చారు, పదవు లిచ్చారు :

ప్రకాశానికన్న సీనియరు నాయకుడైన పట్టాభికి 1937 వరకు రాష్ట్ర కాంగ్రెస్‌లో కోశాధికారి పదవితోనే సంతృప్తి పడవలసి వచ్చింది. ఎప్పుడైతే ఆయనను రాష్ట్ర కాంగ్రెస్ అధినేత అయ్యే అవకాశం లభించిందో అప్పటినుంచి ఆయన తన బలం పెంచుకోవడానికి దాన్ని పూర్తిగా వినియోగించుకున్నారు. తూర్పు గోదావరినుంచి గొట్టిపాటి బ్రహ్మయ్య, కళా వెంకటరావు, నెల్లూరునుండి బెజవాడ గోపాలరెడ్డి, రాయలసీమ నుండి నీలం సంజీవరెడ్డిని పైకి తెచ్చి బాధ్యత గల పదవు లిచ్చాడు. ఇకమీదట ప్రకాశంను ఢీకొనే విధంగా ఈ యువశక్తిని చాటున వుంచి శరసంధానం చేయడం మొదలుపెట్టాడు పట్టాభి. రాజాజీ కేంద్ర ప్రభుత్వంలో చేరిపోతే, అధిష్టానవర్గం ఎలాగు ప్రకాశానికి నాయకత్వం లభించడం ఇష్టపడదు కనుక, అది తమకే లభిస్తుందని ఆశతో ఈ వర్గం ఉండేది. ఇక్కడ విచిత్రమైన విషయం ఏమంటే రంగాకానీ, పట్టాభికానీ ఏనాడు శాసన సభ్యులు కారు.

రంగా, పట్టాభిల మధ్య ఏనాడు సయోధ్య లేదు. వారిద్దరు తమ తమ పదవులను బట్టి ప్రకాశానికి సన్నిహితులైన వారేకానీ, పరస్పరం ఎన్నడూ సహక

రించుకోలేక పోయేవారు. అధిష్ఠాన వర్గంలో పట్టాభి చేరి, రాజాజీతో చేతులు కలిపి తనకు రావలసిన స్థానాన్ని సైంధవుడిలా అడ్డుకుంటున్నాడని రంగా భావించేవాడు. తన మీదకు కళా వెంకట్రావుని ఉసిగొల్పి సంకుల సమరం జరిపిస్తున్నాడనే అనుమానంతో ఉండేవాడు. 1937 నుంచి 1939 వరకు పట్టాభి ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు.

ఈ కుమ్ములాటలలో నష్టపడ్డది సీనియరు నాయకుడు కొండా వెంకటప్పయ్య ఆయన అఖిల భారత కాంగ్రెసు సంఘం అధ్యక్ష పదవి చేబట్టి అఖిల భారత ఖ్యాతి కెక్కిన నాయకుడు. 1937 లో రాజాజీ ప్రభుత్వంలో ఆయనకు స్థానం లభించలేదు. శాసనసభ కాంగ్రెసు పక్షం ముగ్గురు కార్యదర్శులలో ఒకడుగా ఉండిపోవలసి వచ్చింది.

ప్రజలు చేసిన ముఖ్యమంత్రి :

1939 లో కాంగ్రెస్ మంత్రివర్గాలు రాజీనామా చేయగానే ప్రకాశం తిరిగి రాష్ట్రకాంగ్రెసు అధ్యక్షు డయ్యాడు. 1949 లో ఉమ్మడి మద్రాసు రాష్ట్ర అసెంబ్లీకి ఎన్నికలు జరిగాయి. కాంగ్రెసుకు మెజారిటీ లభించినా ముఠా తగాదాలవల్ల ఏకగ్రీవ నాయకుడిని ఎన్నుకోలేక పోయారు. ప్రజలు ప్రకాశాన్ని ముఖ్య మంత్రిగా చేయాలనుకున్నారు. గాంధీజీ ఇందుకు సిద్ధంగాలేరు. కనుక గోపాలరెడ్డి, సంజీవరెడ్డి, కళా వెంకటరావు, చంద్రమౌళి వర్గం పట్టాభిని ఆ పదవిలో కూర్చుండ పెట్టటానికి ప్రయత్నించింది. కానీ ఆ పథకం ఫలించలేదు. ప్రకాశం పోటీచేసి ముఖ్యమంత్రి అయ్యాడు.

ప్రకాశం ముఖ్యమంత్రి కాగానే రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్ష పదవికి రాజీ నామా చేయవలసి వచ్చింది. ఈసారి ప్రకాశం రంగాను బలపరిచాడు. రంగా కాంగ్రెసు అధ్యక్షుడయ్యాడు. పట్టాభికానీ, రంగాకానీ స్వయం ప్రకాశంతో ప్రకాశం సహాయంలేక రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులైనవారు కాదు. రాయలసీమకు మంత్రివర్గంలో తగినన్ని స్థానాలు లేవని ముఖ్యమంత్రి ప్రకాశంపై సంజీవరెడ్డి వొత్తిడి తెచ్చాడు. అంతేకాదు, ఢిల్లీకి పోయి ఈ విషయంలో ప్రకాశంపై ఫిర్యాదు కూడా చేశాడు. 1948 ఏప్రిల్ 30న ప్రకాశం మంత్రివర్గం పడిపోయే వరకు ఈ అసమ్మతి వర్గం నిద్రపోలేదు.

ముందుకు వచ్చిన రంగా :

1948 లో మళ్ళీ ఆంధ్ర కాంగ్రెసు అధ్యక్ష పదవికి పోటీ జరిగింది. ప్రకాశం సహాయంతో సంజీవరెడ్డిని రంగా ఓడించాడు. 1950 వరకు రంగాయే ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు.

జాతిపిత మహాత్మాగాంధీ హత్య జరిగిన ఎనిమిది మాసాలకు 1948 లో పట్టాభి అఖిల భారత కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడయ్యాడు. ఈ ఎన్నికలలో ప్రకాశం వర్గం పట్టాభిని బలపరిచింది. ప్రకాశాన్ని అఖిల భారత కాంగ్రెసు కమిటీలో సభ్యుడుగా చేయాలనుకున్నాడు పట్టాభి. కానీ ఈ ఇద్దరు ఆంధ్ర కురు వృద్ధులు ఢిల్లీలో మిలాఖత్ కావడం సర్దార్ పటేల్‌కు ఇష్టంలేక పడనీయలేదు. కళా వెంకట్రావును అఖిల భారత కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడుగా నియమించు కున్నాడు పట్టాభి. రాష్ట్ర రాజకీయాలను ఇకనుంచి కళా చూచుకోవడం మొదలు పెట్టాడు.

అఖిల భారత కాంగ్రెసు కార్యదర్శి పదవిలో ఉన్న కళా వెంకట్రావ్ కాంగ్రెసు కార్యవర్గంలో రంగా రాకుండా ప్రయత్నించాడు. ఈ విషయం పార్టీ సమావేశంలో బయట పడగానే ఎన్నికలు జరుగవలసిందని నెహ్రూ పట్టుబట్టాడు. ఈ ఎన్నికలలో కళా వెంకట్రావ్ అభీష్టానికి వ్యతిరేకంగా తాను నెగ్గడమే కాకుండా అప్పటి హైదరాబాద్ రాష్ట్ర సభ్యుడు డా. మర్రి చెన్నారెడ్డిని ఛీఫ్‌విప్‌గా ఎంపిక చేయించుకున్నాడు రంగా.

రెండు సింహాల ఓటమి :

1949 లో కుమారస్వామి రాజా ముఖ్యమంత్రి అయినాడు. తనను బలపరి చిన సంజీవరెడ్డి, గోపాలరెడ్డి, కళాలను ఆయన తన మంత్రివర్గంలోకి తీసు కున్నాడు. 1951 లో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్ష పదవికి జరిగిన ఎన్నిక లలో ప్రకాశం రంగాను, పట్టాభి వర్గం సంజీవరెడ్డిని బలపరిచింది. నాలుగు ఓట్ల మెజారిటీతో సంజీవరెడ్డి గెలిచారు. ఇది నిస్సందేహంగా ముగ్గురు కురువృద్ధుల మధ్య జరిగిన పోటీయే. ఈ పోటీలో ఓడిపోయిన ఆంధ్రకేసరి, రైతు కేసరి కాంగ్రెస్‌ను వదలి వెళ్ళిపోయారు. దీనితో శ్రుతి తప్పిన కాంగ్రెస్ ఆర్కెస్ట్రా

సంగీతం ఆంధ్రలో కర్ణకఠోరంగా వినిపించడం మొదలు పెట్టింది. 1951 నుంచి ఆంధ్ర రాజకీయాలు ఒక దశాబ్దంపాటు సంజీవరెడ్డి నేతృత్వంలో నడవడం మొదలుపెట్టాయి.

1951 ఏప్రిల్ 14న అఖిల భారత స్థాయిలో కృపలానీ, ప్రకాశం కలిసి కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీని స్థాపించారు. అందులో ప్రకాశంతో సమాన స్థానం రాలేదన్న కినుకతో అదే రోజు రంగా కృషిక్‌కార్‌లోక్ పార్టీ (కె. ఎల్. పి.) స్థాపించాడు.

భాషా రాష్ట్రాల ఏర్పాటు కోసం నిరంతరం పోరాటం సల్పే పట్టాభిని చూడగానే కాంగ్రెస్ హైకమాండ్‌కు కంపరమెత్తేది. డాక్టర్ పట్టాభికి ముందు రాజెన్‌బాబు కాంగ్రెసు అధ్యక్షుడుగా ఉన్న రోజులలో ఒకసారి కాంగ్రెసు కార్యవర్గ సమావేశంలో పార్లమెంటరీ బోర్డు నియామక విషయం నాలుగు పేర్లు వారు వీరు చెప్పిన తరువాత ఐదో పేరు చెప్పేలోగా ఒక నిమిషం ఆలస్యమైందట. ఇంతలోనే పట్టాభి ఏదో ఎగతాళిగా అన్నట్లు నటిస్తూ 'ఆఖరు పేరుకు ఆలోచిస్తున్నట్లున్నారు. నాపేరు వేసుకుంటే సరిపోతుంది' అనగానే మొగమాటానికి ఆయన పేరు వేసుకోవలసి వచ్చింది. ఎత్తుకు పైఎత్తులు వేస్తూ అధిష్ఠానవర్గంతో నెగ్గుకు వచ్చాడు పట్టాభి. రాజ్యసభలో స్థానం యిచ్చి, ఆ పిదప గవర్నరు పదవి కట్టబెట్టి పట్టాభిని రిటైర్ చేశారు.

### కమ్యూనిస్టులదే పైచేయి :

1952 ఎన్నికల ఫలితాలను బట్టి చూస్తే ప్రజలు చాలాచోట్ల కమ్యూనిస్టులమైనా భరిస్తాం కానీ కాంగ్రెసును భరించలేమని చెప్పారు. ప్రకాశంగారి కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ అన్ని జిల్లాలలో 77 స్థానాలకు పోటీచేసి 20 స్థానాలను, రంగాగారి కె. ఎల్. పి. 63 స్థానాలకు పోటీచేసి 15 స్థానాలను గెలుచుకున్నాయి. సోషలిస్టుపార్టీకి 6 స్థానాలొచ్చాయి. వివిధ జిల్లాలలో వివిధ పార్టీలకు వచ్చిన స్థానాలు, ఆయా పార్టీల నాయకులు కాంగ్రెసులో వుండగా, ఆ ప్రాంతాలలో వారు సాధించిన పలుకుబడి ద్వారా వచ్చినవే. శ్రీకాకుళంలో గౌతు లచ్చన్నకు, విశాఖపట్నంలో పి. వి. జి. రాజు, తెన్నేటి విశ్వనాథం, గుంటూరులో రంగా_వీరికున్న పలుకుబడి ఆయా ప్రాంతాలలో వారి పార్టీ అభ్యర్థుల గెలుపుకు కారణమైంది. కాంగ్రెసుకు 51 స్థానాలే వచ్చాయి. ఈ ఎన్నికలలో ప్రకాశం ఓడిపోయారు.

కమ్యూనిస్టు పార్టీ 63 స్థానాలకు పోటీచేసి 41 స్థానాలను గెలుచుకుంది. రాష్ట్ర మొత్తంలో కాంగ్రెసు పార్టీకి 152 స్థానాలు లభించగా కమ్యూనిస్టు పార్టీ, కె. ఎల్. పి., ప్రజాపార్టీ మొదలైన ఇతర పార్టీలతో ఏర్పడిన ఐక్యఫ్రంటుకు 164 స్థానాలు లభించాయి. ఫ్రంటు ప్రకాశంను తన నాయకుడుగా ఎన్నుకొన్నది. రాష్ట్రంలో కాంగ్రెసేతర ప్రభుత్వం ఏర్పాటు చేయడం ఐక్యఫ్రంటు ప్రధాన లక్ష్యం. కానీ అధికారం రాజాజీకి హస్తగతమైంది.

గోసాయి దేశాయి పార్టీలు :

1956లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడక పూర్వం తెలంగాణా ప్రాంతం పూర్వపు హైదరాబాద్ రాష్ట్రంలో దాదాపు సగభాగం విస్తరించి ఉండేది. హైదరాబాద్ రాష్ట్ర రాజకీయాలలో తెలంగాణా, మరట్వాడా, కర్నాటక విభేదాలు మొదటి నుంచి ఉన్నాయి. ఆయా జిల్లాల స్థాయిలో ఇవి పెద్దగా కనిపించక పోయినా రాష్ట్రస్థాయిలో జరిగే అన్ని ఎన్నికలలో వీటి ప్రభావం కనిపించేది. తెలంగాణా పేరుతో బూర్గుల రామకృష్ణారావు, కొండా వెంకట రంగారెడ్డి, మరట్వాడా, కర్నాటక పేరుతో స్వామీ రామానందతీర్థ, దిగంబర్రావ్ బిందూ అగ్రశ్రేణి నాయకులుగా పోటాపోటీ పడేవారు. స్టేటు కాంగ్రెస్ అధ్యక్ష పదవికి రెండుసార్లు స్వామీజీతో పోటీచేసి ఒకటి, రెండు ఓట్లతో ఓడిపోతూ వచ్చాడు రామ కృష్ణారావు.

స్వాతంత్ర సమరంలో అందరూ కలిసికట్టుగా స్వామీజీ సారథ్యంలో పోరాడారు. స్వాతంత్ర సమరఫలం అనుభవించే సమయం రాగానే స్వామీజీ, రామకృష్ణారావు ముఠాలు బహిరంగంగా ఢీకొన్నాయి. రామకృష్ణారావు, రంగా రెడ్డి, వైద్యా, దేశాయిలను కాంగ్రెస్ ప్రాథమిక సభ్యత్వం నుండి సస్పెండ్ చేశాడు స్వామీజీ. వీరంతా ఐపీ కాంగ్రెస్ పెట్టుకొని జనార్ధనరావు దేశాయిని అధ్యక్షుడుగా, బూర్గులను కార్యదర్శిగా చేసుకున్నారు. ఈ విభేదాలను చూసి విసు గెత్తిపోయిన ప్రజలు వీటిని గోసాయి, దేశాయి ముఠాలని ముద్దుపేర్లు పెట్టు కున్నారు. సంస్థాగత ఎన్నికలలో దేశాయి ముఠా తెలంగాణాలోని అన్ని జిల్లా లను, కర్నాటకలోని రెండు జిల్లాలను హస్తగతం చేసుకొని స్వామీజీ నాయ కత్వంపై సవాల్ విసిరింది. 1949లో సర్దార్ పటేల్ హైదరాబాద్ వచ్చినప్పుడు ఈ రెండు ముఠాల మధ్య విభేదాలు పరిష్కరించి స్వామీజీ సారథ్యంలో ఒకే

కాంగ్రెస్ ఉండేటట్లు చేసి, వర్కింగు కమిటీలో ఇరు ముఠాలకు సమాన ప్రాతినిథ్యమిచ్చి ఈ వివాదాన్ని పరిష్కరించారు. స్టేటు కాంగ్రెసుకు గల స్వతంత్ర ప్రతిపత్తిని లాగేసుకొని దాన్ని అఖిల భారత కాంగ్రెస్‌కు అనుబంధ సంస్థగా మార్చారు.

ఈ ముఠా తగాదాలవల్ల 1952 సాధారణ ఎన్నికల్లో సీట్ల కేటాయింపులో చాలా అపకతవకలు జరిగాయి. సర్దార్ జములాపురం కేశవరావు ఎర్రుపాలెం అసెంబ్లీ నియోజకవర్గం కోరితే ఆయనకు కమ్యూనిస్టుల బలమైన స్థానం పాఖాల ఇచ్చారు. ఆంధ్ర పితామహ మాడపాటి హనుమంతరావుకు నగరంలో నిలబడటానికి అవకాశం ఇవ్వక గజ్వేల్ ఇచ్చారు. నిస్వార్థపరులైన యీ ఆంధ్ర మహానాయకులు కమ్యూనిస్టుల దాడికి తట్టుకోలేక ఓడిపోయారు.

ఎన్నికల తరువాత ముఖ్యమంత్రి ఎవరు అనే సమస్య ఎదురైంది. స్వామీజీ అభ్యర్థి దిగంబర్రావ్ బిందూ, రంగారెడ్డి అభ్యర్థి రామకృష్ణారావు. రంగారెడ్డికి తెలంగాణాలో తిరుగులేని బలం ఉండేది. ఢిల్లీలో కొంత తర్జన భర్జన జరిగినా రామకృష్ణారావు ముఖ్యమంత్రిగా ఉండాలని అంతా అంగీకరించారు.

మంత్రివర్గ నిర్మాణంలో ఎన్నో సమస్య లెదురైనాయి బూర్గులకు. బిందూకు సాధారణ పరిపాలన శాఖ, ఫూల్చంద్ గాంధీకి రెవిన్యూశాఖ ఇవ్వాలని పట్టు బట్టాడు స్వామీజీ. తనకు రెవిన్యూశాఖ తప్ప ఏ ఇతర శాఖ అంగీకారం కాదని కుండ బద్దలు కొట్టినట్లు చెప్పాడు రంగారెడ్డి. బిందూకు హోంశాఖ, రంగారెడ్డికి రెవిన్యూ శాఖలో కొంత భాగం యిచ్చి తాత్కాలికంగా సర్దాడు బూర్గుల.

తొమ్మండుగురు సభ్యులతో మంత్రివర్గం తొలి జాబితా తయారైంది. ఆదిలో చెన్నారెడ్డిని చేర్చుకోలేదు. రంగారెడ్డి ముఠాకి చెన్నారెడ్డి వెన్నెముకలాంటివాడు. చెన్నారెడ్డిని మంత్రివర్గంలో చేర్చుకోకపోతే తాను మంత్రివర్గంలో చేరే ప్రసక్తే లేదని చెప్పాడు రంగారెడ్డి. చెన్నారెడ్డిని మంత్రివర్గంలో చేర్చుకోగానే దీన్ని అవకాశంగా తీసుకొని తనవారు మరో ముగ్గుర్ని మంత్రివర్గంలో చేర్పించాడు స్వామీజీ. ఈ ముఠా తగువులలో సురవరం ప్రతాపరెడ్డికి స్పీకరు పదవి అయినా లభించలేదు. ఆయనను బూర్గుల 'అన్నగారూ' అని పిలిచేవారు మరి.

ఈలోగా స్టేటు కాంగ్రెస్ అధ్యక్ష పదవికి జరిగిన ఎన్నికలలో స్వామీజీతో పోటీచేసి ఓడిపోయిన దేశాయి తెరమరుగున పడిపోయాడు. తనకు పూర్తి రెవిన్యూశాఖ కావాలని రంగారెడ్డి పోరు ఎక్కువైంది. తనకు రెవిన్యూ ఇవ్వనందుకు పూల్చంద్ గాంధీ బిఱితెగించి కూచున్నాడు. అందువల్ల రామకృష్ణారావు మంత్రివర్గంలో పరస్పర సహకారం, సామరస్యం బదులు పరస్పర ఘర్షణలే పెరిగాయి.

కాంగ్రెస్‌పార్టీ క్రమశిక్షణగా పనిచేయాలంటే ఏలాంటి చర్యలు తీసుకోవాలో సూచించవలసిందని మందుముల నరసింగరావు, గోపాలరావ్ ఎక్బోటే, రావ్‌సాహెబ్ దేశపాండేలతో ఉపసంఘం నియమించారు. ఈ ఉపసంఘం ముఖ్యమంత్రి మీద విశ్వాసం లేని మంత్రులను రాజీనామా చేయమంది. మంత్రివర్గ సభ్యులను తగ్గించాలని సూచించింది. దీన్ని తమ మీద క్రమశిక్షణ పేర ముఖ్యమంత్రి ప్రేలాడదీస్తున్న బిఱికత్తిగా అసంతృప్తివాదులు భావించారు. అందుకు నిరసనగా పూల్చంద్ గాంధీ, వి. బి. రాజు, జగన్నాధరావు చంద్రగీ శంకర్రావ్ దేవ్‌లు తమ పదవులకు రాజీనామా చేశారు. దీనితో ముఖ్యమంత్రికి పార్టీలో తిరిగి విశ్వాసం పొందవలసిన అవసరమైంది.

బూర్గుల ప్రతిభ :

రామకృష్ణారావు ఏదో ఒక విధంగా అన్ని ముఠాలను అంతవరకు సమన్వయించుకుంటూవచ్చారు. అసెంబ్లీలో ప్రతిపక్షాల వారివాదనలను ఎదుర్కోవడంలో మంచి ప్రజ్ఞ చూపారు. వివిధ భాషలు మాట్లాడే హైదరాబాద్ అసెంబ్లీలో ఎవరు ఏ భాష మాట్లాడితే ఆ భాషలో సమాధానాలిచ్చి వారివద్ద ఆత్మీయత పెంచుకున్నారు. పరిపాలనా వ్యవహారంలో ఆయనను వ్యతిరేకించిన శక్తులు సైతం ముఖ్యమంత్రి వైఖరిని శంకించలేదు. ఆనాటి హైదరాబాద్ రాష్ట్ర శాసనసభ సభ్యుల సంఖ్య 175 మంది. అందులో కాంగ్రెసు సంఖ్య 93. కమ్యూనిస్టుల ప్రాబల్యంలోని పి. డి. ఎఫ్. శాసనసభ్యుల సంఖ్య 42. ఇతరులు 42 మంది. శాసనసభ ప్రారంభోత్సవానికి నిజాం నవాబు రాజ్‌ప్రముఖ్ హోదాలో రాగానే కాంగ్రెసు తప్ప 77 మంది శాసన సభ్యులు నిజాం అంటే ఇష్టంలేక వెళ్లిపోయారు. అసెంబ్లీ ఆ విధంగా ప్రారంభమైంది.

కానీ, అసంతృప్తివాదులు పార్టీలో తమకెంత బలం ఉందో తెలుసుకోలేక పోయారు. రామకృష్ణారావునే తిరిగి పార్టీ నాయకునిగా ఎన్నుకుంటూ ప్రవేశ పెట్టిన తీర్మానం అధిక సంఖ్యలో నెగ్గింది. రామకృష్ణారావుకు 88 ఓట్లు రాగా, ఆయనతో పోటీచేసిన బిందూకు 8 ఓట్లు, పూల్చంద్ గాంధీకి 3, వినాయక్‌రావు, మేల్కోటే, రంగారెడ్డికి చెరి రెండేసి ఓట్లు వచ్చాయి. ముఖ్యమంత్రి ఎన్నికల్లో మొదటి ఓటమి పొందిన స్వామీజీకి ఇది రెండవ ఓటమి అయింది. అసలు బూర్గుల ముఖ్యమంత్రి కావటంతోనే స్వామీజీ బలం తగ్గింది. తర్వాత స్వామీజీ శిష్యులంతా మంత్రివర్గం నుండి వేరుచేయబడ్డారు. ఆ తాకిడితో వి. బి. రాజు, పూల్చంద్‌గాంధీ, శంకర్‌దేవ్, చంద్రగీ పోయారు. కానీ ముఖ్యమంత్రి కోరిక మీద ఒక్క శంకర్‌దేవ్ మాత్రమే రాజీనామా ఉపసంహరించుకున్నాడు. మంత్రి వర్గ పునర్నిర్మాణంలో గోపాలరావు ఎక్బోటేను క్యాబినెటు మంత్రిగా తీసుకొని, మరో ఏడుగుర్ని ఉపమంత్రులుగా నియమించాడు ముఖ్యమంత్రి.

### తగ్గని విభేదాలు :

స్వామీజీ తరువాత రంగారెడ్డి మంత్రిగానే ఉంటూ ఆరు మాసాల వరకు ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్ష పదవి కూడా నిర్వహించాడు. అటు తర్వాత మల్లప్ప కొల్లూరు కాంగ్రెస్ అధ్యక్షు డయ్యాడు.

స్వామీజీ రాజకీయాలనుండి నిష్క్రమించినా శాంతియుతమైన వాతావరణములో కాంగ్రెసు నావ ఏ ఒడిదుడుకులు లేకుండా గట్టుకు చేరలేదు. రామకృష్ణారావు, రంగారెడ్డి, చెన్నారెడ్డిల మధ్య పరస్పర స్పర్ధలు, అపోహలు తగ్గలేదు.

1955లో తిరిగి ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్ష పదవికి ఎన్నికలు జరిపించవలసి వచ్చాయి. స్వామీజీ ఆశీస్సులు పొంది ముఖ్యమంత్రి అభ్యర్థిగా మళ్ళీ పోటీ చేశాడు. మల్లప్ప కొల్లూరు, రెడ్డిగ్రూపు జె. వి. నరసింగరావును నిలబెట్టి మల్లప్ప కొల్లూరుని ఓడించింది. దీనితో రామకృష్ణారావు, రంగారెడ్డి, చెన్నారెడ్డిల మధ్య అపోహలు తారాస్థాయికి చేరుకున్నాయి. 1955 మే 2వ తేదీన డాక్టర్ చెన్నారెడ్డి నుంచి ముఖ్యమంత్రి ప్లానింగ్, అభివృద్ధి శాఖలు లాగేసుకున్నారు.

స్వామీజీ ముఖ్య శిష్యుడుగా ఉంటూ బూర్గుల మంత్రివర్గంలో సభ్యుడుగా రామకృష్ణారావు, రంగారెడ్డి, చెన్నారెడ్డిలను బాగా ఢీకొన్న వి. బి. రాజుకు రామ

కృష్ణ, రంగారెడ్డి, చెన్నారెడ్డిల స్పర్థలు ఇప్పుడు మంచి అవకాశమిచ్చాయి. ఈ అవకాశాన్ని ఆయన పూర్తిగా ఉపయోగించుకున్నాడు. ముఖ్యమంత్రికి అండగా నిలిచి రంగారెడ్డి, చెన్నారెడ్డిలతో పోట్లాటకు ముందు నిలుచున్నారు. తన పూర్వ స్థానాన్ని సంపాదించుకున్నారు.

యుక్తులు, ఎత్తుకు పైఎత్తులలో రాజు దిట్ట. సమయస్ఫూర్తి, రుజువర్తనం పార్టీలో పార్టీలను నిర్మించుకునే సామర్థ్యం, చతురత కలిగిన రాజనీతిజ్ఞుడుగా ఆయన ప్రసిద్ధుడైనాడు. ముఖ్యమంత్రి రామకృష్ణారావు విశాలాంధ్రను బలపరస్తున్నప్పుడు ఆయనకు పూర్తి మద్దతు ఇచ్చారు.

పలు భాషలు మాట్లాడేవారు, అతివాదులు, మితవాదులు, మాజీ జాగీర్దారీ తెగవారు మొదలైన ఎన్నో వర్గాల వారిని ఆకట్టుకుంటూ పరిపాలన జరపాలంటే ఏ ముఖ్యమంత్రికైనా కష్టమైన పనే. దానితో విసుగెత్తి పోయాడు రామకృష్ణారావు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడే వరకు తెలంగాణాలో బూర్గుల అధికారమే ఉంది. నాలుగేళ్లు అవిచ్ఛిన్నంగా పాలించిన తెలుగు వారి మొదటి ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావే.

కురువృద్ధులకు వీడ్కోలు :

ఉమ్మడి మద్రాసు రాష్ట్రం నుంచి విడివడి ఆంధ్రరాష్ట్రం ఏర్పడే సమయంలో అసెంబ్లీలోని మొత్తం 140 స్థానాలలో వివిధ పార్టీల బలాబలాలు :- కాంగ్రెస్ 51, కమ్యూనిస్టులు 43, కె. ఎల్. పి. 14, ప్రజా పార్టీ 6, ప్రజా సోషలిస్టు పార్టీ 15, షెడ్యూల్డ్ కాస్ట్స్ ఫెడరేషన్ 2, ఇండిపెండెంట్లు 9 మంది.

ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షుడు నీలం సంజీవరెడ్డి ఆనాడు శాసన సభ్యుడు కారు. 1952 అసెంబ్లీ ఎన్నికలలో ఓడిపోయిన తరువాత ఆయన ఢిల్లీలో రాజ్యసభ స్థానం సంపాదించుకున్నారు. ఆంధ్రలో కౌన్సిల్ లేదు. ఏ. బలరామిరెడ్డి రాజీనామా చేయగా కాళహస్తి నియోజక వర్గంనుంచి సంజీవరెడ్డి అసెంబ్లీకి ఎన్నికయ్యారు. నలభై ఏళ్ళు నిండీ నిండని సంజీవరెడ్డి యువ నాయకుని క్రింద లెక్క. కురువృద్ధులైన ప్రకాశం, రంగాలు రాజకీయాల నుంచి విరమించుకోలేదు. వారు భీష్మించి కాంగ్రెస్ నుంచి వెళ్ళిపోయి సొంత పార్టీలు పెట్టుకున్నారు. ఆంధ్ర అసెంబ్లీలో కాంగ్రెసుకు పూర్తి మెజారటీ లేదు. ఇత

పార్టీల సహాయం లేనిదే ప్రభుత్వం ఏర్పాటు చేసే అవకాశం దానికి లేదు. పైగా నెహ్రూతో సహా ప్రకాశం లేని మంత్రివర్గం తలలేని మొండెం అన్నారు. తన వ్యక్తిగత ఔన్నత్యంతో అన్ని పార్టీలకు అతీతంగా ఆంధ్రులకు ఏకైక నాయకుడుగా ప్రకాశం పంతులు ఉండాలని నెహ్రూ అభిలషించారు.

ప్రకాశం ముఖ్యమంత్రిగా ఇతర పార్టీల సహాయంతో మంత్రివర్గం ఏర్పడింది. మన దేశంలో మిశ్రమ మంత్రివర్గాలు మొదటినుంచి ఏర్పడుతున్నాయి. ప్రకాశం మంత్రివర్గంలో నీలం సంజీవరెడ్డి ఉప ముఖ్యమంత్రి. తెన్నేటి విశ్వనాథం, గౌతు లచ్చన్న, దామోదరం సంజీవయ్య, పట్టాభి రామారావు, కడప కోటిరెడ్డి మంత్రులు. ఇందులో నలుగురు రాయలసీమవారే. నీలం సంజీవరెడ్డి ఉప ముఖ్యమంత్రి కాగానే రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్ష పదవికి రాజీనామా చేశారు. ఆయన స్థానంలో బెజవాడ గోపాలరెడ్డి ఎన్నికయ్యారు. రాజధాని విషయంలో వచ్చిన తగాదాలో పడి కొద్ది రోజులకే గౌతు లచ్చన్న మంత్రి పదవికి రాజీనామా చేశాడు.

గవర్నరు త్రివేదితో ముఖ్యమంత్రి ప్రకాశం సంబంధాలు అంతంతగానే ఉండేవి. శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం ఏర్పడినప్పుడు యూనివర్శిటీలకు గవర్నరు ఛాన్సలర్‌గా ఉండే ఆచారాన్ని, సంప్రదాయాన్ని పక్కకుపెట్టి, ఆంధ్ర హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ కోకా సుబ్బారావును ఛాన్సలర్‌గా నియమించారు ప్రకాశం. దీన్ని అవమానంగా భావించుకొని విశ్వవిద్యాలయ ప్రారంభోత్సవానికి గవర్నరు హాజరు కాలేదు. అంతేకాదు; ప్రకాశం పడిపోయిన తరువాత శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి కూడా గవర్నర్ ఛాన్సలర్‌గా ఉండే చట్టం తెచ్చారు గవర్నరు శ్రీ చందూలాల్ మాధవలాల్ త్రివేది.

మంత్రివర్గ పతనం :

అదేం ఖర్మమోగానీ ప్రకాశం పంతులు మంత్రివర్గాలు రెండూ రెండే. ఈ సారి అది 13 నెలలే అధికారంలో ఉన్నది. మద్యపాన నిషేధ విషయంపై ప్రభుత్వం శాంతి రామమూర్తి సంఘాన్ని నియమించింది. అది నిషేధం రద్దు చేయమని సూచించింది. ప్రభుత్వానికి ఆ సూచన అమలుపరచడానికి కాంగ్రెస్ సిద్ధాంతం అడ్డు వచ్చింది. ఈ సూచనను అమలు పరచనందుకు ప్రభుత్వంపై అవిశ్వాస తీర్మానం ప్రవేశపెట్టారు గౌతు లచ్చన్న. మంత్రివర్గంపై కమ్యూనిస్ట్ర

ఉన్న న్యాయకంటి శంకరరెడ్డి, అడుసుమిల్లి సుబ్రహ్మణ్యం వ్యతిరేకంగా ఓటు చేశారు. ఒకే ఒక ఓటుతో ప్రథమాంధ్ర మంత్రివర్గం పతనమైంది. ప్రతిపక్ష బలంవల్ల కాక నలుగురు స్వపక్షీయుల వెన్నుపోటువల్ల ప్రథమాంధ్ర ప్రభుత్వం పడిపోయింది.

మధ్యంతర ఎన్నికలు :

ప్రకాశం మంత్రివర్గం పతనంతో రాష్ట్రంలో 1954 నవంబర్‌లో రాష్ట్రపతి పాలన విధించబడింది. 1955లో జరిగిన మధ్యంతర ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీ కె. ఎల్. పి., ప్రజా పార్టీలతో పొత్తు కుదుర్చుకున్నది. నియోజక వర్గాల పునర్విభజనతో 140 స్థానాల సంఖ్య 194 స్థానాలకు పెరిగింది. అధికారం తమకు లభిస్తుందన్న ఆశతో కమ్యూనిస్టులు పెద్ద ఆర్భాటంతో రంగంలో దిగారు. ప్రధాని నెహ్రూ, కాంగ్రెస్ అధ్యక్షుడు ధేబర్, ఎస్. కె. పాటిల్ మొదలైన అగ్ర నాయకులు కాంగ్రెస్ తరపున ప్రచారాలు చేశారు. యునైటెడ్ కాంగ్రెస్ పార్టీకి 147 స్థానాలు లభించాయి. 1952 ఎన్నికలలో కాంగ్రెస్‌వారికి పట్టిన గతే యీ ఎన్నికలలో కమ్యూనిస్టులకు పట్టింది. ఆ పార్టీ దిగ్గజాలు తరిమెల నాగిరెడ్డి బసవపున్నయ్య, మోటూరి హనుమంతరావు, చండ్ర రాజేశ్వరరావుతో సహా పలువురు ఓడిపోయారు. ఐక్య కాంగ్రెసు తరపున ఓడిపోయిన ప్రముఖుడు తెన్నేటి విశ్వనాథం ఒక్కరే. ప్రకాశం పంతులు గెలిచారు. ఆనాటికి ఆయన వయస్సు 86 సంవత్సరాలు.

గోపాలరెడ్డి మంత్రివర్గం :

ఎన్నికల అనంతరం అధిష్టానవర్గం సలహాపై డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి ముఖ్యమంత్రి అయినాడు. నీలం సంజీవరెడ్డి మళ్ళీ ఉపముఖ్యమంత్రిగా ఉండిపోయారు. కళా వెంకట్రావ్, చంద్రమౌళి, గౌతులచ్చన్న, సంజీవయ్య, ఎ. బి. నాగేశ్వరరావు, నీరుకొండ రామారావు, ఓబులరెడ్డి తదితర మంత్రులు.

గోపాలరెడ్డి ముఖ్యమంత్రి కాగానే రాష్ట్రకాంగ్రెసు అధ్యక్ష పదవికి రాజీనామా చేయవలసి వచ్చింది. కె. ఎల్. పి. మద్దతు చూచుకొని గోపాలరెడ్డి ఆచార్య రంగాను నిలబెట్టారు. సంజీవరెడ్డి సహాయంతో అల్లూరి సత్యనారాయణరాజు పోటీ చేశారు. 1955 జూన్ 4న ఎన్నికలు జరిగాయి. 20 ఓట్ల మెజారిటీతో అల్లూరి

గెలిచారు. అంటే సంజీవరెడ్డి, గోపాలరెడ్డి గ్రూపులు పోటీ పడగా సంజీవరెడ్డి గ్రూపు గెలిచిందన్నమాట. కొంతకాలం సంజీవరెడ్డి, అల్లూరి స్నేహం 'కృష్ణార్జుల' వలె వర్థిల్లింది. ఆంధ్రప్రదేశ్ ఏర్పడేవరకు గోపాలరెడ్డి ప్రభుత్వమే అధికారంలో ఉన్నది.

1955 మధ్యంతర ఎన్నికలతో ఆంధ్రప్రదేశ్‌లో కురువృద్ధుల తరం అంతరించిందనే చెప్పాలి. ప్రకాశం వృద్ధాప్యంవల్ల నాయకత్వానికి పోటీ చేయలేదు. పట్టాభి మధ్యప్రదేశ్ గవర్నర్‌గా వెళ్లిపోయారు. రంగాది ఒంటరి బ్రతుకు అయిపోయింది. ఆయన దరిమిలా 'రైతుజన బాంధవుడు'గా మిగిలిపోయారు.

సంజీవరెడ్డి నాయకత్వం :

1956 నవంబరు ఒకటవ తేదీన ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. రాష్ట్ర నాయకత్వానికి డా. బెజవాడ గోపాలరెడ్డి, నీలం సంజీవరెడ్డి పోటీ పడ్డారు. ఆంధ్రప్రదేశ్ ఏర్పాటుతో తొమ్మిది జిల్లాల తెలంగాణా ఒక కొత్త శక్తిగా రూపొందింది. తెలంగాణా శాసనసభ్యులలో ఎక్కువ మంది సంజీవరెడ్డిని బలపరిచారు. సంజీవరెడ్డి ముఖ్యమంత్రి అయ్యారు. తనను వ్యతిరేకించిన చెన్నారెడ్డిని మంత్రివర్గంలో తీసుకొనలేదు సంజీవరెడ్డి. ఆంధ్ర ప్రాంతం వారికి ముఖ్యమంత్రి పదవి లభిస్తే తెలంగాణా ప్రాంతం వారికి ఉప ముఖ్యమంత్రి పదవి ఇవ్వాలనే పెద్ద మనుషుల ఒప్పందంలోని షరతును సంజీవరెడ్డి అంగీకరించలేదు. బూర్గుల కేరళ గవర్నరుగా వెళ్లిపోవడంతో రాష్ట్ర రాజకీయాలలో సంజీవరెడ్డి తిరుగులేని నాయకుడయ్యాడు.

1957 లో ఒక్క తెలంగాణా ప్రాంతంలోనే శాసన సభకు ఎన్నికలు జరిగాయి. 1955 లో ఎన్నికైన ఆంధ్రరాష్ట్ర శాసన సభ్యుల పదవీకాలాన్ని 1962 వరకు పొడిగించారు. ఈ ఎన్నికలు ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెసును గట్టి పరిచినవి.

ఈ ఎన్నికలలో కాంగ్రెసు పార్టీ తెలంగాణాలోని 105 స్థానాలకు పోటీచేసి 67 స్థానాలను గెలిచింది. ప్రజాసోషలిస్టు పార్టీ ఒక్కస్థానం మాత్రమే గెలిచింది. అది ఆదిలాబాద్ జిల్లాలో కోదాటి రాజమల్లు గెలుచుకున్న స్థానం. పీపుల్సు డెమో

క్రటిక్ ఫ్రంటు పేరుమీద కమ్యూనిస్టుపార్టీ 64 స్థానాలకు పోటీచేసి 22 స్థానాలను గెలుచుకున్నది. అంటే గత ఎన్నికలలో ఈ పార్టీ గెలుచుకున్న స్థానాలలో ఇది సగం అన్నమాట. ఈ ఎన్నికలలో కమ్యూనిస్టుల బలం చెప్పుకోదగ్గంతగా లేదు. ఎన్నికల అనంతరం హైదరాబాద్ కాంగ్రెసు కమిటీ రద్దయిపోయి ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కమిటీ ఏర్పడింది. దీనికి అల్లూరి సత్యనారాయణరాజు అధ్యక్షుడైనాడు ఇక్కడ కూడా కాంగ్రెసు పార్టీ ముందుచూపుతో వ్యవహరించలేక పోయింది. ఆంధ్రప్రాంతం వారికి ముఖ్యమంత్రి పదవి ఇస్తే తెలంగాణా ప్రాంతం వారికి ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్ష పదవి ఇవ్వాలనే ఒప్పందాన్ని ఎవరు పట్టించుకోలేదు. 1958 లో ఆంధ్రప్రదేశ్ లెజిస్లేటివ్ కౌన్సిల్ ఏర్పడింది. సంజీవరెడ్డి పరిపాలన మూడు సంవత్సరాల రెండు మాసాలు కొనసాగింది. అటు తర్వాత అఖిల భారత కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడుగా ఆయన ఢిల్లీ వెళ్ళిపోయాడు.

**అధికారంలో సంజీవయ్య :**

సంజీవరెడ్డి స్థానంలో రాజీ అభ్యర్థిగా దామోదరం సంజీవయ్య ముఖ్యమంత్రిగా ఎన్నికయ్యారు. ఇప్పుడు రాష్ట్ర రాజకీయాలలో మూడు వర్గాలు తలెత్తాయి. 1) సంజీవరెడ్డి వ్యతిరేక వర్గం, 2) అధికారదాహం కల వర్గం, 3) వెనుకబడ్డ కులాల వర్గం.

పెద్దమనుషుల ఒప్పందాన్ని సంజీవయ్య అమలు పరచటానికి ప్రయత్నించి తెలంగాణా నాయకులకు ఉప ముఖ్యమంత్రి పదవి, ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్ష పదవు లిచ్చినా అవి మూతా తగాదాల వరకే ఉండిపోయాయి. మంత్రి వర్గంలో 'యూనిటీ ఫ్రంట్' అనే అసమ్మతి ఏర్పడింది. ఈ సమయంలో వచ్చిన ఎన్నికలలో అభ్యర్థులను నిర్ణయించడానికి ఒక కమిటీ నియమించవలసి వచ్చింది. ఈ కమిటీలో ముఖ్యమంత్రి తరపున అల్లూరి సత్యనారాయణరాజు తన వర్గం వారికే ఎక్కువ స్థానాలిచ్చారని చెప్పి యూనిటీఫ్రంట్ అధిష్టానవర్గానికి ఫిర్యాదు చేసింది. ఈ రగడలోపడి ఎ. సి. సుబ్బారెడ్డి తన మంత్రి పదవి కోల్పోయాడు.

అఖిల భారత కాంగ్రెసు కమిటీ అధ్యక్షులైన సంజీవరెడ్డి ఎలక్షన్ కమీషన్ ఎన్నికలను నిబంధనావళి ప్రకారం జరిపించలేదనే సాకుతో ఎన్నికలను రద్దు చేయించారు. కొత్తగా కమీషన్ ఎన్నికలు జరిపించ వలసిందని ఆంధ్రప్రదేశ్ వ్యవహారాలు చూస్తున్న శ్రీ గోవిందవల్లభ పంత్ ద్వారా ఆదేశాలు పంపించారు.

పొందివున్న శక్తుల కేంద్రీకరణ కిది మంచి అవకాశం కల్పించింది. ఎన్నికల కమిటీని యూనిటీ ఫ్రంటువారు హస్తగతం చేసుకున్నారు. ముఖ్యమంత్రి సంజీవయ్య ఖిన్నుడయ్యారు.

1962 ఫిబ్రవరిలో జరిగిన మూడవ సార్వత్రిక ఎన్నికలలో ఈ అంతః కలహాల వలన కాంగ్రెసు పార్టీ 50 సీట్లను పోగొట్టుకుంది. ఎన్నికల ఫలితాలు కాంగ్రెస్ 175, సి. పి. ఐ. 51, స్వతంత్ర పార్టీ 19, ఇండిపెండెంట్లు 51, సోషలిస్టు పార్టీ 2, నామినేటెడ్ 1, అప్పట్లో ఖాళీ 1, మొత్తం 300.

ఎన్నికల తరువాత తిరిగి సంజీవరెడ్డి ముఖ్యమంత్రి అయ్యారు. సంజీవయ్య అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షుడయ్యారు. 1964లో రోడ్డు రవాణా కేసులో సుప్రీం కోర్టు తనకు వ్యతిరేకంగా ఇచ్చిన తీర్పు ఫలితంగా సంజీవరెడ్డి ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేశారు. సంజీవరెడ్డి స్థానంలో శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రి అయ్యారు.

బ్రహ్మానందీయం :

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో అఖిల భారత స్థాయిలో నాయకులైన అవకాశం ఎవరికి లభించినా అందులో స్థానబలం హెచ్చు. తన బలం తక్కువ. అందువల్ల వీరు ఎంత ఉన్నత పీఠంలోవున్నా రాష్ట్ర రాజకీయాలపై తమకున్న వ్యామోహాన్ని వదులుకోలేకపోయారు. కేంద్రంలో ఉన్న శ్రీ సంజీవరెడ్డి ఢిల్లీనుంచే ఈ హెచ్చరికలు చేయడం మొదలు పెట్టారు. దీనితో ముఖ్యమంత్రికి సంజీవరెడ్డికి మధ్య పచ్చిగడ్డి వేస్తే భగ్గున మండే పరిస్థితులు ఏర్పడ్డాయి.

1967 ఎన్నికలలో అఖిల భారత స్థాయిలో కాంగ్రెసు దెబ్బతిన్నా ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెసుకు బలం చెక్కుచెదరలేదు. ఎన్నికల ఫలితాలు : కాంగ్రెస్ 164, సి. పి. ఐ. 10, స్వతంత్ర 24, సి. పి. ఎం. 9, జనసంఘం 3, రిపబ్లికన్ పార్టీ 2, జనకాంగ్రెస్ 20, పీపుల్స్ డెమోక్రటిక్ పార్టీ 34, ఇండిపెండెంట్లు 17, నామినేటెడ్ 1, మొత్తం స్థానాల సంఖ్య 287. బ్రహ్మానందరెడ్డి నాయకత్వంలో రాష్ట్రం సర్వతోముఖంగా అభివృద్ధి సాధించింది.

1969_71 లలో తెలంగాణా ప్రత్యేక రాష్ట్ర ఉద్యమం ఉల్కాపాంతలా జనాన్ని హడలుగొట్టింది. లోక్‌సభకు 1971 లో జరిగిన మధ్యంతర ఎన్నికలలో

వెల్లువలా విజృంభించిన తెలంగాణా ప్రజాసమితి మహా వృక్షాలనుకున్న వారిని పెకిలించింది. తెలంగాణాలోని 14 సీట్లకు పోటీచేసి 10 సీట్లను గెలుచుకుంది. రాష్ట్రస్థాయిలో ముఖ్యమంత్రిని వ్యతిరేకించిన ప్రజాసమితి జాతీయస్థాయిలో ఇందిరాగాంధీకి అనుకూలం. కాంగ్రెసులో చేరవలసిందని ప్రధాన మంత్రి ఇందిరాగాంధీ విజ్ఞప్తిని రాష్ట్ర నాయకత్వాన్ని మార్చాలన్న షరతుతో ఒగించాడు చెన్నారెడ్డి. రాష్ట్ర నాయకత్వం మార్పునకు వీలుగా బ్రహ్మానందరెడ్డిని రాజీనామా చేయమని కాంగ్రెసు పార్లమెంటరీ బోర్డు ఆదేశించింది. రాష్ట్రంలో బలపడి పోయిన ముఖ్యమంత్రులను తొలగించాలన్న ఇందిరాగాంధీ వ్యూహంలోని భాగమే బ్రహ్మానందరెడ్డిని రాజీనామా చేయించడమని కొందరి అభిప్రాయం. బ్రహ్మానందరెడ్డి రాజీనామా చేయడంతో చెన్నారెడ్డి వర్గం కాంగ్రెసులో చేరింది. దీనితో బ్రహ్మానందరెడ్డి, చెన్నారెడ్డి పరస్పరం ఒండొరులను కూలదోసుకునే ప్రయత్నములో ఒక పార్టీ పుట్టి గిట్టనట్లయింది. ఎందరో మహానుభావుల కృషి ఫలితంగా ఏర్పడ్డ ఆంధ్రప్రదేశ్ విచ్ఛిత్తికి తాను కారకుడు కారాదన్న పట్టుదలతో తన సర్వ శక్తులతో రాష్ట్ర సమైక్యతను కాపాడారు బ్రహ్మానందరెడ్డి.

ముఖ్యమంత్రిగా పి వి. :

కాంగ్రెస్ అధిష్టానవర్గం పి. వి. నరసింహారావును నాయకుడుగా ఉండాలని నిర్ణయించింది. వి. బి. రాజు, నూకల రామచంద్రారెడ్డి, కొండాలక్ష్మన్, చెన్నారెడ్డి వంటి తెలంగాణా సీనియరు నాయకులకు పి. వి. ముఖ్యమంత్రి కావడం ఇష్టంలేదు. పి. వి. బ్రహ్మానందరెడ్డికి నమ్మకస్తుడైన అనుచరుడు.

1972 అసెంబ్లీ ఎన్నికలు పి. వి. నరసింహారావు సారధ్యంలోనే జరిగాయి. ఇందిరాగాంధీ వ్యూహం ప్రకారం అగ్రకులాల ప్రభావం తగ్గించి బడుగు వర్గాల వారిని అసెంబ్లీకి నిలిపి గెలిపించడంలో పి. వి. కృతార్థుడయ్యాడు. ఈ ఎన్నికలలో కాంగ్రెసుకు 213 సీట్లు లభించాయి. అంటే 1967 ఎన్నికలలో గెలిచిన సీట్లకంటె 50 సీట్లు ఎక్కువ అన్నమాట. ఇతర పార్టీలు గెలిచిన స్థానాలు: స్వతంత్ర పార్టీ 20, సి. పి. ఐ. 20, సి. పి. ఎం. 7, సంపూర్ణ తెలంగాణా ప్రజాసమితి 1, మజ్లిస్ గెలుచుకున్న మూడు స్థానాలను కలుపుకొని ఇండిపెండెంటు, ఇతరులు 50 స్థానాలు.

పి. వి. నరసింహారావు 15 నెలల అధికారంలో రాష్ట్రంలో భూసంస్కరణల అమలుకు కృషి జరిగింది. భూ కమతాలపై పరిమితులు విధిస్తూ ప్రగతిశీల విధానాలను అమలు పెట్టిన ముఖ్యమంత్రిగా పి. వి. కి పేరు వచ్చింది. ఆయన మార్గంలో అనేక రాష్ట్రాలు భూ సంస్కరణల అమలును చేబట్టాయి.

1973 లో ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం కొరకు ప్రచండ ఉద్యమం బయలు దేరింది. ఈ సమయంలో శాసనసభకు 6 ఉప ఎన్నికలు జరిపించవలసి వచ్చాయి. వాటిలో మూడు ఆంధ్రప్రాంతంలోనివే. ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర పోరాటానికి నాయకత్వం వహించిన 'జై ఆంధ్ర ఫ్రంటు' పోటీ చేసినచోట్ల ఒక్క సీటైనా గెలవకపోవడం ఒక విశేషం. ప్రత్యేక రాష్ట్ర ఉద్యమం తగ్గినా పి. వి. రాజీనామా చేయక తప్పలేదు. ఆయన అధికార పతనానికి ఆయన అమలుపరిచిన భూ సంస్కరణలే ఒకవిధంగా కారణమయ్యాయని కొందరు విమర్శకుల అభిప్రాయం. 1973 జనవరి 18వ తేదీ విధించిన రాష్ట్రపతి పాలన 1974 జనవరి 23 వరకు కొనసాగింది.

జలగం పాలన :

అసెంబ్లీలో మెజారిటీ ఉన్న పి. వి. ని తొలగించి కాంగ్రెస్ హైకమాండ్ జలగం వెంగళరావును ముఖ్యమంత్రిగా చేసింది. సమర్థుడైన ముఖ్యమంత్రిగా పేరు తెచ్చుకున్న జలగం వెంగళరావుకు పార్టీలో చెప్పుకోదగ్గ బలం లేదు. ఎమర్జెన్సీ ఎత్తివేసిన తరువాత కాని ఇది ప్రస్ఫుటం కాలేదు. మంత్రుల సంఖ్యను పెంచుతూ అసంతృప్తివాదులను తృప్తిపరుస్తూ వచ్చారు వెంగళరావు. 12 మంది సభ్యులతో ప్రారంభమైన వెంగళరావు మంత్రివర్గం 1977 సెప్టెంబర్ నాటికి 35 వరకు పెరిగింది. వెంగళరావు తన మంత్రివర్గంలో నాలుగుసార్లు మార్పులు చేశారు.

1977 లో లోక్‌సభకు జరిగిన ఎన్నికలలో ఆంధ్రప్రదేశ్‌లో ఒక్క నంద్యాల స్థానాన్ని తప్ప అన్ని స్థానాలను కాంగ్రెసు (ఐ) గెలుచుకుంది. నంద్యాలలో జనతాపార్టీ విజయం సంజీవరెడ్డి వ్యక్తిగత విజయం. ఎందుకంటే 1978 లో యీ నియోజకవర్గంలో సంజీవరెడ్డి రాజీనామా చేయగా జరిగిన ఉప ఎన్నికలలో కాంగ్రెస్ అభ్యర్థి పెండేకంటి వెంకటసుబ్బయ్య గెలిచారు.

## ఎన్నికలు :

1978 ఫిబ్రవరిలో అసెంబ్లీకి జరిగిన ఎన్నికలలో అధికారం కైవసం చేసుకోవాలన్న విపరీతమైన కాంక్షతో జనతా, కాంగ్రెస్, ఇందిరా కాంగ్రెస్ మహా తీవ్రంగా పోటీ చేశాయి. ఏ పార్టీకి రాష్ట్రంలో మెజారటీ రాదనుకున్న రాజకీయ జ్యోతిష్కులందరికీ యీ ఎన్నికల ఫలితాలు సంభ్రమాశ్చర్యాలు కలిగించాయి. ఇందిరా కాంగ్రెస్ నిర్మాణరీత్యా కొత్తదే అయినా ప్రజలు ఆ పార్టీని ఆమె పేరుతో గెలిపించారు. ఈ ఎన్నికలలో ఇందిరా కాంగ్రెస్‌కు 175, జనతాకు 50, అధికార కాంగ్రెస్‌కు 30, సి. పి. ఐ. 6, సి. పి. ఎం. 8, ఇండిపెండెంట్లకు 15 స్థానాలు వచ్చాయి. ఎన్నికలలో తమ పార్టీకి సంభవించిన ఓటమి వలన వెంగళరావు మంత్రివర్గం రాజీనామా చేసింది. కాంగ్రెస్ (ఐ) రాష్ట్రశాఖ అధ్యక్షుడైన డాక్టర్ మర్రి చెన్నారెడ్డి ముఖ్యమంత్రి అయినారు. విధానసభలో ప్రతిపక్ష నాయకుడైన గౌతు లచ్చన్నకు మంత్రి హోదా లభించింది.

## చెన్నారెడ్డి అధికారం :

చెన్నారెడ్డి పరిపాలనలో రాష్ట్ర కాంగ్రెస్ (ఐ) లో అంతర్గత విభేదాలు తీవ్రస్థాయికి చేరుకున్నాయి. ముఖ్యమంత్రి పదవికోసం ఆశించి విఫలుడైన రాజారాం మంత్రివర్గంలోనే ఉంటూ అసమ్మతి వర్గానికి నాయకత్వం వహించారు. శ్రీమతి ఇందిరాగాంధీ తిరిగి అధికారంలోకి రాగానే అసమ్మతి వాదులకు మంచి పట్టు లభించింది. ఇందిరా కాంగ్రెస్‌కు చెందిన మొత్తం 255 మంది అసెంబ్లీ సభ్యులలో 187 మంది, విధాన పరిషత్‌లోవి 40 మంది కాంగ్రెస్ సభ్యులలో 29 మంది ముఖ్యమంత్రిని తొలగించాలని సంతకం చేసినట్లు రాజారాం ప్రకటించి, తన కోట దుర్భేధ్యం అన్నాడు. ముఖ్యంగా తన రెండున్నర ఏళ్ళ పరిపాలనలో చెన్నారెడ్డి మిత్రులకంటే శత్రువులనే ఎక్కువ సృష్టించుకున్నారు.

అసమ్మతి వర్గీయులకు తన మద్దతులేదని శ్రీమతి ఇందిరాగాంధీ ప్రకటిస్తే మెజారిటీ నిరూపించుకో గలనని ముఖ్యమంత్రి చెప్పుతూ వచ్చారు. కానీ మెజారటీ మద్దతు తనకు ఉన్నదని ముఖ్యమంత్రి భావించి స్వచ్ఛందంగా పార్టీలో విశ్వాస తీర్మానం ద్వారా ఓటింగ్ పొందడానికి ప్రయత్నించలేదు. ఈ ప్రతిష్టంభన ఐదు నెలలు కొనసాగింది. ప్రభుత్వ యంత్రాంగం దీనితో అస్తవ్యస్తమైంది.

ఎట్టకేలకు 1980 అక్టోబర్ 10వ తేదీన ముఖ్యమంత్రి పదవికి చెన్నారెడ్డి రాజీనామా చేశాడు. పార్టీలో తిరుగుబాటు ఫలితంగానే ఆయన ఈ ఉన్నత పదవిని కోల్పోవలసి వచ్చింది. చొరవ, సాహసం కలిగిన నాయకుడుగా, పరిపాలనా దక్షుడుగా, కార్యశూరుడుగా పేరు తెచ్చుకున్నప్పటి సాహసం, సంయమనశక్తి లోపించడంవల్ల డాక్టర్ చెన్నారెడ్డి అన్ని వర్గాల ఆదరాభిమానాలను చూరగొనలేక పోయారు. దీనికితోడు ఆయన హయాంలో అవినీతి పెచ్చుపెరిగిందని లోకం కోడైకూసింది. ఆయన షష్టిపూర్తి సంరంభం విమర్శకు గురి అయింది. ఇది నిజంకాదని నిరూపించడానికి ఆయన ప్రయత్నించలేదు.

చెన్నారెడ్డి ముఖ్యమంత్రిగా ఉండగా ఏ పని చేపట్టినా స్వతంత్రంగా నిర్వహించేవారు. తాను పార్టీలో క్రమశిక్షణ గల సైనికుడనేవారు. కానీ, నేను శ్రీమతి ఇందిరాగాంధీకి దాసాను దాసుడనని ఏనాడు ఆయన అనలేదు. మంత్రి వర్గ ప్రతిష్టంభన కొనసాగుతుండగా ఆయన ఢిల్లీ వెళ్ళలేదు. దీన్ని అవకాశంగా తీసుకొని ఆయన ప్రత్యర్థులు ఇందిరాగాంధీకి చాడీలు చెప్పారు. చెన్నారెడ్డి తనకు తాను ఇందిరాగాంధీతో సమానుడుగా భావించుకొని, ఆ విధంగా ప్రచారం చేసు కుంటున్నాడని ఆమెకు అపోహ కలిగించారు. ముఖ్యమంత్రి చెన్నారెడ్డి, ప్రదేశ్ కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడు అజీజ్ అంగీకారంలేనిదే రాష్ట్రంలోని ఇతర రాజ కీయ పక్షాలకు చెందిన వారిని కాంగ్రెసు (ఐ) లో చేర్చుకోరాదని లెజిస్లేచర్ కాంగ్రెసు పార్టీ అఖిల భారత కాంగ్రెసు కమిటీని కోరింది. ఈ తీర్మానం శ్రీమతి ఇందిరాగాంధీ పట్ల ముఖ్యమంత్రి అవిధేయత సూచిస్తుందని అసమ్మతి వాదులు వాదించారు. ఒక్క విషయంలో చెన్నారెడ్డిని 'సెభాష్' అనక తప్పదు. ఆయన ఏనాడు తన ఆత్మాభిమానాన్ని ఢిల్లీలో వేలానికి పెట్టలేదు. ఆరుకోట్ల ప్రజల ముఖ్యమంత్రిగా, హుందాగా ప్రవర్తించారు. పదవి తనకు 'ఎడమకాలి గోరుతో సమానం' అన్నారు. పరువుగా, ఆత్మసంతృప్తితో పదవీ విరమణ చేసే అవకాశాన్ని కాంగ్రెస్ అధిష్టానవర్గం ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రులకు ఏనాడు ఇవ్వలేదు. డాక్టర్ చెన్నారెడ్డిని మూడు మాసాలపాటు ముప్పుతిప్పలు పెట్టారు. ఆయనపై తిరుగుబాటు చేయడానికి అసమ్మతి వాదులను దువ్వి, వారిని ప్రోత్సహించారు. మంత్రివర్గ సమావేశాలకు, మంత్రులు హాజరు కావడానికి నిరాకరించేటట్టు చేశారు. అసెంబ్లీని సమావేశపరచడానికి కానీ, పంచాయతీ సంస్థలకు ఎన్నికలు జరిపించడానికి కానీ చెన్నారెడ్డికి అనుమతించలేదు. గవర్నరుకు రాజీనామా లేఖను

పంపించమని అడిగారు. అంతలోనే పదవి నుండి పైబొలగడానికి అనుమతించక తాత్సారం చేస్తూ ఆయనకు చిత్తక్షోభ కలిగించారు.

ఎంతో అధికార దర్పంతో రెండు సంవత్సరాలు రాష్ట్రాన్ని పాలించిన చెన్నారెడ్డి పతన కారణాలు భావితరాలకు గుణపాఠాలు. విభేదాలు అంటే చీలికలు కావు. అసలు విభేదాల వల్ల తప్పనిసరిగా కీడు కలుగుతుందని భావించడం కూడా పొరపాటే. నాయకులమధ్య విభేదాలు ప్రస్ఫుటంగా వెల్లడైనప్పుడే సమస్యల గురించి సమగ్రంగా పరిశీలించడానికి పార్టీకి అవకాశం లభిస్తోంది. వాస్తవానికి క్రోధాద్వేషాలు లేని విభేదాలే మేలు. బాహికమైన సంపూర్ణ ఏకాభిప్రాయం చాలా ప్రమాదకరమైనది. ఏకాభిప్రాయం చాటున అధినేత పట్ల ఎంతైనా విరోధభావం దాగి ఉండొచ్చు. దీన్ని చెన్నారెడ్డి తన హయాంలో గ్రహించకపోవడం దుర దృష్టకరం. అంతేకాదు ప్రజాస్వామ్య వ్యవస్థలో రాజకీయ నాయకునికి ఉండ వలసిన నమ్రత, సర్దుబాటుతనం చెన్నారెడ్డిలో బహు తక్కువ. గాంధీ తరానికి చెందిన చివరి నాయకులలో ఎవ్వరికి తీసిపోనంత రాజకీయానుభవం చెన్నారెడ్డికి ఉన్నా, ఆయన తన శక్తి సామర్థ్యాలు స్వంత రాష్ట్రానికి ఉపయోగించలేక పోయారు. ఆయన పరిపాలన పూర్తికాలం సాగిఉంటే 1983 ఎన్నికలలో కాంగ్రెస్ (ఐ) అంత చిత్తుగా ఓడిపోయేది కాదని కొందరి అభిప్రాయం.

## అంజయ్య 'ఎయిర్‌బస్' మంత్రివర్గం :

డాక్టర్ చెన్నారెడ్డి స్థానంలో రాష్ట్ర ఎనిమిదవ ముఖ్యమంత్రిగా టంగుటూరి అంజయ్య 1980 అక్టోబర్ 11న ప్రమాణస్వీకారం చేశారు. మంత్రివర్గ నిర్మాణ ములో పూర్తి స్వేచ్ఛ అనుభవించారు అంజయ్య. ఆయన తన 'ఎయిర్‌బస్' మంత్రివర్గాన్ని ప్రకటించినప్పుడు చాలామంది చకితులైనారు. ఎంత ఎక్కువమంది మంత్రులు ఉంటే పరిపాలన అంత సౌష్టవంగా ఉంటుందని ఆయన విశ్వాసం. విమర్శలు శరపరంపరగా వచ్చిన తరువాతనే ప్రధాని జోక్యం చేసుకొని మంత్రి వర్గం సైజును కుదించమని చెప్పారు. ప్రతిపక్షాలనుంచి తమలో చేరిన వారిని అధిష్ఠానవర్గం అనుమతి తీసుకోకుండానే మంత్రివర్గంలో తీసుకున్న ఘనత కూడా అంజయ్యదే. దాదాపు ముగ్గురు శాసనసభ్యుల్లో ఒకరికి మంత్రిపదవో, తత్తుల్య మైన మరో పదవి అప్పగించారు అంజయ్య.

కాంగ్రెస్ (ఐ) మంత్రివర్గాల సంఖ్యా బలం సాధారణంగా దిగువసభ (అసెంబ్లీ) సభ్యుల మొత్తం సంఖ్యలో పదోవంతు మించకూడదు. ఇది ఏ. ఐ. సి. సి. చేసిన తీర్మానం. ఆ లెక్కన చూస్తే ఆంధ్రప్రదేశ్ శాసనసభ్యుల సంఖ్య 294. కాబట్టి రాష్ట్రంలో మంత్రుల సంఖ్య పరిమితి 30 కావాలి. నిజానికి కేంద్రంలోను, అనేక రాష్ట్రాలలోను యీ సూత్రాన్ని పాటించారు. 61మంది సభ్యులకు చేరిన అంజయ్య మంత్రివర్గం అధిష్ఠానవర్గం జోక్యంపై 45 కి తగ్గించవలసి వచ్చింది. తన 'ఎయిర్ బస్' మంత్రివర్గం, విస్తరణ, కుదింపులతో రాష్ట్ర రాజకీయాలను కొంతకాలం శ్రీ అంజయ్య వినోదభరితం చేశారు.

రాష్ట్ర వ్యవహారాలను అంజయ్య నిర్వహించిన తీరు బాగానే ఉంది. ఈ విధానాన్ని రిజర్వు బ్యాంక్ కూడా మెచ్చుకుంది. వోవర్ డ్రాఫ్టు లేకపోవడం రాష్ట్ర ఆర్థిక పరిస్థితి బాగుందనటానికి నిదర్శనం. ఆయన పరిపాలన అదనపు వనరుల సమీకరణకు కూడా ఉపయోగపడింది. ప్రజాస్వామిక చర్యలు అమలు చేసినప్పటికీ అంజయ్య కూడా ఏడాదిన్నర కంటె ఎక్కువ కాలం పదవిలో ఉండలేక పోయారు.

ఎన్. జనార్ధన్‌రెడ్డి ఒకవైపు, కోన ప్రభాకరరావు మరొకవైపు సాగించిన అసమ్మతి వర్గ కార్యకలాపాలు అంజయ్య మంత్రివర్గాన్ని మట్టి కరిపించాయి. ఢిల్లీలో సాగిన రాజకీయాలు అంజయ్యను పదవీ భ్రష్టుణ్ణి చేశాయి.

### ఆరు నెలలకే కూలిన భవనం :

అంజయ్య స్థానంలో 1982 ఫిబ్రవరి 29న భవనం వెంకట్రామ్ ముఖ్యమంత్రి అయ్యారు. ఫిరాయింపుదార్లను మంత్రివర్గంలో తీసుకోలేదు భవనం. కాంగ్రెస్ (ఐ) లెజిస్లేచర్ పార్టీలో ఫిరాయింపుదార్లు 70 మంది ఉన్నారు. అధిష్ఠానవర్గం 1980లో తిరుగుబాటుదార్ల వొత్తిడికి లొంగి చెన్నారెడ్డిని ముఖ్యమంత్రి పదవి నుంచి తొలగించినప్పుడు ప్రకోపించిన యీ వ్యాధి పూర్తిగా ముదిరి పోయింది.

క్రమశిక్షణారాహిత్యం మరీ అదుపు తప్పిపోయిందనటానికి భవనం హయాంలో రాజ్యసభ ఎన్నికలలో పార్టీ అభ్యర్థుల ఓటమి మంచి ఉదాహరణ. ఐదుగురు అభ్యర్థులలో పార్టీ అధ్యక్షురాలు శ్రీమతి ఇందిరాగాంధీ స్వయంగా

ఎంపిక చేసిన అభ్యర్థి ఎం. ఎం. హాషిం (మాజీ రాష్ట్రమంత్రి) ఘోరంగా ఓడిపోయి జనతా అభ్యర్థి గెలిచారు. ఇది అధిష్ఠాన వర్గానికి తీవ్ర అసంతృప్తి కలిగించింది. ఈలోగా సినీనటుడు ఎన్. టి. రామారావు తెలుగుదేశం పార్టీని స్థాపించారు. ఆయనను భవనం గట్టిగా ఎదుర్కోలేడని భావించి అధిష్ఠానవర్గం ఆరు నెలల లోపే భవనాన్ని గద్దెనుంచి దింపివేసింది. అప్పుడు కాంగ్రెస్ (ఐ) సంధించిన చివరి అస్త్రం కోట్ల విజయభాస్కరరెడ్డి.

అసెంబ్లీ ఎన్నికల దృష్ట్యా పార్టీ ఐక్యత కోసం విస్తృత ప్రాతిపదికపై మంత్రివర్గం ఉండాలని ముఖ్యమంత్రిని పార్టీ అధిష్ఠానవర్గం కోరింది. దీనితో 27 మందితో ప్రారంభమైన విజయభాస్కరరెడ్డి మంత్రివర్గం రెండు నెలలకే 32 కు పెరిగింది. నాలుగు సంవత్సరాలలో నలుగురు ముఖ్యమంత్రులు మారినట్లే నలుగురు పి. సి. సి. (ఐ) అధ్యక్షులు మారారు. (అజీజ్, కోన, దాస్, వెంకటస్వామి) కోట్ల హయాంలోనే అసెంబ్లీ ఎన్నికలు జరిగి ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కంచుకోట కూలింది.

ఢిల్లీ రాజకీయ రంగంలో తమ ముఖ్యమంత్రు లెందుకు నోరులేని పావులుగా మారిపోయారో ప్రజలు అర్థం చేసుకోలేకపోయారు. ఒకటి మాత్రం నిజమై కూర్చుంది. కాంగ్రెస్ ముఖ్యమంత్రుల ఎగుడు దిగుళ్ల ఆది దేవత ఆధీనాలు కావడం వల్ల అందుకు శ్రీమతి ఇందిరాగాంధీ రానున్న ఎన్నికలలో భారీ మూల్యం చెల్లించుకోవలసి వచ్చింది.



# తెలుగుదేశం పార్టీ సాఫల్య వైఫల్యాలు

1983 అసెంబ్లీ ఎన్నికలకు తొమ్మిది నెలల ముందు తెలుగుజాతి ఆత్మ గౌరవ పరిరక్షణ లక్ష్యంతో ప్రభంజనంలా ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రాజకీయ రంగంలో సినీ నటుడు ఎన్టీ రామారావు ప్రవేశించి 'తెలుగుదేశం' పార్టీని స్థాపించారు. ఈ ఎన్నికలలో తెలుగుదేశం పార్టీ ధాటికి తట్టుకోలేక దిగ్గజాలనుకున్న వారు మట్టికొట్టుకు పోయారు. పదవుల కోసం కీచులాటలు కాంగ్రెస్ పరాజయానికి కారణమైనాయి. కాంగ్రెస్‌కు మునుపటిలా వేళ్ళు తన్నుకున్న పార్టీ వ్యవస్థ లేదు. ఇప్పుడు పార్టీలు అంతా నాయకులే తప్ప కార్యకర్తలు లేరు. తెలుగుదేశం పార్టీ గెలవటానికి ఆ పార్టీకి గత చరిత్ర లేకపోవడమే కొంతవరకు కారణం. చరిత్ర లేని 'దేశం' అదృష్టవంతమైందన్నాడు ఒక పాశ్చాత్య రచయిత. ఎన్. టి. రామారావు కాంగ్రెసేతర పార్టీ ముఖ్యమంత్రిగా పదవీ స్వీకారం చేశారు.

## గవర్నరు తప్పుడు చర్య :

తెలుగు సినిమారంగంలో దాదాపు ముప్పయ్ ఏళ్ళు తిరుగులేని నాయకుడుగా చెలామణీ అయిన ఎన్. టి. ఆర్. 'అలవాటుపడ్డ నటన'తో రాష్ట్రాన్ని పాలించడం మొదలుపెట్టగానే తెలుగుదేశం పార్టీలో ముసలం పుట్టింది. 'దేశం' పార్టీ రెండుగా చీలినప్పుడు కాంగ్రెస్ ఓరిమితో దాని పరిణామాలను ఎదురుచూడవలసి ఉండగా- అధికార అరణ్యవాసం భరించలేని కాంగ్రెస్ 'దేశం' తిరుగుబాటు వర్గంతో మిలాఖత్ అయి గవర్నరు చేత ఎన్. టి. ఆర్. ప్రభుత్వాన్ని కూలద్రోయించింది. దీనితో తేనెతుట్టను కెలికినట్లయింది. సాధారణంగా తన నిర్ణయాలను పునరాలోచించుకునే అవకాశం ఇవ్వని శ్రీమతి ఇందిరాగాంధీకి ఈసారి ఆంధ్రప్రదేశ్ విషయంలో ఎదురుదెబ్బ తగలగానే తిరిగి ఎన్. టి. ఆర్. ని గద్దె ఎక్కించక తప్పలేదు.

మధ్యంతర ఎన్నికలు :

1984 నవంబర్ 27న ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీని రద్దు చేశారు. అసెంబ్లీ ఏర్పడి ఆనాటికి 22 మాసాల 13 రోజులయింది. మామూలుగా ఐదేళ్ళు కొనసాగి ఉంటే 1988 జనవరి 8వ తేదీన పదవీకాలం అంతా అయి ఉండేది. 1984 ఆగష్టు 13వ తేదీన (నాదెండ్ల భాస్కరరావు ముఖ్యమంత్రిగా చేబట్టిన తేది) రాష్ట్రంలో ప్రజాభీష్టానికి వ్యతిరేకమైన వాతావరణం ఏర్పడింది. పార్టీ ఫిరాయింపుల మోసం ప్రబలి రాజకీయాలు కలుషితమయ్యాయి. మంత్రివర్గానికి అసెంబ్లీలో మెజారటీ బలం ఉన్నప్పటికీ రాజకీయాలలో విలువలు పునరుద్ధరించడానికోసం తాజాగా ప్రజల తీర్పు కోరడం అవసరమని ఎన్. టి. ఆర్. మంత్రివర్గం తీర్మానించింది. చీలిపోయిన నాదెండ్ల వర్గం 'డెమోక్రటిక్ తెలుగుదేశం పార్టీ' అని పేరు పెట్టుకుంది. ఈ పార్టీకి ఎన్నికల సంఘం 'ఉదయించే సూర్యుడు' గుర్తును కేటాయించింది.

ఈ ఎన్నికలల్లో తెలుగుదేశం పార్టీ మరొకసారి విజయభేరి మ్రోగించింది. పార్టీ ఫిరాయింపుదార్లకు ఓటర్లు మట్టి కరిపించారు. సమైక్యంగా పోటీ చేయడం వల్ల తెలుగుదేశం మిత్రపక్షాలు కూడా అంతో ఇంతో లాభం పొందాయి. తెలంగాణాలో ఉన్న ప్రాబల్యాన్ని కూడా కాంగ్రెస్ ఈసారి కోల్పోయింది.

లోక్‌సభ ఎన్నికలలో తెలుగుదేశం పార్టీ 32 స్థానాలకు పోటీచేసి 28 స్థానాలను సాధించింది. మాజీ ముఖ్యమంత్రులు శ్రీ వెంగళరావు, అంజయ్య మరో నలుగురు (మొత్తం ఆరుగురు) గెలిచినా,ఎన్. టి. ఆర్. ప్రభంజనంలో ఆరుగురు కేంద్రమంత్రులతో సహా కాంగ్రెస్ (ఐ) అభ్యర్థులందరు కొట్టుకుపోయారు. నాలుగు నెలలనాడు ఎన్. టి. ఆర్.ను ముఖ్యమంత్రి పదవి నుంచి బర్తరఫ్ చేయకుండా కొనసాగనిచ్చి ఉంటే ఫలితం ఎలా ఉండేదో తెలియదుకాని ఆ దురదృష్టకరమైన సంఘటన తర్వాత ఆయనపై ప్రజలకు సానుభూతి పెరిగింది. వీరోచితంగా ప్రజాస్వామ్య పోరాటం జరిపి రామారావును అధికారంలో ప్రతిష్ఠించారు. గవర్నరుకు ఉద్వాసన పలికించారు. దానికోసం జరిగిన పోరాటం వేడిమి చల్లారకముందే లోక్‌సభ ఎన్నికలు, శాసనసభ ఎన్నికలు జరిగాయి. ఆ వేడి ముందు ఇందిరాగాంధీ హత్యవల్ల కాంగ్రెస్ (ఐ) పై పుట్టిన సానుభూతి కూడా నిష్ప్రయోజనమైంది. రాజీవ్‌గాంధీ ప్రభంజనం ఆంధ్రప్రదేశ్‌లో ప్రవేశించలేక

వెనుతిరిగిపోయింది. బహుశా సబ్సిడీ బియ్యం పథకం, జనతా చీరె, ధోవతి పథకం వంటి జనాకర్షణ చర్యలు కూడా 'దేశం' విజయానికి తోడ్పడి ఉండవచ్చు. ఏమైనా- జాతీయ ప్రతిపక్షాలన్నీ చతికిలపడగా, లోక్‌సభలో ఒక ప్రాంతీయపార్టీ ప్రధాన ప్రతిపక్షం కావడం విచిత్ర పరిణామం.

సంక్షేమ పథకాలు :

ఏడేళ్లు అధికారంలో ఉన్న తెలుగుదేశం పార్టీ రాష్ట్రంలో ఎన్నో సంక్షేమ పథకాలను ప్రవేశపెట్టింది. ఒక్కొక్క కుటుంబానికి 25 కిలోల చొప్పున 1 కోటి 20 లక్షల కుటుంబాలకు కిలో బియ్యం రెండు రూపాయలకే అందించడం చిన్న విషయం కాదు. ఆంధ్రప్రదేశ్‌లో 1971 నుంచి గృహనిర్మాణ పథకం అమలులో ఉన్నది. 1981 వరకు అంటే పదేళ్ళ కాలంలో కాంగ్రెసు ప్రభుత్వం 46,630 గృహాలను మాత్రమే కట్టించగలిగింది. తెలుగుదేశం ప్రభుత్వం అధికారంలోకి వచ్చాక పరిస్థితి మారిపోయింది. 1987 వరకు 'తెలుగు గృహాశ్రయ పథకం' క్రింద గ్రామీణ పేదలకు నిర్మాణం చేసిన శాశ్వత గృహాల సంఖ్య 6.45 లక్షలు. నిర్మించిన ఇళ్ళ విలువ రూ. 423 కోట్లు. జనతా ధోవతులు, చీరెల పథకంవల్ల పేదప్రజలు లాభపడ్డారు.

తెలుగుదేశం ప్రభుత్వం కొడుకులతో పాటు కూతుళ్ళకు కూడా వారసత్వ సంపదలో సమాన హక్కులు కల్పిస్తూ శాసనం చేసింది. స్త్రీ విద్యా వ్యాప్తికి దోహదకారిగా తిరుపతిలో 'పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం' స్థాపించింది. అన్ని ప్రభుత్వ రంగాలలోని ఉద్యోగాలలోను 30 శాతం ఉద్యోగాలు స్త్రీలకే కేటాయించింది. జిల్లా ప్రజాపరిషత్తులలోను, మండల ప్రజాపరిషత్తులలోను 9 శాతం అధ్యక్ష పదవులను స్త్రీలకు రిజర్వు చేసింది. మాతా శిశుసంక్షేమ కార్యక్రమం అమలు జరిగే ప్రాంతంలో నెలకు 20 రూపాయల చొప్పున, అదిలేని ప్రాంతంలో 40 రూపాయల చొప్పున ప్రతి గ్రామీణ శ్రామిక గర్భిణి స్త్రీకి కాన్పుకు ముందునుండి కాన్పు అయిన తరువాత మూడు నెలల వరకు ఈ సహాయాన్ని అందించింది.

1981 జనాభా లెక్కల ప్రకారం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములోని జనాభాలో 14.87 శాతం షెడ్యూల్డు కులాలవారు ఉన్నారు. ఐ. ఆర్. డి. పి. (సమైక్య

గ్రామీణాభివృద్ధి పథకం) పథకం క్రింద ప్రజానీకానికి జరుగుతున్న అభివృద్ధి కార్యక్రమాలలో సగభాగం షెడ్యూల్డు కులాలవారికి కేటాయించారు. దీనితో షెడ్యూల్డు కులాల కుటుంబాలు అనేక విధాలైన ప్రయోజనాలు పొందాయి. షెడ్యూల్డు కులాల విద్యార్థుల ఉపకారవేతనాలను పెంచాడు. వేలాది మంది షెడ్యూల్డు కులాల వారిని వెట్టిచాకిరి నుంచి తెలుగుదేశం ప్రభుత్వం అనేక ప్రణాళికల ద్వారా వారికి పునరావాసం కల్పించింది. గ్రామీణ వృద్ధులలో 60 సంవత్సరాలు నిండిన పేదలకు నెలకు 30 రూపాయల చొప్పున వృద్ధాప్య ఫించన్లను చెల్లించింది. గిరిజన ప్రజల అభ్యున్నతి కూడా తెలుగుదేశం ప్రభుత్వం గణనీయంగా కృషి చేసింది. తన సంక్షేమ పథకాల ద్వారా వెనుకబడిన తరగతులలో నూతనోత్సాహాన్ని రేకెత్తించింది.

## మాండలిక పద్ధతి :

గతంలో ఉన్న మూడంచెల పంచాయతీరాజ్ వ్యవస్థ స్థానంలో తెలుగుదేశం ప్రభుత్వం మాండలిక పరిపాలనా పద్ధతిని అమలుకు తెచ్చింది. ఇంతకు ముందున్న తాలూకాలు, పంచాయతీ సమితుల స్థానాల్లో ఈ మండలాలు వచ్చాయి. ఇవి తక్కువ జనాభా వున్న ప్రాంతంగా ఉండటం వలన పరిపాలనా సౌలభ్యం ఏర్పడింది. అట్టడుగు వర్గాల వారుకూడా రాజకీయాధికారం సంపాదించి పరిపాలనలో పాలుపంచుకోవాలనే ఉద్దేశంతోనే మాండలిక వ్యవస్థలో ఎన్. టి. రామారావు షెడ్యూల్డు కులాలు, షెడ్యూల్డు తరగతులు, వెనుకబడిన వర్గాల వారికి, స్త్రీలకు రిజర్వేషన్లు కల్పించారు. మొత్తం జిల్లా ప్రజాపరిషత్తులు, మండల ప్రజా పరిషత్తు అధ్యక్షుల సంఖ్యలో 15 శాతం షెడ్యూల్డు కులాలకు, 6 శాతం షెడ్యూల్డు తరగతులకు, 9 శాతం స్త్రీలకు, 20 శాతం వెనుకబడిన వర్గాలకు కేటాయించారు.

ఈ మాండలిక రాజ్యాంగంలోని ప్రధానాశం భూస్వామ్య వ్యవస్థను ప్రతిబింబించే గ్రామాధికారుల వ్యవస్థను నిర్మూలించి ప్రజలను బానిస శృంఖలాల నుంచి విముక్తులను చెయ్యడమే. సత్య సామాజిక ప్రజాసేవ కోసం, అరు కోట్ల ప్రజానీకం శ్రేయస్సుకోసం, రాష్ట్ర సర్వతోముఖాభివృద్ధి కోసం ప్రవేశపెట్టిన వ్యవస్థ మండలాలు.

తెలుగుదేశం ప్రభుత్వం వ్యవసాయ అవసరాలకు వినియోగించే విద్యుచ్ఛక్తి చార్జీలలో ప్రవేశపెట్టిన స్లాబ్ రేటు పద్ధతి అనేకమంది సన్న, చిన్నకారు రైతులకు ప్రయోజనమైంది. సహకార రంగంలో సింగల్ విండో పథకాన్ని ప్రవేశపెట్టి తెలుగుదేశం ప్రభుత్వం విప్లవాత్మకమైన చర్య తీసుకుంది.

ఉరకలు పరుగులమీద తెలుగుదేశం ప్రభుత్వం విద్యారంగంలో ప్రగతిని సాధించింది. 1983 లో రాష్ట్రంలో ప్రాథమిక పాఠశాలలు 41291 ఉంటే 1987 నాటికి వాటి సంఖ్య 44299 వరకు పెరిగింది. తెలుగు విజ్ఞాన పారితోషికాల నూతన పథకాన్ని ప్రవేశపెట్టింది. ఒకటి రెండో తరగతులలో చదువుకుంటున్న విద్యార్థులకు ఉచితంగా పాఠ్యపుస్తకాలు, దుస్తులను అందించింది. ఎన్. టి. ఆర్. తన పాలనలో ఎన్నో నూతన పథకాలను చేబట్టి, రాష్ట్రంలో నూతన అభ్యుదయ శకాన్ని ప్రారంభించారు.

ఎన్. టి. ఆర్. ని తప్పులెరుగని ఉత్కృష్ట ప్రవర్తగా భావించరాదు. కాషాయాంబరధారి అయినంత మాత్రాన ఆయన దృక్పథం సర్వేసర్వత్రా సర్వజన హితకరమైనదని అనరాదు. ఆయన కూడా సామాన్య మానవుడే.

ఘోర పరాజయం :

1989 నవంబర్‌లో జరిగిన ఎన్నికలలో తెలుగుదేశం పార్టీ ఘోరంగా ఓడిపోయింది. 1988 డిసెంబర్ 26న అంటే ఎన్నికలకు 11 నెలల క్రితం విజయవాడలో వంగవీటి రంగా హత్య కారణంగా విధ్వంసకాండ చెలరేగింది. రంగా హత్యకు ముందు తరువాత కోస్తా జిల్లాలలో కాపు కులానికి చెందినవారు 'తెలుగుదేశం'పై వ్యతిరేకత పెంచుకున్నారు. ఎన్టీ ఆర్ ఒకే కులంపట్ల అపేక్ష చూపిస్తూ, తక్కిన కులాలపట్ల వివక్షత చూపిస్తున్నారన్న భావాన్ని కాపునాడు నాయకులు ప్రజలలో చొప్పించారు. ఆవిధంగా చిన్నా పెద్దా కులాలకు తెలుగుదేశం ఆ ప్రాంతంలో దూరమయింది.

**ఉద్యోగులలో అసంతృప్తి :**

ఆదిలోనే హంసపాదు సామెతగా ఎన్. టి. ఆర్. వెనకా ముందూ చూడకుండా రిటైర్మెంటు వయస్సును తగ్గించి మొత్తం ఉద్యోగ వర్గాన్నే దూరం చేసు

కున్నారు. 'తుష్టితో పరిపుష్టితో ఆనంద నిలయంగా విలసిల్లేలా ఆదర్శవంతమైన రాష్ట్రంగా రూపొందేలా మీరంతా కృషి చేయాలని' 1983 జనవరి 23న జిల్లా కలెక్టర్ల సమావేశంలో ప్రసంగించిన ఎన్టీ ఆర్ వాగ్ధోరణికి ఉద్యోగులు మొదట మురిసిపోయారు. కాలక్రమేణగాని ఆయన అనర్గళ ప్రసంగ ధార, హావభావాలు, తొంభై శాతం నటనేనని వారికి బోధపడలేదు. ఒక అధికారిని ఏదైనా పదవిలో నియమించినప్పుడు కనీసం కొంతకాలం అదే పదవిలో కొనసాగనిచ్చినప్పుడే ఫలితాలు చూపే అవకాశం ఉంటుంది. చీటికి మాటికి బదిలీలతో సతాయిస్తే అటు ఆ పదవికి న్యాయం జరుగదు. జనానికి మేలూ కలుగదు. సుమారు 60 పాయింట్ 39 శాతం మంది ఐ. ఎ. ఎస్. అధికారులను ఎన్టీ ఆర్ ప్రభుత్వం పట్టుమని ఒక్క సంవత్సరమైనా ఒకే శాఖలో ఉంచలేదు. తత్ఫలితంగా చాలామంది అధికారులు ఇబ్బందులపాలయ్యారు.

పరిపాలనా యంత్రాంగాన్ని పరిశుద్ధం చేయాలనే ఉద్దేశంతో ముఖ్యమంత్రి ఐ. ఏ. ఎస్. అధికారుల ఇళ్ళపై ఏ. సి. బి. దాడులు జరిపించారు. ఇందులో ఎక్కువగా జరిగిన దాడులు, విచారణలు, సస్పెన్షన్లు విచక్షణారహితంగా జరిగాయి. 'అధికారమంటే అహంకారం కాదని' కలెక్టర్ల సమావేశంలో హూంకరించిన ఎన్టీ ఆర్ ఏదో సామెత చెప్పినట్లుగానే తామే కుడితిలో పడ్డారు. పరిపాలనా పరంగా జీరోగా రుజువయ్యారు.

ప్రభుత్వోద్యోగులను, పోలీసులను దూరం చేసుకోవడం వల్ల టి. డి. పి. ప్రభుత్వం దివాళా తీసిందని, అభివృద్ధి కార్యక్రమాలకు నిధులు లేవని వారు ప్రచారం చేయడం మొదలుపెట్టారు. చివరకు 53 రోజుల సమ్మెకాలానికి జీతం ఇచ్చి దగ్గర చేసుకోవాలని ప్రభుత్వం ప్రయత్నించినా అది ఫలించలేదు. ఉద్యోగులు తమ న్యాయమైన కోర్కెల సాధనకు సమ్మెకు దిగితే 'ఉద్యోగుల ఆశలకు అంతులేదని, ఆరు లక్షలమంది ఉద్యోగుల కోర్కెలకోసం ఆరుకోట్ల ప్రజల భవిష్యత్తును నాశనం చేయడానికి నేను మూర్ఖుడను కాను' అని ఆవేశంగా ఎన్టీ ఆర్ అన్నారు. యువత ఎప్పటి నుంచో తెలుగుదేశం ప్రభుత్వంపై ఆశలు పెంచుకున్నా వారికి అనుకూలంగా ప్రవర్తించడం ఎన్టీ ఆర్‌కు చేతకాలేదు. నిరుద్యోగ సమస్య పెనుభూతంగా కళ్ళ ముందు సాక్షాత్కరించింది. దానిని నివారించటానికి

చర్యలు తీసుకోకపోగా ఉద్యోగాలలో చేరే గరిష్ఠ వయో పరిమితిని తగ్గించటం వంటి చర్యలకు పాల్పడి అది యువత కన్నెర్ర చెయ్యడానికి కారణమైంది.

అన్నిటికి తానే :

పరిపాలనానుభవం తనకు శూన్యమని తెలిసి కూడా ఎన్టీ ఆర్ తమ వ్యవహార శైలిని సవరించుకోలేదు. మానవ మనస్తత్వాన్ని ఆకళింపు చేసుకోలేదు. ఆత్మ గౌరవ నినాదాలతో ఆంధ్రప్రదేశ్‌ను దద్దరిల్లజేసిన ముఖ్యమంత్రి ఇతరుల ఆత్మ గౌరవాన్ని ఖాతరు చేయలేదు. అందువల్లనే తన మంత్రివర్గ సహచరుల, కీలకస్థాయి అధికారుల అత్యుత్తమ సేవలను వినియోగించుకోలేకపోయారు. విధాన నిర్ణయాలు తీసుకునే సమయాలలో కూడా అధికారులతో సమావేశమయ్యారే గానీ మంత్రులను చర్చలలో భాగస్వాముల్ని చేయలేదు.

పరిమిత సంఖ్యతో మంత్రివర్గాన్ని ఏర్పాటు చేస్తానని చెప్పిన ఎన్టీ ఆర్ మంత్రుల సంఖ్యను 35కి పెంచుతూ వచ్చారు. మంత్రివర్గాలను పెక్కుసార్లు పునర్ వ్యవస్థీకరించారు. పత్రికలలో బడ్జెట్ వివరాలను చూసి మంత్రివర్గ రహస్యాలు లీక్ అయ్యాయన్న సాకుతో 31 మంది మంత్రుల్ని ఒక్క కలంపోటుతో కొట్టి అవతల పారేయడం రాజకీయంగా జరిగిన నష్టం. ఆ సమయంలో దాని నష్టం పెద్దగా కనిపించకపోయినా ఎన్నికల సమయంలో అది పెనుతుఫానై విలిచింది. కొత్త మంత్రులలో అభద్రతా భావం, ఎమ్మెల్యేలలో అసంతృప్తి, పార్టీ యంత్రాంగంలో స్తబ్ధత పెరిగి పార్టీపరంగా పెను నష్టానికి దారితీసాయి. 'శ్రీ ఎన్టీఆర్ సమర్థుడైన అధికారిని గుర్తిస్తారు. కాని నిలబెట్టుకోలేరు. చెడ్డవాణ్ణి గుర్తించలేరు. కాని చెడు మాటల్ని చెవిని పెడతారు' అని ఓ ఉన్నతాధికారి ఆయనవి కాచి వడపోసి చెప్పిన అనుభవసారం.

బంధు ప్రీతి :

అనువంశిక పాలనకు ఒడిగట్టారని శ్రీమతి ఇందిరాగాంధిపై నిప్పులు చెరిగిన నాయకుడు అధికారంలోకి వచ్చేసరికి అదే దుర్నీతికి తాను పాల్పడ్డారు. 1983 ఎన్నికల వరకు కాంగ్రెస్ (ఐ) స్కంధావారంతో ఉన్న చిన్నల్లుడు శ్రీ చంద్రబాబునాయుడును పార్టీ కార్యదర్శిగా చేసి సకల బాధ్యతలూ అప్పగించారు. మరో అల్లుడు శ్రీ వెంకటేశ్వరరావును మంత్రిగా చేశారు. మండల ఎన్నికల ప్రచార

మహోత్సవంలో అనుంగు పుత్రుడు శ్రీ బాలకృష్ణను రాజకీయ వారసుడుగా ప్రకటించి, మనసులోని ముచ్చట బైట పెట్టారు. సర్వత్రా తీవ్ర దుమారం రాగానే మాట మార్చినప్పటికీ తన ఆంతర్యంపై ప్రజలకు కలిగిన అనుమానాన్ని ఎన్. టి. ఆర్. నివృత్తి చేయలేకపోయారు.

ప్రభుత్వరంగ సంస్థలు అధికార పక్షపాతం ఆశ్రితులకు, ఎన్నికలలో ఓడిపోయిన ప్రముఖులకు రాజకీయ పునరావాస కేంద్రాలయ్యాయన్న కారణంతో అరవైమంది అనధికారులను ఒక్క కలం పోటుతో ఇంటితోవ పట్టించిన తెలుగు దేశం ప్రభుత్వం దరిమిలా ముప్ఫయి మంది ఎమ్మెల్యేలను, పార్టీ మనుషుల్ని ప్రభుత్వ రంగంలోని వివిధ సంస్థలకు అధిపతుల్ని చేసింది.

కాంగ్రెస్‌లో సంస్థాగత ఎన్నికలు లేకపోయినా, అభిప్రాయ భేదాలను ప్రజాస్వామిక పద్ధతిలోనైనా కొంతవరకు వ్యక్తం చేసుకుంటారు. కానీ, 'దేశం' పార్టీలో ఎన్నికలు లేకపోవడంతో పాటు ఆ నామమాత్రపు ప్రజాస్వామ్యం కూడా అంతరించి పార్టీ 'కాయిలా' పడిపోయింది. చివరకు మొత్తం క్యాబినెటునే రద్దు చేసుకునే స్థితికి ఏకవ్యక్తి పాలన, స్వామిభక్తి పాలనగా దిగజారిపోయింది. 'తెలుగుదేశం పార్టీ నాతోనే పుట్టింది. నాతోనే పోతుంది' అని స్వీయ ప్రాముఖ్యాన్ని బైటపెట్టుకున్నారు.

అధికార దుర్వినియోగాన్ని అరికట్టే ఉద్దేశంతో తెలుగుదేశం ప్రభుత్వం లోకాయుక్తను నెలకొల్పింది. విధి నిర్వహణలో పరిమితులు, ప్రతిబంధకాలు ఎన్ని ఉన్నప్పటికీ ప్రజా జీవితానికి పట్టిన అవినీతి కాలుష్యాన్ని ప్రజల దృష్టికి తేవడంలో యీ వ్యవస్థ కృతకృత్యమైనది. అక్రమాల ఆరోపణలలో నిజానిజాలను నిగ్గు తెల్చేందుకు ఉద్దేశించిన లోకాయుక్త పరిధినుంచి ముఖ్యమంత్రిని మినహాయించడం పెద్ద లోపం.

ఎన్టీ రామారావుపై మోపిన సుమారు 200 అభియోగాలలో ఏడింటికి ప్రాథమిక సాక్ష్యాధారాలు కలవని హైకోర్టు నిర్ధారించింది. ఇందులో అధిక భాగం ఎన్టీ ఆర్ కుటుంబానికి సంబంధించినవి. ఒక ముఖ్యమంత్రిపై 'రిట్ ఆఫ్ కో వారంట్'ను ఇంతవరకు ఏ రాష్ట్రంలోను హైకోర్టు అడ్మిట్ చేయలేదు. వీటిపై హైకోర్టు జరపదలచిన పూర్తిస్థాయి విచారణ పర్యవసానం ఎలాఉన్నా నాయకుల

నైతిక ప్రవర్తనపై తిరుగులేని నిర్ణయం చేసే అంతిమ న్యాయస్థానం ప్రజలది. ప్రజలు సంతృప్తిచెందే రీతిలో కళంకం తొలిగించుకునే పని ఆయన చేయలేదు. ఎన్టీ ఆర్ ప్రభుత్వం బంధుప్రీతి సాగరంలో మునిగి తేలిందనే అభిప్రాయం ప్రజలలో వ్యాపించుకుపోయింది. ఇది నిజం కాదని నిరూపించడంలో జాగ్రత్త పడకపోవడమే ప్రజల దృష్టిలో ఆయన ప్రభుత్వం అపఖ్యాతిపాలు కావటానికి కారణం. ప్రభుత్వ యంత్రాంగం పట్ల ఇంత చులకన భావం మున్నెన్నడూ ఏర్పడలేదు.

ముఖ్యమంత్రిగా ఉంటూ 'విశ్వామిత్ర'లో నటించవచ్చునా అనే చర్చ వాదోపవాదాలకు దిగింది. ఈ చర్చ జరగడం మంచిదే అయింది. ముఖ్యమంత్రి వంటి అత్యంత బాధ్యతాయుతమైన, కీలకమైన, అత్యున్నతమైన- పదవిలో ఉన్న వ్యక్తి ఇంతవరకు సినిమాలో నటించడం, వాటిని నిర్మించి, దర్శకత్వం వహించడం చరిత్రలో జరుగలేదన్నది యదార్థం.

లోగడ ప్రఖ్యాత తమిళ నటుడు శ్రీ ఎం. జి. రామచంద్రన్ ముఖ్యమంత్రిగా ఉండగా తిరిగి సినిమాలలో నటించదలచుకున్నప్పుడు అప్పటి ప్రధాని మురార్జీ దేశాయ్ అది తగదని సలహా ఇవ్వగా, శ్రీ ఎం. జి. ఆర్. దాన్ని పాటించి, సినిమాలలో తిరిగి నటించే ఆలోచనకు శాశ్వతంగా స్వస్తి చెప్పారు.

అమెరికా అధ్యక్షుడుగా 1980 లో ఎన్నిక అయి, 1988 వరకు ఆ పదవిలో ఉన్న ప్రఖ్యాత హాలీవుడ్ నటుడు రీగన్ తిరిగి సినిమాలో నటించాలనే ప్రయత్నం ఎన్నడూ చేయలేదు. అమెరికా అధ్యక్ష పదవిలో వుండగా కానీ, పదవీ విరమణానంతర కాని తిరిగి సినిమాలలో నటించడం ఆ పదవి హుందాతనానికి అనుగుణం కాదని రీగన్ సమాధానమిచ్చాడు. అది ప్రజాసేవా రంగం సంప్రదాయాలకు విరుద్ధమని కూడా ఆయన చెప్పారు. పాలకులు తాము ఏమి చేస్తున్నారనేది ముఖ్యం కాదు. తమ గురించి ప్రజలు ఏమనుకుంటున్నారో గమనించడం అంతకంటె ముఖ్యం. ముఖ్యమంత్రిగా ఉంటూ సినిమాలు నటించడమంటే ఫుల్‌టైం ముఖ్యమంత్రి పార్టుటైం ఉద్యోగిగా మారడమే. ఆయన 'విశ్వామిత్ర నటన' 'దేశం'ను నీట ముంచింది.

అయితే ఎన్ని లోపాలున్నా—ఈ ఏడేళ్ళనాడు ఎన్టీఆర్ గత 37 ఏళ్ళుగా రాష్ట్రంలో స్థిరంగావున్న కాంగ్రెస్ కోటను బద్దలు కొట్టి నాన్ కాంగ్రెస్ ప్రభు

త్వాన్ని ఏర్పరచి చరిత్ర సృష్టించారు. ఢిల్లీనుంచి 'నామినేటెడ్' ముఖ్యమంత్రులతో రాష్ట్రపాలన సాగిస్తున్న కాంగ్రెసు సంస్కృతి నుంచి కొన్నాళ్ళపాటైనా రాష్ట్రాన్ని దూరంగా ఉంచగలిగారు. మత కలహాలు లేకుండా రాష్ట్రాన్ని కాపాడగలిగారు. ప్రాంతీయ భేదాలు తలెత్తకుండా రాష్ట్ర సమైక్యతా పునాదులను గట్టిపరిచారు. రాజకీయ అవినీతిని అదుపుచేసి, అనేక రంగాలలో మౌలిక సంస్కరణలు చేపట్టి, వివిధ వ్యవస్థలకు, కొత్త రూపు, కొత్త ఊపు ఇవ్వడంలో తెలుగుదేశం చెప్పుకోదగ్గ ప్రగతి సాధించింది. జాతీయస్థాయిలో తెలుగు ప్రజలకు మునుపులేని గుర్తింపు తెచ్చిపెట్టటమేకాక, రాష్ట్రాల హక్కులు, ఫెడరల్ ప్రజాస్వామ్య శ్రేయస్సు కోసం సాగుతున్న సమరంలో ఆంధ్రప్రదేశ్‌ను అగ్రభాగాన నిలిపింది.

## మార్పు సహజ పరిణామం :

ప్రజాస్వామ్యంలో పార్టీకి అధికారం శాశ్వతం కాదు. జనాభీష్టాన్ని బట్టి పార్టీల జాతకాలు తారుమారై అధికారం చేతులు మారడం పార్లమెంటరీ సాంప్రదాయం. 1983 లో కాంగ్రెసు (ఐ) తప్పిదాలే 'తెలుగుదేశం' పార్టీకి వరప్రసాదమయ్యాయి. ఇప్పుడు తెలుగుదేశం పార్టీ వైఫల్య పరంపరే కాంగ్రెసు (ఐ) గెలుపుకి కారణమైంది. 'రాష్ట్రంలో కాంగ్రెసు (ఐ) ఘనవిజయానికి కారణం ఎన్. టి. ఆర్. వ్యతిరేక ఓటు' అని డాక్టర్ మర్రి చెన్నారెడ్డి చేసిన వ్యాఖ్య అక్షర సత్యం. ఇది కాంగ్రెసు (ఐ) గెలుపు అనడంకన్నా ఎన్టీఆర్ పార్టీ ఓటమి అనడమే ఎక్కువ ఔచిత్యంగా ఉంటుంది. ఎప్పుడైనా ఒక పార్టీకి అనుకూలంగా ఉండే ఓటింగు బలానికి, పైరిపక్షంపట్ల ప్రజలలో ప్రబలిన వ్యతిరేకత తోడయినప్పుడు ఆయా పార్టీల గెలుపు ఓటములను అది ప్రభావితం చేస్తుంది. గతంలోను 1989 నవంబర్ ఎన్నికలలోను ఆ అంశం నిర్ద్వంద్వంగా రుజువైంది.

[ -o- ]

# నూరేళ్ళ కాంగ్రెస్ చరిత్ర

బ్రిటిష్‌వారు భారత దేశాన్ని కొంతకాలం కుయుక్తితో అటు పిమ్మట యుక్తితో, తరువాత శక్తితో పరిపాలించగలిగినా వారు ఈ దేశంలో ప్రజాభిమానం పొందలేకపోయారు. దానికి వారు అనుసరించిన విధానాలే కారణం.

1850 లో చేసిన ఒక అంచనా ప్రకారం భారతీయుని సగటు ఆదాయం రోజుకు రెండు పెన్నీలు. (రెండు అణాలు అంటే 12 పైసలు) అని వెల్లడైంది. 1882లో ఇది ఒకటిన్నర పెన్నీలకు (9 పైసలు) తగ్గిపోయింది. భారతీయుడు తన ఆదాయంలోని మూడవ వంతు భాగాన్ని బ్రిటిష్ ప్రభుత్వానికి పన్నుల రూపంలో చెల్లించేవాడు. గంజి తాగి బ్రతికే గర్భ దరిద్రునికికూడా ఉప్పు పన్ను చెల్లించవలసి వచ్చింది.

## కాంగ్రెస్ పిత – హ్యూమ్ :

బ్రిటిష్ ప్రభుత్వంపై సర్వే సర్వత్రా అసంతృప్తి వ్యక్తమవుతున్న సమయంలో 1885లో సర్ అల్లెన్ అక్టోవియన్ హ్యూమ్ అనే మాజీ బ్రిటిష్ అధికారి భారత జాతీయ కాంగ్రెస్‌ను స్థాపించాడు. 1885 డిశంబర్ 28వ తేదీన బొంబాయిలోని గోకుల్‌దాస్ తేజ్‌పాల్ సంస్కృత కళాశాల ఆవరణలో జరిగిన కాంగ్రెస్ మొదటి సమావేశానికి బెంగాల్ రాష్ట్రానికి చెందిన ఉమేశ్ చంద్ర బెనర్జీ అధ్యక్షుడయ్యాడు. అతని పేరును మహారాష్ట్రకు చెందిన తెలంగ్ ప్రతిపాదించగా, మద్రాసుకు చెందిన సుబ్రహ్మణ్య అయ్యర్ బలపరిచారు. కాంగ్రెస్ పుట్టుకతోనే అఖిల భారత సంస్థగా రూపొందింది. కాంగ్రెస్ మొదటి సమావేశాలు వైస్రాయిలు, గవర్నర్ల ప్రోత్సాహంతోనే జరిగాయి. కాని ఒక వర్గం ప్రజలు దీనికి వ్యతిరేకంగా పలకడంతో 1890లో కలకత్తాలో జరుగబోయే కాంగ్రెస్ సమావేశానికి ప్రభుత్వోద్యోగులు పాల్గొనరాదనే నిషేధాజ్ఞలు జారీ అయ్యాయి.

## సెక్యులర్ సంస్థ :

డెబ్బయ్ ఇద్దరు సభ్యులతో మొలకెత్తిన కాంగ్రెస్ పార్టీ అతి త్వరలో మహా వృక్షమయింది. 1886లో జరిగిన సమావేశంలో 408 మంది ప్రతినిధులు పాల్గొనగా, 1888 నాటికి దీని సభ్యత్వం 1248కి పెరిగింది. 1889లో బొంబాయిలో జరిగిన కాంగ్రెస్ సమావేశానికి సరిగ్గా 1889 మంది సభ్యులే పాల్గొనడం విశేషం. కులమత భేదం లేకుండా కాంగ్రెస్ విస్తరించింది. 1888లో అలహాబాద్‌లో జరిగిన నాల్గవ కాంగ్రెస్ సమావేశానికి జార్జి యుల్, 1889 లో బొంబాయి సమావేశానికి విలియం వెడర్‌బర్న్, 1904 లో జరిగిన సమావేశానికి ఆల్ఫ్రెడ్ వెబ్, 1904న సమావేశానికి హెన్రీ కాటన్ అధ్యక్షులైనారు. అలాగే ముస్లింలుకూడా కాంగ్రెస్ అధ్యక్షులైనారు. 1887 లో బద్రుద్దీన్ త్యాబ్జీ, 1910 లో ముజ్‌రుల్‌హక్, 1914 లో సయ్యద్ మహమ్మద్, 1927లో అన్సారీ, 1923 లో మహమ్మద్ ఆలీ, 1940 నుంచి 45 వరకు మౌలానా అజాద్ ప్రభృతులు కాంగ్రెస్ అధ్యక్ష స్థానాలను అలంకరించారు.

ఈ పార్టీ మొదటి సమావేశాలనుబట్టి ఇది ఆవిర్భవించిన ఇరవై ఏళ్ళలో రవి అస్తమించలేని బ్రిటిష్ సామ్రాజ్యంతో హోరా హోరీగా పోరాడగలుగు తుందని గానీ, అటు పిమ్మట మరో ఇరవై ఐదేళ్ళకు స్వరాజ్యమే సాధిస్తుందని కానీ ఎవరూ ఊహించలేకపోయారు. 1912 లో క్రిస్మస్‌లో బంకిపూర్‌లో జరిగిన కాంగ్రెస్ సమావేశాలకు మొదటిసారి హాజరైన జవహర్‌లాల్ నెహ్రూకు, 'నలుగని కోట్లు, ట్రవుజర్లు వేసుకొనివచ్చిన ఇంగ్లీషు భాషా పరిజ్ఞానం కలిగిన పై తరగతి మనుషుల వ్యవహారంలా కనిపించింది కాంగ్రెస్. ఈ పార్టీ కార్యకలాపాలు సమావేశాలకు, తీర్మానాలకు మాత్రమే పరిమితమై ఉండేవి. కాంగ్రెస్ పార్టీ లోని సమర్థులైనవారిని బ్రిటిష్ ప్రభుత్వం హైకోర్టు న్యాయమూర్తులుగానో, కార్య నిర్వాహకవర్గ సభ్యులు (కేంద్ర మంత్రి)గానో నియమించింది. మరికొందరిని సెంట్రల్ లెజిస్లేటివ్ అసెంబ్లీకి ఎన్నిక చేసేది. రాయ్ బహదూర్, రావు బహదూర్ బిరుదులతో సత్కరించేది. కాంగ్రెసును పటిష్టపరచిన తొలి నాయకులలో హ్యూమ్‌తోపాటు దాదాభాయ్ నౌరోజీ, ఫిరోజ్‌షా మెహతా, సురేంద్రనాథ్ బెనర్జీ, గోపాలకృష్ణ గోఖలే ముఖ్యులు.

1885లో అవతరించినప్పటి నుంచి కాంగ్రెస్ కేంద్ర లెజిస్లేటివ్ అసెంబ్లీ, రాష్ట్ర శాసన సమితుల సభ్యుల సంఖ్యను పెంచాలని సూచిస్తూ వచ్చింది. ఆ

రోజులలో పార్లమెంటు సభ్యులను అసెంబ్లీ సభ్యులు ఎన్నుకునేవారు. శాసన సమితుల విధులను పెంచాలని కూడా కాంగ్రెస్ కోరింది. నౌరోజీ, మెహతా, గోఖలే, సయానీ మొదలైన కాంగ్రెస్ నాయకుల ప్రజ్ఞా పాటవాలు పార్లమెంటు సభల్లోనే బహుముఖంగా విస్తరించాయి.

పార్లమెంటుకు 1895 లో ఎన్నికైన సర్ ఫిరోజ్‌షా మెహతా ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాలను తీవ్రంగా విమర్శించి పార్లమెంటు చరిత్రలోనే ఒక కొత్త సంప్రదాయం సృష్టించాడు. 1890 లో కలకత్తాకాంగ్రెసు సమావేశానికి అధ్యక్షుడైన మెహతా కాంగ్రెసు పార్టీ మితవాదుల ఆధీనంలో ఉన్నంతవరకు దానికి శాసనకర్తగా ఉండేవాడు. తొలినాటి కాంగ్రెస్ అధ్యక్షులంతా ఆయన సలహా మీద ఎన్నికైన వారే.

### మితవాదులు—నౌరోజీ, గోఖలే, బెనర్జీ :

1886 లో కలకత్తా కాంగ్రెసు మహాసభకు మొదటిసారి అధ్యక్షుడుగా ఎన్నికైన దాదాబాయి నౌరోజీ కాంగ్రెస్ పితామహుని కింద లెక్క. ఆయన అజాత శత్రువులాంటి వారు. బ్రిటిష్ కామన్స్ సభకు ఎన్నికైన తొలి భారతీయుడుగా ఆయనపట్ల అందరూ విశేష ఆదరం చూపేవారు. 1906 లో జరిగిన కలకత్తా కాంగ్రెసు సమావేశానికి ఆయన మూడవసారి మితవాదుల అభ్యర్థిగా ఎన్నికయినప్పుడు అతివాదులు ఆయన మీద ఉన్న గౌరవంతో తమ అభ్యర్థిని ఉపసంహరించుకున్నారు.

1905 లో బెనారస్ కాంగ్రెస్‌కు అధ్యక్షత వహించిన గోపాలకృష్ణ గోఖలే మితవాద వర్గానికి నాయకుడు. గొప్ప మేధావి. పార్లమెంటులో చాలాకాలం ప్రతిపక్ష నాయకుడుగా వ్యవహరించారు. ఆయన ఆర్థిక విషయాలలో నిపుణుడు. ఆమరణాంతం జాతీయోద్యమంలో ప్రముఖ వ్యక్తిగా ఉన్నారు. ఎంతటి జటిల విషయాన్నయినా అరటిపండు ఒలిచి పెట్టినట్లు సామాన్యుడికి కూడా అర్థం అయ్యే విధంగా మాట్లాడటం గోఖలే విశిష్టత. గాంధీమహాత్ముడు ఆయనను తన గురువుగా భావించుకునేవారు. గోఖలే దౌర్జన్య వాదులను, విప్లవకారులను సమర్థించలేదు.

రెండుసార్లు కాంగ్రెసు అధ్యక్షపీఠం అలంకరించిన సురేంద్రనాథ్ బెనర్జీ బ్రిటిష్ వారిని సైతం విస్మయపరచిన మహా వక్త. ఐ. సి. ఎస్. లో ఉత్తీర్ణ

డయిన బెనర్జీపై ఏవో కొన్ని సాకులు మోపి ప్రభుత్వం అతన్ని ఉద్యోగం నుంచి తొలగించింది. బ్రిటిష్ ప్రభుత్వానికి పనికిరాని యీ మహాపురుషుడు తన దేశ ప్రజలకు మహోపకారిగా మారాడు. కలకత్తాలో రిప్పన్ కళాశాల స్థాపించి ఎందరికో విద్యాదానం చేశాడు. దేశబంధు సి. ఆర్. దాస్‌కు ముందు వంగరాష్ట్ర రాజకీయాలకు ఆయనే నియంత. వంగదేశ విభజన వ్యతిరేక ఉద్యమానికి సారథ్యం వహించిన సాహసి

బెంగాల్ విభజన :

ప్రజాందోళనలను తొక్కిపారేయాలనే ఉద్దేశంతోనే వైస్రాయ్ కర్జన్ వంగరాష్ట్ర విభజనకు పూనుకున్నాడు. ముస్లింలు అధికంగా ఉన్న ప్రాంతాలతో తూర్పు బెంగాల్ అనే కొత్త రాష్ట్రాన్ని ఏర్పాటు చేశాడు. మత ప్రాతిపదికపై అతడు చేసిన యీ దుష్ట నిర్ణయం తరువాత ఎన్నో దురదృష్టకరమైన సంఘటనలను సృష్టించి దేశ విభజనకు కారణమైంది. తాను పదవిలో ఉండగానే కాంగ్రెస్ అంతిమ శ్వాసను చూడగలనని గట్టి నమ్మకంతో ఉన్న కర్జన్ 1905లో రాజీనామా చేయడానికి ఆ పార్టీ ఆందోళనలే కారణమైనాయి. లోకమాన్యతిలక్, బిపిన్ చంద్రపాల్, లాలా లజపతిరాయ్, అరవిందఘోష్‌ల నాయకత్వంలో స్వదేశీ ఉద్యమం ఉవ్వెత్తున లేచింది. విదేశ దుస్తులను బహిష్కరించడం, బ్రిటిష్‌వారు ఇచ్చిన సనదులను, హోదాలను తిరస్కరించడం, దేశీయ పాఠశాలలను స్థాపించటం ఆనాటి స్వదేశీ ఉద్యమంలోని ముఖ్య భాగాలు. భారతదేశంలో బ్రిటిష్ పరిపాలన ప్రజావిశ్వాసం కోల్పోయినట్లు వ్యక్తమైంది. 1905 లో గోఖలే బనారసు కాంగ్రెసు పీఠం అలంకరించే నాటికి దేశ పరిస్థితులు ఇలాతయారై కూర్చున్నాయి భారతదేశంలో బ్రిటిషు పరిపాలన ప్రారంభమైన తరువాత ఇంతకాలానికి భారతీయులంతా ఒకపై బ్రిటిష్ వారిని ఎదిరించే అభిప్రాయానికి వచ్చారు. ప్రజలలో కలిగిన ఈ బ్రహ్మాండమైన చైతన్యం చరిత్రలో ఒక ముఖ్యమైన ఘట్టమని బ్రిటిష్ ప్రభుత్వం గ్రహించాలని గోఖలే అంతటి మితవాది హెచ్చరించవలసి వచ్చింది. మొత్తం మీద 1885 నుంచి 1905 వరకు కాంగ్రెసు కార్యక్రమాలన్నీ చట్ట సమ్మతమైన ఆందోళనల మీదనే జరిగాయి. ఇంగ్లీషువారు న్యాయ సమ్మతంగా పని చేస్తారనే విశ్వాసం వారిలో తగ్గిపోయింది.

లాల్, బాల్, పాల్‌ల రణభేరి :

కాంగ్రెస్‌లోని తీవ్రవాద వర్గానికి బాలగంగాధర్ తిలక్ (మహారాష్ట్ర), లాలా లజపతిరాయ్ (పంజాబు), బిపిన్ చంద్రపాల్ (బెంగాల్) నాయకులు. ఈ త్రిమూర్తులను కలిపి లాల్, బాల్, పాల్ అనే పేరుతో పిలిచేవారు. వీరిలో తిలక్‌దే అగ్రస్థానము. ఆయనను జాతి లోకమాన్యుడనే బిరుదు నిచ్చి సత్కరించింది.

తన అనర్గళమైన వాగ్ధాటితో, అనితర ధైర్యసాహసాలతో, త్యాగాలతో జాతికి స్ఫూర్తి నిచ్చిన మహానాయకుడు తిలక్. 'స్వరాజ్యం నాజన్మహక్కు' అని ఎలుగెత్తి చాటి బ్రిటిష్ సామ్రాజ్యంపై తిరుగుబాటు చేసిన వీరుడు. భారత విప్లవం తిలక్‌తోనే ప్రారంభమైందని చరిత్రకారుల అభిప్రాయం. బ్రిటిష్ ప్రభుత్వంతో సహాయనిరాకరణ చేయడం ఈ ముగ్గురు నాయకుల ప్రధాన లక్ష్యం. 'మీరు అన్ని రంగాలలో బాయ్‌కాట్ ఉపయోగించండి, తెల్లవారేవరకు స్వరాజ్యం మీగడప ఎదుట ఉంటుంద'ని జాతికి మేల్కొలుపు గీతం పాడారు తిలక్.

1906 లో సూరత్‌లో జరిగిన కాంగ్రెసు సమావేశంలో అతివాదులు, మితవాదుల మధ్య విభేదాలు తీవ్రమై జుట్లుజుట్లు పట్టుకున్నారు. కుట్రలతో, కుతంత్రాలతో తమ అభ్యర్థిని అధ్యక్షుడుగా ప్రకటించుకొని మితవాదులు తమదే పైచేయి అని నిరూపించుకున్నారు. 1908 లో లోకమాన్యుని అరెస్టుచేసి మాండాలే జైలుకు తరలించడంతో మితవాదులకు మార్గం సులభమైనది.

1908లో మద్రాసులో జరిగిన కాంగ్రెస్ సమావేశంలో మితవాదుల ప్రతినిధి రాష్‌బిహారీఘోష్ మళ్ళీ కాంగ్రెసు అధ్యక్షుడుగా ఎన్నికయ్యాడు. 1908 సంవత్సరం మొదలుకొని ఏడు ఎనిమిది సంవత్సరాల వరకు అంటే లక్నో కాంగ్రెస్ జరిగే వరకు కాంగ్రెసు కేవలం మితవాదుల రంగస్థలమై ప్రభుత్వాన్ని యథాలాపంగా విమర్శిస్తూ తీర్మానాలు ఆమోదిస్తూ వచ్చిందేకాని జనసామాన్యం విషయంలో ఎక్కువ శ్రద్ధ చూపలేక పోయింది.

కర్జన్ తరువాత వైస్రాయ్‌గా వచ్చిన మింటో ఒక వర్గం ప్రజల పట్ల ప్రత్యేకాభిమానం కనబరిచాడు. అతని ఈ పద్ధతి 1906 లో ముస్లింలీగ్ సృష్టికి

కారణమైంది. ఎన్నికలకు నిలబడే అన్ని సంస్థలలో ముస్లింలకు ప్రత్యేక స్థానాలు కేటాయించడం జరుగుతుందని అతడు హామీ ఇచ్చాడు. ఈ విధంగా ద్విజాతి సిద్ధాంతం ఇద్దరు వైస్రాయ్‌ల చేతుల్లో పెరిగి పెద్దదయింది. 1909 లో వచ్చిన మింట్లో-మార్లే సంస్కరణలలో ముస్లింలకు ప్రత్యేక నియోజకవర్గాలు ఏర్పాటై, అవి దేశ విభజనకు దారితీశాయి. 1909 లో జరిగిన కాంగ్రెసు సమావేశానికి మాలవ్యా అధ్యక్షత వహించారు.

రాజధాని ఢిల్లీకి మార్పు :

మింటో తరువాత వైస్రాయ్‌గా వచ్చిన హార్డింజ్ మూడు 'అద్భుత' పనులు చేసి చూపెట్టి జాతిని తనవైపు తిప్పుకోవడంలో కొంతవరకు కృతకృత్యు డయ్యాడనే చెప్పాలి. ఆయన చేసిన పనులలో మొదటిది చక్రవర్తి దంపతులను ఢిల్లీకి ఆహ్వానించి ప్రాచీన పద్ధతిలో దర్బారు నల్పడం, అతిపెద్దదైన బెంగాల్ రాష్ట్రం నుంచి ఒరిస్సా, బీహార్‌లను వేరు చేయడం, 1911 లో కలకత్తా నుంచి రాజధాని నగరాన్ని ఢిల్లీకి మార్చడం.

భారత రాజధానిని ఢిల్లీకి తరలించి హార్డింజ్ ముస్లింల అభిమానం పొందగలిగినా, అభిమానధనులైన బెంగాలీలను అవమాన పరచి వారి ఆగ్రహానికి కారకుడయ్యాడు. 1912 లో అతనిపై జరిగిన హత్యా ప్రయత్నం విఫలమైంది. హార్డింజ్ దక్షిణాఫ్రికాలోని భారతీయుల సమస్యను పరిష్కరించడంలో బాగా కృషి చేశాడు. స్మట్సు-గాంధీ ఒప్పందం కుదరటానికి అవసరమైన సరంజామా అంతా అతడే ప్రోదిచేసి పెట్టాడు. 1914 లో తిలక్ మాండలే జైలునుంచి విడుదలై వచ్చి, పరిస్థితులలో వచ్చిన మార్పులను గ్రహించారు. అవి మొదటి ప్రపంచ యుద్ధం రోజులు. దేశం మొత్తం యుద్ధగొడవలో పడిపోయింది. ఆ పరిస్థితులలో స్వదేశీ ఉద్యమాలు కొనసాగించడం సాధ్యం కాలేదు. యుద్ధం తరువాత దేశ ప్రజల ఆశయాలను బ్రిటిష ప్రభుత్వం మన్నించగలిగితే యుద్ధ ప్రయత్నాలకు తాము ఆటంకం కలిగించనని తిలక్ ప్రకటించారు.

1914 లో లక్నోలో జరిగిన కాంగ్రెసు సమావేశంలో మితవాదులు, అతివాదులు కలిసిపోయారు. 1915 సం.లో గోఖలే, మెహతాలు చనిపోవడంతో మితవాద నాయకత్వం పట్టుతప్పింది. రంగంలో గాంధీజీ అవతరించే వరకు తిలక్, అనిబిసెంటులు కాంగ్రెసుకు సారథ్యం వహించారు.

### అనిబిసెంటు-హోంరూల్ లీగ్ :

1893లో భారతదేశంలో స్థిరపడిన అనిబిసెంటు దేశంలో ఆధ్యాత్మిక, సాంస్కృతిక పునరుద్ధరణకు పూనుకుంది. ఈ ఆధ్యాత్మిక శక్తితోనే దేశానికి స్వాతంత్ర్యం లభించగలదని ఆమె ఆశించింది. 1914లో ఆమె రాజకీయ రంగంలో ప్రవేశించగానే దేశంలో కొత్త మార్పు వచ్చింది. గ్రామ గ్రామాన, పల్లె పల్లెలలో ఆధ్యాత్మిక రాజకీయ కేంద్రాలు తలెత్తాయి. 1916లో కాంగ్రెస్ అధ్యక్ష పీఠం అలంకరించేంతటి శక్తివంతురాలైంది ఆమె. గాంధీజీ రాజకీయ రంగంలో ప్రవేశించకముందే అనిబిసెంటు హోంరూల్ లీగ్‌ను స్థాపించి దేశ ప్రజలను మేల్కొలిపింది. సహాయ నిరాకరణోద్యమంపై గాంధీజీతో ఆమెకు విభేదాలు కలిగాయి. చట్టాన్ని వ్యతిరేకించడం ఆమెకు సమ్మతంగా ఉండలేదు. 1919లో అనిబిసెంట్ కాంగ్రెస్‌ను విడిచిపెట్టింది.

తిలక్ జీవితంలోని చివరి ఆరు సంవత్సరాలు చాలా గొప్పవి. ఆయన నిర్మాణాత్మక ఆలోచనలతో కార్యక్రమాలు నిర్వహించారు. అప్పటికి జాతికి ఏకైక నాయకుడయ్యారు. తన అరవై ఒకటవ ఏట 1919లో ఆయన హోంరూల్ లీగ్ నాయకుడుగా లండన్ వెళ్ళారు. 1920 ఆగష్టు ఒకటవ తేదీన లోకమాన్యుడు కన్ను మూసారు. లోకమాన్యుని మరణంతో కాంగ్రెస్‌లో గాంధీ శకం ప్రారంభమయింది.

### మహాత్మాగాంధీ నాయకత్వం :

మొదటి ప్రపంచ యుద్ధం ముగింపుకొచ్చేసరికి దేశంలోని విప్లవ శక్తులను అణచివేయటానికి ప్రభుత్వానికి ప్రత్యేక శాసనాలు అవసరమైనాయి. జస్టిస్ సిడ్నీ రౌలత్ అధ్యక్షతన ఒక సంఘాన్ని నియమించారు. ఈ సంఘం రూపొందించిన చట్టానికి 'రౌలత్ చట్టం' అని పేరు వచ్చింది. ఈ చట్టం ప్రకారం నలుగురు భారతీయులు కలిసి మాట్లాడుకోవడం కూడా నేరమే. విచారణ లేకుండా ఎవరినైనా అరెస్టు చేయవచ్చు.

ఈ చట్టానికి వ్యతిరేకంగా గాంధీజీ దేశవ్యాప్తమైన ఆందోళనలు జరిపించారు. పంజాబ్‌లోని జలియన్ వాలాబాగ్ ఆవరణలో డా. కిచ్లూ, డా. సత్యపాల్ ఉపన్యాసాలను వినటానికి వచ్చిన ప్రజలపై జనరల్ డయ్యర్ తుపాకి గుండ్లు కురిపించాడు. ఈ క్రూరచర్యలో 375 మంది అక్కడికక్కడే చనిపోయారు.

వేలాదిమంది గాయపడ్డారు. పంజాబ్ అంతటా మార్షల్‌లాను విధించారు. బ్రిటిష్ గవర్నరు సర్ మైకేల్ డయ్యర్ రాష్ట్రంలో రాక్షస పాలన కొనసాగించాడు. మిగతా దేశంతో పంజాబ్‌కు సంబంధాలు లేకుండా పోయాయి. 1919లో జరిగిన అమృత్‌సర్ కాంగ్రెస్ సమావేశంలో గాంధీజీ మితవాదులకంటె పైచెయ్యి అని పించుకున్నారు. తిలక్ వంటి మహానాయకునికూడా మించిపోయి భారతీయ నాయకులలో అగ్రేసరులైనారు. 'మహాత్మా గాంధీకి జై' అనే నినాదం దేశమంతా మారుమ్రోగింది. గాంధీజీ రాజకీయాలలో ప్రవేశించిన అచిరకాలంలోనే దేశంలో ఇంత ఆవేశం రేకెత్తిస్తాడనికానీ, వేలకి వేల ప్రజల్ని ఈ మహాయజ్ఞంలో ఆహుతి చేయగలుగుతాడని ఎవరూ ఊహించలేదు.

### మతవాదులతో బ్రిటిష్‌వారి దోస్తీ :

భారతదేశంలో తమ పరిపాలనపట్ల అంతకంతకు నిరసనభావం అధికం కావటంతో మరికొన్ని సదుపాయాలను కల్పిస్తూ బ్రిటిష్ ప్రభుత్వం తగు చర్యలు తీసుకోవలసి వచ్చింది. ఫలితంగా 1919 ఇండియా చట్టం అమలులోకి వచ్చింది. ఈ చట్టం ప్రకారం ముస్లింల కిచ్చిన ప్రత్యేక నియోజకవర్గాలు కొనసాగుతూ, సిక్కులకు, క్రిస్టియన్లకు, యూరోపియన్లకు కూడా ప్రత్యేక నియోజకవర్గాలను కొత్తగా సృష్టించారు. మత శక్తులను దగ్గరికి తీస్తూ వారి సహాయంతో దేశాన్ని పాలించడం తప్ప వేరే మార్గం బ్రిటిష్‌వారికి లేకపోయింది.

### లిబరల్ పార్టీ :

ఈలోగా జాతీయ పోరాట స్రవంతి నుంచి ముస్లిం మతవాదులను, మితవాదులను వేరుచేయడానికి జరిగిన ప్రయత్నాలు కొంత ఫలించడం మొదలు పెట్టాయి. కాంగ్రెస్ నుంచి వేరుపడిపోయిన మితవాదుల బృందం 'లిబరల్ పార్టీ' ఏర్పాటు చేసుకుంది. అభ్యున్నతికి మిత్రులుగాను, తిరుగుబాటుకు శత్రువులుగాను ప్రకటించుకున్న ఈ పార్టీలో శ్రీనివాసశాస్త్రి, తేజ్ బహదూర్ సప్రూ మొదలైన మేధావులు వుండేవారు. వీరు ఇంగ్లీషు భాషలో అనర్గళంగా ఉపన్యసించేవారు. కొన్ని నియమాలకు లోబడి ప్రభుత్వంతో సహకరించాలని వారి వాదన.

### ఖిలాఫత్ ఉద్యమం :

మహమ్మద్ అలీ, షౌకత్ అలీ సోదరుల సహకారం స్వీకరించడంలో గాంధీజీ మంచి విజ్ఞత చూపారు. టర్కీ సుల్తాన్ను పదవిలో పునః ప్రతిష్ఠించ

దానికి వారు 'ఖిలాఫత్' ఉద్యమాన్ని లేవదీశారు. ఈయనే ఇస్లాం మత ఖలిఫ్. యుద్ధంలో ఖలిఫ్ జర్మనీ కైజర్‌కు సహాయం చేసినందుకు బ్రిటిష్‌వారు అతణ్ణి పదవీచ్యుతుణ్ణి చేశారు.

1920లో కలకత్తాలో ప్రత్యేక కాంగ్రెస్ సమావేశం జరిగింది. అందులో గాంధీజీ ప్రభుత్వంతో సహాయ నిరాకరణం చేయాలని ఒక తీర్మానాన్ని ప్రవేశ పెట్టారు. మితవాదులైన లజపతిరాయ్, సి. ఆర్. దాస్‌లు ఈ తీర్మానాన్ని వ్యతిరేకించారు. మాంటెంగ్-చెమ్స్‌ఫర్డు సంస్కరణల క్రింద అమలులోకి వచ్చే శాసన సభలలో కాంగ్రెస్ వెళ్లాలని వారు వాదించారు. గాంధీజీ తమ పోరాటంలో న్యాయవాదులు, డాక్టర్లు, ఉపాధ్యాయులు మొదలైన వివిధ వర్గాలను సమీకరించారు. ఇప్పుడు జాతీయ పోరాటం ఈ మేధావి వర్గాల చేతులలో ముందుకు నడవ సాగింది.

సహాయ నిరాకరణం 1921 లో చిన్న చిన్న ధారలుగా వెలువడినప్పుడు ప్రభుత్వం అంతగా పట్టించుకోలేదు. భారతీయులకు రాజులు, రాణులు అంటే మోజు. ఆ నమ్మకంతో వేల్సు యువరాజుగారి భారతయాత్ర ఏర్పాట్లు జరిగాయి. అయితే ప్రజలు ఆయనకు సంబంధించిన సభలు, సన్మానాలను తిరస్కరించారు. ప్రభుత్వం నాయకులను అరెస్టు చేసింది. మహాత్మాగాంధీ ఇంకా ఇవతలనే ఉన్నారు. ప్రభుత్వంతో సహకరించవద్దని ప్రజలకు ఆయన బోధనలు చేసేవాడు. వీనితో వేలాదిమంది అరెస్టయ్యారు. ప్రజా జీవితం దాదాపు స్తంభించి పోయింది. ఇంతలో దురదృష్టవశాత్తు చౌరి చౌరాలోని కొందరు రైతులు పోలీసు స్టేషన్ను తగలబెట్టారు. ఆ ఆహుతిలో ఆరుగురు పోలీసులు చనిపోయారు. ఇది గాంధీజీ అహింసా సిద్ధాంతానికి విరుద్ధం కనుక ఆయన వెంటనే సహాయ నిరాకరణోద్యమాన్ని నిలిపివేశారు. ఇది సి. ఆర్. దాస్ మొదలైన నాయకులకు తీవ్ర అసంతృప్తిని కలిగించింది.

స్వరాజ్య పార్టీ :

కాంగ్రెస్‌కు ఇప్పుడు రెండు ప్రధాన సమస్య లేర్పడ్డాయి. సహాయ నిరాకరణోద్యమాన్ని కొనసాగించడమా? మానుకోవడమా? కొనసాగించడం జరిగితే ఏవిధంగా కొనసాగించడం ఒకటి. 1923లో జరిగే శాసనసభల ఎన్నికలలో కాం

గ్రెస్ పోటీ చేయాలా-లేదా? రెండోది. 1922 లో గయా కాంగ్రెస్‌కు దేశబంధు చిత్తరంజన్‌దాస్ అధ్యక్షుడుగా ఎన్నికయ్యారు. శాసనసభలో కాంగ్రెస్ పోటీ చేయాలనే తీర్మానాన్ని వోటింగ్‌కు ప్రవేశపెట్టగా అది వీగిపోయింది. దాస్ వెంటనే కాంగ్రెసు అధ్యక్ష పదవికి, మోతీలాల్ నెహ్రూ కార్యదర్శి పదవికి రాజీనామాలు చేశారు. తమ అభిప్రాయాలతో ఏకీభవించినవారితో కలిసి వారు కాంగ్రెసులోనే స్వరాజ్యపార్టీని ఏర్పాటు చేసుకున్నారు.

1923లో జరిగిన కేంద్ర శాసనసభ ఎన్నికలలో స్వరాజ్యవాదులకు ఘన విజయం లభించింది. సభలోని మొత్తం 145 స్థానాలలో ఎన్నికయ్యే 104 స్థానాలలో స్వరాజ్యవాదులు 45 స్థానాలను గెలచుకున్నారు. మోతీలాల్ నెహ్రూ, మాలవ్యా, విఠల్‌భాయి పటేల్, లజపతిరాయ్, బిపిన్ చంద్రపాల్, సర్ శివస్వామి అయ్యర్, పురుషోత్తందాస్ ఠాకూర్‌దాస్, సర్ చిమన్‌లాల్ సెతల్వాడ్ మొదలైన ప్రముఖులు కేంద్ర శాసనసభకు ఎన్నికయ్యారు. శాసనసభలో స్వరాజ్యవాదులది అతి పెద్ద పార్టీ అయింది. శాసనసభలో ఉంటూనే సంస్కరణలకు మట్టు పెట్టాలన్నది వారి లక్ష్యం. ఓ విధంగా ఇది సహాయ నిరాకరణోద్యమానికి విస్తృత రూపం.

1924 లో బెల్గాంలో జరిగిన కాంగ్రెసు సమావేశానికి మహాత్మా గాంధీ అధ్యక్షుడుగా ఎన్నికయ్యారు. మెజారటీ సభ్యులు తమవైపు ఉన్నా పెరుగుతున్న దాస్, మోతీలాల్‌ల వ్యక్తిత్వాలను పరిగణించి, కాంగ్రెసును వారి పరంచేసి కొంతకాలంపాటు గాంధీజీ తప్పుకున్నారు. కానీ దేశబంధు దాస్ హఠాత్తుగా 1925 జూన్ 16న చనిపోయారు. దానితో స్వరాజ్య పార్టీ ఛిన్నాభిన్నమైంది.

దేశబంధు చిత్తరంజన్‌దాస్ గురించి తన జీవిత చరిత్రలో టంగుటూరి ప్రకాశం పంతులు ఇలా రాశారు- 'ఆయన జీవించి ఉన్న రోజులలో ఆయనతో తుల్యమైన నాయకుడు లేడు. ఆయన తర్వాతకూడా అంతటి నాయకుడు ఉండడనే ఘంటాపథంగా చెప్పవలసి ఉంటుంది. ఆయన పోయింది లగాయతు ఈరోజు వరకూ బెంగాల్ రాష్ట్రం ఏ శనిగ్రహ ఛాయలోనో ఇరుక్కుని తప్పబ్బవుతుందని అనక తప్పదు.' భారత ప్రజలు చిత్తరంజన్‌దాస్‌ను గాంధీజీతో సమానంగా గౌరవించారు. గాంధీజీకి 'మహాత్మా' అనే బిరుదు ప్రసాదిస్తే దాసును

'దేశబంధు' అనే బిరుదుతో సత్కరించారు. దేశబంధుతో పోల్చదగిన అర్హత గల వ్యక్తులు భారత రాజకీయరంగంలో చాలా అరుదుగా కనిపిస్తారు. ఆయన చేసిన త్యాగం అలాంటిది.

## సైమన్ కమీషన్ :

స్వరాజ్య పార్టీ శాసన సభలో ప్రవేశించి బాహాటంగా ప్రభుత్వాన్ని స్తంభింపచేయడంతో బ్రిటిషు ప్రభుత్వం ఒక శాసన సవరణ కమిటీని నియమించింది. ఆ కమిటీ అధ్యక్షుడు సర్ జాన్ సైమన్. కనుక ఆ కమీషన్‌ను సైమన్ కమీషన్ అని పిలిచారు. ఈ కమీషన్‌లో ఒక్కడైనా భారతీయ సభ్యుడు లేడు. ప్రజలు కమీషన్ను వ్యతిరేకించారు. 1927 లో మద్రాసులో కాంగ్రెస్ సభ సైమన్ కమీషన్ను బహిష్కరించాలని తీర్మానించింది. సైమన్ కమీషన్ను 1928 అక్టోబర్ 30 న లాహోర్‌కు వచ్చినప్పుడు లజ్‌పత్‌రాయ్ నాయకత్వంలో నల్లజెండాల ప్రదర్శన జరిగింది. పోలీసు లాఠీచార్జీ చేశారు. లజ్‌పత్‌రాయ్‌కి ఛాతీమీద తీవ్రమైన గాయాలు తగిలినవి. ఈ దెబ్బల బాధతో ఆ మహానాయకుడు నవంబర్ 17 న అశువులు బాశాడు. మద్రాసు నగరంలో సైమన్ కమీషన్‌కు వ్యతిరేకంగా ప్రకాశం పంతులు ప్రదర్శించిన ధైర్యస్థయిర్యాలు చరిత్రలో నిలిచిపోయాయి.

## చరిత్రాత్మకమైన లాహోర్ కాంగ్రెస్ :

మద్రాసు కాంగ్రెసు మహాసభ మోతీలాల్ నెహ్రూ నాయకత్వాన భారత రాజ్యాంగ ముసాయిదాను తయారు చేయడానికి అఖిల పక్ష సంఘాన్ని నియమించింది. ఈ సంఘం డొమినియన్ స్టేటస్ ప్రాతిపదికమీద రాజ్యాంగాన్ని తయారు చేసి మోతీలాల్ నెహ్రూ అధ్యక్షతన జరిగిన కలకత్తా కాంగ్రెసుకు సమర్పించింది. పూర్ణ స్వాతంత్ర్యం కోరుతున్న యువకులు దీన్ని ప్రతిఘటించారు. ఆ ప్రతిఘటనకు జవహర్‌లాల్ నెహ్రూ, సుభాష్‌చంద్రబోస్ నాయకత్వం వహించారు. పెద్దలైన శ్రీనివాసయ్యంగార్ ప్రభృతుల మద్దతుకూడా వీరికి లభించింది. తండ్రీ కొడుకుల మధ్య బహిరంగ ఘర్షణ ఏర్పడకుండా మహాత్మాగాంధీ రంగంలోకి వచ్చారు. డొమినియన్ స్టేటస్‌ను ఒక ఏడాది లోపల బ్రిటిషువారు ఇవ్వకపోతే తానే రంగంలో దిగి పోరాటానికి నాయకత్వం వహిస్తానని గాంధీజీ హామీ ఇచ్చారు.

భారత స్వాతంత్ర సమర ఇతిహాసంలో జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షతన లాహోర్‌లో జరిగిన కాంగ్రెసు సమావేశానికి చాలా ప్రాముఖ్యం ఉంది. 1929 సెప్టెంబర్ 28న రాత్రివేళ వేలాది మంది కోలాహలం చేస్తుండగా పూర్ణ స్వాతంత్ర్య తీర్మానాన్ని ఆమోదించారు. ఆనాడు జవహర్‌లాల్ నెహ్రూ భారత యువలోకానికి ఆశాజ్యోతి. 1930 ఏప్రిల్ 10వ తేదీన అలహాబాద్‌లోని తన స్వగృహమైన ఆనంద్‌భవన్‌ను మోతీలాల్ నెహ్రూ కాంగ్రెసుకు ధారాదత్తం చేశారు. ఈ భవనాన్ని తన తండ్రివద్ద నుంచి కాంగ్రెసు అధ్యక్షుని హోదాలో జవహర్‌లాల్ నెహ్రూ స్వీకరించి జాతికి అంకితం చేశారు. ఆనాటికి దాని విలువ రెండున్నర లక్షల రూపాయలని అంచనా.

## ఉప్పు సత్యాగ్రహం :

స్వరాజ్య సంపాదనకు తీవ్రమైన ఉద్యమాలు అవసరమని సర్వేసర్వత్రా అభిప్రాయాలు వ్యక్తమవుతున్న సమయంలో ఒక రోజు గాంధీజీ హటాత్తుగా ఉప్పు సత్యాగ్రహం అనే అస్త్రాన్ని సంధించి బ్రిటిషు ప్రభుత్వంపై వదలి దేశాన్ని ఆశ్చర్యంలో ముంచివేశారు. 1930 మార్చి 12న గాంధీజీ దండియాత్ర సాగించారు. ఏప్రిల్ 6 కి సముద్రతీరాన్ని చేరుకున్నారు. ఉప్పు తయారుచేసి జోలి నింపుకున్నారు. ఆ విధంగా బ్రిటిషు సామ్రాజ్య పునాదిపై తీవ్రమైన దెబ్బ తీశారు. దేశమంతా ఉప్పు సత్యాగ్రహాలు జరిగాయి. నాయకులతో పాటు వేలాది మంది అరెస్టయ్యారు. పెక్కుచోట్ల లాఠీచార్జీలు జరిగాయి.

మొదటి రౌండ్ టేబిల్ సమావేశ సమయంలో కాంగ్రెసు నాయకులంతా జైల్లో ఉన్నారు. దానివల్ల ఫలితంలేదని తెలుసుకున్న ప్రభుత్వం ఏడాది తర్వాత డిటెన్యూల నందరిని విడుదల చేసింది. సెప్టెంబర్ 1931 లో లండన్‌లో జరిగిన రెండో రౌండ్ టేబిల్ సమావేశంలో మహాత్మాగాంధీ పాల్గొని రిక్తహస్తాలతో స్వదేశం తిరిగి వచ్చారు. ఇప్పుడు గాంధీజీకి రెండు సమస్య లెదురైనాయి. ఒకటి వక్రరూపం ధరిస్తున్న మతకలహాలు. రెండోది రాజకీయ రంగంలో ఆవరిస్తున్న నిరాశా నిస్పృహలు. 1931లో మోతీలాల్ నెహ్రూ చనిపోయారు.

1930 మొదలుకొని 1936 వరకు అక్కడక్కడా కొన్ని ఆందోళనలు జరిగినా ఈ ఆరేళ్ళలో కాంగ్రెసు ఎక్కువ కాలం అజ్ఞాతవాసంలోనే గడిపింది.

1933-37 ఎన్నికలలో కాంగ్రెసు పాల్గొన్నది. కేంద్ర శాసన సభలో బూలాభాయ్ దేశాయ్ ప్రతిపక్ష నాయకుడయ్యారు. 1937 శాసనసభల ఎన్నికలలో పాల్గొన్న కాంగ్రెసు 8 రాష్ట్రాలలో అధికారం కైవసం చేసుకున్నది. 1939 లో రెండవ ప్రపంచ యుద్ధం మొదలయింది. ప్రజల అనుమతి లేకుండా బ్రిటిషు ప్రభుత్వం భారతదేశాన్ని యుద్ధంలో దింపినందుకు నిరసనగా కాంగ్రెసు ప్రభుత్వాలు రాజీనామా చేశాయి.

## అజాద్ హింద్ తాత్కాలిక ప్రభుత్వం :

1938 లో గుజరాత్‌లోని హరిపురంలో 51వ కాంగ్రెసు సమావేశాలు జరిగాయి. ఈ సమావేశానికి సుభాష్‌చంద్రబోసు అధ్యక్షుడు. కాంగ్రెసు అధ్యక్షుడుగా సుభాస్‌చంద్రబోసు భారతదేశానికి చేసిన సేవలలో పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షతన జాతీయ ప్రణాళికా సంఘం ఏర్పాటు చేయడం. తన కార్యక్రమాల నన్నింటినీ అమలు పరచడానికి ఒక్క సంవత్సరం మాత్రమే కాంగ్రెసు అధ్యక్ష పదవి నిర్వహిస్తే చాలదని సుభాస్‌చంద్రబోసు అభిప్రాయపడ్డారు. అందుచేత మరొక సంవత్సరం అధ్యక్ష పదవికి పోటీచేయాలని సంకల్పించారు. కానీ దీనికి మహాత్మాగాంధి ఆమోదించలేదు. గాంధీజీ అభిమతానికి విరుద్ధంగా సుభాస్, గాంధీజీ ఆమోదంతో పట్టాభి సీతారామయ్య కాంగ్రెసు అధ్యక్ష పదవికి పోటీ చేశారు. పట్టాభి ఓడిపోయారు. దీన్ని తన ఓటమిగా ప్రకటించారు గాంధీజీ.

1939 మార్చిలో జరిగిన త్రిపుర కాంగ్రెసు సమావేశానికి అధ్యక్షత వహించిన సుభాస్‌చంద్రబోసు ఆరు నెలలకోగా దేశానికి స్వాతంత్ర్యం ఇవ్వాలని బ్రిటిషు ప్రభుత్వాన్ని అడగాలనీ, వారివ్వకపోతే ప్రజలను స్వతంత్ర సమరానికి సిద్ధం చేయాలని సూచించారు. కానీ, యీ తీర్మానం వీగిపోయింది. కాంగ్రెస్ కార్యవర్గాన్ని నియమించడంలో అధ్యక్షునికి గల స్వేచ్ఛను గాంధీజీ అనుయాయులు అడ్డుకున్నారు. ఈ వాదోపవాదాలతో ఇరుపక్షాల మధ్య అభిప్రాయ భేదాలు తీవ్రమైనాయి. కాంగ్రెసు అధ్యక్ష పదవికి రాజీనామా చేసి 1939 మేలో సుభాష్ 'ఫార్వర్డ్ బ్లాక్' ని స్థాపించారు.

1941 వ సంవత్సరం మూడవ వారంలో ఒక రోజున బ్రిటిష్‌వారి కాపలా నుంచి తప్పించుకొని సుభాష్‌చంద్రబోస్ తన కలకత్తా నివాసం నుంచి అదృశ్య

మయ్యారని తెలియగానే యావత్తు దేశం విస్తుపోయింది. సుభాష్‌చంద్రబోస్ జర్మనీ చేరుకొని హిట్లర్ సహాయంతో అజాద్‌హింద్ సైన్యం స్థాపించాడు. తరువాత ఆయన జపాన్ చేరుకున్నారు. 1943 అక్టోబర్ 21 వ తేదీన సింగపూర్‌లో ఆయన స్వేచ్ఛా భారత తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశారు. కొద్ది రోజులలో తొమ్మిది దేశాలు : జపాను, జర్మనీ, ఇటలీ, క్రోషియా, బర్మా, థాయ్‌లాండ్, నేషనల్ చైనా, ఫిలిప్పిన్స్, మాచూరియాలు, అజాద్‌హింద్ తాత్కాలిక ప్రభుత్వాన్ని గుర్తించాయి.

## అజాద్ హింద్ సైన్యం :

నేతాజీకి సైన్యం ఎలా లభించింది తెలుసుకొనవలసిన విషయం. 1942 ఫిబ్రవరిలో సింగపూర్, జపాన్ వశమయింది. బ్రిటిష్‌వారు తమ వలస ప్రాంతాలయిన మలయా, సింగపూర్ రక్షించడం కోసం భారతదేశం నుంచి అక్కడికి తీసుకొని వెళ్లిన సైన్యాలను అక్కడే వదిలి పెట్టి వచ్చారు. ఇరవై వేల మంది భారతీయ సైనికులను, ఉద్యోగులను యుద్ధ ఖైదీలుగా జపాన్ సైనికాధికారులకు అప్పగించారు. జపానువారు ఈ యుద్ధ ఖైదీలనందరినీ జనరల్ ఆఫీసర్ కమాండింగ్ కెప్టెన్ మోహన్‌సింగ్‌కు సర్వాధికారాలతో అప్పగించారు. ఈ విధంగా భారత జాతీయ స్యైనం ఏర్పడింది. ఆ తరువాత తూర్పు ఆసియాలోని వేలాది భారతీయులు దీనిలో చేరారు. కొంతకాలం తరువాత ఈ సైన్యానికి నేతాజీ నాయకత్వం వహించి 30 వేల మందితో మూడు డివిజన్ల సాయుధ దళంగా ఏర్పాటు చేశారు.

భారత జాతీయ సైన్యాలు బర్మా సరిహద్దున బ్రిటిష్ సైన్యంతో తలపడ్డాయి. కాని జయాపజయాలు దైవాధీనాలు. విధి నిర్ణయం మరొక విధంగా ఉంది. భారత జాతీయ స్యైనాలు ఇంఫాల్‌కి మూడు మైళ్ల దూరంలో ఆగిపోవలసి వచ్చింది. లార్డ్‌మౌంట్ బ్యాటన్ ఎంత నష్టమైనా లెక్క చేయకుండాపెద్ద ఎత్తున ఇంఫాల్‌ను రక్షించుకున్నాడు. భారత జాతీయ సైన్యానికి అవసరమైనన్ని విమానాలు లేవు. బర్మాలో విపరీతంగా వర్షాలు పడడంవల్ల వీరికి సైన్యపు సరఫరాలు సరిగా అందలేదు. భారత జాతీయ సైన్యాన్ని తప్పని సరిగా ఉపసంహరించవలసి వచ్చింది. 1945 మేలో జర్మనీ మిత్రదేశాలకు దాసోహం అంది. తరువాత కొద్ది రోజులకు జపాన్ కూడా లొంగిపోయింది.

1945 ఆగష్టు 16 న సింగపూర్ నుంచి నేతాజీ సైగావ్‌కి విమానంలో బయలుదేరారు. అదే నేతాజీ సుభాష్‌చంద్రబోస్ అంతిమ యాత్ర. అయిదు రోజుల తర్వాత అంటే 1945 ఆగష్టు 22 న టోకియో రేడియో నేతాజీ సుభాష్ చంద్రబోస్ ప్రయాణం చేసిన విమానం ఆగష్టు 18 న జపాన్‌కు వస్తూ ఫార్మోజాలో నేల కూలిందని, నేతాజీ స్వర్గస్థులయ్యారని ప్రకటించింది.

నేతాజీ దేశభక్తి అద్వితీయం. ఆయన పేరు మంత్రశక్తి వంటిదన్నారు మహాత్మా గాంధీ. భారత జాతీయ సైన్యం తన సర్వ లక్ష్యసాధనలో విఫలమయినా వారు గర్వింపతగినవెన్నో ఉన్నాయి. వాటిలో ముఖ్యమైనవి ఒక పతాక నీడన సమైక్యమవడం. అన్ని మతాలవారు, అన్ని కులాలవారు కలిసి తాదాత్మ్యంతో ఐకమత్యం సాధించి స్వతంత్ర భారతదేశానికి నూతన బాటలు పరిచారు.

**క్విట్ ఇండియా ఉద్యమం :**

ఈ క్లిష్ట సమయంలో కమ్యూనిస్టులు చాపకింది నీరులా కాంగ్రెసులో వ్యాపించిపోయారు. కాంగ్రెసులోని రైతు సంఘాలను, విద్యార్థి సంఘాలను, కార్మిక సంఘాలను ఆక్రమించుకొని స్వతంత్ర భారతదేశం అవతరించే సమయానికి తమ చే పై చెయ్యిగా నిరూపించుకోవాలనుకున్నారు. వీరికి చత్రం పట్టే సోషలిస్టు పార్టీ 1937లో కమ్యూనిస్టు పార్టీని బహిష్కరించింది. 1945లో కాంగ్రెసు పార్టీ కూడా కమ్యూనిస్టులతో తెగతెంపులు చేసుకుంది.

1941 డిశంబర్‌లో జపాన్ పెర్ల్ హార్బర్ మీద దాడి జరిపింది. అమెరికా జపాన్‌తో యుద్ధం ప్రకటించింది. జపాన్ అతి త్వరగా పురోగమించి మలయా, సింగపూర్, బర్మా దాటి భారతదేశం వరకు వచ్చింది. దీనితో భారత ప్రజలు యుద్ధంలో సహకరించడం అత్యవసరమయింది. ఈ సందర్భంలో యుద్ధ మిత్ర మండలి ప్రభుత్వంలో లేబర్ పార్టీ సభ్యుడైన సర్ స్టాఫర్డ్ క్రిప్స్ రాజకీయ ప్రతిష్టంభన తొలగించడానికి భారతదేశం వచ్చాడు. క్రిప్స్ రాయబారం విఫలమయింది.

1940 లో గాంధీజీ ప్రవేశపెట్టిన వ్యక్తి సత్యాగ్రహంలో కాంగ్రెస్‌వారు చూపిన క్రమశిక్షణ, కార్యదీక్ష దేశంలో నూతనోత్సాహాన్ని కలిగించాయి. 1942

ఆగష్టు 8 న జరిగిన కాంగ్రెస్ సమావేశంలో గాంధీజీ 'క్విట్ ఇండియా' ఉద్యమం ప్రవేశపెట్టారు. ఈ తీర్మానాన్ని జవహర్‌లాల్ నెహ్రూ ప్రతిపాదించగా, సర్దార్ పటేల్ బలపరిచారు. తరువాత గాంధీజీ మాట్లాడుతూ బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఇట్లా హెచ్చరించారు. 'బ్రిటిష్ ప్రభుత్వం తనకు తానుగా భారతదేశ రాజ్యాధికారాన్ని భారతీయులకు అప్పగించి వెళ్ళిపోవాలి. లేకపోతే ఈ దేశంలో ఆవేశంతో ఉప్పొంగిపోతున్న ప్రజాశక్తిని వారు ఎదుర్కొనవలసి వస్తుంది'. గాంధీ, నెహ్రూ పటేల్, అజాద్ మొదలయిన కాంగ్రెస్ కార్యవర్గ సభ్యులందరిని ప్రభుత్వం 1942 ఆగష్టు 9 వ తేదీన బంధించింది. అంటే క్విట్ ఇండియా ఉద్యమం ప్రవేశపెట్టిన ఒక్క రోజునే అందరూ అగ్రనాయకులు అరెస్టు అయ్యారు. దీనికి నిరసనగా దేశమంతటా హింసాయుత సంఘటనలు చెలరేగాయి. ప్రజలు ప్రభుత్వ కార్యాలయాలను ధ్వంసం చేశారు. తంతి, టెలిఫోన్ తీగెలను తెంపివేశారు. రైలు పట్టాలను తొలగించారు. బ్రిటిష్ ప్రభుత్వం లేదనిపించారు.

1943 అక్టోబర్‌లో లిన్‌లిథిగో స్థానంలో వేవల్ వైస్రాయ్‌గా వచ్చాడు. ఏనాటికి పూడ్చలేని రెండు హానికరమైన పనులు ఇతడు చేశాడు. సిమ్లాలో ఒక సమావేశం జరిపి, ఆ సమావేశ తీర్మానం ప్రకారం విస్తృత ప్రాతిపదికపై ఏర్పాటయ్యే మంత్రివర్గంలో ఇతర మతాలతోపాటు రెండు ప్రధాన మతాల సభ్యులకు మంత్రివర్గంలో సమాన స్థానం కల్పించడం. దేశంలో మతోన్మాద వాతావరణం తగ్గక ముందే 1946 లో ఎన్నికలు జరిపించడం. ఈ చర్య జిన్నాకు బాగా లాభించింది. కేంద్ర శాసనసభలోని అన్ని ముస్లిం సీట్లను జిన్నా గెలుచుకోగలిగాడు. వివిధ శాసనసభల్లోని 509 ముస్లిం సీట్లలలో ముస్లింలీగ్ 442 సీట్లను గెలిచింది.

ఈ సందర్భంగా రాయల్ ఇండియన్ నేవీ (నౌకాదళం) లో 1946 ఫిబ్రవరి 18 వ తేదీన తిరుగుబాటు జరిగింది. ఇది బొంబాయి నుంచి కలకత్తా, కరాచీ మద్రాసులకు విస్తరించింది. ఈ ఆందోళనలో 200 మంది చనిపోయారు. చివరకు సర్దార్ పటేల్ చొరవతో యీ ఉద్యమం చల్లబడింది.

1945 లో ప్రపంచ యుద్ధం ముగిసింది. బ్రిటన్‌లో జరిగిన ఎన్నికలలో లేబర్ పార్టీ గెలిచి అట్లీ ప్రధానమంత్రి అయ్యాడు. లేబర్ పార్టీ ప్రభుత్వం

రాయబారాల కోసం భారతదేశానికి క్యాబినెట్ మిషన్ పంపింది. దీనిలో అట్లీ మంత్రివర్గంలోని ముగ్గురు సీనియర్ మంత్రులు - సర్ పెథిక్ లారెన్స్, క్రిప్స్, అలెగ్జాండర్ సభ్యులు. వారు భారత నాయకులతో మంతనాలు జరిపి తమ పథకాన్ని మే 16 తేదీన ప్రకటించారు.

అవిభక్త భారతదేశంలోని చివరి ఎన్నికలు 1946 జులైలో జరిగాయి. రాజ్యాంగ నిర్ణయ సభలోని 296 స్థానాలలో కాంగ్రెస్ పార్టీ 205 స్థానాలను గెలిచింది. ఒకవైపు ఇదంతా జరుగుతుంటే దేశం మతపరమైన ఘర్షణలతో హోరెత్తిపోయింది. ఆగష్టు 16 ను ముస్లింలీగ్ 'ప్రత్యక్ష చర్య దినం' గా ప్రకటించింది. కలకత్తాలో మతపరమైన హత్యాకాండకు ఒడిగట్టింది. 1946 లో జవహర్‌లాల్ నెహ్రూ సారథ్యంలో కేంద్రంలో ఇంటెరిం ప్రభుత్వం ఏర్పడింది. ఆదిలో ముస్లింలీగ్ మంత్రివర్గంలో చేరలేదు. తర్వాత చేరి పాకిస్తాన్ ఏర్పాటు మార్గాలను సుగమం చేసుకుంది. మంత్రివర్గంలో 'ముస్లిం వర్గం' 'హిందూ వర్గం' అని రెండు ప్రత్యేక శాఖలు బాహాటంగా పని చేయడం ప్రారంభించాయి. అంతులేని మత కలహాలతో దేశం అట్టుడినట్లు ఉడికిపోయింది. వేవల్ పథకం ఇటు భారతీయులను అటు అట్లీ, చర్చిల్‌లను సంతృప్తి పరచలేదు. సివిల్ అధికారిగా వచ్చిన సైనికాధికారి అనిపించుకున్నాడు వేవల్. అతని స్థానంలో 1947 మార్చి 22 వ తేదీన లార్డ్ మౌంట్ బ్యాటెన్ గవర్నరు - జనరల్‌గా వచ్చాడు. భారత స్వాతంత్ర్య చట్టం ప్రకారం భారతదేశం ఆగష్టు 15 వ తేదీ నుండి రెండు స్వతంత్ర రాజ్యాలుగా భారతదేశం, పాకిస్తాన్‌లుగా ఏర్పడుతుందని అతడు ప్రకటన చేశాడు.

ఆగష్టు 14 వ తేదీ అర్ధరాత్రి భారత రాజ్యాంగ నిర్ణయ సభ ఢిల్లీలో డాక్టర్ రాజేంద్రప్రసాద్ అధ్యక్షతన సమావేశమైంది. త్వరలో స్వతంత్ర భారతదేశానికి ప్రథమ ప్రధాని కానున్న నెహ్రూ ఆరోజు చిరస్మరణీయమైన ఉపన్యాసంచేశారు. ఈ సందర్భపు చారిత్రాత్మక ప్రాముఖ్యాన్ని గుర్తించుకొని సభ్యులు దేశసేవకు తమకు తాము అంకితం చేసుకోవాలని ఆయన ఉద్బోధించారు. నూరేళ్ళ పండుగ జరుపుకున్న కాంగ్రెస్ పార్టీ సుదీర్ఘ పోరాటంతో దేశానికి స్వాతంత్ర్యం లభించింది.



# అధికారంలో రాజీవ్‌గాంధీ

1984 అక్టోబర్ 31 వ తేదీన ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ దారుణ హత్య అనంతరం ఆ సాయంత్రమే ఆమె పెద్ద కుమారుడు శ్రీ రాజీవ్ గాంధీ ప్రధానిగా ప్రమాణ స్వీకారం చేశారు.

శ్రీ రాజీవ్‌గాంధీ ఐదేళ్ళ పాలనలో కొన్ని చెప్పుకోదగ్గ విషయాలతోపాటు దానికి సరి సమానమైన వైఫల్యాలు కూడా తెచ్చుకున్నారు.

శ్రీ రాజీవ్‌గాంధీ భారతదేశంలోని పరిశ్రమలు పోటీపడి నడిచేలా చేశారు. విదేశీయులు సులభంగా పెట్టుబడులు పెట్టేందుకు అవకాశం కల్పించారు. సాంకేతిక పరిజ్ఞానాన్ని, టెలికమ్యూనికేషన్లను ఆయన అభివృద్ధి చేశారు. కంప్యూటర్లను పెద్ద ఎత్తున వినియోగంలోకి తెచ్చారు.

చాలా కొద్దికాలంలోనే రాజీవ్‌గాంధీ ప్రపంచ రాజనీతిజ్ఞుడుగా పేరు గడించారు. పాకిస్తాన్, చైనాలతో భారత సంబంధాలను అసాధారణంగా మెరుగుపరిచారు. ఆయన కాలంలో దేశంలో ఆర్థిక ప్రగతి ఆరుశాతం చొప్పున పెరిగింది. పారిశ్రామిక ఉత్పత్తి 11 శాతం పెరిగింది. సైనిక దళాల పునర్నిర్మాణానికి ఆయన పూనుకున్నారు. భారత సైనిక పాటవాన్ని సాంకేతికంగా అభివృద్ధిపరిచారు. గత కొద్ది సంవత్సరాలలో భారతదేశ విచ్ఛిత్తికి దారి తీసిన హింసాయుత ఉద్యమాలను ఆయన దాదాపు అణచి వేయగలిగారు. పంజాబ్‌లో టెర్రరిజాన్ని అంత మొందించడంలో విఫలమైనప్పటికీ అస్సాం, మిజోరం, పశ్చిమ బెంగాల్‌లో గుర్ఖాలాండ్ కోసం తలెత్తిన ఉద్యమాలను ఆపగలిగారు. భారత దేశంలో స్వాతంత్ర్యం తరువాత గత 40 సంవత్సరాలలో లేని రీతిలో 1987 లో జాతిని కుదిపివేసిన అత్యంత తీవ్రమైన అనావృష్టి పరిస్థితులను రాజీవ్‌గాంధీ నేర్పుగా ఎదుర్కొన్నారు. 1987 లోనే తూర్పు భారతదేశాన్ని కకావికలు చేసిన వరద పరిస్థితులను ఎదుర్కొని సహాయ కార్యక్రమాలను పర్యవేక్షించారు.

శ్రీ రాజీవ్‌గాంధీ అధికారంలోకి రాగానే ప్రజల ఆశలు రేకెత్తాయి. అంతా నూతన శకం ఆరంభమైందనుకున్నారు. కొత్త పరిపాలనా సంస్కృతిని నెలకొల్పుతానని, దేశాన్ని 21 వ శతాబ్దికి తీసుకు వెడుతానని, సాంకేతిక విప్లవం తెస్తానని, స్వచ్ఛమైన ప్రభుత్వాన్ని అందిస్తానని రకరకాల వాగ్దానాలు కురిపిస్తే ప్రజలు నమ్మారు. కానీ త్వరలోనే ఆ భ్రమలు పటాపంచలయ్యాయి. ఆయన పలుకుబడి బోఫోర్స్ తుపాకుల వ్యవహారంలో సన్నగిల్లింది. బోఫోర్స్ తుపాకుల కొనుగోలు సందర్భంగా 6 కోట్ల డాలర్లు ముడుపులుగా ముట్టాయని వచ్చిన ఆరోపణలను కప్పి పుచ్చటానికి ప్రభుత్వ యంత్రాంగం ప్రయత్నించింది. క్రిమినల్ రికార్డు కలిగిన వ్యక్తులు పార్టీలో చేరి, ముఖ్య స్థానాలాక్రమించడం, పార్లమెంటు అభ్యర్థులుగా పోటీ చేయడం వల్ల కూడా రాజీవ్‌గాంధీ పలుకుబడి దెబ్బతింది.

భారత దేశంలోని మధ్య తరగతి వర్గం కొంత మెరుగుపడినప్పటికీ ఆయన హయాంలో కూడా 70 శాతం మంది దారిద్ర్యంలోనే ఉండిపోయారు. శ్రీ రాజీవ్ గాంధీ అధికారంలో ఉండగా సిక్కుల టెర్రరిజం పెరిగింది. మేజారిటీ హిందువులు, మైనారటీ ముస్లింల మధ్య వైరుధ్యాలు పెరిగాయి. గత అయిదు సంవత్సరాలలో వందల సంఖ్యలో భారతీయులు అదృశ్యమైనారని టెర్రరిస్టులు అనుమానించారు. మనకు అత్యంత సన్నిహితంగా ఉంటూ వచ్చిన శ్రీలంక, నేపాల్ దేశాలతో సత్సంబంధాలు కొనసాగించడంలో శ్రీ రాజీవ్‌గాంధీ విఫలమైనారు.

రాజీవ్‌గాంధీది ఎన్నికలలో గెలిపించే జాతకం కాదు అనే విమర్శ బలంగా ఏర్పడింది. తమిళనాడు ఎన్నికలలో ఆ రాష్ట్రాన్ని 13 సార్లు ఆయన చుట్టి వచ్చినా అక్కడ కాంగ్రెస్ గెలవలేదు. భారత దేశ చరిత్రలో ఏ ప్రధానమంత్రి ఎన్నికల కోసం ఒక రాష్ట్రాన్ని ఇన్నిసార్లు సందర్శించలేదు. ఒక్క మాటలో చెప్పాలంటే భారత రాజకీయాల్లో శ్రీ రాజీవ్‌గాంధీ సరిగ్గా ఇమడలేకపోయారు. 1984లో బ్రహ్మాండమైన మెజారిటీతో శ్రీ రాజీవ్‌గాంధీ అధికారంలోకి వచ్చారు. అప్పటి పరిస్థితులలో పెద్ద మార్పు లేకపోయినా 1989 ఎన్నికలలో ఆయన ఆ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోలేకపోయారు. పాశ్చాత్య దేశాల పద్ధతుల పట్ల ఉన్న బలహీనత, అవినీతి కారణంగా శ్రీ రాజీవ్‌గాంధి అధికారం కోల్పోయారని విమర్శకుల అభిప్రాయం.

